# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 10 సంచిక : 5 హైదరాబాద్ 130 మే 2012 పేజీలు : 68 రు. 15

* ఎస్.సి., ఎస్.టి. నిధుల మళ్లింపు
* రైల్వేను ధ్వంసం చేస్తున్న ప్రైవేటీకరణ
* దేశ ఆర్థిక వ్యవస్థకు విదేశీ రుణ ప్రమాదం
* కిడ్నాప్‌ల వెనుక అసలు కారణాలు
* గుజరాత్ మారణకాండకు పదేళ్లు
* రావ్‌ఘాట్ ప్రాజెక్టుతో వినాశనమే
* చెర్నోబిల్ దుర్ఘటన



हैदराबाद विश्वविद्यालय

# University of Hyderabad

(A Central University established by an Act of Parliament)
Prof. C.R. Rao Road, Gachibowli, P.O. Central University, Hyderabad 500 046



# Study at the University of Hyderabad

*Join us in our journey towards excellence*

## प्रवेश घोषणा / ADMISSION ANNOUNCEMENT 2012-13

The University of Hyderabad invites bright, aspiring students committed to excellence to apply for admission to various postgraduate courses and research programmes through an All-India entrance examination. The University offers, subject to availability, hostel facility to the students admitted to any of its regular programmes of study.

### Courses / Programmes offered

**M.A. and M.Sc. (5-year Integrated) Courses:** (10 Semesters) (after +2 education) in Sciences, Humanities and Social Sciences. **PG Courses:** (4/6 semesters)(after 10+2+3 education) in Sciences, Humanities, Social Sciences, Performing Arts, Fine Arts, Art History, Communication, Business Administration in Health Care and Hospital Management, Health Psychology, Master of Computer Applications. **Adv. PG Diploma and P.G Diploma:** (2 semesters) in Folk Culture Studies, Mineral Exploration, Health Fitness and Life Style Management and Health Communication.

**M.Tech. Programmes:** (4 semesters) in Computer Science, Artificial Intelligence, Information Technology (CS/AI/IT), Computational Techniques, Integrated Circuit Technology, Bioinformatics and Mineral Exploration. **M.Phil. Programmes:** (2 semesters) in Humanities and Social Sciences. **Ph.D. Programmes:** (2-5 years) in Sciences, Humanities and Social Sciences. **Integrated M.Tech./Ph.D.** Materials Engineering, Nano Science and Technology and **Integrated M.Sc./Ph.D.** Biotechnology.

**Centres for the entrance examinations:** Ahmedabad, Aizawl, Ananthapur, Bengaluru, Bhubaneswar, Bhopal, Chennai, Cochin, Delhi, Dimapur, Guwahati, Hyderabad, Jaipur, Jammu, Kadapa, Karimnagar, Kolkata, Lucknow, Madurai, Mumbai, Nagpur, Nellore, Nizamabad, Patna, Pune, Ranchi, Raipur, Shillong, Srinagar, Srikakulam, Tirupati, Vijayawada, Visakhapatnam, Vizianagaram and Warangal. ***The University reserves the right to cancel any of the examination centres and allot another centre closer to the centre cancelled.***

**General Information:** Detailed information is given in the Prospectus-cum-Application Form 2012-13 which is available on the University's website and also at **schools9.com, indiaresults.com** and **manabadi.com.** Printed copies are not available with the University for sale. Candidates who are appearing in the final examination of the qualifying degree and expecting their results and certificates before 31st July 2012 are also eligible to apply.

**Reservation of seats:** Reservation of seats shall be as per the GOI/UGC norms for SC/ST/OBC/PWD/Wards/Dependants of defence personnel/Kashmiri migrants/ Foreign Nationals/NRIs. Few seats are also provided to the nominees from some UT/NE states. Relaxation in the prescribed percentage of marks in the qualifying degree examination is also provided for SC/ST/PWD categories.

**Entrance Examination fee** (Separate application is required for each course /programme): For General & OBC Category Rs.300/- For SC/ST/PWD Category Rs. 125/-

**How to apply:** 1) The Prospectus-cum-Application Forms can be downloaded from the University website or other websites as stated at the para "General Information." Filled in applications should be submitted to the University along with the Entrance Examination fee in the form of a demand draft of Rs. 300/- for each course in the case of General/OBC category and Rs. 125/- for each course in the case of SC/ST/PWD categories. 2) Xerox copies of Application Forms along with the instructions to fill the application form can be obtained in person from the Academic Section, Office of the Controller of Examinations, University Campus, Hyderabad free of cost to a limited extent. 3) The Demand Draft towards the entrance examination fee should be drawn in favour of the Finance Officer, University of Hyderabad, on State Bank of India, Hyderabad Central University Campus Branch, Hyderabad (Code 5916) or on Andhra Bank, Nampally Branch, Hyderabad (Code 378). 4) The duly filled in applications are to be submitted in person at the Academic Section or by post to the Dy. Registrar (Acad. & Exams) to the above address so as to reach him **on or before 4.5.2012.**

| Important Dates | |
|---|---|
| Downloading of Application Forms from the University Website: www.uohyd.ac.in and also download from schools9.com, indiaresults.com and manabadi.com | 04-04-2012 to 04-05-2012 |
| Last date for the receipt of filled-in Application Forms | 04-05-2012 |
| Downloading of Hall Tickets from | 21-05-2012 |
| Dates of Entrance Examinations | 01-06-2012 to 07-06-2012 |

**Important Information:** Hall Tickets, information to short-listed candidates for interview and selected/wait-listed candidates will not be communicated by post. It is the responsibility of the candidates to check the University website for downloading the Hall Tickets, results and the relevant formats required for admission. The University will not be held responsible for communication of the same.

**Note: 1. Applications received after the last date will not be accepted. University will not be held responsible for any postal delay. 2. Admission enquiries: 040-23132102, 23132103**

**Date : 02.04.2012**

***www.uohyd.ac.in***

**Dr.Ch.Venkateswara Rao**
**Controller of Examinations**

R.O. No. 55/HCU/12-13 Dated : 13-4-2012

130

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మే 2012
సంపుటి : 10
సంచిక : 5

వ్యవస్థాపక సంపాదకులు : **వి. హనుమంతరావు**
సంపాదకులు : **ఎన్. వేణుగోపాల్**
సహాయ సంపాదకులు : **డి.వి.రామకృష్ణారావు**
కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ : **వై. రామచంద్రం**
ఆఫీస్ అసిస్టెంట్ : **ఎస్. వెంకటేష్**

## లోపలి పేజీల్లో...





ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ కృతజ్ఞతలు**

వీక్షణం ఆర్థిక స్థితి గురించి విజ్ఞప్తికి ప్రతిస్పందనగా
ఏప్రిల్ 2012లో అందిన విరాళాలు, సహాయాలు

*శరత్‌రెడ్డి రు. 1000, నారాయణస్వామి, కర్ణాటక రు. 500*

చిమ్మె జాన్ బర్నబాస్ వ్యాసం 'అంబేద్కర్ విగ్రహాల ధ్వంసం – క్షీరాభిషేకాలు' లో వారు చాలా సూటిగా ప్రస్తుత దళిత పోరాటాల పరిస్థితిని మొత్తం సమాజ పరిస్థితిలో భాగంగా చేసిన విశ్లేషణ ఎంతో వాస్తవికంగా ఉంది. ఈ వ్యాసాన్ని దళిత మేధావులు, దళిత సంఘాల నాయకులు లోతుగా చర్చించవలసిన సమయం ఆసన్నమైందని భావిస్తున్నాను. నిజానికి ఈరోజు అన్ని పీడిత వర్గాల పోరాటాలు తమ కనీస కోర్కెలను సంప్రదాయిక పోరాట రూపాల్లో సాధించుకోలేకపోవడం అందరికీ తెలిసిందే. రాజ్యం ఇంత నిరంకుశంగా వ్యవహరిస్తుంటే ప్రజలు పోరాట రూపాలు దానికనుగుణంగా మార్చుకోవడం ద్వారా మాత్రమే తమ లక్ష్యాలను సాధించుకోగలుగుతారు. కొత్త పరిస్థితిలో కూడా పాత అవగాహనతో పోరాడడమంటే భారత పాలకుల క్రూరత్వాన్ని కప్పిపుచ్చి ప్రజలను భ్రమల్లో ముంచడం, తద్వారా కలిగే నిరాశా నిస్పృహల ద్వారా పిరికితనాన్ని ఆత్మహత్యలను ప్రోత్సహించడమే కాక, ఈ క్రూర దేశ (ప్రజా) ద్రోహ పాలకవర్గాలను ఓటమి నుండి కాపాడడంతో సమానమని భావిస్తున్నాను. ఇంత మంచి వ్యాసాన్ని అందించిన చిమ్మె జాన్ బర్నబాస్‌కి నా అభినందనలు. 'మానవ రహిత విమానాల కథ' ద్వారా అందించిన విలువైన సమాచారానికి యెడ్ల పోచయ్యకు నా కృతజ్ఞతలు. లాభమే పరమావధిగా, ప్రజలపట్ల బాధ్యతారాహిత్యంగా, నిజాన్ని అబద్ధంగా, అబద్ధాన్ని నిజంగా సృష్టించడానికి మాత్రమే పనిచేస్తున్న పత్రికారంగం, ఎలక్ట్రానిక్ మీడియా ఉన్న ఈ పుణ్యభూమిలో, పేరుపొందిన మేధావులకు, ధర్మాన్ని నిలబెట్టాల్సిన న్యాయమూర్తులకు, ప్రజా సంక్షేమం కోసం అత్యంత ఎక్కువ జీతాలు, సౌకర్యాలతో పాటు రాజ్యాంగ రక్షణలు కల్పించబడ్డ ఐ.ఎ.ఎస్. అధికారులకు, రాజ్యాంగ స్ఫూర్తితో ప్రజలను రక్షించాల్సిన ఐ.పి.ఎస్. అధికారులకు, బి.సి., ఎస్.సి., మైనారిటీ కమిషన్లకు, సమాజ శాంతి కోసం పనిచేస్తున్నామని గొప్పలు చెప్పుకునే రకరకాల ఆధ్యాత్మికవేత్తలకు, పేద ప్రజల పక్షపాతులమని చెప్పుకునే పార్లమెంటరీ వామపక్షాలకు – చత్తీస్‌గఢ్, ఒడిశా, జార్ఖండ్ రాష్ట్రాలలో మావోయిస్టుల అణచివేత అనే వంకతో లక్షలాది ప్రజల మీద మానవ రహిత విమానాల సహాయంతో భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి జరుపుతున్న యుద్ధాన్ని గురించిన నిజాలను మిగతా ప్రజానీకానికి తెలియ జెయ్యాలనే స్పృహ మీడియాకు లేకపోవడం ఆ దేశ ప్రజల దౌర్భాగ్యం. యే ప్రజల వలన వారు ఆయా స్థాయిల్లో ఉన్నారో ఆ ప్రజలపట్ల వారు తమ బాధ్యతను మరిచినట్లే. అమెరికాలోని లక్షలాది భూమిపుత్రులను వేటాడి చంపిన యురపియన్ వలసవాదుల చరిత్ర మనదేశంలోని కోట్లాది ఆదివాసుల (మూలవాసుల) మీద జరుగుతున్న యుద్ధంలో పునరావృతమైంది. ఇప్పటికైనా కళ్లు తెరిచి తప్పును సవరించు కోకపోతే, భావితరాలు అడిగే – 'ఈ మానవ హనన జరుగుతున్నప్పుడు నీవెటు వైపున్నావు?' ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో ఆలోచించుకోవాల్సి ఉంది.

**– రావి సుబ్బారావు,**
*వీక్షణం వర్డ్‌ప్రెస్ బ్లాగ్‌కు వచ్చిన ఉత్తరం*

పోచయ్య వ్యాసం చాలా వివరాలు తెలియజేసింది. మావోయిస్ట్‌లకు రక్షణ ప్రజ ఉద్యమమే అనే దాంట్లో అనుమానం లేదు. సమస్య అంతా అక్కడే ఉంది. అగ్రగామి రాజకీయ శక్తి వెనుకాడే, ఊగిసలాడే శక్తులను కూడగట్టుకుని వెళ్తుంది. ఆ పని ఆ ఇతర సంస్థలు అయిష్టంగా, సందేహాలతో చెయ్య వచ్చు కానీ రాజకీయ ఒత్తిడి వల్ల వాళ్లకు చెయ్యక తప్పదు. మావోయిస్ట్ పార్టీ కార్యాచరణ అలా ఉందా అన్నదే ప్రశ్న. ఇటీవల ఒడిశాలో జనశక్తి కార్యకర్త కేంద్రుక అర్జున్ హత్య గురించి, బస్సు పేల్చివేసి అందులో ప్రయాణికుల మీద కాల్పులు జరిపిన వార్త కొన్ని వ్యాసాల్లో చదివాను. ఇటువంటి చర్యల వల్ల వారికి ఉద్యమం లేని ప్రాంతాల్లో సానుభూతి లేకుండా చేస్తుంది. వారితో ఉండవలసిన ప్రజలు వారికి వ్యతిరేకంగా మారి ప్రభుత్వానికి సమాచారం అందించే అవకాశం ఉంది. శ్రీలంకలో ఎల్.టి.టి.ఇ. చరిత్ర ఇక్కడ పునరావృతం కాకుండా చూడవలసిన బాధ్యత మేధావుల మీదా, కార్యకర్తల మీదా ఉంది. ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు వీక్షణం ఏప్రిల్ సంచికలో అక్టోబర్ విప్లవం గురించి రాసిన వ్యాసం, చెదురుముదురుగా ఉన్న చాలా సమాచారాన్ని ఒక క్రమంలో తెలియజేసింది. కాని ఆ వ్యాసం అక్టోబర్ విప్లవానికి ముందుమాట లాగా మిగిలిపోయింది. అక్టోబర్ విప్లవం పరజాయం, దాని దుష్ఫలితాలు ప్రపంచవ్యాప్తంగా ప్రత్యామ్నయ ఆర్థిక, రాజకీయ వ్యవస్థల కోసం జరిగే ఉద్యమాలను వెనుకకు నెట్టాయి. అక్టోబర్ విప్లవం గురించి, దానిలో వివిధ శ్రేణుల మధ్య జరిగిన తాత్విక, రాజకీయ ఘర్షణ, విప్లవం తరువాత పరిణామాల గురించి చర్చ జరగడం చాలా అవసరం. మనలో చాలామందికి, వామపక్ష సంస్థల కార్యకర్తలతో సహా, అక్టోబర్ విప్లవం గురించి కొద్దిపాటి అవగాహన, తాత్విక పునాది లేని విశ్లేషణ మాత్రమే ఉన్నాయి. నాగభూషణాచార్యులు అక్టోబర్ విప్లవం గురించి వరుసగా కనీసం అయిదారు వ్యాసాలు రాస్తే కొంత ప్రయోజనం ఉంటుంది.

**– నరేంద్ర మోహన్,**
మెల్‌బోర్న్, ఆస్ట్రేలియా
*వీక్షణం వర్డ్‌ప్రెస్ బ్లాగ్‌కు వచ్చిన ఉత్తరం*

ఏప్రిల్ 2012 వీక్షణం సంచికలో 'రష్యాలో అక్టోబర్ విప్లవం' వ్యాసంలో ఒక వివరణ ఇవ్వాల్సిన అవసరం ఉంది. 47వ పేజీలో – '1881లో రెండో అలెగ్జాండర్ ఒక 'నిహిలిస్టు' చేతిలో హత్యగావింపబడ్డాడు' – అనే వాక్యంలో నిహిలిస్టు అనే పదానికి బదులుగా 'నరోద్నయ వోల్య సభ్యుడు' అని చదువుకుంటే పాఠకులకు మరింత సౌకర్యంగా ఉంటుంది. 'నిహిలిజం' అనేది నిజానికి లాటిన్ పదం. దీనికి 'శూన్యం' అని అర్థం. అయితే 'విప్లవకారు'డనే అర్థంలో తుర్గెనేవ్ తన ప్రసిద్ధ నవల 'తండ్రులూ కొడుకులూ'లో ప్రయోగించాడు. నాటి నిరంకుశ వాతావరణంలో తనుద్దేశించిన పదాన్ని ఉపయోగించలేక తుర్గెనేవ్ ఈ పనిచేశాడు. పాఠకులు కూడా తుర్గెనేవ్ అభిప్రాయాన్ని సరిగ్గానే గ్రహించారు. ఇప్పుడు ఈ నరోద్నిక్కుల గురించిన కొన్ని వివరాలు ఇలా ఉన్నాయి –

రష్యాలో సోషల్ డెమోక్రాట్లు పేరుతో మార్క్సిస్టులు తలెత్తకముందు, అక్కడి విప్లవ కార్యక్రమాలన్నింటినీ నరోద్నిక్కులే సాగిస్తూండేవారు. 'నరోద్' అనే రష్యన్ పదానికి 'ప్రజలు'ని అర్థం. ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులైన రైతులే నాటి భూస్వామ్య వ్యవస్థ చేత అత్యంత దారుణంగా దోపిడీకి, పీడనకు గురవుతున్నందువల్ల, నరోద్నిక్కులు ఈ రైతాంగాన్నే ప్రధాన విప్లవ శక్తిగా భావించి, విప్లవోద్యమాన్ని ముందుకు తీసుకెళ్లేందుకు ప్రయత్నించారు. నిరంకుశ జార్ ప్రభుత్వానికీ, భూస్వామ్య పీడనకూ వ్యతిరేకంగా నరోద్నిక్కులు వీరోచితంగా పోరాడ్డమేకాకుండా, ఎన్నో ఆత్మ త్యాగాలూ చేశారు. అయితే వీరికి కార్మికవర్గం గురించి గానీ, ఆ వర్గ నాయకత్వ శక్తి గురించి గానీ తెలీదు. జార్ ప్రభుత్వాన్నీ, భూస్వాముల్నీ జయించడానికి రైతాంగానికి తగినంత సామర్థ్యంలేదని వీరు గ్రహించలేదు. ఒక్క నరోద్నిక్కులే కాదు, సోషలిజం గురించి కలలు కన్న ఇతర మేధావులు కూడా పెట్టుబడిదారీ వ్యవస్థ ఏర్పడకముందు పలు దేశాలలో ఇలాగే భావించారు. రైతాంగాన్ని విప్లవ పోరాటానికి సన్నద్ధం చెయ్యడం కోసం విశ్వవిద్యాలయ విద్యార్థులైన నరోద్నిక్ యువ విప్లవ మేధావులు (వీరిలో మహిళలూ ఉన్నారు) వందలాది మంది 1872, 74లలో గ్రామాలకు వెళ్లి విప్లవప్రబోధం చెయ్యడానికి పూనుకున్నారు గానీ, రైతాంగం మద్దతు సంపాదించలేకపోయారు. అంతేగాక పోలీసుల వలలో చిక్కి, జైల్లకో, సైబీరియాకో వెళ్లాల్సి వచ్చింది. మిగిలినవారు ఒంటరిగానే, ప్రజల మద్దతు లేకుండానే జార్ ప్రభుత్వంతో పోరాటానికి సిద్ధపడి మరిన్ని తప్పులు చేశారు. 1876లో 'భూమి, స్వాతంత్ర్యం' అనే పేరుతో ఒక కొత్త పార్టీ పెట్టారు. అయితే వీరిలో పలు అభిప్రాయ భేదాలు ఏర్పడి, వీరిలో తీవ్రవాద వర్గం 'నరోద్నయా వోల్య' (పీపుల్స్ విల్ – ప్రజాభీష్టం) అనే రహస్య సంఘాన్ని స్థాపించారు. వీరు రెండో అలెగ్జాండర్ చక్రవర్తిని చంపడానికి పలుమార్లు ప్రయత్నించి, చివరికి 1881, మార్చ్ 13న బాంబులతో చంపగలిగారు. అయితే ఈ హత్య వల్ల వారు ఆశించిన ఫలితం మాత్రం రాలేదు. భూస్వామ్యవర్గం ఈ చర్యతో నశించకపోగా, తర్వాత అధికారంలోకి వచ్చిన మూడో అలెగ్జాండర్ మరింత నిరంకుశంగా పాలించాడు. 'నరోద్నయా వోల్య' సభ్యులు ఇతన్నీ చంపాలని చూశారుగానీ, ఆ పథకం విఫలమైంది. జార్ ఆ సంస్థ సభ్యుల్ని రకరకాల శిక్షలపాల్జేసి, ఆ సంస్థను నామరూపాల్లేకుండా చేశాడు. 1887, మార్చ్1న జరిగిన ఈ హత్యాయత్నంలోనే బాంబులు తయారు చేశాడన్న నేరారోపణతో లెనిన్ అన్న అయిన అలెగ్జాండర్‌ను ఉరితీశారు.

**– ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు**
పాలకొల్లు, పశ్చిమ గోదావరి

*(... మిగతా 62వ పేజీలో)*

*ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు వ్యాసంలో 'స్లావ్' పదం అర్థం బానిసలుగా వచ్చింది. కానీ, ఆ పదం యూరప్‌లోని ఒక జాతి పేరు.*

# ప్రజా వ్యతిరేక, కుంభకోణ భరిత అక్రమాంధ్రప్రదేశ్

ప్రత్యేక ఆర్థిక మండలాల పేరుతో, అభివృద్ధి పథకాల పేరుతో వందల ఎకరాల ప్రభుత్వ భూములను చౌకగానో ఉచితంగానో ఆశ్రితులకు కట్టబెట్టడం; ఖనిజ నిలువలు ఉన్న భూములను అన్ని నిబంధనలూ ఉల్లంఘించి దేశదేశాల సంపన్నులకు అప్పగించడం; అలా అప్పనంగా భూమి అప్పగించినందుకు ప్రతిఫలంగా ముడుపులు, తమ కంపెనీలలో పెట్టుబడులు సంపాదించడం; ఈ అడ్డగోలు ఆస్తుల పంపకాల వ్యవహారంలో మంత్రులు, దేశదేశాల ధనవంతులు, ఐ ఎ ఎస్, ఐపిఎస్ అధికారులు అందరికీ తలా పిడికెడు భాగస్వామ్యం ఉండడం; నేరసామ్రాజ్యాధిపతులు, ప్రభుత్వాధికారులు ఉమ్మడిగా భూవివాదాల సెటిల్మెంట్లు చేసి వందల కోట్ల రూపాయలు ఆర్జించడం; ఈ అక్రమార్జన పత్రికలలోకి, సినిమాలలోకి ప్రవహించడం; మద్యం వేలం పాటలలో అక్రమాలు; మంత్రులకు, రాజకీయ నాయకులకు బేనామీగా వందలాది మద్యం దుకాణాలు; మద్యం అమ్మకాలలో అక్రమాలను మాయ చేయడానికి మంత్రులనుంచి పాత్రికేయులదాకా ముడుపులు; అక్రమాల పుట్టగా మారిన ఎక్సైజ్ శాఖ; ఒకరి గుట్టు ఒకరు బైట పెట్టుకోవడంలో భాగంగా అవినీతి నిరోధక శాఖ పరిశోధనలను వాడుకోవడం; అక్కడా మళ్లీ అక్రమాలు; ఇసుక తవ్వకాల అక్రమాలు; ఆరోగ్యశ్రీ అక్రమాలు; రిజిస్ట్రేషన్ శాఖలో అక్రమాలు; ఎక్కడ దాడి జరిగినా బయటపడుతున్న కోట్ల రూపాయల అక్రమాస్తులు; వందలకోట్ల పెట్టుబడి వ్యాపారంగా మారిన ఎన్నికలు; న్యాయవ్యవస్థలో, న్యాయమూర్తుల తీర్పులలోనే అక్రమాలు; తమకు అనుకూలమైన తీర్పు వచ్చేదగ్గరికే వ్యాజ్యాలు తీసుకుపోతున్న రాజకీయ నాయకులు; అవినీతి, అక్రమం లేని ప్రభుత్వ శాఖ లేకపోవడం...ఇదీ ఇవాళ ఆంధ్రప్రదేశ్ చిత్రపటం. దినపత్రికలలో, ఇరవైనాలుగు గంటల వార్తాస్రవంతులలో, పాలకవర్గ ముఠాల పరస్పర ఆరోపణలలో, పరిశోధక, న్యాయవ్యవస్థలు తమ సాధికారత కోసం బయటపెడుతున్న అతితక్కువ వివరాలలో ఈ వ్యవస్థ దుర్మార్గాలు, పాలకవర్గాల అక్రమాలు అనుక్షణం బయటపడుతున్నాయి. కొనసాగుతున్న రాజకీయార్థిక, సామాజిక వ్యవస్థ ఎంత అక్రమాల నిలయమో, ఎంత ప్రజావ్యతిరేకమో, ఎంత బందిపోటు అరాచకమో స్పష్టంగా వెల్లడవుతోంది. నిజానికి ఇవన్నీ కూడ ప్రజల వైపు నుంచి, ప్రజాప్రయోజనాలతో వెలువడుతున్న పూర్తి నిజాలు ఏమీ కాదు. వెలువడుతున్న వాస్తవాలు అసలు జరిగిన వాస్తవాలలో ఒక్కశాతం కూడ కాదు. నీళ్లలో మునిగి ఉన్న మంచుగడ్డలో శతాంశమో సహస్రాంశమో బయటికి కనిపించినట్టు ఇవాళ కనబడుతున్న ప్రతి ఒక్క అక్రమానికీ వెనుక కనబడని అక్రమాలు వందో వెయ్యో ఉంటాయి. ఇవాళ ఈ అక్రమాలను బయటపెడుతున్న యంత్రాంగాలన్నీ, రాజకీయ ప్రత్యర్థులైనా, పత్రికలైనా, ప్రచారసాధనాలైనా, సిబిఐ, ఎసిబి వంటి పరిశోధక సంస్థలైనా, న్యాయస్థానాలైనా, వ్యవస్థలో అంతర్భాగాలే. అవన్నీ వ్యవస్థను నిలిపి ఉంచే యంత్రాంగాలే. తాము బయటపెట్టే నిజాలు వ్యవస్థ మనుగడకే ప్రమాదకరమని అనిపిస్తే ఆ వాస్తవాలను తొక్కిపెట్టే వ్యవస్థ పరిరక్షక యంత్రాంగాలే. ఎమార్ – ఎంజిఎఫ్, జగతి పబ్లికేషన్స్ వంటి వ్యవహారాలలో అవసరమైన నిజాలు కొన్ని బయటపెట్టి సాహసిక సంస్థగా పేరు తెచ్చుకున్న సిబిఐ, ఆజాద్ ఎన్ కౌంటర్ హత్య మీద మాత్రం సుప్రీంకోర్టుకు ఇచ్చిన నివేదికలో ఎలా స్పష్టమైన వాస్తవాలకు మసిబూసి మారేడుకాయ చేసిందో చూస్తే ఈ వ్యవస్థ యంత్రాంగాల డొల్లతనం అర్థమవుతుంది. ఈ పాలకవర్గ యంత్రాంగాల స్వభావం అసలు విషయాల దగ్గర ఎప్పుడో ఒకసారి అలా బయటపడి పోతున్నప్పటికీ, పాలకవర్గ ముఠాల మధ్య దోపిడీ వాటాల తగాదాలు భీకరంగా జరుగుతున్నప్పుడు ఈ యంత్రాంగాలే ఒకదానితో ఒకటి కీచులాడుకుంటూ కొన్ని వాస్తవాలను వెల్లడిస్తుంటాయి. భూమి, పరిశ్రమలు, విద్యుత్తు, నివాసగృహాలు, మద్యం, అధికారం... ఏ ఒక్క అంశం తీసుకున్నా ప్రభుత్వాధికారంలో ఉన్నవాళ్లు దాన్ని దుర్వినియోగం చేయడమో, తమ సొంత ప్రయోజనాల కోసం వాడుకోవడమో, అది న్యాయంగా ఏ ప్రజా ప్రయోజనాల కోసం ఉపయోగించాలో అలా ఉపయోగించకపోవడమో జరుగుతున్నాయి. సామాజిక వనరులు ప్రజలవి మాత్రమేననీ, వాటిని ప్రజోపయోగం కోసం మాత్రమే వినియోగించాలనీ కనీస అవగాహన లేని ప్రజావ్యతిరేక, ప్రజాకంటక పాలకవర్గాలు రాజ్యం చేస్తున్నాయి. పైనుంచి కిందిదాకా పాలనా యంత్రాంగమంతా ఈ ప్రజావ్యతిరేకతనే అనుసరిస్తోంది. వ్యవస్థ కుళ్లిపోయిందనీ, పుచ్చిపోయిందనీ చెప్పడానికి ఇంతకన్న ఇతర నిదర్శనాలు అవసరం లేదు. నిజానికి వ్యవస్థ కుళ్లిపోయిందనీ, దీన్ని సమూలంగా మార్చవలసి ఉందనీ చెప్పడానికి వ్యవస్థ విమర్శకులెవరో రానవసరం లేదు. ఇవాళ ప్రభుత్వాధికారానికి, వర్గ అధికారానికి, పాలనకు సంబంధించిన ఏ అంశం తీసుకున్నా, ఏ ప్రచార సాధనాన్ని చూసినా స్పష్టంగా కొట్టవచ్చినట్టు కనబడుతున్న అంశం అదే. అధికారంలో ఉన్నవాళ్లు చెడ్డవాళ్లు గనుక అలా చేశారనీ, అధికారంలోకి మంచివాళ్లను ఎన్నుకుంటే అలా ఉండదనీ, అలా ఎన్నుకోకపోవడం ప్రజల తప్పనీ అనుకునే మధ్యతరగతి అమాయకత్వం ఇదివరకు ఉండేది. ఇప్పుడింక ఆ అమాయకత్వానికి కూడ అవకాశం లేదు. దేశంలోనూ, రాష్ట్రంలోనూ అధికారానికి రాని రాజకీయ పార్టీ ఏదీ లేదు. అన్ని పార్టీలు ఏదో ఒక సందర్భంలో ఎన్నికలలో గెలిచి అధికారం చలాయించాయి. ఈ అక్రమ, అస్తవ్యస్త పాలన అటూఇటూగా యథాతథంగానే కొనసాగుతున్నది. అంటే ఏ ఒక్కపార్టీ కూడ మంచి పార్టీ కాదనైనా అనుకోవాలి. లేదా, ఇది మనుషుల, పార్టీల మంచితనం సమస్య కాదని, వ్యవస్థ నిర్మాణమైన పద్ధతికి సంబంధించిన సమస్య అని అనుకోవాలి. అలాగే ఇవాళ అవినీతిపరులుగా, అక్రమార్జనాపరులుగా, ప్రజావ్యతిరేకులుగా కనబడుతున్న అధికారవర్గపు వ్యక్తులు స్వతహాగా చెడ్డవారు కారనీ, ఒకప్పుడు ఆదర్శవంతులేననీ కూడ వార్తలు వస్తున్నాయంటే కూడ ఇది వ్యక్తుల మంచిచెడుల సమస్యకాదని స్పష్టమవుతుంది. అధికార వ్యవస్థే, పాలనానీతే దోపిడీ పీడనల మీద నిర్మాణమైనప్పుడు, పాలనా వ్యవస్థ ఆధిపత్య వర్గాల ప్రయోజనాల కోసం మాత్రమే నడిచేలా నిర్మాణమైనప్పుడు ఆ యంత్రాంగంలో ఎవరుంటారనేది సమస్య కాదు. మనుషుల మార్పుతో వ్యవస్థ మారదు. మనుషులకు అక్రమానికి అవకాశం ఇవ్వని వ్యవస్థ రూపొందించుకోవడమే, ఈ వ్యవస్థను సమూలంగా తొలగించి, నూతన వ్యవస్థను నిర్మించడమే ఏకైక పరిష్కారమని అక్రమాంధ్రప్రదేశ్ వేనోళ్ల ప్రకటిస్తున్నది. వీ

# బొగ్గు నుంచి సైనిక శకటాల దాకా...

ఒకవైపు పార్లమెంటు బడ్జెట్ సమావేశాలు జరుగుతుండగానే మరోవైపు అధికారపార్టీ ఎన్నెన్నో కుంభకోణాలలో, వివాదాలలో చిక్కుకుంటున్న రసవత్తర దృశ్యాలు కనబడుతున్నాయి. మిగిలిన కుంభకోణాలను పక్కన పెట్టినా కనీసం బొగ్గు గనుల కేటాయింపు, రక్షణ శాఖ అక్రమాల కుంభకోణాలు రెండిటి గురించి అయినా ప్రస్తావించుకోవలసి ఉంది. ఈ రెండు కుంభకోణాలు తీవ్రమైనవి మాత్రమే గాక భారత రాజకీయార్థిక వ్యవస్థకు సంబంధించినంతవరకు చాల కీలకమైనవి. ప్రభుత్వాలు, పాలకవర్గాలు ప్రజల నుంచి దాచిపెట్టడానికి ప్రయత్నిస్తున్నవి. మొదట బొగ్గు గనులను దాదాపు వంద ప్రభుత్వ రంగ, ప్రైవేటు రంగ సంస్థలకు ఎటువంటి వేలం లేకుండా కట్టబెట్టడానికి సంబంధించినది. ఆయా కంపెనీలకు మామూలుగా మార్కెట్ ధరలకు బొగ్గు అమ్మితే రాగల ఆదాయానికన్న చాల తక్కువకు ప్రభుత్వం బొగ్గు గనులను అప్పగించింది. 2004 నుంచి 2009 వరకు ఆ బొగ్గు గనుల మీద పూర్తి అధికారాన్ని ఆ కంపెనీలకు కట్టబెట్టింది. ప్రభుత్వ నిర్ణయాల ఫలితంగా ప్రజాఖజానాకు ఎంత నష్టం వాటిల్లిందో గడిచిపోయిన తర్వాత అంచనా వేసే రాజ్యాంగబద్ధ సంస్థ కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా (కాగ్) ప్రస్తుతం తయారు చేస్తున్న నివేదికలో, ఈ కెటాయింపుల వల్ల ప్రజాఖజానాకు స్థిరధరలలో ఆరు లక్షల ముప్పైఒక్కవేల కోట్ల రూపాయలు (ప్రభుత్వ రంగ సంస్థలనుంచి మూడు లక్షల ముప్పై ఏడు వేల కోట్ల రూపాయలు, ప్రైవేటు సంస్థల నుంచి రెండు లక్షల తొంబైనాలుగువేల కోట్ల రూపాయలు) నష్టం వాటిల్లిందని, తాజాధరల ప్రకారం అయితే ఈ నష్టం పదిలక్షల అరవై ఏడు వేల కోట్ల రూపాయలు అవుతుందని తేలింది. ఈ నివేదిక బయటికి పొక్కి పార్లమెంటులో చర్చ జరిగితే, వెంటనే అసలా నివేదికే లేదని కాగ్ చేత ప్రకటన ఇప్పించారు. అధికారిక ప్రతినిధులందరూ దాన్ని మూసిపెట్టడానికి ప్రయత్నించారు. నివేదిక ఉందా లేదా అనే చర్చలో పడి అసలు దేశానికి, దేశ ప్రజలకు చెందిన విలువైన వనరులను అలా వ్యక్తుల లాభాలకోసం కట్టబెట్టడానికి ప్రభుత్వానికి ఉన్న నైతిక అధికారం ఏమిటనే ప్రశ్న వినబడకుండా పోయింది. సరిగ్గా అటువంటి మౌలిక చర్చ అవసరమై కూడ జరగకుండా పోయిన మరొక వివాదం రక్షణ శాఖకు సంబంధించినది. ఒకవైపు సర్వసైన్యాధ్యక్షుడి పుట్టినతేదీ వివాదం కొనసాగుతుండగానే సైనిక శకటాల కొనుగోలు వ్యవహారంలో కోట్ల రూపాయల ముడుపులు చేతులు మారి ఉండవచ్చుననే వార్త బైటికి పొక్కింది. అది అలా ఉండగానే, రెండు సైనిక దళాలు తిరుగుబాటు ఆలోచనతో ఢిల్లీవైపు పయనించాయని వార్తలు, భారత సైన్యపు యుద్ధ సన్నద్ధత ప్రశ్నార్థకమనే వార్తలు వెలువడ్డాయి. దేశమంతా ఇటువంటి వార్తలు బయటికి పొక్కనీయవద్దని గగ్గోలు జరిగింది గాని అసలు లక్షల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని బుగ్గిపాలు చేస్తూ, అంతర్జాతీయ ఆయుధ వ్యాపారులకు లాభాలు చేకూరుస్తూ, పనిలో పనిగా దేశ రాజకీయ నాయకులకు, సైనికాధికారులకు వందల కోట్ల రూపాయల ముడుపులు ముట్టజెపుతూ సాగుతున్న ఈ భారీ సైనిక రక్షణ కుంభకోణాలు ఇంకెన్నాళ్లు అనే ప్రశ్న మాత్రం బైటికి రాలేదు. ప్రజల అన్నవస్త్రాల కోసం వెచ్చించవలసిన లక్షల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని ఈ అణ్వస్త్రాల, ఆయుధాల, అక్రమాల పాలు చేయడం ఎందుకు అనే నైతిక ప్రశ్న ఇప్పటికైనా వేయవలసి ఉంది. వీ

# నేపాల్ - మలిగిపోయిన చివరి ఆశ

ప్రజా ఉద్యమ నాయకత్వాలు మధ్య దారిలో దారితప్పడం కొత్త కాదు. అప్పటిదాకా జరిగిన అపారమైన త్యాగాలను, ఉద్యమం మీద ప్రజలలో పెరిగిన అనంతమైన ఆకాంక్షలను బలిపెట్టి నాయకత్వం భయానికో, భ్రమలకో, ఆకర్షణలకో లొంగిపోయి ఉద్యమాన్ని విరమించిన ఉదాహరణలు చరిత్ర పొడవునా వందలాదిగా ఉన్నాయి. ఆ సుదీర్ఘ లొంగుబాట్ల, రాజీల, విద్రోహాల జాబితాలో నేపాల్ మొదటిదీ కాదు, చివరిదీ కాబోదు. రాచరిక భూస్వామ్యం నుంచీ, సామ్రాజ్యవాదం నుంచీ నేపాల్ ప్రజలను విముక్తి చేయగలదని అద్భుతమైన ఆశను రేకెత్తించిన నేపాల్ మావోయిస్టు ఉద్యమం పది సంవత్సరాల సాయుధ పోరాటంతోనే ఎన్నో విజయాలు సాధించి, ఒక కీలకమైన సమయంలో తప్పుడు మలుపు తిరిగి ఆరు సంవత్సరాలు కావస్తోంది. ఇంకా అది ఎత్తుగడేనేమో, మళ్లీ ఆ నాయకత్వం వెనక్కి తిరిగి విప్లవమార్గం చేపడుతుందేమో, అంతకుముందరి దశాబ్దాల చరిత్రను తనకు తాను రద్దుచేసుకునే దుస్సాహసం చేయదేమో అని చాలమంది ఆశావాదులు ప్రపంచవ్యాప్తంగా ఊపిరి బిగబట్టి ఆరేళ్లుగా నిరీక్షిస్తున్నారు. ఆ నిరీక్షణను విఫలం చేస్తూ మావోయిస్టు పార్టీ నాయకత్వం ప్రజా విముక్తి సైన్యాన్ని ప్రభుత్వసైన్యాలలో విలీనం చేసే ప్రయత్నం మొదలుపెట్టింది. ఆరు సంవత్సరాల కింద విశాల ఐక్య సంఘటనతో ప్రభుత్వంలో చేరడానికి, నేపాల్ నూతన గణతంత్రానికి రాజ్యాంగ రచన చేయడానికి అక్కడి విప్లవ పార్టీ సిద్ధమైనప్పుడు, ఆ నిర్ణయాన్ని ఆహ్వానించినవారికి కూడ మింగుడుపడని నిర్ణయం విప్లవ ప్రజాసైన్యపు ఆయుధాలను ఐక్యరాజ్యసమితికి అప్పగించడం. విప్లవ ప్రజాసైనికులను మరే ప్రజాహిత కార్యకలాపాలకు వినియోగించకుండా బారక్ లకు కట్టిపడేయడం. అలా ప్రజా ఆయుధాలను, ప్రజా సైనికులను తాళాలు వేసిన నిర్బంధ శిబిరాల్లో బంధించారు. అప్పటినుంచి ఇప్పటిదాకా గడిచిన రాజకీయ ఎత్తుగడలు, మంత్రాంగాలు చివరికి ప్రజాసైన్యాన్ని ప్రభుత్వ సైన్యంతో సమ్మేళనం చేయాలనే దగ్గరికి దారితీశాయి. పదిహేనేళ్లకు పైగా నేపాల్ ప్రజల ప్రయోజనాలను రక్షించిన ప్రజావిముక్తి సైన్యం ఈ ఏప్రిల్ తర్వాత రద్దయిపోతుంది. ఇంతకాలం రాజు సైన్యంగా, కొంతకాలంగా నేపాల్ ప్రభుత్వ సైన్యంగా ఉన్న ప్రజావ్యతిరేక సైన్యం మాత్రమే ఇక ముందు ఉంటుంది. ఈ చర్యకు నేపాల్ విప్లవ నాయకత్వం ఏ సమర్థన ఇచ్చుకున్నప్పటికీ ఇది దారుణమైన ప్రజావ్యతిరేక దాడి. యూనిఫైడ్ కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ నేపాల్ – మావోయిస్ట్స్ అనే ఆ పార్టీ ఇంకా తన పేరులోంచి మావోను తీసేయలేదు గనుక 'ప్రజాసైన్యం లేకుండా ప్రజలకుండేదేమీ లేదు' అన్న మావో మాట గుర్తుచేయాలి. చరిత్రలో ఇతర ప్రజా ఉద్యమాలు ఎంత గొప్పవైనా, వాటితో మార్క్సిస్టుల నాయకత్వంలోని చిన్నపాటి ఉద్యమాలకు కూడ ఉండే గుణాత్మకమైన తేడా అదే. మార్క్సిస్టులు మొదటిసారిగా ప్రజలకోసం ప్రజాసైన్యాన్ని సృష్టించి, దాన్ని ప్రజలే నడుపుకునేలా చేసి, అంతిమ ప్రజావిజయానికి మార్గం సుగమం చేస్తారు. ప్రజాసైన్యం ప్రజలలో ఆత్మవిశ్వాసాన్ని, చొరవను పెంచి వారు మరిన్ని విజయాలు సాధించడానికి, రాజ్యాధికారం చేపట్టడానికి వీలు కల్పిస్తుంది. ఆ దారిలో కొంత ముందుకు సాగిన తర్వాత కూడ అపజయాలు, అంతర్గత ద్రోహాలు ఎదురు కావచ్చునని నేపాల్ నేర్పుతున్న పాఠం ప్రపంచ ప్రజాఉద్యమాలన్నిటికీ ఒక హెచ్చరిక. వీ









- **ప్రజాకవి కాళోజీ** – సాహిత్య సమాలోచన – సంపాదకులు : డా. గంటా జలంధర్ రెడ్డి – 568 పేజీలు, 1/8 డెమీ, రు:300, ప్రతులకు: డా. గంటా జలంధర్ రెడ్డి, అధ్యక్షులు, తెలుగుశాఖ, ఆంధ్ర విద్యాలయ కళాశాల, గగన్‌మహల్, హైదరాబాద్ – 500029, సెల్ : 9848292715; అన్ని ప్రముఖ పుస్తక షాపులలో
- **ఎర్రమట్టి బండి** – కవిత్వం – తైదల అంజయ్య – మంజీర రచయితల సంఘం – 126 పేజీలు, 1/8 డెమీ, రు: 70, ప్రతులకు: తైదల రాజేశ్వరి, నాగసముద్రాల, (పో) బస్వాపూర, (వయా) శనిగరం, కరీంనగర్–505473, సెల్: 9866862983; అన్ని ప్రముఖ పుస్తక షాపులలో
- **అధూరె** – ముస్లిం కథలు – స్కైబాబ – నసల్ కితాబ్ ఘర్, 'హర్యాలి' ముస్లిం రచయితల వేదిక – 126 పేజీలు, 1/8 డెమీ, రు: 50, ప్రతులకు: హాజీ బేగం, కేశరాజుపల్లి, నల్గొండ – 508 002, సెల్ : 9885420027; అన్ని ప్రముఖ పుస్తక షాపులలో
- **మరణోపనిషత్** – మరో ఐదు కథలు – ముక్తవరం పార్థసారథి – వికాసం బుక్స్, 107 పేజీలు, 1/8 డెమీ, రు : 80, ప్రతులకు : ఎం. పార్థసారథి, 411, ప్రభాత్కర్ అపార్ట్‌మెంట్స్, విజయనగర్ కాలనీ, హైదరాబాద్ – 500 057. ఫోన్ : 040–23345091
- **ప్రత్యేక తెలంగాణ ఉద్యమం** – మార్క్సిస్ట్ దృక్పథం – సంకలనకర్త, సంపాదకుడు : క్రాంతికార్ – ప్రజా తెలంగాణ ప్రచురణలు, 36 పేజీలు, 1/8 డెమీ, రు : 10, ప్రతులకు : ప్రజా తెలంగాణ ప్రచురణలు, బుద్ధ భవన్, 11–1–88, లెనిన్ నగర్, ఖమ్మం – 507 001; సెల్: 9177280712, 9396735271
- **ఛూటే ఏరిన రచనలు** – దిక్సూచి ప్రచురణలు – 366 పేజీలు, 1/8 డెమీ, రు : 125, ప్రతులకు : దిక్సూచి ప్రచురణలు, గోరుమాధవ రావు, జింకిభద్ర గ్రామం, సోంపేట మండలం, శ్రీకాకుళం జిల్లా
- **వివేచన** – సాహిత్య వ్యాసాలు – వి. చెంచయ్య – విప్లవ రచయితల సంఘం – 128 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు : వి. చెంచయ్య, సాహితీ నిలయం, 10–40–15 ఎ/1, జనతాపేట నార్త్, కావలి – 524 201, నెల్లూరు జిల్లా. ఫోన్ : 08626–242277 సెల్: 9440638035
- **దళిత** – కె. బాలగోపాల్ – పర్‌స్పెక్టివ్స్ – 209 పేజీలు, 1/8 డెమీ, రు : 120, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్‌భవన్, బ్యాంక్‌స్ట్రీట్, హైదరాబాద్ – 500 001; ఫోన్ : 040 – 24744580
- **నెగడు** – తెలంగాణ కవిత్వం – చింతం ప్రవీణ్ – కల్పన ప్రచురణలు – 87 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు : చింతం ప్రవీణ్, 16–10–237, శివనగర్, వరంగల్ – 506 002, సెల్ : 9346886143, 953353001, ఇమెయిల్: praveen.kuc@gmail.com; అన్ని ప్రముఖ పుస్తక షాపులలో
- **వానలో కొబ్బరిచెట్టు** – హెచ్చార్కె – పాలపిట్ట బుక్స్ – 100 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16–11–20/6/ 1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036. సెల్ : 9848787284









## పోరాడేవారంతా రాజకీయ ఖైదీలే

దశాబ్దాలుగా జైళ్లలో మగ్గుతున్న రాజకీయ ఖైదీల విడుదల కోసం కృషి చేస్తున్న 'కమిటీ ఫర్ ది రిలీజ్ ఆఫ్ పొలిటికల్ ప్రిజినర్స్ (సిఆర్‌పిపి) – ఆంధ్రప్రదేశ్ చాప్టర్' మొదటి మహాసభలు మార్చ్ 23న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగాయి. ఈ సభలో అరుంధతీ రాయ్ మాట్లాడుతూ న్యాయ సహాయం అందకుండా జైళ్లలో మగ్గుతున్న పేదలనూ, ప్రజా సమస్యలపై పోరాడుతున్న వారినీ రాజకీయ ఖైదీలుగానే పరిగణించాలని సూచించారు. వనరుల దోపిడీకి వ్యతిరేకంగా బస్తర్, దండకారణ్యంలో పోరాడుతున్న ప్రతి ఆదివాసీ రాజకీయ ఖైదీయేనని ఆమె అన్నారు. ఈ సందర్భంగా 'బందీకాని గొంతుక' పుస్తకాన్ని ఆవిష్కరించారు. వివిధ ప్రజాసంఘాల నేతలు ఈ సభలో పాల్గొని ప్రసంగించారు.

## కొనసాగుతున్న ఆత్మబలిదానాలు

మార్చ్ 24న హన్మకొండలోని ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీ ఆడిటోరియం ఎదుట ఎంబిఎ విద్యార్థి లూనావత్ భోజ్యానాయక్ (21) ఒంటిపై పెట్రోల్ పోసుకొని అంటించుకున్నాడు. జై తెలంగాణ నినాదం చేస్తూ పరిగెత్తాడు. చికిత్స పొందుతూ మరణించాడు. ఇటీవల కాలంలో ఆత్మహత్యలు తగ్గాయి అనుకుంటున్నప్పుడు భోజ్యానాయక్‌తో ఆ పరంపర కొనసాగుతోంది. తెలంగాణ అంతటా పెద్ద ఎత్తున నిరసనలు చెలరేగాయి. కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల నాయకులు తెలంగాణ విషయంలో వ్యవహరిస్తున్న తీరు, చేస్తున్న వ్యాఖ్యల వల్లనే ఇలాంటి పరిణామాలు జరుగుతున్నాయనే అభిప్రాయం వ్యక్తమవుతోంది.

## ఎస్.సి., ఎస్.టి. సబ్ ప్లాన్‌ను అమలు చేయాలి

ఎస్.సి., ఎస్.టి. సబ్‌ప్లాన్ అమలుకు చట్టం తీసుకురావాలన్న డిమాండ్‌తో ఐక్యకార్యచరణ కమిటీ ఆధ్వర్యంలో మార్చ్ 23 నుంచి 72 గంటల పాటు హైదరాబాద్‌లోని ఇందిరా పార్క్ వద్ద ఉన్న ధర్నాచౌక్‌లో నిరసన ప్రదర్శన జరిగింది. తదనంతరం మార్చ్ 26న తలపెట్టిన చలో అసెంబ్లీ కార్యక్రమం ఉద్రిక్తతలకు దారితీసింది. ఐక్యకార్యచరణ కమిటీ నేతలు, కార్యకర్తలు, వివిధ రాజకీయ పార్టీల నేతలు ఈ నిరసనలో పాల్గొన్నారు. ఎస్.సి., ఎస్.టి. ఉప ప్రణాళికను అమలు చేసేందుకు రాష్ట్ర కెబినేట్ సబ్ కమిటీని ఏర్పాటు చేస్తున్నట్లు మార్చ్ 27న ముఖ్యమంత్రి ప్రకటించారు. ఆ నివేదికను చర్చించి ప్రణాళిక అమలుకు చట్టబద్ధత కల్పించేలా నిర్ణయం తీసుకుంటామని ముఖ్యమంత్రి తెలిపారు.

## సిబిఐ చార్జిషీట్

వైఎస్ జగన్‌మోహన రెడ్డి అక్రమాస్తుల కేసులో సిబిఐ మార్చ్ 31న తన తొలి చార్జిషీట్‌ను దాఖలు చేసింది. అరవై ఎనిమిది పేజీల చార్జిషీట్‌లో జగన్‌ను మొదటి నిందితుడిగా పేర్కొంది. విజయసాయిరెడ్డితో పాటు అరబిందో, హెటెరో ప్రతినిధులతో సహా పదమూడు మందిని నిందితులుగా చూపింది. ఎమ్మార్ కేసులో ఇప్పటికే అరెస్టైన సీనియర్ ఐఎఎస్ అధికారి బి.పి. ఆచార్యను ఈ నిందితునిగా పేర్కొంది. నిందితులు నేరపూరిత కుట్ర, విశ్వాసఘాతుకం, మోసం తదితర నేరాలకు పాల్పడ్డారని అభియోగాలు నమోదు చేసింది.

## కాష్టం వద్దు.. రాష్ట్రం తెచ్చుకుందాం

'కాష్టం వద్దు.. రాష్ట్రం సాధించుకుందాం' అని ఏప్రిల్ 3న హైదరాబాద్ బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో జరిగిన సభలో వక్తలు నినదించారు. ఒక్కరోజుతో, మలుపుతో తెలంగాణ వస్తుందని భావించవద్దని, అది దీర్ఘకాలిక కార్యాచరణతో ముడిపడి ఉన్న ఉద్యమమని యువతకు హితవు పలికారు. 'తెలంగాణ అమరవీరుల సాక్షిగా' సంఘం ఆధ్వర్యంలో ఈ సభ జరిగింది. ఇదే కాలంలో తెలంగాణలోని పలు విద్యార్థి ప్రజా సంఘాలు ఆత్మహత్యలు వద్దంటూ విస్తృతంగా సభలూ, సమావేశాలూ నిర్వహించాయి.

## హైదరాబాద్ పాతబస్తీలో అల్లర్లు

ఏప్రిల్ 6 ఒకే రోజున హనుమాన్ జయంతి, గుడ్ ఫ్రైడే, ముస్లింలకు పవిత్రమైన శుక్రవారం ప్రార్థనలు ఈ సారి కలిసి వచ్చాయి. హనుమాన్ జయంతి పురస్కరించుకొని పెద్ద ఎత్తున ఊరేగింపులు జరిగాయి. అన్ని ముగిసిపోయాక ఏప్రిల్ 8న మాదన్నపేటలోని ఒక ప్రార్థనాలయంలో ఆవు కాళ్లు నరికి పడేసిన సంఘటనతో ఉద్రిక్తతలు చోటుచేసుకున్నాయి. అయిదుగురు కత్తిపోట్లకు గురయ్యారు. నగరమంతా 144 సెక్షన్ విధించారు. ఉద్రిక్తతలు చోటుచేసుకున్న ప్రాంతాలలో వారం రోజులపాటు కర్ఫ్యూ కొనసాగింది.

## ఉస్మానియా యూనివర్సిటీలో బీఫ్ ఫెస్టివల్

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో దళిత విద్యార్థి సంఘాలు, వామపక్ష విద్యార్థి సంఘాల ఆధ్వర్యంలో ఏప్రిల్ 15న బీఫ్ ఫెస్టివల్ (పెద్దకూర పండుగ) జరిగింది. నెల రోజులకు పైగా దీనిపై విద్యార్థుల మధ్య వివాదం రగుల్కొంది. ఎబివిపి విద్యార్థులు బీఫ్ ఫెస్టివల్‌ను వ్యతిరేకించారు. ఈ కార్యక్రమం ఉస్మానియాలోని న్యూ రిసెర్చ్ స్కాలర్స్ (ఎన్.ఆర్.ఎస్.) వసతి గృహం వద్ద జరిగింది. బీఫ్ ఫెస్టివల్ అనంతరం ఉస్మానియాలో దీన్ని వ్యతిరేకిస్తున్న వర్గానికీ, నిర్వహించిన వర్గానికీ మధ్య ఘర్షణ చోటు చేసుకుంది. కొద్ది మంది విద్యార్థులు గాయపడ్డారు.

## జార్జిరెడ్డి 40వ వర్ధంతి

ప్రగతిశీల విద్యార్థి ఉద్యమానికి ఆద్యుడు జార్జిరెడ్డి అని, ఆయనను వేసిన బీజాలే నేటి విద్యార్థి ఉద్యమానికి స్ఫూర్తిగా నిలుస్తాయని జార్జి మిత్రులు పేర్కొన్నారు. ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థి ఉద్యమ నిర్మాత, ప్రముఖ మేధావి జార్జిరెడ్డి 40వ వర్ధంతి సభను జార్జి మిత్రులు ఏప్రిల్ 15న హైదరాబాద్‌లో నిర్వహించారు. విద్యతో పాటు సమాజాన్ని సంస్కరించాలని, ఇందులో విద్యార్థులు కీలకపాత్ర పోషించాలని లక్ష్యంతో సూత్రధారిగా వ్యవహరించిన మహానాయకుడు జార్జిరెడ్డి అని వక్తలు శ్లాఘించారు. జార్జి మిత్రుడు చలపతిరావు అధ్యక్షతన జరిగిన ఈ సభలో పలువురు ప్రముఖులు పాల్గొన్నారు.

## ఇంటర్ ఫస్ట్ ఇయర్ ఫలితాలు

ఇంటర్ ఫస్ట్ ఇయిర్ ఫలితాలు ఏప్రిల్ 20న వెలువడ్డాయి. రాష్ట్రవ్యాప్తంగా 8,50,443 మంది విద్యార్థులు పరీక్షలకు హాజరుకాగా, 4,57,146 మంది ఉత్తీర్ణులయ్యారు. గతసారితో పోలిస్తే ఈ సారి ఉత్తీర్ణత 1.54 శాతం పెరిగింది. ఇక ఈ ఏడాది కూడా ఫలితాల్లో బాలికలదే పైచేయి. బాలికల్లో 58.32 శాతం, బాలురలో 49.73 శాతం ఉత్తీర్ణులయ్యారు. వీ

## పీడిత ప్రజలదెప్పడూ పోరాట సంప్రదాయమే

తెలంగాణ నేల పోరాటాల గడ్డ. అనేక ఉజ్జ్వలమైన పోరాటాలు చేసిన చరిత్ర ఈ నేలకు ఉంది. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం, జగిత్యాల జైత్రయాత్రలు, రైతుకూలీల తిరుగుబాట్లు, కార్మిక పోరాటాలు, మహిళా పోరాటాలు, ఉజ్జ్వలమైన విద్యార్థి ఉద్యమాలు నడిచింది ఈ నేల మీదనే. కొమురం భీం, బందగీ, దొడ్డి కొమురయ్య, చాకలి ఐలమ్మ, లక్ష్మీ రాజం, బెల్లి లలిత ఇలా అట్టడుగు వర్గాల ప్రజలు ఎంతో ఉన్నతమైన పోరాట సాంప్రదాయాలను మన ముందుంచారు. ఇప్పటికన్నా చాలా తక్కువ ఉత్పత్తి ఉన్న కాలంలో ప్రకృతితో పోరాడే శక్తి ఇంతగా లేని కాలంలో మానవ సమాజాలు ఆత్మహత్యలకు పూనుకోలేదు. ప్రకృతి బీభత్సాలను, కరువు-కాటకాలను, క్రూర మృగాలను, దుర్మార్గమైన నిరంకుశ భూస్వాములను మన తల్లులు తండ్రులు ఎదిరించి నిలిచారు. ఆకలితో, అర్థాకలితో శ్రమ తగ్గ ఫలితం దక్కకపోయినా అనేక ఆటుపోట్ల మధ్యనే ఈ సమాజాన్ని మన చేతిలో పెట్టారు. గడిచిన చరిత్రను, వారి ఆరాట పోరాటాలను మనం మననం చేసుకోవాలి. ఎందరో అమరులు వదిలిపోయిన ఉన్న సమాజ ఆశయాలను పోరాడి సాధించడానికి, వారు కలలుగన్న సమాజాన్ని నిర్మించడానికి మనమంతా చివరి ఊపిరి వరకు పోరాడాలి. బతుకున్నది ఆ లక్ష్యాలను సాధించడం కోసమే ననే స్ఫూర్తితో మెలగాలి. ఆత్మ బలిదానాలకే తెగించిన వాళ్లం ఆ సాహసాన్ని పోరాట శక్తిగా మలచాలి. వేరెవ్వరికీ లేని సాహసం, చొరవ మనలో నిక్షిప్తమై ఉన్నాయని గ్రహించాలి. ఆచరణలో నిరూపించాలి. ఆత్మహత్యకు పూనుకునే ఆలోచన కలిగిన ఆ క్షణాన కొద్దిగా ఆలోచించి వ్యక్తిగతాన్ని రద్దు చేసుకొని ఆ క్షణం నుంచి సమిష్టి కోసం కొత్త జీవితాన్ని ప్రారంభించాలి. ఈ సమాజంలోని పీడిత వర్గాల ప్రజలతో మమేకం కావాలి. మనది వ్యవసాయ సంస్కృతి. ఎన్ని ఆటుపోట్లు ఎదురైనా విత్తనాన్ని నాటి ఈనాటి వరకూ మనకు అన్నం పెట్టిన మన పాత తరాల ఆదర్శాన్ని ముందుకు తీసుకుపోవాలి. ఏదీ వ్యక్తగతం కాదు. అంతా సామాజికమే. సమిష్టి ఆకాంక్షలకు సమిష్టి పోరాటమే మార్గం. ఉద్యమంలో ఉన్న అవకాశావాద ధోరణులను, ఉద్యమ విద్రోహాలను ఎండగడదాం. అవకాశ రాజకీయ పార్టీల్నిటినీ, రాజకీయ నాయకులందరినీ బయట పెడదాం. దేశంలోని కొనసాగుతున్న విప్లవోద్యమానికే నాయకత్వాన్ని అందింటిన చరిత్ర తెలంగాణ నేలకు ఉందని మరిచిపోవద్దు. నూరు పూలు వికసించడానికి, వేయి ఆలోచనలు సంఘర్షించడానికి మనం దోహదపడదాం. మన కష్టాలకు కారణామైన ప్రాంతాతేతరుడైనా, ప్రాంతం వాడే అయినా తరిమి కొడదాం. పాతరేద్దాం.

## భూములు వెనక్కిచ్చి బతుకును పునరుద్ధరిస్తారా!

రాష్ట్రంలో 2006-11ల మధ్య అప్పటి ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి ఆధ్వర్యంలో పారిశ్రామికాభివృద్ధి పేరిట, వసతుల కల్పన పేరిట జరిగిన భూపందేరాలపై, అక్రమాలపై వాస్తవాలను కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) బయటపెట్టింది. ప్రాజెక్టుల పేరిట జరిగిన ఘరానా మోసాలు బయటపడ్డాయి. కాగ్ నివేదికను ప్రభుత్వం మార్చ్ 29న అసెంబ్లీలో ప్రవేశపెట్టింది. ఏటా ప్రభుత్వ లావాదేవీలపై సివిల్, వాణిజ్య, ఆదాయం, స్థానిక సంస్థలకు సంబంధించిన నాలుగు అంశాలపై కాగ్ నివేదిక ఇస్తుంది. ఆ నివేదికలో - రాష్ట్ర సామాజిక, ఆర్థిక ప్రయోజనాలను అప్పటి ప్రభుత్వం కాపాడలేదని, హేతుబద్ధత మరిచి ఇష్టారాజ్యంగా, కారుచౌకగా భూములు అప్పగించిందని, తద్వారా ప్రైవేట్ వ్యక్తులకూ, సంస్థలకూ ఆయాచిత లబ్ధిని చేకూర్చారని తెలిపింది. భూములను వాస్తవ ధరలతో సంబంధం లేకుండా అతి తక్కువ ధరలకు వివిధ సంస్థలకు కేటాయించడం ద్వారా ప్రభుత్వానికి రు.1784 కోట్ల నష్టాన్ని కలుగజేసినట్లు తెలిపింది. 2006-11 మధ్య 1027 మందికి 88,492 ఎకరాలు కట్టబెట్టారు. మచ్చుకు పదకొండు జిల్లాల్లో 459 మందికి జరిగిన కేటాయింపులను కాగ్ పరిశీలించింది. భూకేటాయింపుల్లో ఒక పద్ధతి లేదు, పారదర్శకత లేదు, ప్రజా ప్రయోజనాలను కాపాడలేదని పేర్కొంది. పదకొండు సెజ్‌లను పరిశీలించిన కాగ్ - 5,92,507 ఉద్యోగాలు వస్తాయని ప్రభుత్వం 17,911 ఎకరాలను దారాధత్తం చేసిందని, అయితే కేవలం 25,582 ఉద్యోగాలు మాత్రమే ఇచ్చారని పేర్కొంది. ఏళ్లు గడిచినా ప్రాజెక్టులు పూర్తవలేదని పేర్కొంది. అయితే ఇన్ని నిజాలు బయటపడ్డాక రాష్ట్ర ప్రభుత్వం బాధిత ప్రజలకు న్యాయం చేస్తుందా అనేది అసలు ప్రశ్న. అప్పుడు భూములు కోల్పోయిన వారికి, బతుకును కోల్పోయిన వారికి తిరిగి వారికి బతుకును, భరోసాను ఇవ్వగలదా అనేది ప్రశ్న. కాగ్ మచ్చుకు కొన్నిటినే పరిశీలించింది. ఒక ప్రభుత్వం, పార్టీ హయాంలో జరిగిన అక్రమాలను మరో ప్రభుత్వం, మరో పార్టీ హయాంలో కాగ్‌లు ప్రకటించిన సత్యాలను దండగుచ్చి సరిచేయాల్సిన బాధ్యత ప్రజల మీదే ఉంది. ఇలాంటి అన్ని కేటాయింపుల అసలు రంగును బయట పెట్టాల్సింది బాధితులైన ప్రజలే.

## పెద్దకూర పండుగ - ఒక సాంస్కృతిక సవాల్

ఈ దేశంలోని దళితులు, ముస్లింలు, ఆదివాసులు, అణగారిన జాతులు తమ ఆహారాన్ని, తమ ఇష్టాల్ని బహిరంగంగా ప్రకటించలేని ఆత్మన్యూనతలో వేల సంవత్సరాలు కొనసాగాయి. అయితే, 1960ల చివరి నుంచి ఈ దేశంలో విప్లవోద్యమాలు తలెత్తాయి. విస్తరించాయి. 1990ల నుంచి అనేక అస్తిత్వ పోరాటాలు, ఆత్మగౌరవ పోరాటాలు ముందుకొచ్చాయి. తమ మూలాల వెతుకులాట, తమ చరిత్ర, సంస్కృతుల ప్రకటన బలోపేతమయ్యాయి. పై వర్గాల ఆహారం, ఆహార్యం, సంస్కృతులే గొప్పవిగా, గౌరవించబడేవిగా కొనసాగిన, కొనసాగుతున్న కాలాన్ని ప్రశ్నించే తరాలు బయలుదేరాయి. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షతో పాటు జమిలిగా తెలంగాణ ప్రాంత దళితులు, ఆదివాసులు, ముస్లింలు, బహుజనులు తమవైన ఆకాంక్ష లనూ, డిమాండ్లనూ, ప్రశ్నలనూ ముందుకు తీసుకొస్తున్నారు. ఇది తట్టుకోలేని హిందూ బ్రాహ్మణీయ మతోన్మాద శక్తులు ఆ చైతన్యాన్ని అడ్డుకోవాలనీ, అవమానించాలనీ, తమ ఆధిపత్యం కొనసాగించాలనీ ప్రయత్నిస్తున్నాయి. ఆ ఆధిపత్యానికి విసిరిన ఒకానొక సవాలే బీఫ్ ఫెస్టివల్. ఉస్మానియా యూనివర్సిటీ దళిత, బహుజన, ముస్లిం, వామపక్ష విద్యార్థులు బీఫ్ ఫెస్టివల్ ద్వారా ఆ సవాల్‌ను విసిరారు. ఈ శ్రామిక వర్గాల ప్రజలు ఆవు మాంసాన్ని, ఎద్దు మాంసాన్ని తింటారు. కోడి, మేక మాంసాలలాగనే ఈ మాంసం కూడా. అయితే హిందుత్వ శక్తులు ఆవు, ఎద్దులకు ప్రత్యేక పవిత్రతను ఆపాదించి వాటిని తినేవారిని అవమానిస్తున్నారు. చౌకగా దొరికే ఈ బలవర్ధక ఆహారాన్ని శ్రామికులు అనాదిగా తింటున్నారు. అయితే మనుషులను మతం పేరిట చంపి, కులం పేరిట అవమానించే హిందుత్వ శక్తులు అణగారిన వర్గాల సంస్కృతిని అవమానించడాన్ని ముక్త కంఠంతో ఖండించాలి. అన్ని అస్తిత్వాల, ప్రజాసమూహాల ఆత్మగౌరవాన్ని ఎత్తిపట్టడమే మనందరి కర్తవ్యం.

వార్త - వ్యాఖ్య : డి.వి. రామకృష్ణారావు

స్త్రీల జీవితంపై స్త్రీలకు అధికారంలేని స్థితిని స్త్రీవాద సాహిత్యం స్పష్టంగా రంగం మీదికి తెచ్చి చూపింది. స్త్రీల జీవితంపై స్త్రీలకు అధికారం ఉండాలంటే సాధికారత సాధించబడవలసిన లక్ష్యం అని నిజాయితీగా నమ్మితే, భిన్న జీవిత పార్శ్వాలను జీవన రంగాలను అల్లుకుపోయిన లింగ వివక్షా సంస్కృతి అమానీయమైనది, అప్రజాస్వామికమైనది అని గుర్తించి దానిని ధ్వంసం చేసి నూతన ప్రజాస్వామిక సంబంధాలను స్త్రీ పురుషుల మధ్య నెలకొనడానికి చిత్తశుద్ధితో కృషి చేయవలసి ఉంటుంది. స్త్రీవాద సాహిత్యం ఆ ప్రయోజనాపేక్షతోనే వస్తున్నది. దళిత స్త్రీవాదం దానిని ఇంకా సూక్ష్మస్థాయిలో పదునెక్కిస్తున్నది. ఈ విధంగా వచ్చే సాహిత్యం సమాజంలో జండర్ స్పృహను పెంచడానికి రూపొందించే కార్యక్రమాలలో భాగంగా భావజాల వ్యాప్తికి సరళ సుందరం శక్తిమంతమూ అయిన సాధనంగా ఉపయోగపడుతుంది కూడా.

**కాత్యాయనీ విద్మహే – భూమిక, మార్చ్–ఏప్రిల్ 2012**

**9** మార్చ్ 1924లో దళితులు, కుల సంస్కరణవాదులు తదితరులతో కలిసి అంబేద్కర్ ఒక సంస్థను ఏర్పాటు చేశాడు. దానినే బహిష్కృత హితకారిణీ సభగా పిలుస్తారు. ఆ సంస్థ ఆశయాలు, లక్ష్యాలు జూలై 20న స్థాపక సమావేశ సందర్భంగా వెలువరించడం జరిగింది. స్థాపక సభ్యులు సర్ చిమన్‌లాల్ హీరాలాల్ సెతల్‌నాడ్, మేయర్ హిసిమ్ రుస్తుమ్‌జీ జిన్వాలా, జె.కె. నారిమన్, డా. ఆర్.పి. పరంజపె, డా. వి.పి. చవాన్, బాలగంగాధర్ ఖేర్. ఈ సంస్థకు అధ్యక్షుడిగా అంబేద్కర్, కార్యదర్శిగా సీతారాం నాందేవ్ శివ్‌తార్కార్, కోశాధికారిగా నివృత్తి జాదవ్ నియమింపబడగా, శంభాజీ గైక్వాడ్ స్థాపక సభ్యులుగా ఉన్నారు. సంస్థ ప్రధాన నినాదం 'చదివించు, పోరాడు, సమీకరించు'.

**గెయిల్ ఆంవెట్, తెలుగుసేత: ఎ.ఎన్. – సమాంతర, మార్చ్ 2012**

కామ్రేడ్ లెనిన్ జీవితం చాలా తక్కువ కాలమే. 1924 జనవరి 21న తన తుదిశ్వాస విడిచే నాటికి 54 సంవత్సరాలు మాత్రమే. కానీ ఆయన తన జీవితకాలంలో అనుసరించిన తీరు, ఆలోచనా అద్భుతమయింది. తాను ఒక మార్క్సిస్టు తాత్వికవాదిగా మారడమే కాకుండా, దాన్ని తన దేశానికి అన్వయించి ప్రపంచంలోనే మొదటిసారి గర్జించు రష్యా, గాండ్రించు రష్యా సోషలిస్టు విప్లవాన్ని అకుంఠిత దీక్షతో నడిపాడు. విప్లవ విజేతగా పేరొందినాడు. ప్రపంచ ప్రజలకే వెలుగు రేఖను అక్టోబర్ విప్లవం ద్వారా అందించిన మహానుభావుడు కామ్రేడ్ లెనిన్.

లెనిన్ తన జీవితంలో 25 వేల పేజీలు రచించారు. 44 గ్రంథాలతో వీటిని క్రోడీకరించారు. 112 లైబ్రరీల్లోని గ్రంథాలను ఎంచుకొని అధ్యయనం చేశాడు. 1861 నుండి ఫ్యూడల్ రష్యా పెట్టుబడిదారీ దేశంగా మారిన పరిణామాలను అధ్యయనం చేశాడు. ఈ పరిణామాలను అధ్యయనం చేయడానికి 'రష్యాలో పెట్టుబడిదారీ అభివృద్ధి' అనే గ్రంథాన్ని తన 26వ ఏట (1896లో) రచించాడు. ఈ గ్రంథ రచన కోసం 583 పుస్తకాలు అధ్యయనం చేశాడు. ఒక విషయంపై సమగ్రంగా తెలుసుకోవడానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఇలా కాకుండా సమగ్ర కర్తవ్యాలను రూపొందించుకోలేమన్నాడు.

**సూర్యం, ప్రజాపంథా, 15 ఏప్రిల్ 2012**

ప్రపంచమంతటా మనుషులు నమ్మే రకరకాల మతాలు ఎప్పటి నుంచీ మొదలయాయో ఊహించాలేగాని కచ్చితంగా చెప్పలేం. సుమారు ఐదు లక్షల ఏళ్ల క్రితం నుంచి పది, పన్నెండు వేల ఏళ్ల క్రితం వరకూ పాతరాతి యుగం కొనసాగింది. ఆ కాలపు అవశేషాలనూ, రాతి వస్తువులనూ, చెక్కడాలనూ బట్టి కొన్ని విషయాలు తెలుస్తున్నాయి. కొన్ని విశేషాలు ఇతరత్రా లభిస్తాయి. ఈనాటికీ నాగరికత సోకకుండా తమకు ప్రత్యేకమనిపించే తంతులు నిర్వహిస్తూ బతికే ఆదిమ తెగలు ప్రపంచమంతటా కనిపిస్తారు. వారి ఆచారాలూ, నమ్మకాలూ మనకు విచిత్రంగా, అనాగరికంగా అనిపించినప్పటికీ ఆధునిక ముసుగులు తగిలించుకున్న నేటి మత విశ్వాసాల పునాదులన్నీ వాటిలో కనిపిస్తాయి. వీటిలో కొన్ని వివరాలు కొందరికి జుగుప్సనూ, కొందరికి కోపాన్నీ కలిగించవచ్చు. అయినా కాస్త ఆలోచిస్తే మనుషులకు మొదటి నుంచీ ఉన్న కొన్ని మానసిక బలహీనతలే ఈ విషయంలో పనిచేశాయని స్పష్టమౌతుంది.

**కొడవటిగంటి రోహిణీప్రసాద్, మనుషులు చేసిన దేవుళ్లు**

దేవుడి మహిమలను ప్రచారం చేసే దైవభక్తుల హక్కును మన ప్రభుత్వం గుర్తిస్తోంది. అంతవరకూ నా అభ్యంతరం ఏమీ లేదు. కథలలో, కవిత్వాలలో, భరత నాట్యాలలో, భజనలలో ఎంత ప్రచారమైనా సాగించవచ్చు. కాని, దేవుడు లేడని త్రికరణశుద్ధిగా నమ్ముతున్న నా విశ్వాసానికి ప్రభుత్వం ఏ కొంచమైనా హామీయిస్తుందా? జగద్గురు స్వాములవారికున్న రక్షణలో పదో వంతయినా ఆశించే హక్కు నాకు లేదా?

సైన్సును సత్యంగా కాకపోతే సత్యాన్వేషణగానయినా అంగీకరించాలా వద్దా? ఒకప్పుడు సైంటిస్టులను మత గురువులూ, మహారాజులు చిత్రవధలు చేసిన సంఘటనలు మనం చరిత్రలో చదువుకోవడం లేదా? అయినా ఈనాడు మతం ఓడిపోతోంది. సైన్సు గెలుస్తోంది. ఇదే ఈనాటి చారిత్రక పరిణామం. దీన్ని ఏ పూజారి తన కుంటికాలు అడ్డుపెట్టి అడ్డలేదు.

**శ్రీశ్రీ, అనంతం**

మరునాడు ఎండబెట్టిన ఆవు మాంసం కూర వండారు. ఈ గిరిజనులు హిందువులు కారు. కాబట్టి గోహత్య మహాపాతకం అని అనుకోరు. వారు ముస్లింలూ కారు. కాబట్టి హలాల్ చేయాలనే నియమం కూడా లేదు. వారు మానవులను తప్ప అన్నిటినీ తింటారు. మనుషులను మింగే పని నాగరిక సమాజంలో అనేక రూపాల్లో, అనేక పద్ధతుల్లో జరుగుతూ ఉంటుంది. ఈ గిరిజనులు మనుషులను దేవుళ్లలాగా కొలవరు. అలా అని అవమానపరచరు. కోపం వస్తే క్షణకాలంలో మెడకాయ నుండి తలకాయ వేరు చేసేస్తారు. మనిషి ప్రాణాలను తీయడం వారికి చాలా చిన్న పని. కానీ వారు ఆ పనిని చాలా అరుదుగా చేస్తారు. అరవై లక్షల జనాభా ఉన్న దండకారణ్యంలో ఏటా రెండో మూడో హత్యానేరాలు జరుగుతాయి. అదే మనం నాగరిక సమాజం అనుకునే ఢిల్లీలో వార్తాపత్రికలు నిండా హత్యలు, దోపిడీలు, కత్తిపోట్లు, దొంగతనాల వార్తలే.

**సత్నామ్, జంగల్‌నామా**

అంతర్జాతీయ దృక్పథం కన్నా జాతీయ దురహంకారం క్షేమమను కున్నప్పుడు ప్రజాస్వామ్యం ముసుగు వేసుకున్న ప్రభుత్వాల సామ్రాజ్యవాద స్వభావాన్ని గుర్తించడం కష్టం. అందుకే ఇవ్వాళ మనకు కులం పార్టీలేగాని సిద్ధాంత పార్టీలు లేవు. ఏ ఎన్నికల పార్టీకీ ఒక సిద్ధాంతం, ఒక లక్ష్యం, ఒక నీతి లేవు. సోషలిజం వల్లిస్తున్న నోళ్లు చూసి పీడితులు వీళ్లలో ఏ వొక్కరి చేతులైనా శ్రమజీవుల రక్తంతో తడవకుండా ఉన్నాయా అని అనుమానిస్తున్నారు. దోపిడీకి పెట్టుకున్న ముద్దుపేరు ఎన్నికలు. ఐదేళ్లకొకసారి, ఇంకా మధ్య మధ్య చాలసార్లు, చాల తీర్లు మననెవ్వరు దోచుకోవాలో నిర్ణయించి చట్టబద్ధమైన దోపిడీ శాసనసభలకు ప్రతినిధులుగా పంపించాలి! కళ్లు తెరిచినవారెవ్వరూ కంట్లో వేలు పెట్టినవాని నోట్లో వేలు పెట్టరు. సమ సమాజం సాధించుకోవడానికి పోరాటమే రాజీలేని మార్గమని తెలుసుకున్న పీడితులు విప్లవాన్ని ఎన్నికలతో వాయిదా వెయ్యరు, బహిష్కరిస్తారు.

**వరవరరావు, సృజన సంపాదకీయం, మార్చ్ 1972**

# ఎస్.సి., ఎస్.టి. సబ్‌ప్లాన్ నిధులు ఎవరికి?

***ఎస్.సి., ఎస్.టి. సబ్‌ప్లాన్ నిధులను దారి మళ్లించకుండా ఆ సామాజిక వర్గాల ప్రజల అభివృద్ధికే వినియోగించాలని అంటున్నారు*** **ఎం. ఆంజనేయులు**

దళితులు, ఆదివాసీలు సామాజికంగా, ఆర్థికంగా ఎన్నో తరాలుగా వివక్షకు గురవుతూ వస్తున్నారు. ఊరికి దూరంగా, అంటరాని వారిగా, అభివృద్ధికి ఆమడ దూరంలో ఉంటున్నారు. ఈ దేశ జనాభాలో దాదాపు 25 శాతంగా ఉన్న దళితులు, ఆదివాసీలు కడు దుర్భర దారిద్ర్యంలో, పేదరికంలో మగ్గుతున్నారు. నిరక్షరాస్యులుగా, చాలీచాలని కూలీతో, అర్ధాకలితో, రోగగ్రస్తులుగా జీవితాలను వెళ్లదీస్తున్నారు. ప్రభుత్వాలు ఎంతో ఘనంగా ప్రవేశపెట్టిన సంక్షేమ పథకాలు సైతం దళితులకు, ఆదివాసీలకు అందనంత దూరంలో ఉన్నాయి. విద్యా, ఉపాధి, ఉద్యోగ రంగాలలో వారిపట్ల నిర్లక్ష్యం స్పష్టంగా కనిపిస్తుంది. మన రాష్ట్రంలో 52,972 దళిత వాడలు, 20,000 గిరిజన తండాలు/గూడెంలు ఉన్నాయి. వారు అన్నిరంగాలలో వివక్షకి, నిర్లక్ష్యానికి గురయినట్లే అభివృద్ధిలో కూడా వివక్షకు గురవుతున్నారు. గ్రామాలలో, కాలనీలలో, బస్తీలలో; త్రాగునీరు, విద్యుత్, రోడ్లు, ఇల్లు, మరుగుదొడ్లు, విద్య, వైద్యం తదితర కనీస అవసరాలకు నోచుకోలేకపోతున్నారు. పల్లెలు అభివృద్ధికి నోచుకోక పోగా, కూలీలుగా కాలం వెళ్లదీస్తున్న అత్యధిక దళితులు కూలీపనులు దొరకక పనులను వెతుక్కుంటూ పొట్ట చేతపట్టుకుని సుదూర ప్రాంతాలకు వలస పోతున్నారు. వారి పిల్లల విద్య, ఆరోగ్యం, వారి బాల్యం పణంగా పెట్టి వలసలు పోతున్నారు. చివరికి చనిపోతే, బొంద పెట్టడానికి కూడా స్మశానాలు లేని దుస్థితి వారిది.

రాజ్యాంగం కల్పించిన రక్షణలు, సౌకర్యాలు, హక్కులు వారికి ఏమాత్రం మేలు చేయలేకపోయాయి. వారిపై అత్యాచారాలు, వేధింపులు, దాడులు పెరిగిపోతూనే ఉన్నాయి. చట్టాలన్నీ కలవారి చుట్టాలుగా చలామణీ అవుతున్నాయి. ఈ పరిస్థితులు దేశంలో, రాష్ట్రంలో ఏ పార్టీ అధికారంలో ఉన్నప్పటికీ, చెప్పుకోదగ్గ మార్పులు లేకుండానే కొనసాగుతున్నాయి. వారిని ఓటు బ్యాంక్‌గా మలచుకొని, తమ స్వార్థ రాజకీయ ప్రయోజనాలకు వాడుకుంటున్నారు. భూసంస్కరణలు, పంచవర్ష ప్రణాళికలు, 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాలు, పేదరిక నిర్మూలనా పథకాలు ఆ జాతులను అభివృద్ధిపథాన నడిపించలేక పోయాయి. స్వాతంత్ర్యం వచ్చి 63 సంవత్సరాలు గడిచినా వారి అక్షరాస్యత శాతం చాలా తక్కువగా ఉంది. 1 నుంచి 10వ తరగతి లోపు మధ్యలోనే చదువు మానేసే వారి సంఖ్య దళితుల్లో 70 శాతం, గిరిజనులలో 80 శాతంగా నమోదయింది. దీన్నిబట్టి వారి పట్ల ఎంత నిర్లక్ష్యంగా ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నాయో అర్థమవుతుంది. రాజకీయ పార్టీల నేతలకు, పాలకులకు చిత్తశుద్ధి లేకపోవడం వలన కోట్లాది రూపాయల సంక్షేమ నిధులు వారి బొక్కసాలకు చేరాయి. ప్రతి పేద కుటుంబానికి కనీసం ఒక ఎకరా ప్రభుత్వ భూమి ఇవ్వాలని కోనేరు రంగారావు కమీషన్ చేసిన సిఫారసులను బుట్టదాఖలు చేసినారు.

భారతదేశంలోని మొత్తం పేదలలో 50 శాతం మంది పైగా దళితులే ఉన్నారని ఇటీవల ఒక సర్వేలో తేలింది. దీన్ని బట్టి వారి జీవితాలు ఎంత దుర్భరంగా ఉన్నాయో అర్థమవుతుంది. ఇప్పటికీ 80 శాతానికి పైగా దళితులు గ్రామాలలోనే నివసిస్తున్నారు. 22 జూలై, 2011న ప్రణాళికాసంఘం ఒక కేసులో సుప్రీం కోర్టులో చేసిన వాదన ప్రకారం గ్రామీణ ప్రాంతాలలో రోజూ 15 రూపాయలు సంపాదించేవారు, పట్టణాలలో 20 రూపాయలు సంపాదించేవారు దారిద్ర్యరేఖకు ఎగువన ఉన్నట్లు భావించాలని చెప్పారు. పేదరికాన్ని తగ్గించి చూపడానికి, సబ్సిడీల భారాన్ని తగ్గించుకోవడానికి, ప్రణాళికా సంఘం చేసిన ఈ ప్రతిపాదనలను సుప్రీంకోర్టు జడ్జీలు దల్వీర్ భండారీ, దీపక్ వర్మ తప్పుబట్టారు. ఈ వాదన వాస్తవాలకు దగ్గరగా లేదని మండిపడ్డారు.

ఇందిరాగాంధీ 1980లో తిరిగి అధికారానికి వచ్చిన తరువాత దళితుల, ఆదివాసీల పరిస్థితులను సమీక్షించి, ఇప్పటివరకు వారికోసం ప్రవేశపెట్టిన అభివృద్ధి పథకాలు సరిగ్గా వారికి చేరలేదని, వారి ఆర్థిక, సామాజిక జీవితాలలో మార్పు రాలేదని నిర్ధారణకు వచ్చింది. ప్రజాస్వామ్యాన్ని పరిహసించిన ఎమర్జెన్సీ నిర్బంధం, పెల్లుబికిన ప్రజా ఉద్యమాల అణచివేత, రైతాంగ విప్లవ పోరాటాలపై ఉక్కుపాదం మోపటం లాంటి చర్యలతో ఇందిరాగాంధి ఓటు బ్యాంకు చెదిరి పోయింది. ఆ పార్టీ ప్రజలకు బాగా దూరమైంది. 1977లో జరిగిన ఎన్నికలలో ఘోర పరాజయం మూటగట్టుకుంది. అనేక రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు పతనమయ్యాయి. ఈ ప్రతికూల పరిస్థితి నుంచి బయట పడాలని భావించిన ఇందిరాగాంధీ తిరిగి అధికారంలోకి వచ్చిన వెంటనే దళితులను, ఆదివాసీలను మరోసారి ఓటు బ్యాంకుగా మార్చుకోవడానికి ఈ కొత్త ప్రతిపాదనలతో ముందుకొచ్చింది. దీనికోసం ఆయా రాష్ట్రాలలో, కేంద్రంలో ప్రత్యేకంగా నిధులు కేటాయించి, వారి కోసమే ఖర్చు పెట్టాలని భావించారు. జనాభా ప్రాతిపదికన ఆయా రాష్ట్రాలలో వారి జనాభా నిష్పత్తిలో దళితులకు, ఆదివాసులకు ప్రణాళికా వ్యయంలో నిధులు కేటాయించాలని ఆదేశించింది. వెంటనే మార్చి 12, 1980లో అన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులకు, కేంద్ర మంత్రిత్వ శాఖలకు ఇందిరాగాంధీ సుదీర్ఘ లేఖ రాశారు. దళితుల, ఆదివాసీల అభివృద్ధికి అత్యధిక ప్రాధాన్యత ఇవ్వాలని ఆ లేఖలో కోరారు. ఇప్పటివరకు దళితులు తీవ్ర ఆర్థిక దోపిడికి, సామాజిక వివక్షకు గురయ్యారని ఆవేదన చెందారు. పేదరిక నిర్మూలనకు, వారి సమగ్ర

అభివృద్ధికి చిత్తశుద్ధితో కృషి చేయాలని ఆ లేఖలో కోరారు. ఈ విధంగా 6వ పంచవర్ష ప్రణాళికా కాలం నుంచి ఎస్.సి.సబ్‌ప్లాన్ (ఎస్.సి.ఎస్.పి) నిధుల కేటాయింపు ప్రారంభమైంది. అంతకుముందే 5వ పంచవర్ష ప్రణాళికా కాలంలో ట్రైబల్ సబ్ ప్లాన్ (టి.ఎస్.పి) ప్రారంభమైంది.

ఇందిరాగాంధీ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు ప్రణాళికా సంఘం మెంబర్ సెక్రటరీగా నేటి ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ ఉన్నారు. దీని అమలుకు సంబంధించి మార్గదర్శకాలు అన్ని రాష్ట్రాలకు, కేంద్రపాలిత ప్రాంతాలకు ప్రణాళికా సంఘం జారీ చేసింది.

జనాభా ప్రాతిపదికన వారి నిష్పత్తిని బట్టి ఆయా రాష్ట్రాల బడ్జెట్‌లోని ప్రణాళికా వ్యయంలో నిధులు కేటాయించాలని, వాటిని వారి అభివృద్ధికే ఖర్చు చేయాలని చెప్పారు. ఈ నిధులను ఎట్టి పరిస్థితులలోను దారి మళ్లించరాదని, ఖర్చు చేయకుండా ఉంచరాదని తెలిపారు. సాంఘిక సంక్షేమ శాఖకు నిధులను అన్ని విభాగాలు, మంత్రిత్వ శాఖల నుంచి రప్పించి, జమచేయాలని, సాంఘిక సంక్షేమ శాఖ ద్వారానే ఖర్చు చేయాలని కోరారు. ఈ నిధులను ఎస్.సి, ఎస్.టిల సమగ్ర ఆర్థిక, సామాజిక, విద్య అభివృద్ధిని సాధించడానికి, ఆర్థిక సమస్యలను రూపుమాపడంలో ఎస్.సి.ఎస్.పి, టి.ఎస్.పి ఉపయోగపడాలని లక్ష్యంగా నిర్దేశించారు. ఎస్.సి.ఎస్.పి ప్రకారం కుటుంబం యూనిట్‌గా తీసుకుని వ్యక్తిగతంగా ఆర్థికంగా లబ్ధి చేకూర్చే కార్యక్రమాలు చేపట్టి వారి ఆర్థిక పురోగతికి దోహదపడాలని సూచించారు. టి.ఎస్.పి ప్రకారం గ్రామం యూనిట్‌గా తీసుకుని గిరిజన గూడెం, తండాలు సమగ్రంగా అభివృద్ధి చెందేలా కార్యక్రమాలు చేపట్టాలని సూచించారు. వారికి కావలసిన కనీస వసతులపై దృష్టి పెట్టాలని సూచించారు.

ప్రభుత్వ వ్యయాన్ని రెండు రకాలుగా విభజించవచ్చు. అవి : 1) ప్రణాళికా వ్యయం 2) ప్రణాళికేతర వ్యయం

**ప్రణాళికా వ్యయం :** అభివృద్ధి కార్యక్రమాలకు, సంక్షేమ పథకాలకు, ఆర్థిక పురోగతికి చేపట్టే కార్యక్రమాలకు చేసే వ్యయాన్ని ప్రణాళికా వ్యయం అంటారు.

**ప్రణాళికేతర వ్యయం :** ఇది రోజువారి కార్యకలాపాలకు, ప్రభుత్వ నిర్వహణ, జీతాలు, పెన్షన్‌లు, వడ్డీల చెల్లింపు తదితర ఖర్చులు ప్రణాళికేతర వ్యయం కిందకు వస్తాయి. సబ్‌ప్లాన్(ఉప ప్రణాళిక) అంటే ప్రణాళికా వ్యయంలో మరొక ఉప ప్రణాళిక అని అర్థం. అంటే ప్రణాళికా వ్యయంలో కొంత మొత్తాన్ని పక్కకు తీసి ప్రత్యేకంగా ఖర్చు చేయడమని అర్థం. ఉదాహరణకు మన రాష్ట్ర బడ్జెట్ 2012-13 ప్రకారం ప్రణాళికావ్యయం 54,030 కోట్ల రూపాయలు. ఈ 54,030 కోట్ల రూపాయలలో మన రాష్ట్ర జనాభాలో 16.20శాతం శాతంగా ఉన్న దళితులకు 16.20శాతం నిధులు కేటాయించి, వారి అభివృద్ధికే ఖర్చు చేయాలి. అలాగే గిరిజనులకు వారి జనాభా నిష్పత్తి ప్రకారం 6.60శాతం నిధులు కేటాయించి, ఖర్చు చేయాలి. అంటే దళితులకు 16.20శాతం లెక్కన 8750 కోట్ల రూపాయలు, ఆదివాసీలకు 6.60శాతం లెక్కన 3565 కోట్ల రూపాయలు మన రాష్ట్రంలో ఈ ఆర్థిక సంవత్సరంలో ఖర్చు చేయాలి.

రాష్ట్రంలోని అన్ని మంత్రిత్వశాఖలు, డిపార్ట్‌మెంట్‌లు; కేంద్రంలోని మంత్రిత్వశాఖలు, డిపార్ట్‌మెంట్‌లు వారి వారి బడ్జెట్‌లలో సబ్‌ప్లాన్ కింద నిధులు కేటాయించి ప్రణాళికాబద్ధంగా ఖర్చుచేయాలి. ఈ సబ్‌ప్లాన్ నిధులను కచ్చితంగా అమలు చేయాలని కేంద్రం నుంచి రాష్ట్రాలకు ఆనాటి ప్రధానమంత్రి వి.పి.సింగ్, రాజీవ్‌గాంధీ మంత్రివర్గంలో సహాయ మంత్రిగా పనిచేసిన కె.ఆర్.నారాయణన్, పి.వి.నరసింహారావు మంత్రివర్గంలో సంక్షేమశాఖా మంత్రిగా పనిచేసిన సీతారాం కేసరి లేఖలు రాశారు. చిత్తశుద్ధితో దళితుల అభివృద్ధికి పథకాలు రూపకల్పన చేసి ఖచ్చితంగా అమలు చేయాలని వారు ఆ లేఖలలో అన్ని రాష్ట్ర ప్రభుత్వాలను కోరారు.

కె. ఆర్. నారాయణన్ రాష్ట్రపతిగా ఉన్నప్పుడు దళితుల, ఆదివాసీల ఆర్థిక స్థితిగతులు, సంక్షేమ కార్యక్రమాలు, సబ్ ప్లాన్ నిధుల అమలు తీరుతెన్నులు, ఎస్.సి, ఎస్.టి అత్యాచారాల నిరోధక చట్టం కింద కేసుల సత్వర పరిష్కారం తదితర విషయాలను కూలంకషంగా చర్చించి కేంద్ర ప్రభుత్వానికి నివేదిక సమర్పించాలని గవర్నర్ల సమావేశంలో నిర్ణయించారు. దీని కోసం ఏడుగురు గవర్నర్లతో 2000లో ఒక ఉన్నతస్థాయి కమిటీని ఏర్పాటు చేశారు. ఈ కమిటీకి చైర్మన్‌గా అప్పటి మహారాష్ట్ర గవర్నర్ శ్రీ పి.సి. అలెగ్జాండర్‌ని నియమించారు. ఈ కమిటీలో సభ్యులుగా శ్రీయుతులు ఎమ్.ఎ.జాకబ్ (మేఘాలయ), ఎస్.ఎస్.కాంగ్ (కేరళ), వి.ఎస్.రమాదేవి (కర్నాటక), సూరజ్‌భాన్ (ఉత్తరప్రదేశ్), ఎమ్.ఎమ్.రాజేంద్రన్ (ఒరిస్సా), బాబూ పరమానంద్ (హర్యాన) లను నియమించారు.

ఈ కమిటీ దేశవ్యాప్తంగా సమాచార సేకరణ కోసం విస్తృతంగా పర్యటించింది. గ్రామీణ ప్రజలను, వారి కష్టాలను దగ్గరికి వెళ్లి పరిశీలించారు. వారి బాధలను అడిగి తెలుసుకున్నారు. విద్య, సామాజిక, ఆర్థిక వెనుకబాటుతనాన్ని దగ్గరగా చూశారు. రాష్ట్రాల, కేంద్రపాలిత ప్రాంతాల నుంచి నివేదికలను తెప్పించుకొని తగిన సమాచారాన్ని సేకరించారు. వివిధ గ్రూపులు, వ్యక్తులు, సంఘాలు, రాజకీయ నాయకులు, మేధావులతో అనేక సమావేశాలు నిర్వహించారు. వారి అభిప్రాయాలను అడిగి తెలుసుకున్నారు. ఆయా రాష్ట్రాలలో సంక్షేమ పథకాలు, సబ్ ప్లాన్ నిధుల అమలు, ఎస్.సి, ఎస్.టి అత్యాచారాల నిరోధక చట్టం కింద నమోదయిన కేసులు ఎలా పరిష్కారమవుతున్నది గవర్నర్లు సేకరించారు. 2001లో గవర్నర్ల కమిటీ అనేక సిఫార్సులతో తన తుది నివేదికను రాష్ట్రపతికి సమర్పించింది. రాష్ట్రపతి ఆ నివేదికను కేంద్ర ప్రభుత్వానికి తన ముందు మాటతో పంపించారు.

1. ప్రతి రాష్ట్రంలో నోడల్ ఏజన్సీగా సాంఘిక సంక్షేమ శాఖను గుర్తించి అన్ని విభాగాల నుంచి, మంత్రిత్వ శాఖల నుంచి సబ్ ప్లాన్ కింద కేటాయించిన నిధులను అప్పగించాలి. పథకాల రూపకల్పన, అమలు, పర్యవేక్షణలలో స్వతంత్రంగా వ్యవహరించేలా సాంఘిక సంక్షేమ శాఖకు అధికారాలు ఇవ్వాలి.

2. మహారాష్ట్ర మోడల్‌ను అన్ని రాష్ట్రాలలో అమలు చేయాలి. మహారాష్ట్రలో సాంఘిక సంక్షేమ శాఖ నోడల్ ఏజెన్సీగా పనిచేస్తుంది.

3. ఎస్.సి.ఎస్.పి, టి.ఎస్.పి నిధులను దారి మళ్లించరాదు. ఒకవేళ ఖర్చు కాకపోతే వచ్చే ఆర్థిక సంవత్సరంలో ఖర్చుపెట్టేలా చర్యలు తీసుకోవాలి.

4. జనాభా ప్రాతిపదికన ఎస్.సి, ఎస్.టిలకు ఎంత వాటా రావాలో, దానికన్నా తక్కువ నిధులు కేటాయించకుండా ఉండేలా కేంద్ర మంత్రిత్వ శాఖలు, రాష్ట్ర ప్రభుత్వాలు చర్యలు చేపట్టాలి. ఎస్.సి, ఎస్.టిలకు ప్రత్యక్షంగా ప్రయోజనం చేకూరే పథకాలకు నిధులు కేటాయించేలా చర్యలు చేపట్టాలి. పథకాల అమలుకు అవసరమైతే ఈ నిష్పత్తి కన్నా ఎక్కువ నిధులు కూడా కేటాయించాలి.

5. సబ్ ప్లాన్ నిధులు కేటాయించని, ఖర్చు చేయని అధికారులను శిక్షించాలి. చట్టపరమైన చర్యలు తీసుకోవాలి.

గవర్నర్ల కమిటీ చేసిన విలువైన సిఫార్సులను కేంద్ర ప్రభుత్వం అమలు చేయకుండా, తుంగలో తొక్కి దళితుల పట్ల వివక్షను చూపించింది. సాక్షాత్తు భారత ప్రథమ పౌరుడు, తొలి దళిత రాష్ట్రపతి నియమించిన కమిటీకే విలువ లేకుండా చేశారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సబ్‌ప్లాన్ నిధులను దారి మళ్లించారు. పేపర్ల మీద లెక్కలు చూపించి వారి అభివృద్ధికే ఖర్చు చేసినట్లు చూపిస్తున్నారు. కానీ, ఆచరణలో ఆ నిధులన్నింటిని దారి మళ్లించారు. దీనికి ఏ పార్టీ అతీతం కాదు.

కేంద్ర హోంశాఖ మంత్రి చిదంబరం 30 ఆగస్టు 2010న రాజ్యసభలో మాట్లాడుతూ కామన్‌వెల్త్ గేమ్స్ కోసం ఢిల్లీ రాష్ట్ర ఎస్.సి. సబ్ ప్లాన్ నిధులు 744 కోట్ల రూపాయలు దారి మళ్లించిన విషయాన్ని అంగీకరించారు. ఈ దారి మళ్లిన నిధులను తిరిగి ఎస్.సి. సబ్‌ప్లాన్ అకౌంట్‌లోనికి ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వం నుంచి రాబడతామని కూడా చిదంబరం ప్రకటించారు. అయితే ఆచరణలో ఇదేమి అమలు కాలేదు. తరువాత ప్రవేశపెట్టిన ఢిల్లీ రాష్ట్ర బడ్జెట్‌లో దారి మళ్లిన నిధులు ఎక్కడా తిరిగి కేటాయించలేదు. అలాగే సబ్ ప్లాన్ నిధులను వేరే కార్యక్రమాలకు దారి మళ్లించడం తప్పు అని కూడా చిదంబరం అంగీకరించారు.

17 జూన్ 2011న ఢిల్లీలో జరిగిన రాష్ట్రాల సాంఘిక సంక్షేమశాఖ మంత్రుల సమావేశంలో ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ మాట్లాడుతూ 'దళితులకు ఇతర వర్గాల ప్రజానీకానికి మధ్య ఉన్న ఆర్థిక, సామాజిక అంతరాలను తొలగించడానికి సబ్‌ప్లాన్ పథకం ప్రతిష్టాత్మకమైనది. దీనిని రాష్ట్రాలు కచ్చితంగా అమలు చేసి, దళితులను, ఆదివాసులను అభివృద్ధి పథంలోకి తీసుకొని రావాలి. రాష్ట్రప్రభుత్వాలు ప్రణాళికా బద్ధంగా పథకాలు రూపకల్పన చేసి, సబ్‌ప్లాన్ నిధులను వారి అభివృద్ధికే కేటాయించేలా నిజాయితీగా చర్యలు చేపట్టాలి. సబ్ ప్లాన్ కింద నిధులను ఉపయోగించి వారి జీవితాలలో మార్పు వచ్చేలా, ఉన్నత ఫలితాలు రాబట్టేలా మరింత కట్టుదిట్టంగా చర్యలు చేపట్టాలి. నిధులు దారి మళ్లకుండా వారి అభివృద్ధికే ఉపయోగించాలి' అని అన్నారు.

మన రాష్ట్రంలో కూడా నిధులు నిరాటంకంగా దారి మళ్లాయి. అసలు ఇటువంటి సబ్‌ప్లాన్ ఉందనే విషయం కూడా ఎవ్వరికీ తెలియకుండా చేశారు. రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి నోడల్ అధికారిగా నోడల్ ఏజన్సీ ఏర్పాటు చేసి, సాంఘిక సంక్షేమ శాఖ ద్వారా నిధులు ఖర్చు చేయడమే కాక, దళితులకు ఈ సబ్‌ప్లాన్ గురించి వివరించి విస్తృతంగా ప్రచారం కూడా చేయాలని ప్రణాళికా సంఘం మార్గదర్శకాలలో ఉంది.

గడిచిన 20 సంవత్సరాలలో మన రాష్ట్రంలో ఎస్.సి, ఎస్.టి సబ్‌ప్లాన్ నిధులు దాదాపు 21 వేల కోట్ల రూపాయలు దారిమళ్లాయి. వేరే రంగాలకు, వారి అభివృద్ధికి ఏమాత్రం సంబంధం లేని రంగాలకు ఖర్చు చేశారు. మన రాష్ట్రంలో ఫ్లైఓవర్ల నిర్మాణానికి, ఔటర్ రింగ్ రోడ్డుకు, జలయజ్ఞం, పార్కుల అభివృద్ధి, హుస్సేన్‌సాగర్ సుందరీకరణకు, మెట్రోరైల్, రోడ్ల విస్తరణ, టూరిజం, అండర్‌గ్రౌండ్ ఎలక్ట్రికల్ కేబులింగ్, ఆరోగ్యశ్రీ, మంత్రుల వాహనాలు తదితర అవసరాలకు ఎస్.సి.ఎస్.పి., టి.ఎస్.పి. నిధులు ఖర్చు చేశారు.

2001లో వై.ఎస్.రాజశేఖర్ రెడ్డి ప్రతిపక్ష నేతగా ఉండగా, సీనియర్ జర్నలిస్టు మల్లెపల్లి లక్ష్మయ్య 'వార్త'లో రాసిన సబ్‌ప్లాన్ ఆర్టికల్‌పై అసెంబ్లీలో సుదీర్ఘ చర్చ జరిగింది. అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు దళితుల నిధులు దారి మళ్లలేదని అసెంబ్లీలో బుకాయించాడు. తరువాత అధికారంలోకి వచ్చిన వై.ఎస్.ఆర్, అసెంబ్లీలో తిరిగి చర్చ జరిగిన తరువాతనే నోడల్ ఏజన్సీకి అంగీకరించి, రాష్ట్రస్థాయిలో సాంఘిక సంక్షేమ శాఖ / గిరిజన సంక్షేమ శాఖ మంత్రి నోడల్ అధికారిగా, జిల్లాస్థాయిలో కలెక్టర్ నోడల్ అధికారిగా నోడల్ ఏజన్సీలు ఏర్పాటు చేశారు. శాసనసభ్యులను మహారాష్ట్రకు పంపించి, అక్కడ ఎస్.సి, ఎస్.టి సబ్‌ప్లాన్ ఎలా అమలు జరుగుతున్నదీ అధ్యయనం చేసి వచ్చారు. కానీ, ఆచరణలో మన రాష్ట్రంలో కూడా ఫలితం అనుకున్నంతగా, ఆశించినంతగా రాలేదు. రాష్ట్రస్థాయిలో నోడల్ ఏజెన్సీ ఇప్పటివరకు 9 సార్లు సమావేశమయింది. కానీ, ఫలితం శూన్యం. క్రమంగా నిధుల దారి మళ్లింపు భారీగానే జరిగింది. వై.ఎస్.ఆర్ హయాంలో జలయజ్ఞం, ఇందిరమ్మ ఇళ్లు, తదితర సంక్షేమ పథకాలకు ఎస్.సి, ఎస్.టి సబ్‌ప్లాన్ నిధులను పెద్దఎత్తున దారి మళ్లించారు. పైగా ఎక్కడెక్కడో ఖర్చుపెట్టి ఎస్‌సి/ఎస్‌టి సబ్ ప్లాన్ కింద చూపెడుతున్నారు. ఆ విధంగా ప్రభుత్వం మరో రూపంలో మోసం చేయాలని చూస్తోంది. అందుకుగాను, లెక్కలు, ఫలితాలు స్పష్టంగా ఉండాలంటే, ప్రణాళికా నిధులనుంచి నేరుగా జనాభా దామాషా ప్రకారం 16.2 శాతం నిధులను సాంఘిక సంక్షేమ శాఖకు కేటాయించాలి. కార్యక్రమాల రూపకల్పన, నిధుల కేటాయింపు, ఖర్చు, పర్యవేక్షణ బాధ్యతలు సాంఘిక సంక్షేమ శాఖకే ఉండాలి. అప్పుడు మాత్రమే ఎస్.సి.ఎస్.పి లక్ష్యం నెరవేరుతుంది.

❖ ఇప్పటి వరకు దారి మళ్లించిన నిధులను తిరిగి వారికే కేటాయించి దళితుల, ఆదివాసీల అభివృద్ధికి కృషి చేయాలి.

❖ దళితుల, ఆదివాసీల సమగ్ర అభివృద్ధికి, గ్రామాలవారిగా ప్రణాళికలు రూపొందించి వారి జీవన పరిస్థితులను అన్ని రంగాలలో మెరుగుపర్చాలి. విద్య, ఉపాధి అవకాశాలు కల్పించాలి.

❖ అన్ని దళిత వాడలలో, గిరిజన తండాలలో కనీస వసతులు కల్పించాలి.

❖ ప్రతి దళిత కుటుంబానికి రెండు ఎకరాల సాగుభూమి ఇవ్వాలి.

సబ్ ప్లాన్ (ఉప ప్రణాళిక) నిధుల సక్రమ వినియోగానికి రక్షణగా చట్టం చేయాలి :

దళితుల, గిరిజనుల నిధులను వారి అభివృద్ధికే కేటాయించి, ఖర్చు చేసేలా ప్రత్యేక చట్టాన్ని చేయాలి. కోర్టులలో సవాల్ చేసే అవకాశం ఉంటుంది. ఈ పథకాన్ని అమలు చేయాలని ప్రభుత్వాలను నిలదీయ

డానికి అవకాశం ఉంటుంది. చట్టం ద్వారా దళితులకూ, గిరిజనులకు కొంతమేర భరోసా ఇచ్చినట్లవుతుంది. రాజకీయ పార్టీలు, సంస్థలు, మేధావులు శ్రద్ధ వహించి చట్టం తీసుకురావటానికి ప్రభుత్వంపై ఒత్తిడి చేయాలి.

ఇటీవలనే జాతీయస్థాయిలో సోనియాగాంధీ నాయకత్వంలోని జాతీయ సలహామండలి (ఎన్.ఏ.సి.) ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్‌కి 20 డిసెంబర్ 2011న ఎస్.సి./ఎస్.టి సబ్‌ప్లాన్‌ను పటిష్టంగా అమలు చేయాలని, వ్యవస్థాగత ఏర్పాటు చేసి నిధులు దారిమళ్లించకుండా చూడాలని కోరారు. ఆర్థిక సామాజిక అంతరాలను తొలగించడానికి ఈ పథకాన్ని పటిష్టంగా అమలు చేయాలని ఆమె ఆ లేఖలో కోరారు.

సెంటర్ ఫర్ దళిత్ స్టడీస్ గత పది సంవత్సరాలపైగా ఈ సమస్యపై విస్తృతంగా ప్రచారం నిర్వహించి ఆందోళనలకు శ్రీకారం చుట్టింది. సెంటర్ ఫర్ దళిత్ స్టడీస్ ఆధ్వర్యంలో వివిధ రాజకీయ పార్టీలతో, మీడియా ప్రముఖులతో, లీగల్ నిష్ణాతులతో అనేకమార్లు రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌లు నిర్వహించింది. వివిధ ఛానళ్ల వారితో మాట్లాడి ఈ ఉద్యమానికి మద్దతుగా చర్చాగోష్టులు నిర్వహించాలని విజ్ఞప్తి చేసింది. ఫలితంగా హెచ్‌ఎంటివి, సాక్షి న్యూస్, టి న్యూస్, ఈ టివి2 లాంటి ఛానళ్లు చర్చాగోష్టులను ప్రత్యక్షంగా నిర్వహించాయి. అనేక ఛానళ్లు, పత్రికలు ప్రధానశీర్షికలతో ఈ సమస్యపై విస్తృతంగా రాశాయి. ప్రజలల్లో ఈ సమస్య పట్ల అవగాహనను పెంపొందించడానికి దోహదపడ్డాయి. అలాగే రాష్ట్ర శాసనసభలో ప్రత్యేకంగా రెండు రోజులపాటు సబ్‌ప్లాన్‌పై చర్చించాలని స్పీకర్‌ను, రాష్ట్ర ముఖ్యమంత్రిని, గవర్నర్‌ని కలిసి వినతిపత్రాలు సమర్పించడం జరిగింది. అయితే రాష్ట్ర ప్రభుత్వం స్పందించకుండా ఈ విషయాన్ని అసెంబ్లీలో చర్చించకుండా కాలయాపన చేసింది.

ఉద్యమం ఈ స్థాయిలో జరుగుతుండగానే ఈ సంవత్సరం ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో కూడా నిధుల దారి మళ్లింపుకి తెరతీశారు. ఎస్.సి. సబ్‌ప్లాన్‌కు 8750 కోట్ల రూపాయలు కేటాయించాల్సి ఉండగా, 7487 కోట్ల రూపాయలు మాత్రమే కేటాయించి, 1263 కోట్ల రూపాయలు కోత విధించింది. అలాగే ఎస్.టి. సబ్‌ప్లాన్‌కు 3565 కోట్ల రూపాయలు కేటాయించాల్సి ఉండగా కేవలం 3006 కోట్ల రూపాయలు మాత్రమే కేటాయించి 559 కోట్ల రూపాయలు కోత విధించింది.

సబ్‌ప్లాన్ నిధుల సాధన కోసం ఏర్పడిన ఐక్య కార్యాచరణ కమిటీ నాయకత్వంలో మార్చి 23 నుంచి 72 గంటల దీక్షలకు, 26న చలో అసెంబ్లీకి పిలుపునివ్వడం జరిగింది. 72 గంటల దీక్షలకు సంఘీభావంగా అన్నీ రాజకీయ పార్టీలు రోజుకు రెండు పార్టీల చొప్పున దీక్షలలో కూర్చున్నారు. రాష్ట్రంలోని ప్రధాన పార్టీలన్నీ ఈ ఉద్యమానికి తమ సంఘీభావాన్ని క్రియాశీలకంగా తెలియజేసారు. సిపిఐ, సిపిఎం, టిఆర్ఎస్, బిజెపి, న్యూడెమోక్రసీ, వైఎస్ఆర్ కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు ఈ ఉద్యమంలో కలిసి వచ్చాయి. వివిధ దళిత సంఘాలు, మేధావులు, ప్రజాస్వామిక వాదులు, మీడియా ఈ ఉద్యమానికి అండదండగా నిలబడ్డాయి. రాష్ట్ర ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని అణిచి వేయడానికి చలో అసెంబ్లీ రోజు అరెస్టులకు పాల్పడింది. అయినా మొక్కవోని దీక్షతో ఉద్యమాన్ని కొనసాగించారు. ఫలితంగా రాష్ట్ర ప్రభుత్వం దిగివచ్చి అసెంబ్లీలో ముఖ్యమంత్రి క్యాబినెట్ సబ్‌కమిటీని నియమిస్తున్నట్లు ప్రకటించింది. ఈ కమిటీ తన నివేదికను రెండు నెలల లోపల సమర్పిస్తుందని ప్రకటించింది. వెంటనే ఉపముఖ్యమంత్రి దామోదర రాజనర్సింహ్మా దీక్షాస్థలిని సందర్శించి, ముఖ్యమంత్రి శాసనసభలో చేసిన ప్రకటనను వివరించి దీక్ష విరమించవలసిందిగా కోరారు. వెంటనే పోరాట కమిటీ సమావేశమై దీక్షను విరమిస్తున్నట్లు ప్రకటించింది.

13 ఏప్రిల్ 2012న తొమ్మిదిమంది మంత్రులతో క్యాబినెట్ సబ్ కమిటీ ఏర్పాటు చేస్తూ జి.ఓ.నెం.1640 విడుదల చేసింది. దీనికి ఉపముఖ్యమంత్రి దామోదర రాజనర్సింహ్మా చైర్మన్‌గా వ్యవహరిస్తారు. ఈ కమిటీ అన్ని వర్గాల ప్రజలతో సమాలోచనలు జరిపి, వివిధ రాష్ట్రాలలో పర్యటించి, తుది నివేదికను సమర్పించాల్సి ఉంది.

ప్రభుత్వం నిజాయితీగా ఈ కమిటీ పనిచేసేలా చూడాలి.కాలయాపన లేకుండా తక్షణం చర్చలు ప్రారంభించి నివేదికను చట్టం చేసే దిశలో రూపొందించాలి. దళితుల, ఆదివాసీల ఆకాంక్షలకు ప్రతిబింబంగా ఈ కమిటీ నివేదిక ఉండాలి. కమిటి నివేదికను అసెంబ్లీలో విస్తృతంగా చర్చించి సబ్‌ప్లాన్ నిధుల దుర్వినియోగాన్ని అరికట్టే విధంగా చర్యలు తీసుకోవాలి. ప్రభుత్వం మొండిగా వ్యవహరించి సరైన చర్యలు చేపట్టకపోతే కలిసి వచ్చే సంఘాలతో, సంస్థలతో ఐక్య ఉద్యమం ద్వారా ప్రభుత్వాన్ని మెడలు వంచి ఈ చట్టాన్ని సాధించటానికి పోరాటాలకు సమాయత్తం కావాలి. ఈ పోరాటాన్ని మరింత ఉధృతం చేయాలి.

*(రచయిత సెంటర్ ఫర్ దళిత్ స్టడీస్ డైరెక్టర్)* వీ

# ఎస్.సి., ఎస్.టి. సబ్‌ప్లాన్ నిధులు

***ఎస్.సి., ఎస్.టి. సబ్‌ప్లాన్ నిధులు సక్రమంగా వినియోగం అయ్యేటట్లు పెద్ద ఎత్తున పోరాటాలు చేయాల్సిన అవసరం ఉందని అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**1995** నుంచి అమలులోకి వచ్చిన ఎస్.సి., ఎస్.టి. సబ్ ప్లాన్ పథకం - ఏ రాష్ట్రంలోనూ సరిగా అమలు జరగడం లేదు. వాస్తవానికి ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం 1989 చట్టానికి కేంద్ర ప్రభుత్వం 1995లో కొన్ని రూల్స్‌ను ఏర్పాటు చేసింది. దానిపేరు 'ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం రూల్స్ 1995'. దీనిలో భాగంగా ఏర్పాటు చేయబడినదే ఎస్.సి., ఎస్.టి. సబ్ ప్లాన్ (ఎస్.సి., ఎస్.టి. ఉప పథకం) అనగా, ఆయా రాష్ట్రాలలో ఎస్.సి., ఎస్.టి.ల అభ్యున్నతి కోసం కొంత నిధులు కేటాయించాలనేదే దీని ముఖ్య ఉద్దేశ్యం. అయితే మన రాష్ట్రంలో చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో 'జన్మభూమి' కార్యక్రమానికి, వై.ఎస్. రాజశేఖరరెడ్డి హయాంలో 'జలయజ్ఞం' కార్యక్రమానికి ఎస్.సి., ఎస్.టి. సబ్‌ప్లాన్ నిధులు వినియోగించబడ్డాయి. అనగా 1995లో వచ్చిన సబ్‌ప్లాన్ ఆనాడే సరిగా సద్వినియోగపరచకుండా, మరో పథకానికి వినియోగించడం జరిగింది. నిధుల జారీ, అమలు అన్నీ పూర్తిగా రాష్ట్ర ప్రభుత్వం పరిధిలోనే ఉంటుంది. కాబట్టి ఆనాడే ఎస్.సి., ఎస్.టి.లకు అన్యాయం జరిగింది. ఇది ఒక విధంగా చెప్పాలంటే రాజ్యాంగం చెప్పిన ఎస్.సి., ఎస్.టి. వర్గాల అభ్యున్నతికి తిలోదకాలిచ్చినట్లు, వారిని ఒక విధంగా అణగ దొక్కినట్లు. ఈ పాలకులు ఇది రాజ్యాంగాన్ని వ్యతిరేకించినట్లే. మరి రాజ్యాంగం మీద ప్రమాణం చేసి పాలిస్తున్న ఈ ముఖ్యమంత్రులూ, ప్రభుత్వాలూ ఈ భారత రాజ్యాంగాన్ని ఏ మాత్రమూ గౌరవించడం లేదని ఆయా వర్గాలు భావించాలి.

రాష్ట్ర వ్యాప్తంగా అనేక ఎస్.సి., ఎస్.టి. సంఘాలూ, వాటికి మద్దతునిచ్చిన ప్రగతిశీల విప్లవ ప్రజాసంఘాలూ ఐక్యంగా ఉద్యమిస్తే ఈ రాష్ట్ర ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి మంత్రివర్గ ఉపసంఘం నియమిస్తానని ఆనాడు అసెంబ్లీ సాక్షిగా ప్రకటించాడు. ఇది కూడా ఈ రాష్ట్రంలో కొన్ని నెలల్లో జరగబోయే ఉప ఎన్నికల (18 అసెంబ్లీ స్థానాలకు)ను దృష్టిలో పెట్టుకొని ఎస్.సి., ఎస్.టి. ఓట్ బ్యాంక్‌ను చేజిక్కించుకునేందుకు చేసిన ప్రకటనగా మనం భావించవచ్చు. లేకపోతే నిజంగా అమలు చేసే ఉద్దేశ్యం ఉంటే మంత్రివర్గ ఉపసంఘం అనవసర అధ్యయనం కాదా?

గత పద్దెనిమిది సంవత్సరాలలో ఎస్.సి., ఎస్.టి. సబ్ ప్లాన్ నిధులు దాదాపుగా ఇరవై ఐదు వేల కోట్ల రూపాయలు దారిమళ్లాయి. (1995-2012) ఇది ప్రభుత్వం చెపుతున్న లెక్కల ప్రకారమే. ఇందులో ప్రభుత్వ పథకాలకు ఎంత వినియోగించబడిందో, ఎంత అవినీతికి పాల్పడ్డారో తెలియదు. రాష్ట్ర జనాభా ప్రకారం ఎస్.సి.ల శాతం 16.2, ఎస్.టి.ల శాతం 6.6 నిధులు కేటాయించబడాలి. 2011-12 ఆర్థిక సంవత్సరాలలో రు. 7500 కోట్లు రాష్ట్ర ప్రభుత్వమూ, రు. 7500 కోట్లు కేంద్ర ప్రభుత్వమూ కేటాయించాలి. కానీ రాష్ట్ర ప్రభుత్వం మాత్రమే కేటాయించినప్పటికీనీ అందులో రు. 3000 కోట్లు దారిమళ్లించిబనవి. కేటాయించిన నిధులను కూడా రాష్ట్ర ప్రభుత్వం కానీ, కేంద్ర ప్రభుత్వం గానీ సరిగా ఖర్చుచేయడం లేదనేది వాస్తవం. 2012-13 ఆర్థిక సంవత్సర బడ్జెట్‌లో ఎస్.సి.లకు రు. 8750 కోట్లు కేటాయించాల్సి ఉండగా రు. 7487 కోట్లు కేటాయించారు. ఎస్.టి.లకు రు. 3565 కోట్లు కేటాయించల్సి ఉండగా, రు. 3006 కోట్లు మాత్రమే కేటాయించారు. అనగా ఎస్.సి.లకు రు. 1263 కోట్లు, ఎస్.టి.లకు రు. 599 కోట్లు కోతపెట్టారు. అక్కడ రు. 51,406 కోట్లు కోత విధించారు. గత బడ్జెట్‌లో కేటాయించిన ముప్పై వేల కోట్ల రూపాయలలో జలయజ్ఞం కార్యక్రమానికి రు. 2,430 కోట్లు, అవుటర్ రింగ్ రోడ్ (ఒఆర్ఆర్) కు రు.107 కోట్లు, మెట్రో రైల్ నిర్మాణానికి రు. 81 కోట్లు, హుసేన్ సాగర్ ఆధునికీకరణకు రు.91 కోట్లు, పార్కుల అభివృద్ధి, తదితర రంగాలకు ఎస్.సి సబ్‌ప్లాన్ నుంచి రు. 3839 కోట్లు, ఎస్.టి. సబ్‌ప్లాన్ నుంచి రు. 1564 కోట్లు దారిమళ్లించారు. రాష్ట్రం పరిస్థితి ఇలానే ఉంటే కేంద్రమేమి తక్కువా? అంటూ వారు కూడా కేంద్ర ప్రణాళిక బడ్జెట్ మొత్తం రు. 521025 కోట్లు కాగా, ఎస్.సి సబ్ ప్లాన్ ప్రకారం రు. 84406 కోట్లు కేటాయించాల్సి ఉండగా రు. 38 వేల కోట్లు మాత్రమే కేటాయించారు. పది వేల కోట్లు అసలు ఖర్చు పెట్టలేదు.

ఈ నేపథ్యంలో రాష్ట్ర ముఖ్యమంత్రి తీసుకున్న నిర్ణయంపై అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. ప్రభుత్వం ఏర్పాటు చేసే 'ఉప(మంత్రివర్గ) సంఘం' ఏ విషయాలపై అధ్యయనం చేయాల్సి ఉందో అర్థం కావడం లేదు. ఇదేదో వారి ప్రభుత్వం సాధించిన 'ఘనత' గా చెప్పుకుంటున్నారు కొంతమంది మంత్రులు. వాస్తవానికి ఈ ప్రభుత్వం తన తప్పును ప్రజల వద్ద అంగీకరించడమే. ఇదేట్లా వారి 'ఘనత' అవుతుందో, వారు సాధించిన విజయంగా చెప్పుకోవడం హాస్యాస్పదం. వాస్తవానికి దళితుల కోసం ప్రభుత్వ యాంత్రాంగం ఏ మాత్రమూ చిత్తశుద్ధితో పని చేయడంలేదు. నిజంగా ఈ ప్రభుత్వ యంత్రాంగంలోని జిల్లా కలెక్టర్లు, జిల్లా ఎస్.పి.లు దళితులపై జరుగుతున్న దాడుల పట్ల, అత్యాచారాల పట్ల, అవమానాల పట్ల సరిగా స్పందించడం లేదు. వీటిపై ఈ ప్రభుత్వంలోని పెద్దలు దృష్టి పెట్టాలి. అంతే కానీ ఏదో ఘనకార్యం చేసినట్లు సంబరాలు జరుపుకోవడం కాదు. ఎస్.సి, ఎస్.టి ఎమ్మెల్యేలూ, మంత్రులూ-ఎస్.సి, ఎస్.టి సబ్‌ప్లాన్ నిధులపై చట్టం తేవడం అనేది దళితులకు ఈ కాంగ్రెస్ ప్రభుత్వం చేసే గొప్ప మేలుగా అభివర్ణిస్తున్నారు.

# కంభం జ్ఞాన సత్యమూర్తి (శివసాగర్)

విప్లవ కవి తొలితరం మార్క్సిస్టు - లెనినిస్టు, దళిత ఉద్యమ నాయకుడు కంభం జ్ఞాన సత్యమూర్తి (శివసాగర్) అనారోగ్యంతో ఏప్రిల్ 17న మరణించారు. ఆయన వయసు 84 సంవత్సరాలు. కృష్ణా జిల్లా జి.కొండూర్ మండలం కందులపాడులోని పెద్ద కుమారుడి స్వగృహంలో కన్నుమూశారు. ఆరు దశాబ్దాల పాటు విప్లవ, దళిత ఉద్యమ నిర్మాణంలో చురుగ్గా పాల్గొన్నారు. 1967 నుంచీ తెలుగునాట నక్సలైట్ విప్లవోద్యమ అగ్రనేతగా కొనసాగుతూనే విప్లవ సాహిత్యానికి మార్గదర్శకత్వం అందించారు. కొత్త కొత్త ప్రతీకలతో విప్లవ కవిత్వాన్ని సుసంపన్నం చేశారు. 1986 తర్వాత విప్లవోద్యమాన్ని వదిలిన పరిణామాల్లో దళిత జాతి విముక్తి కోసం ఉద్యమించారు. కృష్ణా జిల్లా నందివాడ మండలం పోలుకొండ శివారు శంకరంపాడులో ప్రసన్నరావు, మేరీ దంపతులకు 1928లో సత్యమూర్తి జన్మించారు. చర్చి ఫాదర్ అయిన ఆయన తండ్రి గుడివాడకు రావడంతో కళాశాల విద్య అక్కడ పూర్తిచేశారు. విశాఖ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పొలిటికల్ సైన్స్‌లో పిజి చేశారు. విద్యార్థి దశలోనే కమ్యూనిస్టు సిద్ధాంతాలకు ఆకర్షితులయ్యారు. అప్పటి ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీలో చురుకైన పాత్ర నిర్వహించారు. తొలి నుంచి సృజనశీలి కావడంతో పత్రికలకు వ్యాసాలు, కవితలు రాసేవారు. ఈ



క్రమంలో విశాలాంధ్ర సబ్ ఎడిటర్‌గా గుంటూరు యువజన సంఘం పత్రిక ఎడిటర్‌గా పనిచేశారు. 1959-60లో యూనివర్సిటీ విద్య (డబుల్ ఎంఎ) పూర్తి చేసిన అనంతరం వృత్తి విప్లవకారుడిగానే ఉండాలని నిశ్చయించుకున్నారు. 1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో, విశాఖ ఉక్కు ఉద్యమంలో పాల్గొని అరెస్టు అయ్యారు. కొండపల్లి ప్రోద్బలంతో 1970ల్లో నక్సలైట్ ఉద్యమ నిర్మాత చారుమజుందార్‌ను గుంటూరు జిల్లా గుత్తికొండ బిలంలో కలిశారు. ఆ తరువాత కొద్దిరోజులకే చారు మజుందార్ చనిపోగా, విప్లవోద్యమానికి నాయకత్వం కొరవడడం, బెంగాల్, శ్రీకాకుళ ఉద్యమాలు అణచివేయబడడం వంటి నిరాశభరిత పరిస్థితుల్లో కొండపల్లి, సత్యమూర్తి ఎదురీదాలని సంకల్పించారు. 'ఉద్యమం నెలబాలుడు సంకలనం ఈ నేపథ్యంలోనే వచ్చింది. 1975 ఎమర్జెన్సీలో సత్యమూర్తి అరెస్టు అయి పార్వతీపురం కుట్ర కేసులో ఐదేళ్ల జైలు జీవితం గడిపారు. 'విప్లవం కుట్ర కాదు.. సూర్యుడు కుట్రదారుడు' కాదని నినదించారు. గెరిల్లా విప్లవ గీతాలు, జనం ఊపిరితో, పది వసంతాలు, నెలవంక సంకలనాలు, అంబేద్కర్ సూరీడు గ్రంథం రచించారు. ఆయన అంత్యక్రియలు ఏప్రిల్ 18న విజయవాడలో జరిగాయి. వీ

కానీ ఇంకా కార్యరూపం దాల్చకుండానే ఇంత ప్రచారం చేసుకోవలసిన అవసరం లేదు. కేవలం రాబోయే ఉప ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని ఈ ప్రకటన చేయవలసి వచ్చిందనేది. నిర్వివాదాంశం.

వాస్తవాలు మాట్లాడుకుంటే-గత 18 సంవత్సరాల కాలంలో దుర్వినియోగమైన దళితులకు ఏ మాత్రమూ చెందుకుండా పక్కదారి పట్టిన నిధుల స్థానంలో (ఎంత కృషి చేస్తే) ఈ దళితులకు ఈ ప్రభుత్వం ఎన్ని నిధులు సమకూర్చితే గతించిన కాలంలో ఖర్చు చేయవలసిన డబ్బును సమకూర్చగలుగుతారో ఒకసారి ఈ మంత్రివర్గ ఉపసంఘం కూడా దృష్టి సారిస్తే బాగుంటుంది. ఆ కోణంలో కూడా ఆలోచించాలని కోరుతున్నాం. జరిగిన తప్పును భర్తీ చేయడానికి కూడా బాటలు వేయాలి. ఎందుకనగా కేవలం జరిగింది 'ఆర్థిక సర్దుబాటు' కాబట్టి-దానికి రాబోయే కాలంలో ఎక్కువ నిధులు సమకూర్చుతే, జరిగిన అన్యాయాన్ని కొంత భర్తీ చేసినట్లవుతుంది. అదే విధంగా ప్రతి సంవత్సరం బడ్జెట్‌లో కేటాయిస్తున్న నిధులన్నింటినీ ఒక చోట చేర్చి ఆ నిధులను ఎస్.సి, ఎస్.టి. వర్గాలకు సరియైన పద్ధతిలో 'ఖర్చు' అయ్యేటట్లు ఒక 'నోడల్ ఏజెన్సీ' ని ఏర్పాటు చేయాలి. ఎస్.సి, ఎస్.టి. కమిషన్‌ను వెంటనే పునరుద్ధరించాలి. లేదా జాతీయ స్థాయిలో ఉన్నట్లు ఈ రాష్ట్రంలో కూడా ఎస్.సి., ఎస్.టి.లకు ప్రత్యేక కమిషన్‌లను ఏర్పాటు చేసే విధంగా చర్యలు తీసుకోవాలి. కార్పొరేషన్‌ను పునరుద్ధరించాలి. ఎస్.సి, ఎస్.టి. అత్యాచార కేసులను నీరుగార్చే పోలీసు అధికారులపై కఠిన చర్యలు తీసుకొనే విధంగా ప్రభుత్వ యంత్రాంగానికి ఆదేశాలివ్వాలి. ఎస్.సి, ఎస్.టి. (పిఒఎ) యాక్ట్ 1989 లోని సెక్షన్ నాలుగును పటిష్టంగా అమలు చేయాలి. (బాధితులకు సరియైన న్యాయచెయ్యాలని డిఎస్‌పిలపై చర్యలు తీసుకోనే సెక్షన్) సంఘటనలకు జిల్లా కలెక్టర్లు, ఎస్‌పిలు వెంటనే స్పందించే విధంగా రాష్ట్ర మంత్రులూ, ముఖ్యమంత్రి చిత్తశుద్ధితో ఆదేశాలు జారీచేయాలి. అన్నింటికీ చిత్తశుద్ధి అవసరం. 'పోరాటం' ద్వారానే ఈ ప్రభుత్వానికి కళ్లు తెరిపించాలి. ఏదైనా సాధించుకోవచ్చు. దళితులు పోరాటాలను మరింత ఉధృతం చేయాలి. గ్రామాలలో కొద్దో, గొప్పో చదివి, వివిధ రకాలుగా చిన్న చిన్న వృత్తులను చేసుకొని బతుకులీడుస్తుతున్న దళితులు ఈ ప్రపంచాన్ని మరింత అధ్యయనం చేయడానికి, ఆయా గ్రామాలలో గ్రంథాలయాలను ఏర్పాటు చేసుకోవాలి. తమ పిల్లలను ఉన్నత విద్య అభ్యసించే విధంగా కృషిచేయాలి. డా. అంబేద్కర్ చెప్పినట్లు 'మీ స్వంతకాళ్లపై మీరు నిలబడి, మీ హక్కుల కోసం పోరాడుతూ, మీ ఉద్యమాన్ని మీరే నిర్మించుకోండి.'

'మేకల్లా బలికాకండి - సింహాలై పోరాడండి' లాంటి నినాదాలను ప్రతినిత్యమూ మననం చేసుకుంటూ పోరాటాన్ని మరింత ఉధృతం చేస్తూ, ఈ సమాజ మార్పులో భాగస్వాములు కావాలి. సమసమాజ నిర్మాణం కోసం జరిగే అన్ని పోరాటాలలో దళితులు ముందుండాలి. ఈ వ్యవస్థను మార్చకుండా దళితుల సమస్యలు కూడా పరిష్కారించ బడవు. ఎందుకంటే దళితుల సమస్య ఈ దేశ కుల వ్యవస్థ నిర్మాణ స్వరూప స్వభావాలతో నిర్మితమై ఉంది. కాబట్టి కుల వ్యవస్థను కూల్చడానికి మనమంతా సంఘటితమై పోరాడుదాం.

*(రచయిత న్యాయవాది,*
*ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# కేంద్ర బడ్జెట్ 2012-13

***బడ్జెట్ కేటాయింపులకూ వాస్తవ ఖర్చుకూ మధ్య తేడాలను, ప్రాధాన్యత లోపాలను వివరిస్తూ బడ్జెట్ ఎవరి ప్రయోజనాలకో తెలియజేస్తున్నారు ఎ. నర్సింహారెడ్డి***

ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడిదారీ వ్యవస్థ డొల్లతనాన్ని 2008 నుండి నెలకొన్న ఆర్థిక సంక్షోభం స్పష్టం చేసింది. అనేక దేశాలు ఈ సంక్షోభాన్ని కట్టడి చేసేందుకు అధికారికంగా కొన్ని చర్యలు తీసుకున్నాయి. కొన్ని దేశాలు ప్రజా సంపదతో దివాళా తీసిన బ్యాంకులను, ఆర్థిక సంస్థలను కాపాడడానికి ఆర్థికపరమైన ఉద్దీపనలు ప్రకటించాయి. ఈ ప్రక్రియ సంక్షోభాన్ని మరింత పెంచింది తప్ప తగ్గించలేక పోయింది. అమెరికా, యూరప్ దేశాలలో ఈ స్థితిని చూడవచ్చు. మరికొన్ని దేశాలు మాంద్యం కారణంగా ప్రభుత్వ ఆదాయాలు పడిపోతున్నప్పటికీ ప్రభుత్వ వ్యయాలను తగ్గించలేదు. ఈ వైఖరి కొంత మేరకు సంక్షోభ తీవ్రతను తగ్గించడానికి దోహదం చేసింది. మన దేశంలో కూడా సంక్షేమ పథకాలను కొనసాగించారు. జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం ఓ మేరకు పేద ప్రజలకు ఊరటనిచ్చింది. అదే సమయంలో కార్పోరేట్ సంస్థలకు ఎన్నో రాయితీలు కల్పించింది. కోట్లాది మంది ప్రజలకిచ్చిన సబ్సిడీతో పోల్చితే వందల్లో ఉన్న కార్పోరేట్ సంస్థలకిచ్చిన రాయితీలు ఎన్నో రెట్లు అధికం. ప్రభుత్వం తన నయా ఉదారవాద విధానాలలో భాగంగా ప్రకృతి వనరులను, ప్రభుత్వ ఆస్తులను కారుచౌకగా ప్రైవేట్ వ్యక్తులకు, కార్పోరేట్ సంస్థలకు అప్పగించింది. అవినీతి మునుపెన్నడు లేని స్థాయికి చేరుకుంది. అయితే తన ఉదారవాద విధానాలకు ఒకింత మానవీయతను అద్దే ప్రయత్నం చేసింది. ప్రతిపాదిత ఆహార భద్రతా బిల్లు అందులో భాగమే. సరళీకరణ విధానాల అమలు కారణంగా ద్రవ్యలోటు, రుణభారం పెరిగింది. ఈ సాకుతో 2012-13 బడ్జెట్‌లో సంక్షేమ చర్యలన్నింటికి పొదుపు చర్యల పేరిట ఆర్థిక మంత్రి ప్రణబ్ మంగళం పాడారు.

వర్తమాన ఆర్థిక సంవత్సరంలో ఆర్థిక రంగంలో ఎదురైన సవాళ్ళు, సమస్యలను పరామర్శిస్తూ, పరిష్కార మార్గాలను సూచించే ఆర్థిక సర్వే నివేదికను ఏటా వార్షిక బడ్జెట్‌కు ముందు ప్రభుత్వం పార్లమెంట్‌లో ప్రవేశపెట్టడం ఆనవాయితీ. 2011-12 సంవత్సరం ఆర్థిక సర్వేను మార్చి 15వ తేదీన కేంద్ర ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ లోక్‌సభకు సమర్పించారు. ఈ సర్వే అంచనా ప్రకారం 2011-12 సంవత్సరానికి దేశ ఆర్థికాభివృద్ధి రేటు 6.9 శాతం దాటకపోవచ్చని, అదేవిధంగా 2012-13 ఆర్థిక సంవత్సరానికి వృద్ధిరేటు 7.6 ఉండవచ్చునని అంచనా. ఆర్థిక రంగంలోని ప్రస్తుత పరిణామాలు ఆందోళనకు హేతువుగా ఉన్నప్పటికీ భవిష్యత్తు మాత్రం బ్రహ్మాండంగా ఉంటుందని సర్వే నమ్మబలికింది. అవినీతి, ద్రవ్యోల్బణం ప్రధాన సవాళ్లుగా సర్వే పేర్కొంది. వివిధ ఆర్థిక రంగాలకు సంబంధించి సంస్కరణల అనుకూల చర్యలనే సర్వే సూచించింది. ఆర్థిక రంగం వృద్ధికి సవాళ్లుగా నిలిచిన ద్రవ్య లోటును తగ్గించేందుకు చర్యలు తీసుకోవాలని, ప్రత్యక్ష, పరోక్ష పన్నుల రంగంలో భారీ ఎత్తున సంస్కరణలను అమలు చేయాలని, రిటైల్ రంగంలో ఎఫ్‌డిఐలను అనుమతించాలని, రాజకీయ నాయకులు, నీతి నిబద్ధతకు నిలువుటద్దంలా నిలిచేలా చర్యలు తీసుకోవాలని సర్వే సిఫారసులు చేసింది. ఆర్థిక వ్యవస్థ వేగవంతంగా పురోగమించేందుకు ప్రధానంగా ఆరు కీలక రంగాల్లో సంస్కరణలు చేపట్టడం అవసరమని సూచించింది. అవి.. ఎఫిషియంట్ కాంట్రాక్ట్స్, ధరల నిర్ణయంలో జోక్యాన్ని నివారించడం, సరళతరమైన కార్మిక చట్టాలు రూపొందించడం, పారిశ్రామిక ప్రాజెక్టులకు ప్రభుత్వమే భూమిని సేకరించడం, సబ్సిడీలను నేరుగా వినియోగదారులకు అందించడం, డీజిల్‌పై నిర్దిష్ట సబ్సిడీని నిర్ణయించడం. ఈ ప్రతిపాదనలు అన్ని సంస్కరణలను వేగవంతం చేసేవేనన్నది స్పష్టం.

ఈ నేపథ్యంలోనే ఆర్థికమంత్రి ప్రణబ్ ముఖర్జీ 2012-13 ఆర్థిక సంవత్సరానికి మార్చి 16న కేంద్ర బడ్జెట్‌ను పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టారు. ఒకవైపు తాయిలాలు ప్రకటిస్తూనే మరోవైపు వడ్డించే ప్రయత్నం చేశారు. ఆర్థిక మంత్రి మాత్రం అపఖ్యాతి పాలైన ఆర్థిక సంస్కరణలను ముందుకు తీసుకు వెళ్లేందుకు అంకితమయ్యారు. బడ్జెట్‌లో నూతనత్వం ఏమిలేదు. పెరుగుతున్న సంపద పంపిణీలో సమన్యాయం సాధించే చర్యలు ఏమాత్రం బడ్జెట్‌లో లేవు. సబ్సిడీల కోత, ప్రభుత్వరంగ సంస్థల పెట్టుబడుల ఉపసంహరణ, ప్రైవేట్ రంగానికి కార్పోరేట్ సంస్థలకు దేశ వనరులు దోచిపెట్టడం, ప్రజలపై పరోక్ష పన్నులు విధించడం లాంటి ప్రజావ్యతిరేక చర్యలు తప్ప, ప్రజల దైనందిక అవసరాలు తీర్చి, ప్రణాళికాబద్ధ ఆర్థికాభివృద్ధికి, భవిష్యత్ పురోభివృద్ధికి దిశా నిర్దేశం చేసే చర్యలు బడ్జెట్‌లో మచ్చుకైనా కన్పించవు. అంతర్జాతీయ ఆర్థిక సంస్థలైన ప్రపంచబ్యాంకు, ఐఎంఎఫ్‌లు ప్రబోధిస్తున్న ఆర్థిక సంస్కరణలను తలకెత్తుకున్న బడ్జెట్ ఇది. దేశం ఎదుర్కొంటున్న ఏ ఒక్క సమస్యకూ పరిష్కారం చూపని బడ్జెట్ ఇది. ఈ బడ్జెట్ వివిధ వర్గాల ప్రజలకు ఒకింత నిరాశనే మిగిల్చింది.

2012-13 ఆర్థిక సంవత్సరానికి మొత్తం రు. 14,90,925 కోట్లతో ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో ప్రణాళికా వ్యయం రు. 5,21,025 కోట్లు. ప్రణాళికేతర వ్యయం రు. 9,69,900 కోట్లు. దీనిలో పన్నుల రాబడి రు. 10,77,612 కోట్లు. పన్నేతర ఆదాయం రు. ఒక లక్షా 64 వేల కోట్లు కాగా నికర మార్కెట్ రుణాలు రు. 4,79,000 కోట్లు. ఆర్థిక వృద్ధికి స్థిరత్వంతో కూడిన ప్రోత్సాహం అందించడమే లక్ష్యంగా బడ్జెట్‌ను రూపొందించామని పేర్కొన్న ఆర్థిక మంత్రి, దయాదాక్షిణ్యాలతో ఉండడానికి నేను క్రూరంగా ఉండి తీరాలి అంటూనే షేక్స్‌పియర్ రాసిన

హామ్లెట్ నాటకంలోని సంభాషణను ఉటంకించారు. ఇప్పుడు జిడిపిలో రెండు శాతంగా ఉన్న సబ్సిడీలను మూడు సంవత్సరాల కాలంలో 1.75 శాతానికి పరిమితం చేస్తామని ఎలాంటి శషభిషలు లేకుండా ఆర్థిక మంత్రి ప్రకటించారు. మొత్తానికి ఆర్థిక వ్యవస్థ గాడిలో పడాలంటే పేదల పట్ల నిర్దయతో నిర్ణయాలు తీసుకోక తప్పదనే భావనను ఆర్థిక మంత్రి కలిగి ఉన్నట్లు స్పష్టమవుతోంది.

**2012-13 బడ్జెట్ సమగ్ర స్వరూపం (రు. కోట్లలో)**

| | 2011-12 బడ్జెట్ అంచనాలు | 2011-12 సవరించిన అంచనాలు | 2012-13 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|---|
| రెవెన్యూ వసూళ్లు | 789892 | 766990 | 935685 |
| మూలధన వసూళ్లు | 467837 | 551730 | 555240 |
| మొత్తం వసూళ్లు | 1257729 | 1318720 | 1490925 |
| ప్రణాళికేతర వ్యయం | 816182 | 892116 | 969900 |
| ప్రణాళికా వ్యయం | 441547 | 426604 | 521025 |
| మొత్తం వ్యయం | 1257729 | 1318720 | 1490925 |
| రెవిన్యూ లోటు | 307270 | 394951 | 350424 |
| ద్రవ్య లోటు | 412817 | 521980 | 513590 |
| ప్రాథమిక లోటు | 144831 | 246362 | 193831 |

ద్రవ్యలోటు తగ్గించే సాకుతో ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయడానికి, ఆర్థికాభివృద్ధి వేగాన్ని పెంచడానికి ద్రవ్య పటిష్టతను సాధించాల్సిన అవసరం ఉందని ప్రణబ్ పేర్కొన్నారు. ఎఫ్ఆర్‌బిఎం చట్టం ప్రకారం 2008 నాటికే జిడిపిలో 0.3 శాతానికి ద్రవ్యలోటును తగ్గించుకోవాలని, రెవిన్యూ లోటును పూర్తిగా అధిగమించాల్సి ఉందని, అయితే అంతర్జాతీయ ఆర్థిక సంక్షోభం ఫలితంగా అది సాధ్యం కాలేదని చెప్పిన ఆర్థిక మంత్రి ఇప్పుడు ఆ దిశగా పయనించాలని అన్నారు. ద్రవ్య పటిష్టతను పెంచుకోవడానికి పన్ను - జిడిపి నిష్పత్తిని 13 నుండి 17 శాతానికి పెంచడం, వ్యయాన్ని అదుపు చేయడం సరైన మార్గం అని తెలిపారు. ఈ రెండు అంశాలూ పైకి మంచిగానే కనిపిస్తాయి. కాని వాటిని ఏ విధంగా సాధిస్తారన్నదే ప్రశ్న. దీనికోసం బడ్జెట్‌లో ఆయన చూపిన మార్గం సంపన్నులపై పన్నులను తగ్గించి, సాధారణ ప్రజలకిచ్చే సబ్సిడీలపై కోత పెట్టడంగా ఉంది. ప్రత్యక్ష పన్నులను పెంచడం, సంపన్నులకు కల్పించే రాయితీలను తొలగించడం ద్వారా కూడా దీన్ని సాధించవచ్చు. కాని ఆ మార్గాన్ని ప్రణబ్ ఎంచుకోలేదు. ప్రత్యక్ష పన్నుల్లో ప్రస్తుతం ఉన్న దానికన్నా రు. 4,500 కోట్ల కోతను భరిస్తూ, అదనంగా రు. 45,940 కోట్ల మేర పరోక్ష పన్నులు విధించారు.

ప్రస్తుత ఆర్థిక విధానాల ఫలితంగా కుబేరులుగా మారిన వారి నుండి అధిక ఆదాయం రాబట్టుకోవడానికి ఏమాత్రం ఆర్థికమంత్రి ప్రయత్నం చేయలేదు. మరో వైపున ఎక్సైజ్ పన్నును 10 నుండి 12 శాతానికి పెంచేశారు. అది మధ్యతరగతి ప్రజలందరిపై పడే భారం. మన దేశంలో సేవలు బాగా విస్తృతి చెందాయంటూ సేవా పన్నును 10 నుండి 12 శాతానికి పెంచారు. పైగా పన్ను పరిధిలోకి వచ్చే సర్వీసుల సంఖ్యకు భారిగా విస్తరించారు. నెగిటివ్ జాబితాలోని 17 వస్తువులపై మినహా మిగిలిన అన్ని సేవలపై సర్వీసు పన్ను పెంపుదల ద్వారానే రు. 18,660 కోట్ల అదనపు రాబడి వస్తుందని చెప్పారంటే దాని తీవ్రతను తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు. అసలే పెరిగిన ధరలతో సతమతమవుతున్న సగటు జీవులపై నూతన భారాన్ని ఆర్థిక మంత్రి మోపుతున్నారు. వాస్తవంలో ఇంకా ఎక్కువగానే జనాన్ని పిండేస్తారన్నది నిస్సందేహం.

ఆహారం, ఎరువులు, పెట్రోలియం ఉత్పత్తులపై ప్రస్తుత సమయంలో సబ్సిడీలు అవసరమేనని అంగీకరిస్తూనే, స్థూల ఆర్థిక వ్యవస్థ మౌలిక సూత్రాలకు భంగం కలిగించేవిగా అవి ఉండరాదని చెప్పుకొచ్చారు. ఆహార సబ్సిడీలను భరిస్తామని అంటూనే, మిగతావాటిని మాత్రం ఆర్థిక వ్యవస్థపై ప్రతికూల ప్రభావం పడనంత మేరకే భరిస్తామని స్పష్టం చేశారు. ఎరువులపై సబ్సిడీలో భారీగా కోత విధించారు. 2011-12లో రు. 67199 కోట్లు ఉన్న సబ్సిడీని 2012-13లో రు. 60974 కోట్లకు తగ్గించింది. పెట్రోలియంపై 2011-12లో రు. 68481 కోట్లు ఉన్న సబ్సిడీని 2012-13లో రు. 43580 కోట్లకు తగ్గించారు. ఇందువల్ల ఆహార ధాన్యాల ఉత్పత్తి ఖర్చు తడిసి మోపెడవుతుంది. గ్రామీణ ఉపాధి హామి పథకానికి గత ఏడాది 40 వేల కోట్ల రూపాయలు కేటాయించగా ఈ ఏడాది 33 వేల కోట్ల రూపాయలు కేటాయించారు. ఆరోగ్యానికి జిడిపిలో 3 శాతమే కేటాయించారు. ఆదాయాన్ని పెంచుకోవడానికి ప్రభుత్వరంగ సంస్థల వాటాలను తెగనమ్మడాన్ని ఉధృతం చేస్తానని కూడా ఈ బడ్జెట్ ప్రకటించింది. గత బడ్జెట్‌లో ఈ లక్ష్యాన్ని రు. 40,000 కోట్లుగా పెట్టుకున్నప్పటికీ రు. 14,000 కోట్లు మాత్రమే సాధించగలిగామని, రానున్న సంవత్సరంలో దీన్ని రు. 30,000 కోట్ల మేర సాధించాలని ప్రణబ్ లక్ష్యంగా ప్రకటించారు.

14,90,925 కోట్ల రూపాయల వ్యయాన్ని అంచనా వేసిన బడ్జెట్‌లో ద్రవ్యలోటు రు. 5,13,590 కోట్లు. పెట్టుబడుల ఉపసంహరణ ద్వారా ఆశిస్తున్నది రు. 30 వేల కోట్లు. మార్కెట్ నుండి తీసుకోదలచిన రుణాలు, ఇతర పన్నుయేతర ఆదాయాన్ని లెక్కలోకి తీసుకుంటే నికర రెవిన్యూ లోటు రు. 1,85,752 కోట్లు. ప్రతిపాదిత వ్యయాన్ని పరిగణనలోకి తీసుకొన్నప్పుడు బడ్జెట్‌లో కనబడుతున్న లోటును పూడ్చడం అంత సులభం కాదని స్పష్టమవుతుంది. ఆర్థిక మంత్రి రు.5 లక్షల కోట్లకు పైగా రుణాలు తీసుకరావల్సి ఉంటుంది. అప్పులు పుట్టకపోతే దీన్ని భర్తీ చేయడానికి నోట్లు ముద్రించడమో లేదా సబ్సిడీలకు కోత పెట్టడం లాంటి చర్యలు తీసుకోక తప్పదు. కాబట్టి ద్రవ్యోల్బణం నియంత్రణ కృషికి ఇది విఘాతమవుతుంది. అంటే ధరల పెరుగుదలకు దోహదకారి అవుతుంది. ఇప్పటికే ప్రభుత్వ అప్పు ఆందోళనకరంగా జి.డి.పి.లో 45.5 శాతానికి చేరింది. దేశ రుణభారం ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతోంది. 1971లో మన దేశ రుణభారం రు. 19,193 కోట్లు, 1981లో రు. 59,749 కోట్లు, 1991లో రు. 3,14,558 కోట్లు, 2001లో 16 లక్షల కోట్లు, 2005లో రు. 22,60,145 కోట్లు, 2010లో రు. 39,31,105 కోట్లు, 2011లో రు. 43,52,689 కోట్లు, 2012 మార్చి నాటికి రు. 46 లక్షల కోట్లుగా ఉంది. ఈ ఆర్థిక సంవత్సరాంతానికి ఇది జిడిపిలో 46.5 శాతానికి చేరనుంది. ప్రస్తుత బడ్జెట్ కంటే రుణభారం మూడు రెట్లు ఉంది. నేడు వడ్డీల చెల్లింపుల

కోసం, రోజువారి ఖర్చుల కొరకు రుణాలు చేయవల్సిన దుస్థితికి మన ప్రభుత్వ నిర్వాకం చేరుకుంది.

ఆమ్ ఆద్మీ అంటూ కబుర్లు చెప్పిన ప్రధాని పదవులను అయినా పణంగా పెడతాం తప్ప రాబోయే రోజుల్లో ఎట్టి పరిస్థితుల్లోను సబ్సిడీలను తగ్గించి తీరతామని బడ్జెట్ ప్రవేశపెట్టిన తర్వాత దూరదర్శన్‌కిచ్చిన ఇంటర్వ్యూలో తెగేసి చెప్పారు. కఠినమైన నిర్ణయాలను తీసుకొనే క్రమంలో మిత్రపక్షాలను కలుపుకొని వెళతామంటూ సబ్సిడీల తగ్గింపు క్రమంలో 'బుల్లెట్లను ఎదుర్కొనడం' తప్ప మరొక మార్గం లేదని ప్రధాని చెప్పారు. ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్ షరతులను పూర్తిస్థాయిలో అమలు జరిపేందుకు కేంద్ర ప్రభుత్వం తెగించినట్లు కనిపిస్తోంది. 'ద్రవ్యలోటును జి.డి.పి.లో 3.5 శాతానికి తగ్గించుకోవడం' ప్రతి దేశ ఆర్థిక సమస్యలకు పరిష్కారంగా ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంకులు ప్రబోధిస్తూ వచ్చాయి. ద్రవ్యలోటు ఎక్కువైతే, ఆ దేశ అప్పులు తీర్చే రుణాలపై వడ్డీలు చెల్లించే సామర్థ్యం తగ్గిపోతుందనీ, కనుక ఆ దేశానికి అంతర్జాతీయ రుణ లభ్యత తగ్గిపోతుందనీ, పెట్టుబడులు వచ్చే అవకాశాలు తగ్గిపోతాయనీ భావించబడుతున్నది. ఒక దేశ అభివృద్ధి, ఆ దేశానికి విదేశాల నుండి వచ్చే పెట్టుబడులవల్ల, విదేశాల నుండి పొందే భారీ రుణాల వల్ల, విదేశాలకు ఎగుమతులను పెంచుకోవడం వల్లనే సాధ్యపడుతుందనేది పెట్టుబడిదారీ పాలక వర్గాల ఆలోచనా దృక్పథం. అందుకే ఏప్రిల్ ఒకటి నుంచి ప్రారంభం కానున్న పన్నెండవ ప్రణాళికలో మూడవ దశ సంస్కరణలు అమలు కాబోతున్నాయి.

ఇప్పుడున్న స్థితిని బట్టి వచ్చే ఏడాది ఆహారం, ఎరువులు, చమురు ఖాతాలో సబ్సిడీల మొత్తం ఒక లక్షా 96 వేల కోట్ల రూపాయలకు చేరవచ్చని అంచనా. అయితే ఈ మొత్తం ఇస్తారన్న గ్యారెంటీ మాత్రం లేదు. ఆధార్ సాయంతో లబ్ధిదారుల సంఖ్యను భారీగా తగ్గించే ఎత్తుగడ ప్రణబ్ ప్రసంగంలో వ్యక్తమయింది. దేశంలో అత్యధిక శాతం శ్రామిక ప్రజలు వ్యవసాయం, చేతివృత్తులు, చిన్న, మధ్యతరహా పరిశ్రమలు, స్వయం ఉపాధి మీద ఆధారపడుతున్నారు. ఈ రంగాలకు తగినంత ప్రోత్సాహం కల్పిస్తే నిరుద్యోగులందరికీ ఉపాధి కల్పించొచ్చు. వారి ఆదాయాలను పెంచొచ్చు. వారి కొనుగోలు శక్తిని ఇతోధికంగా పెంచొచ్చు. దేశీయ మార్కెట్టును ఇబ్బడి ముబ్బడిగా అభివృద్ధి చేయొచ్చు. పొదుపును పెంచుకొని దేశీయంగానే అవసరమైన పెట్టుబడులను సమీకరించుకోవచ్చు. కాని పాలకులు ఆ దిశలో చర్యలు తీసుకునే ఆలోచనలో లేరు.

ధరలు భారీగా పెరిగిన తరుణంలో పన్ను రాయితీలు పెరుగుతాయని ఆశించిన పన్ను చెల్లింపుదారున్ని ఈ బడ్జెట్ తీవ్రంగా నిరాశపరిచింది. ఆదాయపు పన్నులో భారీ రాయితీ ఇస్తారని, 3 లక్షల్లోపు ఆదాయం ఉండే వేతన జీవులు పన్ను కట్టాల్సిన అవసరం ఉండక పోవచ్చని ఆశించిన వారికి నిరాశే ఎదురైంది. ప్రత్యక్ష పన్నుల కోడ్‌ను పరిశీలించిన పార్లమెంటరీ స్థాయి సంఘం సిఫార్సులను ఆర్థిక మంత్రి ప్రణబ్ అటకెక్కించారు. మధ్యతరగతి ఉద్యోగుల ఆదాయపు పన్ను మినహాయింపు పరిమితిని ప్రస్తుత బడ్జెట్‌లో స్వల్పంగా రు. 1.80 లక్షల నుంచి రు. 2 లక్షలకు పెంచారు. 20 శాతం పన్ను స్లాబ్ పరిధిలో ఉన్నవారికి మినహాయింపును రు. 10 లక్షలకు పెంచారు. ప్రస్తుతం ఈ స్లాబ్ రు. 8 లక్షలుగా ఉంది. సీనియర్ పౌరులకు ఆదాయపు పన్ను మినహాయింపు పరిమితిని రు. 2.5 లక్షలకు పెంచారు. 80 ఏళ్లు పై బడినవారికి ఆదాయపు పన్ను మినహాయింపు పరిమితిని రు. 5 లక్షలకు పెంచారు. ఈ కేటగిరిలో రు. 5 లక్షల నుంచి 10 లక్షల వరకు 20 శాతం, రు. 10 లక్షలకు పైన 30 శాతం పన్ను చెల్లించాల్సి ఉంటుంది. ఆరోగ్య పరీక్షలకు అయ్యే ఖర్చులో రు. 5 వేలు తగ్గింపుగా చూపవచ్చు. మూడేళ్ల కాలపరిమితికి చిన్న పెట్టుబడిదారు పెట్టే పెట్టుబడులపై రు.50వేల దాక పన్ను మినహాయింపు ఇచ్చారు. డిబెంచర్ మీద వచ్చే వడ్డీపై టిడిఎస్ వద్దే రు.5000 దాక మినహాయింపు కల్పించారు. సేవింగ్స్ బ్యాంకుపై రు.10 వేల దాక పన్ను మినహాయించారు.

బడ్జెట్ ప్రతిపాదనలు తుదిరూపు సంతరించుకోక ముందు నుంచే వ్యవసాయ నిపుణులు, రైతు సంఘాల నాయకులు వ్యవసాయాన్ని లాభసాటిగా మార్చడానికి, సుస్థిర పరచడానికి ముఖ్యమైన విధాన నిర్ణయాలు జరగాలని, రైతుల ఆత్మహత్యల నివారణకు చర్యలు తీసుకోవాలని, పరిశోధనలకు, అభివృద్ధికి ప్రస్తుత కేటాయింపుల కన్నా మూడింతలు బడ్జెట్‌లో పెంచాలన్న అభ్యర్థన ఆర్థిక మంత్రి దృష్టిని ఆకర్షించ లేకపోయింది. భారతీయ పరిశ్రమల సమాఖ్య ఆర్థిక మంత్రికి సమర్పించిన విజ్ఞాపన పత్రంలో దేశ స్థూల జాతీయోత్పత్తి 9 శాతం చేరుకోవాలంటే వ్యవసాయ రంగం ద్వారా స్థూల జాతీయోత్పత్తి వాటా 18 శాతం నుండి కనీసం 4 శాతానికి పెరిగి 22 శాతానికి పెరగవలసి ఉంటుందని స్పష్టం చేశారు. వ్యవసాయానికి అధిక ప్రాధాన్యత ఇస్తున్నామని చెబుతూనే ఆర్థిక మంత్రి గత సంవత్సరం రు. 17,123 కోట్లు ఉన్న కేటాయింపులను 2012-13 బడ్జెట్‌లో రు. 20,208 కోట్లు కేటాయించారు. గతం కంటే రు. 3,085 కోట్లు పెంచినా ఇది సముద్రంలో నీటి బొట్టు మాత్రమే.

దేశ జనాభాలో 55 శాతం మందికి జీవనాధారంగా ఉన్న వ్యవసాయ రంగానికి కేటాయించింది స్థూల జాతీయోత్పత్తిలో 2 శాతం కన్నా తక్కువ. రాష్ట్రీయ కృషి వికాస్ యోజనకు రు. 9.127 కోట్లు, పంట రుణాల కోసం రు. 1 లక్ష కోట్లు పెంపుదల చేస్తూ రు. 5.75 లక్షల కోట్లు లక్ష్యంగా నిర్ణయించారు. అయితే దీనికి బ్యాంకులు ఏ మేరకు సహకరిస్తాయన్నది సంశయమే. మరోవైపు బ్యాంకు రుణాలు పేదలకు, కౌలుదారులకు అందడం లేదు. ఎం.వి. నాయర్ కమిటీ చేసిన వర్గీకరణతో రైతులు మరో పెద్ద ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నారు. వ్యవసాయ - తత్సంబంధ రంగాలన్నింటినీ ఒకే గాటన కట్టింది. వ్యవసాయానికి ఇప్పటి దాక ప్రత్యక్షంగా లభిస్తున్న రుణాలు, సంబంధిత రంగాలన్నింటిని కలుపుకొని పరోక్ష పద్ధతిలో రుణాలు లభిస్తే వ్యవసాయం మరింత సంక్షోభంలో కూరుకుపోవడం తథ్యం. గత సంవత్సర బడ్జెట్‌లో రు. 4.75 లక్షల కోట్లు రుణాలిస్తామని కేవలం రు. 2.94 లక్షల కోట్లు మాత్రమే ఇచ్చారు. మైక్రో ఇరిగేషన్ రంగానికి రు. 1500 కోట్లు, వ్యవసాయ పరిశోధనా విద్యా విస్తరణకు రు. 1000 కోట్లు కేటాయించారు. రైతుకు గిట్టుబాటు ధర సంగతి అలా ఉంచి, కనీస మద్దతు ధర ప్రస్తావన కూడా బడ్జెట్‌లో చేయలేదు. నందన్ నిలేకని నేతృత్వంలోని టాస్క్‌ఫోర్స్ చేసిన సిఫార్సులను ప్రణబ్ యథాతథంగా ఆమోదించారు. దశల వారిగా ఎరువుల సబ్సిడీని నేరుగా తొలుత రిటైలరుకు, తర్వాత రైతుకు బదిలీ చేస్తామని... దాని ద్వారా

12 కోట్ల రైతు కుటుంబాలకు ప్రయోజనం చేకూరుతుందన్నారు. దేశవ్యాప్తంగా 12 కోట్ల రైతు కుటుంబాల్లో మూడొంతుల మందికి వ్యవస్థాగత పరపతి సదుపాయం నేటికీ అందని మానిపండే. బడ్జెట్ కేటాయింపులు నామమాత్రంగా పెంచినంత మాత్రాన వ్యవసాయోత్పత్తి పెరగడం అసాధ్యం. అమలులో ఉన్న పథకాల మీద కొద్దిపాటి పెంపుదల ద్రవ్యోల్బణం తాకిడికి హరించుకుపోయి చివరకు ఏ విధమైన పురోగతీ రైతాంగం అనుభవంలోకి రాదు. వ్యవసాయానికి జీవం పోసే మౌలిక వనరుల ఊసు బడ్జెట్‌లో మచ్చుకైన కానరాదు.

ప్రైవేట్ పెట్టుబడులు విపరీతంగా పెరిగేలా చూడడం కొన్ని రంగాలలో ప్రైవేటీకరణకు ఉన్న అడ్డంకులను తొలగించడం బడ్జెట్ లక్ష్యంగా ఉంది. విద్యుదుత్పత్తి, రహదారులు, విమానాల మరమ్మత్తు, గృహనిర్మాణం, నీటిపారుదల, ఆదర్శ పాఠశాలల వంటి రంగాలలో విదేశీ వాణిజ్య రుణాలను, పబ్లిక్ ప్రైవేట్ భాగస్వామ్యాన్ని అనుమతించ బోతున్నామని ప్రణబ్ ప్రకటించాడు. ప్రభుత్వం దగ్గర నిధులు లేవు గనుక ప్రైవేట్ నిధులు ఆహ్వానిస్తున్నామని తెలిపారు. మౌలిక సదుపాయ రంగానికి పెట్టుబడులు సమకూర్చుకోవడానికి గత బడ్జెట్‌లో రు. 30,000 కోట్ల పన్ను రహిత బాండ్ల జారీకి అనుమతించగా, ఈ బడ్జెట్‌లో రు. 60,000 కోట్లకు అనుమతించనున్నారు. అలాగే 'రాజీవ్ గాంధీ ఈక్విటీ సేవింగ్స్ స్కీం' అనే పేరుతో ఆసక్తికరమైన ఓ పథకాన్ని ఈ బడ్జెట్‌లో ప్రకటించారు. వార్షికాదాయం రు. 10 లక్షల లోపు ఉన్నవారు, రు. 50,000 వరకు ఈక్విటీలు కొనుగోలు చేయవచ్చు. దానిలో వారికి వ్యక్తిగత ఆదాయం పన్ను నుండి 50 శాతం మినహాయింపు లభిస్తుంది. ఈ పథకం ద్వారా మధ్యతరగతి ప్రజానీకాన్ని స్టాక్ మార్కెట్ జూదంలోకి మరింతగా ఈడ్చడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. క్యాపిటల్ మార్కెట్‌లో సంస్కరణలను ప్రగాఢం చేసే చర్యలను కూడా ప్రణబ్ ప్రకటించారు. వ్యవసాయం, మౌలిక వసతుల రంగాల్లో కార్పొరేట్ సంస్థలు, విదేశీ పెట్టుబడులకు ఎర్రతివాచీ పరిచారు. రీటైల్ రంగంలో ఎఫ్‌డిఐ లాంటి వివాదాస్పద అంశాలపై ఏకాభిప్రాయ సాధనకు కృషి చేస్తామని కార్పొరేట్ రంగానికి హామీ ఇచ్చారు.

విద్యలో నాణ్యత పడిపోతున్న నేపథ్యంలో విద్యకు కేటాయింపులు స్వల్పంగా పెంచారు. 2011-12 ఆర్థిక సంవత్సరంలో విద్యారంగానికి రు. 52,060 కోట్లు కేటాయించగా 2012-13 ఆర్థిక సంవత్సరంలో రు. 61,427 కోట్లు కేటాయించారు. ఈ నిధుల్లో ఎక్కువ శాతం (రు. 45,969 కోట్లు) పాఠశాల విద్యకే ఖర్చు కానుండగా ఉన్నత విద్యకు రు. 15,458 కోట్లు వ్యయం చేస్తారు. పాఠశాలల్లో విద్యార్థులకు మధ్యాహ్న భోజనం పెట్టేందుకు రు. 11,937 కోట్లు ఖర్చు చేస్తారు. అయినా జాతీయ ఆదాయంలో 6 శాతం విద్యకు కేటాయించాలన్న నిపుణుల మాట ఆచరణలోకి రాలేదు. విద్యాహక్కు చట్టం (ఆర్.టి.ఇ.) అమలు చేసేందుకు రు. 25,555 కోట్లు కేటాయించారు. రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన 38,355 కొత్త పోస్టులకు బడ్జెట్‌లో మ్యాచింగ్ గ్రాంట్ ఊసేలేదు. ప్రభుత్వ పాఠశాలల్లో మౌలిక సదుపాయాలలేమి, నాణ్యమైన విద్య అందక పోవడం, ఉన్నత విద్యా సంస్థల్లో 34 శాతం బోధన సిబ్బంది కొరత, ప్రైవేట్ విద్యాసంస్థల బలవంతపు వసూళ్లు కట్టడి చేయడం లాంటి సమస్యల ప్రస్తావన బడ్జెట్‌లో రాలేదు. ఏప్రిల్ నుంచి ప్రారంభమయ్యే 12వ పంచవర్ష ప్రణాళికలో భాగంగా బ్లాక్ స్థాయిలో 6 వేల మోడల్ పాఠశాలలను ఏర్పాటుచేయాలని ప్రతిపాదించారు. వీటి కొరకు రు. 972 కోట్లు కేటాయించింది. వీటిలో 2,500 స్కూళ్లను ప్రభుత్వ-ప్రైవేట్ భాగస్వామ్య విధానంలో నెలకొల్పుతారు. ఇందుకై కార్పోరేట్ సంస్థలను ఆహ్వానించడం విషాదకరం. మాధ్యమిక విద్యలో నాణ్యతను పెంపొందించేందుకు అమలుచేస్తున్న రాష్ట్రీయ మాధ్యమిక శిక్షా అభియాన్ (ఆర్ఎంఎస్ఎ)కు 2012-13 బడ్జెట్‌లో రు. 3,124 కోట్లు కేటాయించారు. విద్యార్థులకు బ్యాంకుల నుంచి విద్యారుణాల నిధులను మరింత మెరుగ్గా అందించేందుకు 'క్రెడిట్ గ్యారంటీ ఫండ్'ను ఏర్పాటు చేయనుంది. విద్యార్థుల్లో చదువుకు తగ్గ నైపుణ్యాలను పెంపొందించేందుకు కొత్తగా 26 స్కిల్ డెవలప్‌మెంట్ ప్రాజెక్టులు చేపట్టిన నేషనల్ స్కిల్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్ (ఎన్ఎస్‌డిసి)కి రు. 1000 కోట్లు కేటాయించింది. ప్రాథమిక విద్యకు నిధులు పెంచామన్న పేరుతో ఉన్నత విద్యను నిర్లక్ష్యం చేయడం జరుగుతోంది. మన దేశంలో ఉన్నత విద్యలో చేరుతున్నవారు 13 శాతమే. ప్రపంచంలోనే అత్యంత అసమానతలున్న విద్యా విధానం మన దేశంలోనే కొనసాగడం శోచనీయం.

రక్షణ రంగానికి ఎప్పటిలాగే కేటాయింపులు పెంచారు. 2011-12లో ఈ రంగానికి కేటాయించింది రు. 1,64,415 కోట్లు కాగా, 2012-13 సంవత్సరానికి రు. 1,93,407 కోట్లు కేటాయించారు. తాజాగా జాయింట్ వెంచర్ పేరిట ప్రభుత్వరంగ రక్షణ పరిశ్రమల్లో పబ్లిక్ ప్రైవేట్ భాగస్వామ్యానికి అనుమతించడంతో పాటు రక్షణ రంగంలోకి విదేశీ, స్వదేశీ కార్పోరేట్ సంస్థలకు అవకాశమివ్వడం జరుగుతుంది. రానున్న పదేళ్లలో 100 బిలియన్ డాలర్ల రక్షణ పరికరాలు కొనుగోలు చేయాలని ప్రభుత్వం భావిస్తోంది. ఇదే మొత్తాన్ని మన దేశంలో ఉన్న రక్షణ రంగ పరిశ్రమలకు కేటాయిస్తే నేడున్న 51 డిఆర్‌డిఒ ల్యాబ్స్‌కు అదనంగా మరో 50 ల్యాబ్స్, అలాగే 20 ఆర్డినెన్స్ కంపెనీలను అదనంగా నిర్మించుకోవడం వల్ల మూడు లక్షల మందికి ఉద్యోగం దొరుకుతుంది. ఈ రంగాన్ని అమెరికా, ఫ్రాన్స్ లాంటి సామ్రాజ్యవాద దేశాల స్వాధీనం లోకి నెట్టడం దేశ రక్షణకు కూడా క్షేమం కాదు. ఈ సంవత్సరం రక్షణ విభాగంకు సంబంధించి 126 మీడియం మల్టీరోల్ కాంబాట్ ఎయిర్‌క్రాఫ్ట్ (ఎంఎంఆర్‌సిఎ)లు, 145 అల్ట్రాలైట్ హౌజర్స్ (యుఎల్‌ఎచ్), 197 లైట్ యుటిలిటీ హెలికాప్టర్లు, ఆధునాతన ఆయుధాల కొనుగోలుకు ఒప్పందాలు జరగనున్నాయి.

దేశ ఆర్థిక వ్యవస్థ ఇప్పటికిప్పుడు కోలుకుని మెరుగైన వృద్ధిని నమోదు చేస్తుందనే విశ్వాసం ఆర్థిక మంత్రి ప్రణబ్‌కు కలగని నేపథ్యంలో, ప్రభుత్వాదాయం పెంచుకోవడానికి పన్నులపై దృష్టి సారించారు. ప్రత్యక్ష పన్నుల రూపంలో ఆయన విదిల్చింది పిసరంత, పరోక్ష పన్నుల రూపంలో వసూలు చేస్తోంది కొండంత. ప్రత్యక్ష పన్నులకు సంబంధించి 2005-06, 2011-12ల మధ్య ఎగవేయబడిన కార్పోరేట్ పన్ను రు. 3,95,878 కోట్లు. ఎక్సైజ్ డ్యూటీ రు. 9,55,726 కోట్లు. కస్టమ్స్ డ్యూటీ రు. 12,22,438 కోట్లు. మొత్తం పన్నుల ఎగవేత ద్వారా ప్రభుత్వం కోల్పోయిన ఆదాయం రు. 25,74,042 కోట్లు. అంటే సంవత్సరానికి దాదాపు రు. 5 లక్షల కోట్ల వరకూ ఈ ఎగవేతలున్నాయి. నిత్యం వెలుగు చూస్తున్న భారీ కుంభకోణాల్లో లక్షలాది కోట్ల రూపాయల ఆదాయాన్ని ప్రభుత్వం కోల్పోయినట్లు ప్రభుత్వ లెక్కలే చెబుతున్నాయి.

# రైల్వేలను కబళించబోతున్న ప్రైవేటీకరణ

***ప్రపంచంలోనే అతిపెద్ద రైల్వేగా పేరొందిన భారత రైల్వే చరిత్రనూ, రైల్వే కార్మికుల ఉజ్వల పోరాటాలనూ, ప్రైవేటీకరణకు సిద్ధపడుతున్న పాలకుల పన్నాగాలనూ వివరిస్తున్నారు* పి.వి. రమణ**

**మా**ర్చ్ 14న అప్పటి రైల్వేమంత్రి దినేష్ త్రివేది పార్లమెంట్‌లో రైల్వే బడ్జెట్ ప్రవేశపెడుతూ రైలు ప్రమాదాలు ఇక ఉండవు, ప్రమాదాలకు కారణమవుతున్న లెవల్ క్రాసింగులను తీసివేసి గేట్లు పెడతారు. దాని కోసం 'రైల్ రోడ్ గ్రేడ్ సెపరేషన్ ఆఫ్ ఇండియా' పేరుతో ఒక సంస్థ ఏర్పాటు చేస్తాం. 100 రైల్వేస్టేషన్‌లను విమానాశ్రయాల స్థాయిలో అభివృద్ధి చేస్తాం. భద్రత, ఆధునికీకరణ నాణానికి రెండు ముఖాలు. ఆధునికీకరణ చేయకుండా భద్రతా ప్రమాణాలను అందుకోవడం కష్టం. అదే సమయంలో నిధులు తేకుండా ఆధునికీకరణను సాధించలేం. అందుకే నిధుల సేకరణ కోసం శామ్ పిత్రోడా నాయకత్వంలో ఒక కమిటీ వేశాం అని వివరించారు. ఇంత వరకు రైల్వే వ్యవహారాలన్ని చూస్తున్న రైల్వేబోర్డును వ్యాపార సంస్థగా, వృత్తి సంస్థగా నడపాలని కూడా చెప్పారు.

సామ్రాజ్యవాద శక్తులకు అనుకూలంగా నిర్ణయం తీసుకోవడానికి ఏర్పాటు చేసిన 'ఎక్స్‌పర్ట్ గ్రూప్ ఫర్ మోడర్‌నైజేషన్' కమిటీ చైర్మన్ శామ్ పిత్రోడా ఇచ్చిన సూచనలన్నీ ఎటువంటి అభ్యంతరాలు తెలపకుండా త్రివేది వాటినన్నిటినీ తన బడ్జెట్‌లో ప్రవేశపెట్టాడు. ప్రయాణికుల చార్జీలు పెంచడం, తర్వాత మారిన రైల్వేమంత్రి తగ్గించడమనే డ్రామా నిజానికి బడ్జెట్‌లో ఇతర ప్రమాదాకరమైన అంశాలపై ప్రజల దృష్టి మళ్లించడానికి ఆడినదే. ప్రయాణికుల చార్జీలను నిర్ణయించే రెగ్యులేటరీ సంస్థ ఏర్పాటు చేయాలని, ఖరీదు నిర్ణయంలో పాత్ర వహించే ఇతర అంశాలతో కలిసి ఉన్న ఆయిల్‌ను విడగొట్టి దాని రేటు పెరిగినప్పుడల్లా చార్జీలు పెంచి ప్రజల నడుం విరిచే ప్రమాదకరమైన ప్రతిపాదనలు చేశారు. అవి పార్లమెంట్‌లో చర్చించిన తర్వాతే నిర్ణయం తీసుకుంటామని చెప్పినా భవిష్యత్తులో ప్రజల్ని భారీ వడ్డింపులకు సిద్ధం చేయడానికేనని అర్థం అవుతుంది. రెగ్యులేటరీ కమిషన్‌లు, అథారిటీలు, కార్పోరేషన్లు ఇవన్నీ ప్రపంచ బ్యాంకు విధానాలలో భాగమే.

2005లో ప్రభుత్వం 'రైల్వే టారీఫ్ రెగ్యులేటరీ అథారిటీ' సంస్థను ఏర్పాటు చేయాలని నిర్ణయించింది. అప్పటి రైల్వేమంత్రి ఆర్. వేలు 'అటువంటి సంస్థ అవసరం లేదని, ఆ నిర్ణయాన్ని పునఃపరిశీలించమని' క్యాబినేట్ నిర్ణయానికి పంపడం జరిగింది. మాజీ రైల్వేబోర్డు చైర్మన్ ఎస్.ఎస్. ఖురానా 'టారీఫ్ రెగ్యులేటరీ కమిటీ ఏర్పాటు చేస్తే సామాన్య ప్రజల అవసరాలను పట్టించుకోకుండా కేవలం ఖర్చు ఆధారంగా చార్జీలు నిర్ణయించబడి వారిపై విపరీతమైన భారం మోపుతాయి అని అన్నారు. తరువాత ఈ ప్రతిపాదనకు విరమించుకున్నారు. తిరిగి దానిని నేడు ప్రవేశపెట్టారు.

శామ్ పిత్రోడా కమిటీ సూచనల ప్రకారం భారతీయ రైల్వేలలో ఇంత వరకు కనివినీ ఎరుగని భారీస్థాయిలో ప్రైవేటీకరణ జరగబోతోంది. రైల్వేస్టేషన్లు, హైస్పీడ్ రైల్వేలైన్లు, రైల్వే ఇంజన్లు, బోగీల తయారీలను ప్రైవేటు సంస్థలకు అప్పచెప్పబోతున్నారు. కొన్నింటిని పబ్లిక్–ప్రైవేట్ పార్టనర్‌షిప్ (పి.పి.పి) విధానంలో (వేరే రూపంలో జరిగే ప్రైవేటీకరణకు ముద్దు పేరే పి.పి.పి) నిర్వహిస్తారు.

రైల్వే ల్యాండ్ డెవలప్‌మెంట్ అథారిటీ (ఆర్.ఎల్.డి.ఎ) ఆధ్వర్యంలో ప్రధాన పట్టణాలలో ఉన్న భారతీయ రైల్వేలకు సంబంధించిన దాదాపు ఒక లక్ష ఎకరాల భూమిని డెవలపర్స్‌కు 30 నుండి 90 సంవత్సరాల లీజుకు ఇవ్వాలనే ప్రతిపాదనలు చేశారు. అప్పుడే ఢిల్లీ, బెంగుళూరు, విజయవాడ, గయ, గ్వాలియర్ పట్టణాలకు చెందిన 52 స్థలాలలో 1527 హెక్టార్ల స్థలంలో పనులు ప్రారంభమై పోయాయి. వీటిపై రాబడి రు. 5,500 కోట్లు. ఈ స్థలాలలో ప్రైవేట్ హోటల్స్ వస్తాయి. ఇప్పటికే

---

ప్రభుత్వం చట్టరీత్యా కల్పించిన మినహాయింపులు మరిన్ని లక్షల కోట్ల రూపాయలు ఉంటాయి. ప్రభుత్వానికి ప్రజలకు మేలు చేయాలని అభిష్టం ఉండాలేకాని నిధుల కొరత అనేది అసలు సమస్యే కాదు. విదేశీ బ్యాంకుల్లో పొగుబడ్డ అవినీతి – నల్లధనాన్ని దేశానికి రప్పిస్తే జాతి రుణభారాన్ని తీర్చేయడంతో పాటు, ప్రజలపై పైసా పన్ను పోటు లేకుండా ప్రజలందరికి తిండి, గూడు, బట్ట, విద్య, వైద్యం, నీరులాంటి సదుపాయాలన్నీ సమకూర్చవచ్చు. ఈ ప్రభుత్వం అందుకు సిద్ధంగా లేదు.

సరళీకరణ విధానాల అమలు కారణంగా సంక్షేమ పథకాలు, సామాజిక భద్రతపై దాడి పెరిగింది. ప్రజా సమస్యలను పరిష్కరించడంలో ప్రజానుకూల విధానాలను అందించడంలో యుపిఎ ప్రభుత్వం విఫలమైంది. గత విధానాల కొనసాగింపులో భాగంగానే ఈసారి కూడా పెరుగుతున్న అంతరాలను, పెరిగిన ద్రవ్యోల్బణం, నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించే చర్యలు ఏవీ బడ్జేట్‌లో చోటు చేసుకోలేదు. మొత్తంగా చూస్తే సామాన్యుడి పొట్టగొట్టి కార్పొరేట్లకు రాయితీలు ఇచ్చే బడ్జెట్ ఇది. రైతుకిచ్చే సబ్సిడీని వెనక్కి లాక్కోవడం వలన ఆహార భద్రతకు ముప్పు వాటిల్లనుంది. విద్య, వైద్యం, ఉపాధి, వ్యవసాయం, సంక్షేమం, గ్రామీణాభివృద్ధి ఇలా అన్ని రంగాలను నిర్లక్ష్యం చేస్తూ 15 లక్షల కోట్లతో 7.6 శాతం జిడిపి రేట్ లక్ష్యంగా ముందుకు సాగుతామని చెప్పడం వంచనకు పరాకాష్ట. సగటు మనిషి దైనందిన జీవితానికి బడ్జెట్ విఘాతంగా మారబోతోంది. "పొందని సేవలకు – అందని ప్రయోజనాలకు" ప్రజలు భారీ మూల్యం చెల్లించక తప్పదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

ఢిల్లీ యాత్రీ నివాస్ ప్రైవేట్ యాజమాన్యానికి అప్పచెప్పారు. లాభమే ప్రధానంగా రైల్వేను వ్యాపార సంస్థగా మార్చాలని, రైల్వే గూడ్స్‌షెడ్‌లను, వేర్‌హౌస్‌లను పర్యవేక్షించడానికి ప్రత్యేకంగా 'లాజిస్టిక్‌కార్ప్స్'ను ఏర్పాటు చేశారు. తర్వాత ప్రయాణీకుల రవాణా మెయింటెనెన్స్, రైల్వేలైనుల విస్తరణలో కూడా ఈ పద్ధతులను ప్రవేశపెడతారు. ప్రయాణికుల సౌకర్యాలు, సాంకేతిక అవసరాలు, కేటరింగ్, హోటల్స్ ప్రైవేటువారికి అప్పజెపుతూ, ఇది కమర్షియలైజేషన్ తప్ప ప్రైవేటైజేషన్ కాదంటున్నారు రెండింటికి ఏదో పెద్ద తేడా ఉన్నట్లు.

సరకు రవాణా ఎక్కువగా జరిగే ప్రాంతాల్లో స్పీడ్ ట్రైన్లు ప్రవేశ పెట్టాలని, ముంబాయి నుండి అహ్మదాబాద్ వరకు 350 కి.మీ రైల్వేలైను ఏర్పాటుకు ప్రతిపాదన చేశారు. నిర్మాణానికి 10 సంవత్సరాల కాలం పడుతుంది. ఖర్చు 60,000 కోట్ల రూపాయలు. ఇలాంటి మోడల్ రూట్స్ ఢిల్లీ–పాట్నా (991 కి.మీ) చెన్నై–బెంగుళూరు– కోయంబత్తూరు–ఎర్నాకులం (850 కి.మీ) లలో ఏర్పాటు చేయాలని ప్రతిపాదనలు ఉన్నాయి. ఈ ప్రాంతాలలో లెవల్ క్రాసింగుల్ని తీసి వేయాలనే ప్రతిపాదనకు 50,000 కోట్ల రూపాయల ఖర్చు అవుతుంది.

మన రైళ్లలో ఆహార సరఫరాకు గ్లోబల్ టెండర్లు పిలవాలని రైల్వే మంత్రి ప్రకటించారు. ఇది ఐ.ఆర్.సి.టి.సి. ని బలహీనం చేసి బహుళజాతి కంపెనీలకు ధారదత్తం చేయాలనే ఆలోచనలో భాగమే.

మొత్తం శామ్ పిత్రోడా ప్రతిపాదనలు అమలు చేయడానికి వచ్చే 5 సంవత్సరాలలో 8.4 లక్షల కోట్ల రూపాయలు ఖర్చు అవుతాయి. ఇది కేవలం ప్రైవేట్ సంస్థల ప్రమేయంతో పాటు, కొన్ని చోట్ల పి.పి.పి విధానంలో అమలు చేయాలని చూస్తున్నారు. ఇప్పటికే 99,000 కోట్ల రూపాయల పి.పి.పి ప్రాజెక్ట్‌లకు రూపకల్పన జరుగుతోంది. ఇందులో ప్రైవేట్ ఇన్వెస్టర్స్‌కు భారీ రాయితీలు ఇస్తారు. ఒక్కసారి పి.పి.పి పద్ధతిలో మొదలుపెడితే పెట్టుబడి పెట్టిన కంపెనీలు తర్వాత కాలంలో రేట్లు పెంచేసి తద్వారా పూర్తి ప్రైవేటీకరణకు దారితీసేటట్లు చేస్తారు. ఇవన్నీ కూడా ప్రపంచ బ్యాంక్‌తో పాటు ఇతర సామ్రాజ్యవాద శక్తులకు అనుకూలమైన పరిస్థితులను ఏర్పాటు చేయడానికే. అందుకే రైల్వేమంత్రి త్రివేది ఒక టి.వి.కి ఇంటర్వ్యూ ఇస్తూ 'నేను అమెరికన్ పెట్టుబడిదారు వారెన్ బఫెట్ ను మన రైల్వేలలో పెట్టుబడి పెట్టమని విజ్ఞప్తి చేశాను' అన్నాడు. అంటే మొత్తం రైల్వేలను విదేశీ పెట్టుబడిదారుల పరం చేయడానికి నిర్ణయాలు జరిగిపోయాయని అర్థమవుతుంది. అందుకే ఈ మొత్తం వ్యవహారాన్ని గమనిస్తున్న ఒక రైల్వే బోర్డు మెంబర్ రోడ్డు మీద నడుస్తూ మధ్యలో గొయ్యి ఉందని తెలిసి కూడా తిన్నగా వెళ్లి ఆ గోతిలో పడడంలాగుందని వ్యాఖ్యానించాడు.

ప్రపంచంలో అతిపెద్ద రైల్వేలలో మనదే అగ్రస్థానం. భారతీయ రైల్వేలలో ప్రతి రోజు రెండు కోట్ల, 30 లక్షల మంది అంటే సంవత్సరానికి 720 కోట్ల మంది ప్రయాణిస్తుంటారు. ప్రయాణికుల కొరకు 12,000 రైల్వేలు నడుస్తున్నాయి. వాటిలో పెద్ద పట్టణాలకు, దూరప్రాంతాలకు వేగంగా వెళ్లే రైళ్లు 2600. మెల్లగా చిన్న చిన్న పట్టణాల మధ్య నడిచేవి 4200. బొంబాయి, చెన్నై, కలకత్తా ఇతర మెట్రోపాలిటన్ పట్టణాలలో ఇంటర్‌సిటీ, సబర్బన్ సర్వీసు చేసేవి 5600 రైళ్లు ఉన్నాయి. ఉద్యోగులు 13.6 లక్షలు. ప్రపంచంలోనే ఎక్కువ కార్మికులు ఉన్న సంస్థలలో మన రైల్వేలది ఎనిమిదవ స్థానం. సరుకు రవాణా రోజుకు 26.5 లక్షల టన్నులు జరుగుతుంది. ఇది దేశం మొత్తం సరుకు రవాణాలో 30శాతం మాత్రమే. భారతీయ రైల్వేలకు 9000 లోకోమోటివ్ ఇంజన్లున్నాయి. 7083 రైల్వే స్టేషన్లు, 1,31,205 రైల్వేబ్రిడ్జిలు, 65,000 కి.మీ. రైల్వేలైన్లు ఉన్నాయి.

1980ల మొదట్లో 'నేషనల్ ట్రాన్స్‌పోర్ట్ పాలసీ కమిటీ' ఏర్పడింది. అప్పటికి దేశం మొత్తం ప్రయాణికుల అవసరాలను 74 శాతం, సరుకు రవాణాలో 89 శాతం రైల్వేలు తీర్చేవి. కాని ఈ 32 సంవత్సరాలలో ప్రభుత్వ విధానాల ఫలితంగా తీవ్రమైన మార్పులు చోటు చేసుకొన్నాయి. నేడు దూర ప్రాంతాలకు, పట్టణ ప్రాంతాలకు అవసరమైన ప్రయాణికుల రవాణా సౌకర్యం కేవలం పది శాతం, సరుకుల రవాణాలో 30 శాతం మాత్రమే ఉంది.

37 రాష్ట్రాల బస్ సర్వీస్‌లను పరిశీలించి చేసిన ఒక సర్వే ప్రకారం, బస్సు చార్జీ కిలోమీటర్‌కు 52 పైసలు ఉండగా, రైల్వే చార్జీలు కిలోమీటర్‌కు 17 పైసలు మాత్రమే ఉంది.

**భారతీయ రైల్వేల చరిత్ర**

'ఇంగ్లండ్‌లోని మిల్లు యజమానులు తమ పరిశ్రమలకు కావలసిన పత్తి తదితర ముడిసరుకులను చౌకగా సమకూర్చుకోవడానికి, సంకుచిత బుద్ధితో మాత్రమే భారతదేశంలో రైల్వేలను అభివృద్ధి చేయదలుచు కొన్నారని నాకు తెలుసు. కానీ ఒకసారి ఒక దేశంలో రవాణాలో ముఖ్యంగా బొగ్గు, ఇనుము రవాణా విషయంలో యంత్రాలు ప్రవేశపెట్ట బడినట్లయితే, ఇంక వాటి విస్తరణను అరికట్టడం అసాధ్యం. రైల్వేలకు సంబంధించిన వివిధ తక్షణ అవసరాలు సమకూర్చేందుకు అవసరమైన పారిశ్రామికీకరణను చేపట్టకుండా ఒక పెద్ద దేశంలో రైలు మార్గం నిర్వహించడం సాధ్యం కాదు. ఈ పారిశ్రామికీకరణ వలన రైల్వేలలో ఎక్కువగా ప్రత్యక్ష సంబంధంలేని వివిధ పారిశ్రామిక విభాగాలకు కూడా ఈ యంత్రాల వినియోగం విస్తరిస్తుంది. అందువలన భారతదేశంలో రైల్వేలు ఆధునిక, పారిశ్రామిక అభివృద్ధికి నాంది పలికాయని చెప్పవచ్చు' అని మార్క్స్ భారతీయ రైల్వేలపై చేసిన వ్యాఖ్య ఆయన దూరదృష్టికి నిదర్శనం. భారతదేశంలో ఈ రైల్వేల నిర్మాణం సందర్భంగా ఆధునిక భారత కార్మికవర్గం ప్రారంభమైందని చెప్పవచ్చు. ఈ రైల్వే కార్మికులే నేటి భారత కార్మికవర్గం అవతరణకు నాంది పలికారు.

ఈ సందర్భంగా మన దేశంలో రైల్వేల ప్రారంభ చరిత్ర గురించి తెలుసుకొందాం. గ్రానైట్ రాయి రవాణా కోసం మద్రాస్‌లోని చింతాద్రి పేట దగ్గర రెడ్ హిల్ రైల్ రోడ్ లైన్ (ఆర్‌ఎచ్‌ఆర్‌ఎల్) 1836లో ప్రారంభమై 28 ఆగస్ట్ 1938 నాటికి పూర్తయింది. ఈ రైల్వేలైన్ కోసం గోదావరిపై ఆనకట్ట కట్టిన ఆర్థర్ కాటన్ సర్వే చేశారు. ఆనాటికి ఆయన కెప్టెన్‌గా పనిచేస్తున్నారు. 50 వేల రూపాయల ఖర్చుతో మైలున్నర దూరం రైల్వేలైన్ వేశారు. తరువాత గోదావరిపై ఆనకట్ట ప్రాజెక్ట్ అవసరాల కోసం 1845లో ఒక రైలు లైను ఏర్పాటు చేసారు. ఇవన్నీ ప్రయోగాలుగానే మొదలయ్యాయి.

1845లో లండన్‌లో స్థాపించబడిన రెండు బ్రిటిష్ ప్రైవేట్ కంపెనీలు 'ఈస్టిండియా రైల్వే కమిటీ', 'ది గ్రేట్ పెనిన్సులర్ రైల్వే కంపెనీ'లు ఇండియన్ రైల్వేల నిర్మాణాన్ని చేపట్టాయి. వీటిని గ్యారంటీడ్ రైల్వేలుగా పిలిచారు. ఎందుకంటే బ్రిటిష్ ప్రభుత్వం ఈ కంపెనీలకు రైల్వే నిర్మాణంలో ఎటువంటి పరిస్థితులు ఎదురైనా, 5 శాతం లాభం మాత్రం

తప్పక ఇవ్వడానికి ఒప్పుకుంది. ఆ రెండు కంపెనీలు భారతీయ రైల్వేలకు 90 మిలియన్ పౌండ్ల పెట్టుబడి పెట్టాయి.

22 డిసెంబర్ 1851న రూర్కీకి నిర్మాణ సామాగ్రి రవాణా చేయడానికి రైలు నడిచింది. 16 ఏప్రిల్ 1853న మధ్యాహ్నం 3.30 గంటలకు నాలుగు వందల మంది ప్రయాణీకులతో, 14 బోగీలతో సుల్తాన్, సింధ్, సాహిబ్ పేర్లతో నిర్మించబడిన మూడు లోకో ఇంజన్లతో బొంబాయిలో బోరిబందర్ నుండి థానే వరకు 34 మైళ్ల దూరం రైలు ప్రయాణించింది. దీనికి ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం 21 గన్‌సాల్యూట్స్‌తో ఆహ్వానం పలికింది.

తూర్పు ప్రాంతమైన హౌరా నుండి హుగ్లీ వరకు 15 ఆగస్ట్ 1854న, 24 మైళ్ల దూరం వరకు రైలు నడిచింది. అప్పటి ఫస్ట్ క్లాస్ చార్జీ రు. 3, థర్డ్ క్లాస్ 7 అణాలు.

దక్షిణ ప్రాంతమైన మద్రాస్‌లో వెయిసర్‌పాండీ నుండి ఆర్కోట్ వరకు 63 మైళ్ల దూరం రైలు నడిచింది.

ఉత్తర ప్రాంతమైన అలహాబాద్ నుండి కాన్పూర్ వరకు 3 మార్చ్ 1859న, 119 మైళ్ల దూరం రైలు నడిచింది.

1880 నాటికి భారతదేశంలో మొత్తం 14,500 కిలోమీటర్ల రైల్వే లైన్ ఏర్పడింది. ఇవి ప్రథమంగా మేజర్ పోర్టుల ప్రాంతాలలో కలకత్తా, మద్రాస్, బొంబాయిల మధ్య ఎక్కువగా ఏర్పడ్డాయి. మొదటి రైల్వే ఇంజన్ ఎఫ్ 734, 1895లో రాజస్థాన్‌లో రాజ్‌పుటానా మాల్వా రైల్వేకు చెందిన 'అజ్మీర్' వర్క్‌షాప్‌లో నిర్మాణమయింది. అప్పటికి స్వతంత్ర రాజ్యాలుగా ఉన్న ప్రాంతాలలో ప్రధానంగా అస్సాం, రాజస్థాన్, ఆంధ్ర ప్రాంతాలలో తమ స్వంత రైల్వేలను ఏర్పాటు చేసుకొన్నారు. వైస్రాయి లార్డ్ కర్జన్ నియంత్రణలో ఉన్న పరిశ్రమకు 1901లో రైల్వే బోర్డ్ ఏర్పాటు చేశారు.

1947లో దేశ విభజన జరిగినపుడు 40 శాతం రైల్వేలు పాకిస్తాన్‌కు వెళ్లిపోయాయి. 32 స్వతంత్ర రాజ్యాల రైల్వే లైన్లతో పాటు, విడివిడిగా ఉన్న రైల్వే లైన్లన్నింటినీ కలిపి మొత్తం 55,000 కిలోమీటర్ల లైన్లతో భారతీయ రైల్వే ఏర్పడింది. 1952లో దీన్నే 6 జోన్లుగా విభజించారు.

**రైల్వే కార్మికుల పోరాటాలు**

పనిగంటల తగ్గింపు కొరకు ప్రపంచమంతటా పోరాటాలు జరుగుతున్న కాలం. కేవలం ఎనిమిది గంటల పనికోసం మాత్రం మొట్టమొదటిసారిగా మన దేశంలో ఆందోళన జరిగినట్లు తెలుస్తోంది. 1862లో 1100 మంది రైల్వే కార్మికులు హౌరాలో ఎనిమిది గంటల పని కోసం సమ్మె చేశారు. ఆ సమ్మెకు ఆనాటి బెంగాలీ వార్తాపత్రిక 'సోంప్రకాష్' మద్దతు తెలిపినట్లుగా బెంగాలీ రచయిత గోపాల్‌ఘోష్ తన 'భారతీ మే దివాస్' అన్న గ్రంథంలో తెలిపారు. దీనిని బట్టి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల రైల్వే ప్రారంభించబడిన కొద్ది సంవత్సరాలలోనే మన భారతీయ రైల్వే కార్మికులు గొప్ప చైతన్యపూరిత పోరాటాలకు నాంది పలికారని గ్రహించవచ్చు. మరికొన్ని ముఖ్యమైన పోరాటాల గురించి తెలుసుకొందాం.

రిట్రెచ్‌మెంట్‌కు వ్యతిరేకంగా 1927లో బెంగాల్ నాగ్‌పూర్ రైల్వేలో పోరాటం జరిగింది. ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వ గూఢచారి విభాగం అధికారి డేవిడ్ పెట్రే 'ఫిబ్రవరి 11న సమ్మె ప్రారంభమై ఇతర శాఖలకు విస్తరించింది. సమ్మెలో 26,000 మంది కార్మికులు పాల్గొన్నారు. ఇద్దరు యూరోపియన్ అధికారులు హద్దు మీరి ప్రవర్తించడం, ఉద్యోగ భద్రత లేకపోవడం, తక్కువ జీతాలు, సూపర్‌వైజరీ ఉద్యోగుల జులుం, ప్రధాన సమస్యలని కార్మికులు ఆరోపిస్తున్నారు. సమ్మెకు పురిగొల్పిన 'బి.ఎన్. రైల్వే ఇండియన్ లేబర్ యూనియన్' ఖరగ్‌పూర్ శాఖ నాయకుడు వి.ఆర్. నాయుడ్ని బదిలీ చేయడం ఈ సమ్మెకు తక్షణ కారణం' అంటూ తన రిపోర్ట్‌లో తెలియచేశాడంటే ఆనాటి కార్మికుల పోరాటం చైతన్యం ఏ స్థాయిలో ఉందో అర్థం అవుతుంది. కార్మికుల్ని పోలీసులు కొరడాలు, లాఠీలు, రైఫిల్ మడమలతో కొట్టడమే కాకుండా బాయ్‌నెట్స్‌తో పొడిచారు. ఇష్టమొచ్చినట్లుగా కాల్పులు జరపడంతో అనేక మంది గాయపడ్డారు. ఈ సమ్మెకు ఆనాడు ప్రజల మద్దతు కూడా లభించింది. సమ్మె చేస్తున్న కార్మికుల్ని ఆదుకోవాలని అంతర్జాతీయ కార్మికవర్గాన్ని ఆనాటి ఎ.ఐ.టి.యు.సి. కోరింది.

బెంగాల్‌లో ఈస్టిండియా రైల్వే కార్మికులు 'లీలువా'లో 20 మార్చ్ 1928న ఆరుగురు కార్మికుల్ని డిస్మిస్ చేసినందున, పనిస్థలంలోనే పని నిలుపుదల చేయడంతో అధికారులు నలుగుర్ని తిరిగి పనిలోకి తీసుకొన్నారు. కానీ, అందర్నీ తీసుకోవాలని వర్క్‌షాప్‌లోనే ఉండి కార్మికులు సమ్మె ప్రారంభించారు. దాంతో యాజమాన్యం లాకౌట్‌ను ప్రకటించింది. సమ్మె హౌరా జనరల్ స్టోర్స్‌కు, హౌరా బ్లాకు స్మిగలింగ్ షాప్‌కు, క్యారేజీ డిపార్ట్‌మెంట్‌కు, బామన్ గోచివర్క్ షాప్‌కు, హౌరాతో పాటు, ఆసన్‌సోల్, జమాల్‌పూర్ ప్రాంతాలకు కూడా విస్తరించింది. మార్చ్ 28న కార్మికులు పదివేల మందితో బ్రహ్మాండమైన ప్రదర్శన జరిపారు. ఈ ఉద్యమంపై పోలీసులు జరిపిన కాల్పుల్లో ఇద్దరు కార్మికులు చనిపోయారు.

మూడు వేల మంది కార్మికుల్ని రిట్రెంచ్ చేస్తూ, రైల్వే వర్క్‌షాప్‌ను తరలించబోవడంతో దక్షిణ భారత రైల్వే కార్మికులు 20 జూలై 1928న సమ్మె చేశారు. ప్రముఖ యూనియన్ నాయకులు బి. శివరావు, సింగారవేలు చెట్టియార్ తదితరులు ఈ సమ్మెకు నాయకత్వం వహించి అరెస్టుకాబడ్డారు. పది రోజులపాటు ఈ సమ్మె జరిగింది.

అప్పటికే దేశంలో కమ్యూనిస్ట్ పార్టీ ఆధ్వర్యంలో ఉధృతంగా పోరాటాలు జరుగుతున్నాయి. వాటిని అణచివేయడానికి బ్రిటిష్ ప్రభుత్వం 28 సెప్టెంబర్ 1928న 'ప్రజారక్షణ బిల్లు'ను ప్రవేశపెట్టింది. మార్చ్ 1929లో దీనిపై స్పెషల్ ఆర్డినెన్స్ ప్రకటించింది. అలాగే 'పారిశ్రామిక వివాదాల బిల్లు'ను కూడా ప్రవేశపెట్టింది. ప్రజా వ్యతిరేకమైన ఈ రెండు చట్టాలకు వ్యతిరేకంగానే 8 ఏప్రిల్ 1929న భగత్‌సింగ్, బటుకేశ్వర్ దత్‌లు సెంట్రల్ అసెంబ్లీలో బాంబులు వేసి 'చెవిటివాళ్లు' వినాలనే బాంబులు వేసి తమ నిరసనను తెలియజేస్తున్నామని ప్రకటించారు.

అప్పటికే దేశంలో జాతీయోద్యమంలో భాగంగా ప్రజలు మహోధృతమైన పోరాటాలలో పాల్గొంటున్నారు. అందులో భాగంగా కార్మికరంగంలో పోరాటాలు మరింత పదునెక్కాయి. దాంతో 'కార్మికుల, రైతుల పార్టీలు, యువజన సంఘాలు, యూనియన్లు నిర్మిస్తూ ప్రజల్ని రెచ్చగొట్టి ప్రభుత్వంపై దాడి చేస్తున్నారనే' ఆరోపణతో బ్రిటిష్ ప్రభుత్వం 20 మార్చ్ 1929న 17 మంది కమ్యూనిస్ట్ నాయకుల్ని అరెస్టు చేసింది. ఇందులో అధికభాగం కార్మిక నాయకులే. వారిలో ఎస్.ఎ. డాంగే, జి. అధికారి, పి.సి. జోషి, ఎస్.వి. ఘాటే, ముజఫర్ అహ్మద్ లాంటి ప్రముఖ నాయకులతో పాటు, కె.ఎన్. జోగ్లేకర్, జి.ఐ.పి. రైల్వే కార్మిక

సంఘ్ కార్యదర్శి, ఎస్.ఎచ్. జాబ్‌వాలా, అఖిల భారత రైల్వే మెన్స్ ఫెడరేషన్ ఆర్గనైజింగ్ కార్యదర్శులు కూడా ఉన్నారు. అంతర్జాతీయ కార్మిక చైతన్యానికి నిదర్శనంగా బి.ఎఫ్. బ్రాడ్లీ, ఫిలిప్ స్ప్రాట్, ఎచ్.ఎన్. హచ్చిన్సన్ లాంటి బ్రిటిష్ కార్మిక నాయకులు కూడా ఉన్నారు. ఈ కేసు విచారణ మీరట్‌లో జరగడం వలన 'మీరట్ కుట్రకేసు'గా ప్రసిద్ధి గాంచింది.

1957లో ఇండియన్ లేబర్ కాన్ఫరెన్స్ (ఐఎల్‌సి) 15వ సమావేశం జరిగింది. దానిలో కనీస వేతనం అవసరాల ప్రాతిపదిక మీద ఉండాలని, వేజ్ బోర్డులు నియమించాలని, కార్మిక, యాజమాన్యాల చర్చలలో మధ్యవర్తులను ఏర్పాటు చేయాలని, కనీస వేతనాల్ని లెక్కించడానికి కార్మికునిపై ఆధారపడే కనీసం ముగ్గురు కుటుంబ సభ్యులపై ఆధారపడాలని కొన్ని నిర్ణయాలు తీసుకొంది.

పై సూచనలేవీ పాటించకుండానే రెండవ సెంట్రల్ పే కమిషన్ సమర్పించిన రిపోర్ట్‌పై ప్రభుత్వం డిసెంబర్ 1959లో తీసుకొన్న నిర్ణయాలు కార్మిక వర్గాలలో తీవ్ర ఉద్రిక్త పరిస్థితిని సృష్టించాయి. దేశ వ్యాప్త నిరసనలు పెల్లుబికాయి. వీటి పర్యవసానమే 1960 ఏప్రిల్ 2,3 తేదీలలో బొంబాయిలో అన్ని కేంద్ర ప్రభుత్వ సంస్థల ఉద్యోగులతో పాటు రైల్వే ఫెడరేషన్లు కూడా పాల్గొని, 'జాయింట్ ఆక్షన్ కమిటీ' ఏర్పడింది. దీనికి కార్యదర్శిగా ఎఐఆర్‌ఎఫ్ ప్రధాన కార్యదర్శి పీటర్ ఆల్వారిస్ ఎన్నుకోబడ్డారు. ప్రభుత్వానికి ఆరు అంశాలతో కూడిన డిమాండ్ల పత్రం సమర్పిస్తూ, పరిష్కారించకపోతే సమ్మె చేస్తామని హెచ్చరించారు. దీనిపై భారత రాష్ట్రపతి 'అత్యవసర సర్వీసుల నిర్వహణ ఆర్డినెన్స్ (1960)' ను జారీ చేస్తూ, ఈ సమ్మె చట్టవిరుద్ధమైనదిగా ప్రకటించారు. ఆనాటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఈ సమ్మెను 'ప్రజల తిరుగుబాటు'గా అభివర్ణిస్తూ ఈ సవాల్‌ను ఎదుర్కోవడానికి తన ప్రభుత్వం దృఢనిశ్చయంతో ఉందని ప్రకటించారు.

11 జూలై 1960న సమ్మె ప్రారంభించక ముందే అరెస్టులు ప్రారంభమయ్యాయి. అయినా సమ్మె దేశవ్యాప్తంగా ప్రారంభమై ప్రజా జీవనం స్తంభించిపోయింది. పోరాటాన్ని అణచడానికి, పోలీసులు, హోమ్ గార్డులతో పాటు సరిహద్దు దళాలు, సైనిక దళాలు సిద్ధం చెయ్యబడ్డాయి. పశ్చిమ రైల్వేలోని 'దోహద్' వర్క్‌షాప్‌లో పోలీసు కాల్పుల వలన ఐదుగురు కార్మికులు చనిపోయారు. ఈ సందర్భంగా ఇరవై వేల మంది కార్మికులు అరెస్టు అయ్యారు. పది వేల మంది సస్పెన్షన్ కాబడ్డారు. పదిహేను వందల మందికి పైగా దోషులుగా నిర్ణయించబడి జైలు శిక్షలు పడ్డాయి. పదిహేను వందల మంది కార్మికుల్ని డిస్మిస్ చేశారు. ఐదు రోజుల పాటు దేశవ్యాప్తంగా జరిగిన ఈ సమ్మె కార్మికుల ఐక్య పోరాట శక్తికి నిదర్శనంగా ప్రతిబింబించింది.

మళ్లీ 19 సెప్టెంబర్ 1968న కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులతో పాటు రైల్వే కార్మికులు ఇరవై ఐదు లక్షల మంది సమ్మె ప్రారంభించారు. ప్రభుత్వం మళ్లీ అత్యవసర సర్వీసుల నిర్వహణా ఆర్డినెన్స్‌తో పాటు, రైల్వే కార్మికులపై నిర్బంధం కొనసాగించడానికి ప్రత్యేకమైన ఆర్డినెన్స్ కూడా విడుదల చేసింది. ఆర్డినెన్స్ ప్రకారం సమ్మెలో పాల్గొన్నవారికి, సహాయ పడిన వారికి, ప్రోత్సహించినవారికి ఆరు నెలల నుండి ఒక సంవత్సరం జైలు శిక్ష గాని, వెయ్యి రూపాయల జరిమానాగాని లేదా రెండింటినీ విధించే అధికారాలు ఏర్పడ్డాయి. ఈ సమ్మె సందర్భంగా జరిగిన పోలీసు కాల్పుల్లో పదిహేను మంది కార్మికులు చనిపోయారు. వందలాది మంది గాయపడ్డారు. సుమారు నలభై ఎనిమిది వేల మంది తాత్కాలిక ఉద్యోగులను తొలగించారు. పదివేల మంది కార్మికుల్ని అరెస్ట్ చేశారు. ఈ సమ్మె తర్వాత ఆల్ ఇండియా రైల్వే మెన్స్ ఫెడరేషన్ (ఎఐఆర్‌ఎఫ్) గుర్తింపును రద్దు చేశారు.

రైల్వే కార్మికులలో అత్యంత మిలిటెంట్‌గా పేరొందిన 'లోకో రన్నింగ్ స్టాఫ్ అసోసియేషన్' ముందుగా నోటీసు ఇచ్చి ఆగస్ట్ 1, 1973న సిక్‌లీవ్ ఉద్యమం ప్రారంభించింది. దేశమంతా రైలు రాక పోకలు స్తంభించాయి. నాలుగు రోజులపాటు జరిగిన చర్చల అనంతరం పది గంటల పనిదినం, సంప్రదింపుల విధానం, సమస్యల్ని పరిష్కరించేందుకు ఒక కమిటీ ఏర్పాటుకు అంగీకరించిన తర్వాతే సమ్మె విరమించారు.

1960, 1968లలో రైల్వే కార్మికుల సంఘటిత శక్తి ప్రభావం చూసిన ప్రభుత్వం దాన్ని ఎలాగైనా దెబ్బతీయాలని నిర్ణయించుకొంది. రైల్వే బోర్డు ద్వారా తమకనుకూలమైన ఐఎన్‌టియుసి కి చెందిన 'నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ రైల్వేస్ (ఎన్ఎఫ్ఐఆర్)తో కలిసి కార్మికుల ఐక్యత విడగొట్టడానికి ప్రణాళికలు వేసారు. దాని ఫలితంగా రైల్వేలలో ఫైర్‌మాన్, డ్రైవర్స్, గార్డ్స్, గుమాస్తాలు, ప్రత్యేకంగా జీతాలిచ్చే గుమాస్తాలు, ఆఖరికి కేవలం దేశవ్యాప్తంగా ఉన్న ఇరవై మంది ఫొటోగ్రాఫర్‌లకు విడివిడిగా యూనియన్‌లు ఏర్పడ్డాయి. మొత్తంమీద దేశవ్యాప్త కార్మికశక్తిని 120 యూనియన్లుగా చీల్చారు.

తర్వాత వీటన్నింటినీ ఐక్యం చెయ్యడంలో కొంత కృషి చేసిన సోషలిస్టు నాయకుడు జార్జి ఫెర్నాండెజ్ ఆధ్వర్యంలో 27 ఫిబ్రవరి 1974లో 'ది నేషనల్ కో ఆర్డినేషన్ కమిటీ' ఫర్ రైల్వే మెన్స్ స్ట్రగుల్ (ఎన్‌సిసిఆర్ఎస్) ఏర్పడి రైల్వే కార్మికుల సమస్యలపై చర్చించడానికి సమావేశం ఏర్పాటు చేశారు. దీనికి ప్రభుత్వ అనుకూల ఎన్ఎఫ్ఐఆర్ హాజరు కాలేదు.

ప్రభుత్వ రంగ సంస్థలతో సమానంగా జీతాలు, బోనస్ చెల్లింపు పని గంటల సవరణ, ఉద్యోగ క్రమబద్ధీకరణ లాంటి ముఖ్యమైన డిమాండ్లను ప్రభుత్వానికి సమర్పించి, పరిష్కారించకపోతే మే 8 నుండి సమ్మె చేయాలన్న నిర్ణయం చేసుకున్నారు. తప్పని పరిస్థితుల్లో ప్రభుత్వం చర్చలకు పిలిచింది. 'జాయింట్ యాక్షన్ కమిటీ' తరఫున పన్నెండు మంది ప్రతినిధులు పాల్గొన్నారు. వారిలో కమ్యూనిస్ట్ పార్టీ నాయకుడు ఎస్.ఎ. డాంగే కూడా ఉన్నారు. డిమాండ్లను సమర్పించడంలో ఎటువంటి పాత్ర లేకపోయినా, రైల్వేబోర్డ్ ఆహ్వానం మేరకు ఎన్ఎఫ్ఐఆర్ ప్రతినిధులు కూడా పన్నెండు మంది పాల్గొన్నారు. చర్చలు ఏప్రిల్ 24 ప్రారంభమై 30 వరకూ కొనసాగాయి. సమ్మెను నివారించడానికి తీవ్రమైన చర్చలు జరిగిన తర్వాత చివరకు ఎనభై కోట్ల రూపాయల ఖర్చు అయ్యే ఒప్పందాలు జరిగాయి. మే 1న, ఫెర్నాండేజ్ రైల్వే కార్మికుల మేడేలో పాల్గొనడానికి ఢిల్లీ నుండి లక్నోకు వెళ్లారు. అంతవరకు చర్చల నాటకం ఆడిన ప్రభుత్వం, తన అసలు ఫాసిస్ట్ స్వభావాన్ని బయట పెట్టింది. అర్ధరాత్రి 2.30 గంటలకు ఢిల్లీ పోలీసులు ఫెర్నాండెజ్‌ను లక్నోలో అరెస్టు చేశారు. ఆ రోజు లక్నో రైల్వే ప్లాట్‌ఫారంపై రెండు వేల మంది పోలీసులు తుపాకులతో పహారా కాసారు. తర్వాత 'మీసా' కింద 'డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్' (డిఐఆర్) కింద నాయకులందర్నీ అరెస్టు చేశారు. మొత్తం మీద యాభై వేల మంది కార్మికుల్ని అరెస్ట్ చేశారు. రైల్వే కాలనీలో భయోత్పాతం సృష్టించి, ఇళ్లపై దాడులు చేశారు. ఆడవారిని కొట్టి, మగవారిని చిత్రహింసలకు గురిచేశారు. కాలనీల

నుండి ఒక్కరినీ కూడా బయటకు కదలనీయలేదు. ఒక లక్ష మంది కార్మికులను ఉద్యోగాల నుండి తొలగించారు. వారిలో యాభై వేల మంది టెంపరరీ, కాజువల్ కార్మికులు. ముప్పై వేల మందిని సస్పెండ్ చేశారు. దీనిపై దేశమంతటా బ్రహ్మాండమైన నిరసనలు పెల్లుబికాయి. బొంబాయిలో వెంటనే జనరల్ సమ్మె జరిపారు. నలభై ఎనిమిది గంటల పాటు బొంబాయి పూర్తిగా స్తంభించిపోయింది. ఇరవై లక్షల మంది రైల్వే కార్మికులు చేసిన ఈ మహోన్నతమైన ఐక్య పోరాటం భారత కార్మికోద్యమంలో ఒక నూతన చరిత్రను సృష్టించింది.

ఇంతటి మహోన్నత రైల్వే కార్మికుల పోరాటాలపై ప్రభుత్వానిది పైచేయి కావడానికి, ప్రధాన భాగం కార్మికులు ఇంకా ప్రభుత్వ అనుకూల ఎన్ఎఫ్ఐఆర్ ఫెడరేషన్‌లో ఉండడం ఒక ప్రధాన కారణం. ప్రభుత్వం ఇంత దుర్మార్గంగా రైల్వేలను ప్రైవేటీకరణ భూతానికి పూర్తిగా బలి ఇస్తానని ప్రకటించినా, దాని గురించి ఒక్క మాట కూడా లేకుండా 'పెంచిన చార్జీలను తగ్గిస్తే తాము ఆందోళనకు దిగక తప్పదని, రైల్వేలను రక్షించడానికి చార్జీలు పెంచిన త్రివేదీకి రైల్వే కార్మికలోకం అండగా నిలుస్తుందని, రైల్వేలలో ప్రైవేటు పెట్టుబడికి మా అభ్యంతరం లేదని' ఎన్ఎఫ్ఐఆర్ ప్రధాన కార్యదర్శి మర్రి రాఘవయ్య పత్రికల్లో ప్రకటించడం చాలా సిగ్గు చేటైన పని. ప్రజల పట్ల ఏ మాత్రం బాధ్యత వహించకుండా ప్రభుత్వానికిస్తున్న మద్దతు ఎంత ప్రమాదస్థాయిలో ఉందో అర్థం అవుతుంది.

రైల్వే బడ్జెట్‌లో ప్రతిపాదించిన ప్రైవేటీకరణ విధానాలపై 'ఇతర దేశాలలో ప్రైవేటీకరణ అనుభవాలు, ప్రత్యేకంగా బ్రిటన్ అనుభవాలు పరిశీలిస్తే అవి అంత ఆశాజనకంగా లేవు' అని ఇండియన్ రైల్వేస్ ఫైనాన్స్ కార్పొరేషన్ మానేజింగ్ డైరెక్టర్ ఎస్.ఎన్. మాథుర్ చెప్పడం చెవిటి వాడి ముందు శంఖం ఊదినట్లే.

**బ్రిటన్‌లో ప్రైవేట్ రైల్వేల అనుభవాలు**

బ్రిటన్‌లో 1995లో రైల్వేలను ప్రైవేటీకరణ చేశారు. అనేక ప్రైవేట్ కంపెనీల ఆధ్వర్యంలో రైళ్లు నడవడం ప్రారంభించాయి. ప్రమాదాలు జరిగినపుడు, బాధ్యులెవరనే అంశంపై పెద్ద తగాదాలు జరిగాయి. ఎందుకంటే మెయింటెనెన్స్ కాంట్రాక్ట్ ఒకరికి, రైల్వే సిగ్నలింగ్ వ్యవస్థ మరొకరికి, అలా వివిధ విభాగాలు వేరు వేరు కాంట్రాక్టుల్లో ఉండడం వలన, తప్పు నీదంటే కాదు నీది అని వాదించుకొని ప్రయాణికుల్ని పట్టించుకోని పరిస్థితులు చాలా సార్లు ఏర్పడ్డాయి.

23 ఫిబ్రవరి 2007న లండన్ నుండి గ్లాస్గోకు స్పీడ్‌గా వెళుతున్న రైలు సరైన మెయింటెనెన్స్ లేని పాయింట్లను గుద్దుకొని ప్రమాదానికి గురై 84 ఏళ్ల మార్గరెట్ మేస్సన్ చనిపోయింది. 86 మంది గాయపడ్డారు. అందులో 28 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఈ రైల్వేను 'నెట్‌వర్క్ రైల్' (ఎన్.ఆర్.) అనే ప్రైవేట్ రైల్వే సంస్థ నడుపుతుంది. 'అంతకు ముందు ఐదు రోజుల క్రితం ట్రాక్ సూపర్‌వైజర్ 'డేవిడ్ లూయిస్' ట్రాక్ ఇన్స్పెక్షన్ మరిచిపోయాడని కంపెనీ కోర్టులో తెలిపింది. నిజానికి లూయిస్ తన యజమాన్యానికి ట్రాక్ వ్యవస్థ సరిగ్గా లేదని 'ఈమెయిల్స్' ద్వారా అనేకసార్లు తెలిపాడు. అయినా కంపెనీ పట్టించుకోకుండా కోర్టులో నెపం అతని మీద తోసేసింది. ఎట్టి పరిస్థితులోనూ మధ్యలో రైళ్లు ఆగకుండా వేగంగా వెళ్లిపోయేందుకు వీలుగా ట్రాక్ బాగు చేసే పనిని కంపెనీ తమను సరిగ్గా చెయ్యనివ్వదని, పైగా మెయింటెనెన్స్ కాంట్రాక్టు వేరొకరిది కాబట్టి వారి ఒత్తిడితో తక్కువ మంది స్టాఫ్‌తో ఎక్కువ పని చేయించడం వలన తమ పనిలో నాణ్యత ఉండదని అక్కడ పనిచేసే కార్మికులు వాపోయారు. ప్రైవేట్ కంపెనీలు లాభాలే చూసుకొంటాయి గానీ ప్రజల ప్రాణాలకు బాధ్యత వహించవు అన్న నిజానికి ఇది నిదర్శనం.

ఇవన్నీ పర్యవేక్షించాల్సిన ప్రభుత్వ 'రైల్వే రెగ్యులేషన్' సంస్థ కంపెనీలకు కావాల్సిన లాభాలకు, ఏర్పడుతున్న భద్రతా సమస్యల మధ్య ఉన్న వైరుధ్యాల్ని పరిష్కరించాల్సింది పోయి, ప్రైవేట్ సంస్థలకే వత్తాసు పలుకుతుంది. ఇదంతా ప్రైవేటీకరణ మహత్యమే అంటున్నారు యూనియన్ నాయకుడు బాబ్‌కౌ.

2002లో 'పోట్టర్స్ బార్'లో జరిగిన రైలు ప్రమాదంలో ఏడుగురు చనిపోయారు. 2005లో ఎస్సెక్స్‌లో జరిగిన రైలు ప్రమాదంలో ఇద్దరు స్కూలు అమ్మాయిలు చనిపోయారు. దీనిలో మొదటి దానికి కోర్టు మూడు మిలియన్ పౌండ్ల జరిమానా విధించింది. రెండవ దానికి ఒక మిలియన్ పౌండ్ల జరిమానా విధించింది. ఈ రెండు ప్రమాదాలలో కూడా పాయింట్ల మెయింటెనెన్స్ సరిగ్గా లేకపోవడం వల్లనే జరిగాయి. అంటే లక్షల పౌండ్ల జరిమానా విధించినా ప్రైవేట్ కంపెనీల నిర్లక్ష్యం కొనసాగుతూనే ఉందని స్పష్టం అవుతోంది. పైగా జరిమానా కంపెనీలకు వేసినా ఆ సొమ్మును కంపెనీలు ప్రజల నుండి వసూలు చేస్తాయన్న సంగతి అందరికీ తెలుసు.

2007 ప్రమాదం కేసును విచారించిన జడ్జి 'మిసెస్ స్విఫ్ట్' '2002లో ప్రమాదం జరిగినపుడు, దానికి కారణమైన వ్యవస్థను మెరుగుపర్చాలని నిర్ణయం తీసుకొన్నారు. అవి 2005లో గాని, 2007లో గాని అమలు జరగలేదు. ఇది వ్యక్తుల నిర్లక్ష్యం కాదు. తీవ్రమైన వ్యవస్థాపరమైన లోపం' అంటూ కంపెనీకి నాలుగు మిలియన్ పౌండ్ల జరిమానా విధించారు. జవాబుదారీతనం లేని ప్రైవేటీకరణ, అభివృద్ధి చెందిన దేశాల్లోనే అలా ఉంటే, ఇక నిండా అవినీతిలో మునిగిపోయి ఉన్న మన లాంటి దేశాలలో ఎంత ప్రమాదకరమైన పరిస్థితులకు దారి తీస్తుందో వేరే చెప్పనక్కరలేదు.

రైల్వేలు ప్రజల ఆస్తి. కోట్లాది ప్రజల అవసరాల్ని తీర్చే వ్యవస్థ. దాన్ని ప్రైవేటీకరణ చేసే హక్కు సామ్రాజ్యవాదులకు దాసోహం చేసే మన పాలకులకు లేదు. ఎన్నో గొప్ప పోరాటాలు చేసి భారత కార్మిక వర్గానికి ఆదర్శంగా నిలిచిన రైల్వే కార్మికులు ఈ ప్రైవేటీకరణ భూతాన్ని ఎదుర్కోవాలి.

ఈ సందర్భంలో 'ఇంగ్లండ్‌లో కార్మికవర్గ స్థితిగతులు' అన్న గ్రంథంలో 'మనుషులుగా మేము ప్రస్తుత సామాజిక పరిస్థితులకే లొంగి జీవించడం కాదు, ఈ సామాజిక పరిస్థితులే మేము మనుషులుగా బతకడానికి వీలుగా మారాలి' అని కార్మికులు ఆశిస్తారు. వారు ఏ నిరసనా లేకుండా నిశ్శబ్దంగా ఉండిపోతే, 'యజమానులు తమ మంచి కాలంలో కార్మికులను దోచుకోవడానికీ, సంక్షోభం రోజుల్లో వారిని ఆకలితో మాడమని వదిలేయడానికీ, యజమానుల వర్గానికి హక్కు ఉందని కార్మికులు అంగీకరించినట్లే అవుతుంది. కార్మికులు జంతువులుగా కాక మనుషులుగా జీవించాలనే ఆశను పూర్తిగా కోల్పోనంత వరకు యజమానుల విధానాలకు వ్యతిరేకంగా తిరగబడుతూనే ఉండాలి' అన్న ఎంగెల్స్ మాటలు గుర్తు చేసుకొందాం.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)*

# మన దేశ విదేశీ రుణం

***విదేశాల నుండి తీసుకుంటున్న రుణాలను ప్రజల అవసరాలకు వినియోగించకుండా తమ ఆస్తులు పెంచుకోవడానికీ, వడ్డీలు చెల్లించడానికీ పాలకులు వినియోగిస్తున్నారని అంటున్నారు* వి. హనుమంతరావు**

రుణ బాధ రణ బాధ అన్నారు. దేశాన్ని పాలకులు అప్పుల్లో ముంచెత్తుతున్నారు. రైతాంగం అప్పుల్లో కూరుకుపోయి ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. బ్యాంకులు గృహనిర్మాణానికి, మోటారు సైకిళ్లు, కార్లు కొనుక్కోడానికి అప్పులిస్తున్నాయి. ఆ మధ్య పట్టణాలు నగరాల్లో చిన్న చిన్న టెంట్లు వేసి (వ్యాపారస్తులు అలాంటి టెంట్లు వేసి సరుకులు అమ్మకానికి పెట్టినట్లు) మరీ రుణాలిచ్చారు. ఇలా రుణాలివ్వడానికి ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చిందంటే అది కొనుక్కునే వారి మీద దయ తలచి కాదు. అలా వ్యాపారాన్ని పెంచి వ్యాపారస్తులు, ఆ సరుకులు తయారు చేసే పారిశ్రామికవేత్తలకు లాభాలు సంపాదించి పెట్టడానికే. బ్యాంకులు ఏయే వర్గాలకు అప్పులెంతెంత ఇచ్చాయో ప్రతీ సంవత్సరం విడుదల చేసే గణాంకాలను పరిశీలిస్తే నూటికి 70 శాతం మందిగా ఉండే రైతులకు, గ్రామీణులకు ఎంత రుణం ఇచ్చాయో అంతకన్నా ఎన్నో రెట్లు అధికంగా వ్యక్తులు వినిమయ విలాస వస్తువులు కొనుక్కోవడానికి, హోటళ్లు నిర్మించడానికి ఇచ్చినట్లు తేలింది. రుణాలివ్వడం కూడా మార్కెటీకరణ అయిపోయింది. అంతా ప్రపంచ బ్యాంక్ చలవే.

పాఠకులకు గుర్తుండే ఉంటుంది. 1991లో దేశం మునిగితేలుతూ విదేశీ మారకం నిల్వలు కేవలం పదిహేను రోజులకే మనవద్ద ఉండి చేసిన అప్పులు తీర్చలేకపోయే పరిస్థితి ఏర్పడినపుడు ప్రస్తుత ప్రధాని, అప్పటి ఆర్థిక మంత్రి మన్మోహన్ సింగ్ సలహా మేరకు ప్రపంచ బ్యాంక్ షరతులతో కూడిన రుణాన్నిచ్చిన నాటి నుంచి 'అభివృద్ధి' ముసుగులో రుణాలు చేయడమే ప్రభుత్వానికి దిక్కయింది. వాస్తవానికి అంతకుముందే చంద్రశేఖర్ ప్రధానిగా ఉన్నప్పుడు మన వద్దనున్న బంగారం లండన్‌లో కుదువపెట్టి రుణం తెచ్చుకోవాల్సి వచ్చింది. ఇంకా కొంచెం వెనక్కు పోతే రెండవసారి పరిపాలనా పగ్గాలు చేపట్టిన ఇందిరాగాంధీ ఐ.ఎం.ఎఫ్. నుంచి రుణం తెచ్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడితే తెచ్చుకొని, అవసరం మేరకే వినియోగించుకొని, మిగతాది మాకు రుణం అక్కర్లేదని, తన కోర్కెను ఉపసంహరించుకుంది.

ఇంతెందుకు, అమెరికాలో వారి రాజ్యాంగం ప్రకారం ప్రజా ప్రతినిధుల సభ ప్రభుత్వం ఇంతకు మించి అప్పు చేయకూడదని ఉండగా, ఒబామా ఆ హద్దును దాటే పరిస్థితి ఏర్పడి, విధి లేక రిపబ్లికన్ల (ప్రతిపక్షం) కాళ్లా వేళ్లా పడి, ఆ హద్దును మించి అప్పు చేయడానికి అనుమతిని తెచ్చుకొన్నారు. చైనా కొన్ని ట్రిలియన్ల డాలర్ల రుణాన్ని అమెరికాకు ఇచ్చింది. అప్పు తెచ్చుకోవడానికి చిన్నా పెద్దా తేడా లేదు. కొమ్ములు తిరిగిన పారిశ్రామికవేత్తలు కూడా బ్యాంకుల ముందు క్యూ కట్టి అప్పు తెచ్చుకొని పరిశ్రమలు స్థాపిస్తారు. వర్కింగ్ కాపిటల్ కోసం బ్యాంకుల నుంచి అప్పు తెచ్చుకొంటారు. బ్యాంకులు ఇలా అప్పులివ్వడానికి వాళ్ల పెరట్లో డబ్బుల చెట్లు ఏమీ లేవు. మీరూ, నేనూ, మనమందరమూ బ్యాంకుల్లో దాచుకొన్న డబ్బునే వారు పెట్టుబడిగా పెట్టి, పారిశ్రామిక వేత్తలకు, బడా వ్యాపారస్తులకు ఎక్కువ వడ్డీకి ఇచ్చి, ఆ హెచ్చు వడ్డీలో కొంత భాగం మనకు వడ్డీగా ఇచ్చి, మిగతాది బ్యాంకు నిర్వహణ ఖర్చుకు, బ్యాంకు పెట్టుబడులు పెంచుకోవడానికి, లాభాలకు వినియోగిస్తారు.

దేశం ఎంత లోతున అప్పులో కూరుకపోయిందో చెప్పే ముందు, అప్పు చేయకుండా ఉండలేమా, అప్పు అంత అవసరమా అనే ప్రశ్నకు జవాబేమిటో తెలుసుకోవాలి. రైతాంగం బ్యాంకుల్లో అప్పు దొరక్క ప్రైవేట్‌గా వడ్డీ వ్యాపారస్తుల వద్ద హెచ్చు వడ్డీకి రుణం తీసుకొని చెల్లించలేక, ఆత్మహత్యలు చేసుకోవడం గురించి చంద్రబాబు పాలన కాలం నుంచి వింటూనే ఉన్నాం కాబట్టి వారు రుణం ఎందుకు తీసుకుంటారో ప్రతిరోజూ పత్రికల్లో చదువుతున్నాం కాబట్టి, పై ప్రశ్నకు వేరే జవాబు చెప్పనక్కర్లేదు. వ్యక్తులుగా మధ్యతరగతి గృహస్తులు ఇంట్లో ఏదో శుభకార్యం తలపెట్టినపుడు అప్పు చేయక తప్పదు. ఇంటి ఖర్చును తగ్గించుకొని, లేదా నీతి నియమాలు లేని వాళ్లు బల్లకింద చేయిపెట్టి సంపాదించి అప్పు తీరుస్తారు. కాని ఆ క్రమంలో అవినీతికి బానిసలై పోతారు. వ్యాపారాలు చేసేవారు చిన్నగా ప్రారంభించి, చిల్లర వ్యాపారం పెంచి (చిల్లర శ్రీ మహాలక్ష్మి అంటారు) లాభాలు సంపాదించి వ్యాపారాన్ని పెంచుకొంటారు. అలా వ్యాపారాన్ని పెంచడానికి తన వద్దనున్న నిధులు చాలక బ్యాంకు నుంచో, బంధువుల నుంచో అప్పు తెచ్చుకొని, మరిన్ని లాభాలు సంపాదించి అప్పులు తీరుస్తుంటారు.

అమెరికా లాంటి దేశమే అప్పులు చేస్తుంటే, వర్ధమాన దశలో ఉన్న మన దేశం అప్పులు చేయడంలో ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. వర్ధమాన దేశమైన ఏ దేశమైనా అవసరాలు ఎక్కువ ఉంటాయి. నిధుల కొరత ఉంటూనే ఉంటుంది. ఇందుకోసం ఇటు దేశంలో, అటు విదేశాల్లో కూడా అప్పులు చేయాల్సే ఉంటుంది. అయితే తెచ్చిన అప్పు ప్రభుత్వ ఆస్తుల సృష్టికి (అంటే ప్రాజెక్టులు, రైల్వేలు వగైరా) వినియోగించి ఆ సౌకర్యాలు వినియోగించే వారి వద్ద నుంచి పన్నుల వసూళ్ల ద్వారా, ప్రభుత్వ పరిశ్రమలైతే, వాటి నుంచి లాభాలను చేసిన అప్పు తీర్చాలనేది ఆర్థిక సూత్రం. అప్పిచ్చిన విదేశీ ప్రభుత్వం లేదా ఆర్థిక సంస్థలు తమ తమ దేశాల్లో వడ్డీరేట్లు ఒకటి లేక రెండు శాతం వడ్డీ మాత్రమే లభిస్తుంది కాబట్టి, మన దేశం లాంటి వర్ధమాన దేశాల్లో దేశాభివృద్ధి కోసం నిధుల అవసరం చాలా ఎక్కువగా ఉంటుంది కాబట్టి, రుణాలివ్వడానికి, ఆ విధంగా అధిక వడ్డీ లభిస్తుంది. కాబట్టి, వారి నిధులను ఐఎంఎఫ్, ప్రపంచబ్యాంక్, ఆసియన్ డెవలప్‌మెంట్ బ్యాంక్ లాంటి సంస్థలకు పెట్టుబడిగా ఇచ్చి ఎక్కువ వడ్డీ గుంజుకొంటారు. ఈ విదేశీ అప్పుల గురించిన మరో విశేషమేమంటే, వారికి అసలు కన్నా వడ్డీ అంటే ఎక్కువ మోజు. ఆయా వర్ధమాన దేశాలు ఏదైనా సంక్షోభంలో చిక్కుకొన్నప్పుడు తప్ప, తమ అసలు రుణాలు తిరిగి వసూలు చేయడం

గురించి ఆతృత చూపరు. కాని వడ్డీ మాత్రం అణా పైసలతో నిర్ణీత సమయంలో వసూలు చేయడంలో చాలా నిక్కచ్చిగా ఉంటారు. వసూళ్ల డబ్బే వ్యాపార సరుకు. ఆ సరుకు అమ్మకం వసూళ్ల వ్యవహారమంతా చూసేది ప్రపంచ బ్యాంక్. 'మనకు డబ్బు అవసరం, అభివృద్ధి కార్యక్రమాలకు నిధుల కొరత ఉంది. ఆ కొరత తీరాలంటే అప్పు చేయడం తప్ప వేరే మార్గం లేద'ంటుంది మన ప్రభుత్వం. అప్పు చేయడం తప్పు కాదు కానీ ఆ రుణం వడ్డీతో సహా చెల్లించే తాహతు ఉండాలి. రుణంగా తెచ్చిన సొమ్ముతో చేసే పనుల నుంచి వచ్చే ఆదాయాన్ని తిరిగి చెల్లించే ఏర్పాటు చేసుకోవాలి. లేకపోతే అప్పు వడ్డీతో కలిపి పాపం పెరిగినట్లు పెరిగిపోతుంది. మన దేశంలో ఇప్పుడు అదే జరుగుతోంది.

2011 డిసెంబర్ నాటికి మన దేశం చెల్లించాల్సిన విదేశీ రుణం 334,947 మిలియన్ డాలర్లు. గత సంవత్సరం ఇదే నెలలో అది 243,171 మిలియన్ డాలర్లు. అంటే ఒకే ఒక సంవత్సరంలో సుమారు 90 వేల మిలియన్ డాలర్లు. మన రాష్ట్రం కూడా ఏమీ తక్కువ తినలేదు. తెలుగుదేశం హయాం నాటికి మన విదేశీ రుణం రు. 58137 కోట్లు కాగా, 2003 నుంచి 2010-11 వరకు వై.ఎస్., రోశయ్య, ప్రస్తుతం కిరణ్ పాలనలో రు. 95,609 కోట్లు రుణం తెచ్చింది. చంద్రబాబు గద్దె దిగిన నాటికి ఉన్న రుణంలో, అంతకుముందు కాంగ్రెస్, తెలుగుదేశం పాలనల్లో చేసిన రుణాలు కలిసి ఉన్నాయి. ఆ లెక్కన చూస్తే చంద్రబాబు కన్నా ఆ తరువాత కాంగ్రెస్ పాలన హయాంలోనే విదేశీ రుణాలు ఎక్కువగా ఉన్నాయి.

అప్పు తెచ్చి ఆస్తులు సృష్టించుకోవాలని పైన చెప్పుకున్నాం. అలాంటి ఆస్తుల సృష్టి ఏమైనా జరిగిందా, ఉద్యోగాల సృష్టి జరిగిందా, పేదరికం తగ్గిందా, ప్రజలు సంతృప్తిగా జీవిస్తున్నారా అని ప్రశ్నలు వేసుకొంటే వచ్చే జవాబులేమిటో మనందరికీ తెలుసు. ఆస్తుల సృష్టి ఏ పాటి జరిగిందో మన నీటిపారుదల ప్రాజెక్టుల వైపు చూస్తే తెలిసిపోతుంది. కాగ్ నివేదికలు ప్రభుత్వాన్ని ఎడాపెడా వాయించేస్తున్నాయి. ప్రపంచ బ్యాంక్ రుణం ఇస్తేనే గాని మన నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణం చేపట్టలేకపోవడం మాట అటుంచి కనీసం వాటి పూడికలు తీయ్యలేక వాటి రిపేర్లు చేయించలేం, భవనాలు నిర్మించలేం, హాస్పిటల్లు ఏర్పాటు చేయలేం, రహదారులు నిర్మించలేం, వంతెనలు కట్టలేం, నగరాల్లో బస్సులు నడపలేం, ఆఖరుకు ప్రజలకు తాగడానికి మంచినీళ్లు కూడా ఇవ్వలేం. ఈ ప్రభుత్వం ఉంటేనేం, ఊడితేనేం?

ఇప్పుడు దేశం విదేశీ రుణం గురించి తెలుసుకొందాం. పతాక శీర్షికలో చెప్పినట్లు మన దేశ విదేశీ రుణ భారం 334,947 మిలియన్ డాలర్లు. ప్రతి సంవత్సరం అసలు కొంత, వడ్డీ మొత్తం చెల్లిస్తూ రావాలి. విదేశాల నుంచే కాక దేశంలో కూడా అప్పులు చేస్తుంది. విదేశాల నుంచి, దేశంలోనూ చేస్తున్న రుణాలు ఎలా పెరుగుతున్నాయో పట్టిలో చూడండి.

కేవలం ఆరు సంవత్సరాల్లో మొత్తం రుణం రెట్టింపయింది. నికర రుణం కూడా అంతే మోతాదులో పెరిగింది. ఈ రుణాల్లో రకాలున్నాయి. విదేశీ రుణం, స్వదేశీ రుణం, కార్పొరేట్ సంస్థలు దేశంలో, విదేశాల్లో చేసే రుణం, అనేక సంవత్సరాల తర్వాత చెల్లించాల్సిన రుణం, తక్కువ వ్యవధిలో చెల్లించాల్సిన రుణం. సామాన్య ప్రజలు పోస్టాఫీసుల్లో, బ్యాంకుల్లో జమచేసే నిధులు కూడా ప్రభుత్వం చేసే రుణమే. రుణం చేయడం అసహజమేమీ కాదు. అయితే, సకాలంలో చెల్లించలేకపోతే

(రు. కోట్లలో)

| సంవత్సరం | మొత్తం రుణం | తిరిగి చెల్లింపు | నికర రుణం |
|---|---|---|---|
| 2008-09 | 273000 | 39370 | 233630 |
| 2009-10 | 451000 | 52576 | 398424 |
| 2010-11 | 437000 | 111586 | 325414 |
| 2011-12 (సవరించిన) | 510000 | 73586 | 436414 |
| 2012-13 (బడ్జెట్ అంచనా) | 569616 | 90616 | 479000 |

పీక పట్టుకుంటుంది. ఉదాహరణకు 1991లో సరళీకృత ఆర్థిక విధానాన్ని పి.వి నరసింహారావు, మన్మోహన్‌సింగ్ ద్వయం ప్రపంచబ్యాంక్ కాళ్లావేళ్లా పడాల్సి వచ్చిందంటే అప్పు హద్దు మీరి తిరిగి చెల్లించలేకపోవడమే. ప్రపంచబ్యాంక్ వద్ద రుణం తీసుకొని పీకల మీదకు వచ్చిన రుణాలను సకాలంలో చెల్లించలేకపోవాల్సి రావడమే. విదేశీ రుణం తీసుకోవడం చిన్న చిన్నగా ప్రారంభమై పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ కళ్లల్లో దడ పుట్టిస్తుంది.

ఉదాహరణకు, 1990-91లో విదేశీ రుణం 83.8 బిలియన్ డాలర్ల నుంచి 2002-03 నాటికి 104.9 బిలియన్ డాలర్లకు పెరగగా, జూన్‌లో 316.9 బిలియన్ డాలర్లకు అంటే మూడు రెట్లు పెరిగింది. అంటే పైన ఉదహరించిన మొదటి కాలంలో వార్షిక సగటు రుణం పెరుగుదల 1.8 బిలియన్ డాలర్లు కాగా ఆ తరువాత 12 సంవత్సరాల కాలంలో వార్షిక సగటు పెరుగుదల 25 బిలియన్ డాలర్లు. అప్పు చేసి పప్పు కూడంటే ఇదే. ఆ పప్పు కూడా అత్యధిక సంపన్నులకు మాత్రమే. 2010-11తో అంతమైన అయిదేళ్లలో ఈ సగటు 33.5 బిలియన్ డాలర్లు కాగా 2009-10, 2010-11 నాటికి ఇవ్వాల్సిన రుణం 36.5 బిలియన్ డాలర్లు, 45.5 బిలియన్ డాలర్లు. సంవత్సరం తర్వాత సంవత్సరం రుణభారం అంగలు వేసుకుంటూ పెరిగిపోతుందని పై గణాంకాలు తెలియజేస్తున్నాయి. పెరగాడనికున్న అనేక కారణాల్లో, ఒకటేమిటంటే విదేశాల నుంచి రుణాలు తెచ్చుకోవడానికి కార్పొరేట్ సంస్థలకు తలుపులు బార్లా తెరవడమే. పైన చెప్పినట్లు విదేశాల్లో వడ్డీ రేట్లు కారు చవుక కాబట్టి, ఎగబడి రుణాలు తెచ్చుకొన్నాయి. అయితే, ఇందులో వచ్చిన చిక్కేమిటంటే, కొన్ని రుణాలు చాలా తక్కువ కాలంలో తిరిగి చెల్లించాలి. ఇటీవలి కాలంలో ద్రవ్యోల్బణాన్ని అదుపులోకి తీసుకొని రావాలనే కారణంతో రిజర్వ్ బ్యాంక్ కేవలం ఒక్క సంవత్సరంలో 13 సార్లు వడ్డీని పెంచడంతో కార్పొరేట్లు విదేశాలకు పరుగులు తీసి రుణాలు తెచ్చుకొన్నారు. ఇక్కడొక ఆర్థిక సూత్రం గురించి చెప్పాలి. రుణం స్థూల జాతీయాదాయంలో ఎంత శాతం అని చూస్తారు. ప్రపంచ ఆర్థిక సంక్షోభం నాటి వరకు స్థూల జాతీయాదాయం ఘనంగా పెరుగుతూండడంతో తెచ్చిన విదేశీ అప్పు స్వల్పంగా కనబడుతూ వచ్చింది. కాని అప్పటి నుంచి కథ అడ్డం తిరిగేసరికి తెస్తున్న రుణం శాతం పెరుగుతుంది. మన ప్రధాని ముందు పుట్టారో, స్థూల జాతీయాదాయం ముందు పుట్టిందో తెలియదు కాని ఆయన చేతిలో ఉన్న కొలబద్ద స్థూల రాష్ట్రాదాయం. అది పెరిగితే ఆయనకు బోలెడంత సంతోషం. కాని గత రెండు మూడేళ్లుగా స్థూల జాతీయాదాయం ఆయన

# పేదరికంపై కాకి లెక్కలు - పేదలతో చెలగాటం

***వివిధ ప్రభుత్వ కమిటీలు, సంస్థలు, మేధావులు పేదరికానికి రకరకాల నిర్వచనాలు ఇచ్చారనీ, కూడు, గుడ్డ, నీడ లాంటి ప్రజల మౌలిక అవసరాలను తీర్చాల్సింది ప్రభుత్వమేననీ అంటున్నారు* సంతోష్**

చదివేస్తే ఉన్న మతి పోయినట్లు కేంద్ర ప్రణాళికా సంఘం పేదరికం నిర్ధారణకు అనుసరిస్తున్న పద్ధతి హాస్యాస్పదంగా మారింది. ప్రణాళికా సంఘం పేదలు తినే పిడికెడన్నంపై కన్నేసింది. కడుపు నింపుకోవడం కోసం తినే నాలుగు మెతుకులకూ కొలతలు పెట్టి లెక్కలేస్తోంది. రెక్కలు ముక్కలు చేసుకుంటే కంచంలోకి వచ్చే ఆ నాలుగు మెతుకులనూ కూడ ఎగరేసుకు పోవడానికి కుట్రలు చేస్తోంది. ప్రణాళికా సంఘం తాజా కొలమానం ప్రకారం పట్టణ ప్రాంతాల్లో రోజుకు రు.29, గ్రామాల్లో రోజుకు రు. 22 ఖర్చుపెట్టగలిగితే పేదలు కాదని నిర్ధారించింది. 2004-05 నుండి 2009-10 మధ్యకాలంలో పేదరికం 7.3 శాతం తగ్గిందని ప్రణాళికా సంఘం నిస్సిగ్గుగా మార్చి 21న ప్రకటించింది. ఈ గణాంకాలను అధికారికంగా విడుదల చేయడానికి నాలుగు రోజుల ముందే కేంద్ర ఆర్థిక మంత్రి బడ్జెట్ సమర్పించారు. స్థూల దేశీయోత్పత్తిలో సబ్సిడీలను రెండు శాతానికి తగ్గిస్తామని ఆర్థిక మంత్రి ప్రకటించారు. ఆ తరువాత దాన్ని రానున్న మూడు సంవత్సరాల కాలంలో 1.7 శాతానికి తగ్గించనున్నారు. ఆహారం నుంచి ఇంధనం వరకు అన్ని రకాల సబ్సిడీలూ దారిద్ర్యరేఖకు దిగువనున్న వారికేనన్నది ప్రస్తుత ప్రభుత్వ విధానం. అందుకే దారిద్ర్యరేఖపై ఇంతటి విడ్డూరమైన లెక్కలను ప్రణాళికా సంఘం వండివారుస్తోంది.

నిజానికి పేదరికానికి కొలమానాలుగా నిర్దేశించిన మొత్తంతో ఒక్కపూట కూడా కడుపునిండా తినడానికి కూడు దొరకదన్న సత్యం మన ఘనత వహించిన కేంద్ర సర్కార్ కాంగ్రెస్ పెద్దలకు తెలియదని అనుకోలేం. అందులోనూ అర్థశాస్త్ర పండితునిగా, ప్రపంచ బ్యాంక్ నమ్మకస్తునిగా, సామ్రాజ్యవాద కార్పొరేట్ సేవలో తరించిపోతున్న ప్రధాని మన్మోహన్ సింగ్‌కు, పేదల పక్షపాతిగా తనకు తానే అభివర్ణించుకునే యుపిఎ ఛైర్ పర్సన్ కాంగ్రెస్ అధినేత్రి సోనియా గాంధీకి, రోడ్డుపక్కన చెట్లకింద ఎక్కడ పేదవాడిల్లు కనబడితే అక్కడికెళ్లి కెమెరముందు మీడియాకు ఫోజులిస్తూ వారు తినే తిండినే పంచుకునే రాహుల్‌గాంధీకి ఈ విషయాలు తెలియవంటే అసలే నమ్మలేం! ప్రపంచబ్యాంక్ చెప్పుల్లో కాళ్లు దూర్చి నడుస్తున్న పాలకులు ఉద్దేశ్యపూర్వకంగానే వాస్తవాలను చూడడానికి నిరాకరిస్తున్నారు. కార్పొరేట్ శక్తులకు దేశసంపదను, శ్రమను దోచిపెట్టడానికి, పేదల కడుపుకోట్టడానికి వెనుకాడడం లేదన్నది స్పష్టం. 2011 ప్రపంచ ఆకలి సూచికలో మన దేశం 45వ స్థానంలో ఉంది. పాకిస్తాన్, బంగ్లాదేశ్, మయన్మార్, ఉగాండా, జింబాబ్వే వంటి పేదదేశాలకంటే మన దేశంలో ఆకలి చావులు పెరుగుతున్నాయి.

దారిద్ర్య రేఖకు దిగువన ఉన్నవారికి ఆహార భద్రత కల్పిస్తామని చెబుతున్న ప్రభుత్వం ఇప్పుడు ఆ సంఖ్యను సాధ్యమైనంత మేర తగ్గించాలని ప్రయత్నించడం విడ్డూరంగా ఉంది. మరోవైపు 12 వ పంచవర్ష ప్రణాళికాంతానికి పేదరికాన్ని దేశం నుండి తరిమేస్తానంటూ బీరాలుపలుకుతోంది. నిజానికి పాలకవర్గాలు అనుసరిస్తున్న ఆశ్రిత పెట్టుబడిదారీ విధానంవల్ల దేశవ్యాప్తంగా పేదరికం ఎక్కడ చూస్తే అక్కడ తాండవిస్తోంది. గనిలో, బడిలో, దుక్కిలో, ధూళిలో, కార్ఖానాలలో ఎక్కడ చూసినా పేదలే! ప్రణాళికా సంఘం సవరించిన కొలమానాల ప్రకారమే 50 శాతం మంది వ్యవసాయ కార్మికులు రోజుకు 22 రూపాయలు ఖర్చు చేయలేని స్థితిలో ఉన్నారు. అసంఘటిత రంగ కార్మికులు, ఎస్.సి.లు, ఎస్.టి.లు, మైనారిటీల్లో 43 నుండి 53 శాతం దాకా పేదరికం ఉంది. 32 శాతం ఇళ్లకు మంచినీటి సౌకర్యం లేదు. 53 శాతం ఇళ్లకు మరుగుదొడ్ల సౌకర్యం లేదు, 49 శాతం కుటుంబాలు కట్టెలపొయ్యి మీదనే వంట చేసుకుంటున్నారు, 39 శాతం ఇళ్లకు ప్రత్యేకంగా వంటగది లేదు. 42 శాతం పిల్లలు పోషకాహార లోపంతో బాధపడుతున్నారు. 70 శాతం మహిళలు రక్తహీనతతో బాధపడు తున్నారు. ఈదేశ దారిద్ర్యానికి ఈ లెక్కలే నిలువెత్తు సాక్ష్యం! దీంతో దేశంలో కుల వివక్షత, సామాజిక అసమానతలు తీవ్రంగా ఉన్నాయని అర్థమవుతోంది. కులంతో పాటు మతపరమైన అసమానతలూ తీవ్రంగా ఉన్నాయి. ముస్లింలలో 34 శాతం మంది పేదరికంలో ఉన్నారు. కులాలు, మతాలు మాత్రమే కాదు రాష్ట్రాల మధ్య కూడా తీవ్ర అంతరాలు ఉన్నాయి. బీహార్, ఒడిశా, ఉత్తరప్రదేశ్, జార్ఖండ్, మధ్యప్రదేశ్, చత్తీస్‌గడ్‌లలో 50 శాతం పైగా పేదలున్నారు. అసోం, నాగాలాండ్, మణిపూర్ లాంటి రాష్ట్రాల్లో పేదరికం పెరిగింది.

---

చెప్పినట్లు వినడం లేదు. అది వినడం లేదు కదా తగ్గిపోతూ రావడంతో అందులో శాతంగా రుణ భారం శాతం పెరిగిపోయి ప్రధానికి చెమటలు పట్టిస్తున్నాయి. అందులోనూ, స్వల్పకాలిక రుణాలు (మార్చ్ 2010 - జూన్ 2011 మధ్య) 107.6 బిలియన్ డాలర్ల నుంచి జూన్ 2011 నాటికి 137.2 మిలియన్ డాలర్లకు పెరిగాయి. ఇది ఆర్థిక పరిస్థితిని తలకిందులు చేస్తుంది. దానికి పరిష్కారం పన్నుల బాదుడు, సేవల రుసుం పెంచడమూ కాదు. ఇది ప్రపంచ బ్యాంక్ పరిష్కారం. ధరలు పెరుగుదల మీద గొడ్డలిపెట్టు వేయడం ద్వారా సామాన్య ప్రజల ఆదాయాలు పెరిగి, ఆ మేరకు సబ్సిడీల భారం తగ్గుతుంది. వారి కొనుగోలు శక్తి పెరిగి పారిశ్రామిక ఉత్పత్తులకు గిరాకీ పెరుగుతుంది. ప్రభుత్వం విచ్చలవిడి ఖర్చును భారీగా తగ్గించాలి. ఈ మధ్య ప్రభుత్వ విమాన సంస్థకు కొన్ని వేల కోట్ల రూపాయల సహాయం చేయడానికి నిర్ణయించింది. కొద్దిమంది ప్రయాణికుల కోసం అంత ధన సహాయం అవసరమా? పార్లమెంట్, శాసనసభ్యుల జీతనాతాలు తమంతట తామే పెంచేసుకొన్న వాళ్లు ప్రజా ప్రతినిధులా? ప్రజా విరోధులా? ఇలాంటి దుబారా ఖర్చుపై కోత విధిస్తే విదేశాల్లో బిచ్చమెత్తుకోవాల్సిన పని ఉండదు.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

వాస్తవానికి దారిద్ర్యం, పేదరికం అన్న పదాలకు ప్రణాళికా సంఘం ఇస్తున్న నిర్వచనం అత్యంత లోపభూయిష్టంగా ఉంది. మానవుడు ఎంత వ్యయం చేస్తున్నాడు అన్న దానితో బాటు, నాగరిక జీవనానికి కావాల్సిన కనీస అవసరాలు తీరుతున్నాయా లేదా అన్నదే ప్రాతిపదిక కావాలి.

మన దేశంలో పేదరికం నిర్ధారణలో మొదటి నుంచీ ఒక నిర్దిష్ట విధానమంటూ అనుసరించిన దాఖలాలు లేవు. దేశ ప్రజల జీవనప్రమాణాలను అంచనా వేయడానికి 1951 నుంచి ఇప్పటివరకు 66 జాతీయ శాంపిల్ సర్వేలు జరిగి, 67వ శాంపిల్ సర్వే ప్రస్తుతం కొనసాగుతున్నా ఎవరిని పేదలుగా పరిగణించాలనే విషయంలో ఒక స్పష్టత రాలేదు. 1978లో నిపుణుల కమిటీ సూచనల ఆధారంగా ప్రణాళికా సంఘం తొలిసారిగా దారిద్ర్యరేఖ విషయంలో కొన్ని నిర్ధారణలకు వచ్చింది. పట్టణాల్లో 2100 కెలరీలు, పల్లెల్లో 2400 కెలరీలు ఆహారం రూపంలో పొందలేని జనాభాను పేదలుగా పరిగణించాలని నిర్ణయించింది. అప్పటి ధరల ఆధారంగా సంవత్సరానికి పల్లెల్లో నెలకు రు.61.80 (రోజుకు రు.2.06), పట్టణాల్లో రు. 71.30 (రోజుకు రు. 2.37) ఖర్చు పెట్టలేని వారిని దారిద్ర్య రేఖకు దిగువన చేర్చింది. ఆ తర్వాతి కాలంలో ప్రతి ఏటా జరిగే శాంపిల్ సర్వేలను ఆధారం చేసుకుని, ద్రవ్యోల్బణంతో గణించి ఎప్పటికప్పుడు ప్రణాళికా సంఘం ఎవరు పేదలో అంకెలు విడుదల చేస్తూ వస్తున్నది.

అయితే పేదరికాన్ని నిర్ధారించే పద్ధతిపై అనేక విమర్శలు వచ్చాయి. ప్రణాళికా సంఘం ప్రకటిస్తున్న అంకెలు ఓ వ్యక్తి తీసుకునే ఆహారం కొనడానికి ఏ మాత్రం సరిపోవని, పేదరికాన్ని తగ్గించి చూపడానికే ప్రణాళికా సంఘం ప్రయత్నిస్తున్నదని పలువురు విమర్శించారు. ఈ నేపథ్యంలో పేదరికాన్ని ఎలా నిర్ధారించాలనే విషయంపై ప్రభుత్వం 1993లో డీటీ లక్డావాలా కమిటీని వేసింది. ఈ కమిటీ అన్ని కోణాలను పరిశీలించి పాత పద్ధతికే మొగ్గుచూపింది. ఒక కుటుంబం నెల రోజుల కాలంలో వినియోగించిన ఆహార పదార్థా లను అప్పటి ధరలపై ఆధారపడి లెక్కించి పేదరికాన్ని నిర్ణయించాలని తెలిపింది. శాంపిల్ సర్వేల ఆధారంగా 1993-94లో పల్లెల్లో 37.3 శాతం, పట్టణాల్లో 32.4 శాతం, మొత్తంగా 36 శాతం పేదరికం ఉందని తెలిపింది. వివిధ వర్గాల నుంచి, ప్రతిపక్షాల నుంచి తీవ్ర నిరసన వ్యక్తం కావడంతో ప్రభుత్వం ఈ కమిటీ నివేదికను ఆమోదించ లేదు. తర్వాతికాలంలో 2005 డిసెంబర్ 2న సురేష్ టెండూల్కర్ నేతృత్వంలో మరో కమిటీని నియమించారు. మన ప్రణాళికా సంఘం కుటుంబ ఆదాయాన్ని కాక, నిత్యావసరాల కొనుగోలును ప్రమాణికంగా తీసుకుంటుంది. ఆ పద్ధతి అశాస్త్రీయమని, వాస్తవమైన పేదరికాన్ని అది సూచించదని ఎన్ని విమర్శలు వచ్చినా కేంద్ర ప్రభుత్వ వైఖరిలో మార్పురాలేదు.

మన దేశంలోని పేదరికాన్ని వివిధ జాతీయ, అంతర్జాతీయ సంస్థలు పలురకాలుగా విశ్లేషించాయి. 2005లో ప్రపంచబ్యాంకు నివేదిక ప్రకారం భారత జనాభాలో 41.6 శాతం పేదలున్నారు. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన అధ్యయన బృందం ఇటీవల ఈ శాతాన్ని 53.7గా నిర్ధారించింది. ఇందులో 28.6 శాతం మంది కటిక దరిద్రులని తేల్చింది. ఎన్.సి. సక్సేనా కమిటీ దారిద్ర్యరేఖకు దిగువన 50 శాతంగా అంచనా వేసింది. 1994-2004 మధ్య పదేళ్ల కాలాన్ని పరిగణనలోకి తీసుకున్న అసంఘటిత రంగ పరిశ్రమల జాతీయ కమిషన్ (అర్జున్‌సేన్ గుప్తా నివేదిక) రోజుకు రు.20 కూడా ఖర్చు పెట్టలేని వారు దేశంలో 77 శాతం ఉన్నారని తెలిపింది. అనేక కమిటీలు పేదరికం సంబంధించి తెలిపిన లెక్కలు ఈ విధంగా ఘోషిస్తుంటే మన పాలకులు క్షేత్ర స్థాయిలో పేదరికాన్ని తగ్గించలేక కాయితాల మీద గణాంకాల స్థాయిలో తగ్గించడం వారి దివాళకోరుతనానికి నిదర్శనం. కళ్లెదుట నగ్నంగా కనిపిస్తున్న దారిద్ర్యాన్ని తక్కువ చేసి చెప్పినంత మాత్రాన దారిద్ర్యం మాయ మవుతుందా? తమ పాలనలో దారిద్ర్యం పారదోలామని గొప్పలు చెప్పుకోవడానికి గణాంకాలు ఉపయోగపడవచ్చు కాని పేదరికాన్ని పారదోలడానికి ఉపయోగపడవు. నిజానికి దారిద్ర్య రేఖకు దిగువ ఉన్నవారి సంఖ్యను తగ్గించడం వెనుక నిరుపేదలకు అందే సదుపాయాలను, సబ్సిడీలపై వ్యయాన్ని కోతపెట్టే దుర్నీతి దాగి ఉంది.

ఈ క్రమంలోనే దారిద్ర్య గణన గుట్టు బయటపెట్టాల్సిందిగా సర్వోన్నత న్యాయస్థానం 2011 ఏప్రిల్‌లో ప్రణాళికా సంఘాన్ని ఆదేశించింది. అప్పట్లో పేదరికం నిర్ధారణకు బస్తీల్లో రోజుకు రు. 20 ఖర్చుపెట్టడం అనే లెక్క అసంబద్ధమేనని లెంపలేసుకున్న సంఘం, సెప్టెంబర్‌లో నివేదించిన కొత్త ప్రాతిపదికలూ వివాదాస్పదమయ్యాయి. నగరాల్లో రు. 32, గ్రామాల్లో రు. 26 కన్నా రోజు వారీ ఖర్చు మించిన ఎవరైనా దారిద్ర్యరేఖ ఎగువన ఉన్నట్లేనన్న వివరణపై విపక్షాలు భగ్గుమన్నాయి. అంతకు లీటరు పాలైనా రానప్పుడు విద్య, వైద్య, ఆహార ఖర్చులన్నింటినీ పరిగణనలోకి తీసుకుని మదింపు వేశామన్న సురేశ్ టెండూల్కర్ కమిటీ ప్రమాణికాంశాల ఔచిత్యాన్ని భిన్నవర్గాలు సూటిగా తప్పు పట్టాయి. సరిదిద్దుకునే క్రమంలో ప్రణాళికా సంఘం నోట వెలువడ్డ ప్రాతిపదికలు మరింత దారుణంగా ఉన్నాయి. నిరుటితో పోలిస్తే సన్నగిల్లిన ద్రవ్యోల్బణ ప్రభావం మూలాన బతకడానికి చేయాల్సిన కనీస ఖర్చు తరిగిపోయిందని, సరికొత్త ప్రాతిపదికల ప్రకారం దేశంలో పేదరికం భారీగా తగ్గిందని ప్రణాళికా సంఘం నమ్మబలుకుతోంది. 2004-05లో 40.72 కోట్లున్న పేదల సంఖ్య ఈ అయిదేళ్లలో 34.47 కోట్లకు తగ్గిందని తేల్చింది. అంటే ఆరుకోట్ల పాతికలక్షల మేరకు పేదల సంఖ్యను తగ్గించి చూపారు. కొలమానాల్ని కుదించేసి, పేదరికం తగ్గిపోయిందన్న దబాయింపులతో మసిపూసి మారేడు చేసే తప్పుడు లెక్కల బాగోతానికి ఛీత్కారాలే దక్కాయి. ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు మోంటెక్‌సింగ్ అహ్లువాలియా తీవ్ర విమర్శలకు గురైనారు. పార్లమెంటులో ప్రతిపక్షాలు తీవ్ర నిరసన తెలిపాయి. అయినా ప్రణాళికా సంఘం వైఖరి మారకపోవడం శోచనీయం. ఉపాధ్యక్ష పదవి నుండి అహ్లువాలియాను తొలగించాలని, దేశాన్ని దగా చేస్తున్న, ప్రజలను మోసం చేస్తున్న ప్రణాళికా సంఘాన్ని రద్దు చేయాలని వివిధ పార్టీల సభ్యులు లోక్‌సభలో డిమాండ్ చేశారు. ఎన్.ఎస్.ఎస్. నివేదికను తిరస్కరించాలని, పేదరికం గూర్చి వాస్తవ దృశ్యాన్ని ప్రతిబింబిస్తూ కొత్త నివేదిక రూపొందించాలని సభ్యులు డిమాండ్ చేశారు.

దారిద్ర్య రేఖకు - సంక్షేమ కార్యక్రమాలకు ముడిపడి ఉన్నందున ఈ అంశం ప్రాధాన్యత సంతరించుకుంటోంది. 1975లో జరిగిన లేబర్ కాన్ఫరెన్స్ కనీస వేతనాన్ని నిర్ధారించడానికి కొన్ని ప్రాతిపదికలను ప్రకటించింది. దాని ప్రకారం భార్య, భర్త, ఇద్దరు పిల్లలు ఉన్న ఒక కుటుంబంలో భర్తకు రోజుకు 2,700 కేలరీలు, భార్యకు 2,160 కేలరీలు, సంతానంలో ఒక్కొక్కరికి 1,620 కేలరీల పోషకాహారం ఉండాలి. ఇవికాక... ఉండడానికి ఇల్లు, కట్టుకోవడానికి బట్ట, ఇతర ఖర్చులు అదనం అని పేర్కొంది. అరవై వేల రూపాయలలోపు వార్షికాదాయం కలిగిన కుటుంబాలన్నింటినీ దారిద్ర్యరేఖ దిగువన ఉన్నట్లు పరిగణించాల్సిందిగా గతంలో వాధ్వా కమిటీ చేసిన సహేతుక సిఫార్సును ప్రణాళికా సంఘం తుంగలో తొక్కింది. నెలకు రు. 8,250 లేనిదే అయిదుగురు సభ్యుల కుటుంబం తిండికి, గూడుకు, గుడ్డకు నోచుకోలేదన్న ప్రపంచ బ్యాంకు సూచననూ గాలికొదిలేసింది. రోజుకు డాలర్ (రు. 50) ఆదాయాన్ని ప్రపంచ దారిద్ర్య రేఖగా గతంలో నిర్ణయించిన ప్రపంచ బ్యాంక్ రెండేళ్ల

క్రితం దాన్ని ఒకటిన్నర డాలర్లకు సవరించింది. అనేక విషయాల్లో బ్యాంక్ ఆదేశాలు శిరసావహించే మన ఆర్థిక పండితులకు ఈ మార్పు కనపడలేదా ? వాస్తవిక వ్యయ ప్రాతిపదికన పేదరికం లెక్కలు తరచూ సవరిస్తుండాలని, పల్లె, పట్టణమన్న వ్యత్యాసాన్ని పక్కనపెట్టి ఎక్కడైనా సరే రోజుకు వంద రూపాయలైనా వెచ్చించలేని అందరికీ సంక్షేమ పథకాలు వర్తింపజేయాలన్న సామాజిక కార్యకర్తల సూచనలను కేంద్రం, ప్రణాళికా సంఘం పెడచెవిన పెడుతున్నాయి.

దారిద్ర్యరేఖను హేతుబద్ధంగా నిర్ధారించినప్పుడే, పంచవర్ష ప్రణాళికాల ప్రధానోద్దేశమైన పేదరిక నిర్మూలన కృషి సజావుగా పట్టాలకు ఎక్కుతుంది. ఐరోపాలో జాతీయ సగటు ఆదాయం కంటే 60శాతం తక్కువ రాబడి కలిగినవారిని ప్రభుత్వ సంక్షేమ పథకాల ద్వారా ప్రయోజనం పొందడానికి అర్హులుగా గుర్తిస్తున్నారు. అమెరికాలో నలుగురు సభ్యుల కుటుంబ సంవత్సరాదాయం 22 వేల డాలర్ల (సుమారు రు. 11 లక్షల)కు తగ్గితే, వారు పేదలుగానే లెక్క. సంపన్నుల ఆర్జనతో సాపేక్షంగా నిర్ధారించే అక్కడి పేదల నిర్ధారణకు, ఇక్కడి కాకిలెక్కలకు ఎక్కడా పొంతన కుదరదు. ఒక సాధారణ వ్యక్తి ఆరోగ్యంగా జీవించడానికి అనుదినం 400 గ్రాముల తృణధాన్యాలు, 300 గ్రాముల కాయగూరలు, 100 గ్రాముల పళ్లు, 80 గ్రాముల కాయధాన్యాలు అవసరమని భారతీయ వైద్య పరిశోధన సమాఖ్య నిర్ధారించింది. ఆహారంతో పాటు విద్య, వైద్యం ఖర్చులూ కలగలిపి మదింపు వేసి కనీస వ్యయాన్ని నిగ్గుతేల్చామంటున్నవాళ్లు, సంక్షేమ రాజ్య భావననే క్రూరంగా అపహసిస్తున్నారు. దారిద్ర్య నిర్మూలన అర్థతాత్పర్యాలు మార్చేసి, పేదల సంఖ్యను రాయితీల పద్దును తెగ్గోయడంలో 'ఆమ్ ఆద్మీ' సముద్ధారకులు తలమునకలవుతున్నారు!

వృద్ధిరేటులో క్షీణతపట్ల ఇటీవలి బడ్జెట్ ప్రసంగంలో విత్తమంత్రి ప్రణబ్ ముఖర్జీ ఒకింత దిగులుబడ్డారు. వ్యవసాయం చతికిలపడి, సంప్రదాయ వృత్తులు కునారిల్లి, వలసలు కొనసాగుతూనే ఉన్న పల్లెల్లో పేదరికం ఎలా తగ్గిపోయిందో సామాన్యులెవ్వరికీ కొరుకుడు పడడం లేదు. ఉపాధి హామీ కింద లక్షల కోట్ల రూపాయలకుపైగా ఖర్చుకు లెక్క పత్రం లేదని కేంద్రమే లెంపలేసుకుంది. ప్రజా పంపిణీ వ్యవస్థ, ఇందిరా ఆవాస్ యోజన, రోజ్‌గార్ యోజన తదితరాల పద్దులో వందల వేల కోట్ల రూపాయలు పక్కదారి పడుతున్నట్లు ఆరోపణలు వెల్లువెత్తు తున్నాయి.

ఆహార భద్రత బిల్లు రూపొందించేటప్పుడు సైతం లబ్ధిదారుల నిర్ణయం నిమిత్తం దారిద్ర్యరేఖపై, పేదల సంఖ్యపై జాతీయ సలహా మండలి సభ్యుల మధ్య తీవ్రమైన చర్చ జరిగింది. చివరకు సురేష్ టెండూల్కర్ కమిటీ నివేదికను ప్రామాణికంగా ఆమోదించారు. ఆ కమిటీ పూర్తి వాస్తవికతను ప్రతిబింబించకపోయినా జనాభాలో 40 శాతాన్ని పేదల కింద గుర్తించింది. అయినా దీన్ని మళ్లీ ఆధార్ కార్డుతో సంధానించారు. అందువలన దారిద్ర్యాన్ని నిర్మూలించాలంటే దారిద్ర్యానికి శాస్త్రీయమైన కొలబద్ద అవసరమని సామాజిక శాస్త్రవేత్తలు నొక్కి చెబుతున్నారు.

దేశంలో పట్టెడు మెతుకుల్లేక, ఉండడానికి గూడులేక ఏటా వేలాదిమంది మృత్యువాత పడుతున్నారని చాలాకాలం క్రితం పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్) సంస్థ సుప్రీంకోర్టులో ప్రజా ప్రయోజన వ్యాజ్యం దాఖలు చేసింది. ఆకలి చావులకు ప్రభుత్వమే బాధ్యత వహించాలని పేర్కొంది. పట్టించుకోవాల్సిన ప్రభుత్వం తన బాధ్యతను విస్మరిస్తోందని ఫిర్యాదు చేసింది. దాని పర్యవసానంగా దేశంలో పేదల సంఖ్య ఎంత? అసలు ఆ సంఖ్యను చెప్పడానికి మీ దగ్గరున్న కొలమానాలేమిటని సుప్రీంకోర్టు ప్రశ్నించింది. అందుకు జవాబుగా పట్టణ ప్రాంతాల్లో నెలకు రు. 578 (రోజుకు దాదాపు రు. 20), గ్రామీణ ప్రాంతాల్లో నెలకు రు. 450 (రోజుకు రు. 15) సంపాదించేవారు మాత్రమే పేదలని ప్రణాళికా సంఘం సుప్రీంకోర్టుకు జవాబిచ్చింది. 2004-05 ధరల సూచీ ఆధారంగా దీన్ని రూపొందించామని ప్రణాళికా సంఘం తెలిపింది. దీన్నిబట్టి పల్లెల్లో 41.8 శాతం, పట్టణాల్లో 25.7 శాతం మంది దారిద్ర్య రేఖకు దిగువన ఉన్నట్లు లెక్కలేసింది. ఇంత తక్కువ సొమ్ముతో బతకడం అసలు సాధ్యమేనా అని న్యాయమూర్తులు ఆశ్చర్యం వ్యక్తం చేసి వర్తమాన సంవత్సర ధరల సూచీ ఆధారంగా మళ్లీ లెక్కేయమని మందలించి పంపారు. ఆ తర్వాత ప్రణాళికా సంఘం గత అక్టోబర్‌లో సరికొత్త లెక్కల్ని సుప్రీంకోర్టుకు అందజేసింది. దాని ప్రకారం పట్టణ ప్రాంతాల్లో రోజుకు రు. 32, గ్రామాల్లో రోజుకు రు. 26 రూపాయల కన్నా తక్కువ సంపాదించేవారే పేదలని నిర్ధారించింది. దీనిపై సైతం తీవ్ర నిరసనలు వెల్లువెత్తాయి. సంఘం సభ్యుల్లో ఏ ఒక్కరైనా ఒక్క రోజు ఈ డబ్బుతో బతికి చూపించాలని సుప్రీంకోర్టు సవాల్ విసిరింది.

పైగా పాలకులు ఈ లెక్కలు ఇప్పుడు అమలు చేస్తోన్న సంక్షేమ పథకాలకు వర్తించవని భరోసా ఇస్తున్నారు. ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలకు దారిద్ర్య రేఖకు సంబంధం లేదనీ, ప్రభుత్వ తోడ్పాటుకు అర్హులను నిర్ణయించడానికి సామాజిక ఆర్థిక కులగణన సర్వే లెక్కలను ప్రాతిపదికగా తీసుకుంటామని, అందుకు విడిగా సర్వే జరుగుతుందని, అది వచ్చే జూలైకల్ల ముగుస్తుందని తెలియజేస్తున్నారు. అంతా బాగానే ఉంది కానీ, ఇప్పుడు ఇంత అశాస్త్రీయంగా లెక్కలు వేసినవారు రేపు ఏం చేయబోతున్నారో ఊహిస్తే గుండెలు బాదుకోవాల్సిందే. ఎందుకంటే ఆ సర్వేను ప్రజా పంపిణీ వ్యవస్థతో ముడిపెట్టనున్నారు. ఆకలిని అరికట్టడానికి ప్రస్తుతం కొనసాగుతున్న 22 పథకాల అమలు, త్వరలో తీసుకురాబోయే ఆహార భద్రతా చట్టం వర్తింపులాంటివన్నీ దాని ఆధారంగానే ఉండబోతున్నాయి. గత రెండు దశాబ్దాలుగా ప్రజల జీవనాధారాలు కొల్లగొడుతూ పేదరికాన్ని పెంచడానికి దోహదపడే ఉపాధిరహిత ఆర్థిక విధానాలను, విధ్వంసకర అభివృద్ధి నమూనాను మన పాలకులు అనుసరిస్తున్నారు. అంతర్జాతీయ సమాజం దృష్టిలో భారత్‌లో పేదరికం లేదని చెప్పడం కోసం పాలకులు ఉబలాట పడుతుంటే, మరోవైపు ద్రవ్యలోటు తగ్గించుకోవడానికి సంక్షేమ పథకాలకు, వ్యవసాయానికి, బడుగు బలహీనవర్గాల సంక్షేమానికి కేటాయిస్తున్న సబ్సిడీలను తగ్గించుకోవాలని ప్రపంచ బ్యాంకు మన దేశ పాలకులపై ఒత్తిడి తెస్తోంది.

లక్షల కోట్లలో నల్లధనం, అవినీతి ధనం విదేశీ బ్యాంకుల్లో మగ్గి పోతుంటే, దేశంలో సగానికి పైగా అరకొర జీవితాలు గడుపుతుండడం విషాదకరం. సంస్కరణల కాలంలోనే ఆర్థిక అంతరాలు దేశవ్యాప్తంగా తీవ్రంగా పెరిగాయి. సంపన్నులు మరింత సంపన్నులు కాగా పేదలు మాత్రం మరింత పేదలయ్యారు. ప్రజల జీవితాల్లోని దుర్భరత్వానికి అంకెల మాయ ముసుగేసే ప్రభుత్వ ప్రయత్నాలను సభ్య సమాజం అసహ్యించుకుంటోంది. ప్రజల జీవన ప్రమాణాలపై సరైన అంచనాకు వచ్చేందుకు ప్రభుత్వం ప్రయత్నించాలి.

తినడానికి తిండి, ఉండడానికి ఇల్లు, కట్టుకోవడానికి బట్ట, విద్యా, వైద్యం పొందడానికి తగిన ఆర్థిక స్తోమతలేని ప్రతి కుటుంబాన్ని దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నట్లుగా గుర్తించి అన్ని రకాల పథకాలను, సబ్సిడీలను ప్రోత్సాహకాలను వర్తింప చేస్తేనే 12వ పంచవర్ష ప్రణాళికాలో లక్షించిన పేదరిక నిర్మూలన సాధ్యమవుతుందని పాలకులు గుర్తించి వారికి భారీగా నిధులు కేటాయించాలి. అందుకుగాను మొదటగా మన పాలకుల, ఆర్థిక పండితుల ఆలోచనలో, ఆచరణలో మార్పు రావాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* ఠ

# కిడ్నాప్‌ల వెనుక ఉన్న కారణాలు

*విధ్వంసానికి గురవుతున్న ఆదివాసుల జీవితాలను బయటి ప్రపంచానికి తెలియజేయడం కోసం చేస్తున్న వివిధ మార్గాలలో భాగమే కిడ్నాప్‌లు అని అంటున్నారు* **వై. రామచంద్రం**

ఆదివాసీ ప్రాంతాల్లో జరుగుతున్న వివిధ రకాల అణిచివేతలను, వారి ఆరాట పోరాటాలను, న్యాయమైన ఆకాంక్షలను బయటి ప్రపంచానికి తెలియపరచడానికే 16,ఫిబ్రవరి 2011న ఒడిశాలోని మల్కన్‌గిరి జిల్లా కలెక్టర్ ఆర్. వినీల్ కృష్ణను, ఇంజనీర్ పవిత్ర మాఝీని కిడ్నాప్ చేసినట్లుగా ఆ సందర్భంలో మావోయిస్టు పార్టీ ప్రకటించింది. ఆ క్రమంలోనే మావోయిస్టు పార్టీ 14 డిమాండ్‌లను ఒడిశా ప్రభుత్వం ముందుంచింది.

అప్పటి డిమాండ్లు 1) నారాయణపట్నం, దుంసుడి గ్రామంలో నవంబర్ 2010లో పోలీసులు సీతన్న అనే ఆదివాసీని ఎత్తుకుపోయారు. ఆయన్నేంచేశారో చెప్పాలి. బతికుంటే విడుదల చేయాలి. 2) గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను వెంటనే ఆపివేయాలి. 3) తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్న కేంద్ర కమిటీ సభ్యురాలు షీలాదీ, చత్తీస్‌గడ్ జైల్లో ఉన్న పద్మలను విడుదల చేయాలి. 4) కేంద్ర కమిటీ సభ్యుడు అశుతోష్‌సేన్, ఇతర సభ్యులు శ్రీరాములు శ్రీనివాస్, గణనాథ్‌పాత్రో, జీవన్ బోస్, గంటి ప్రసాదం, శిరీష, ఈశ్వరి, సరిత, ట్రక్కు డ్రైవర్లను కేసు ఎత్తివేసి విడుదల చేయాలి. 5) కోరాపుట్ జైళ్లల్లో అధికారుల నిర్లక్ష్యానికి గురై తాడంగి గంగులు, సిరికె రత్నంలు చనిపోయారు. వాళ్ల కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించాలి. 6) కోరాపుట్, మల్కన్‌గిరి జిల్లా జైళ్లలో మగ్గుతున్న ఆదివాసీలను చాసీ మూలియా సంఘ కార్యకర్తలను కేసులు ఎత్తివేసి విడుదల చేయాలి. 7) కోరాపుట్, మల్కన్‌గిరి, నారాయణపట్నం, విశాఖపట్నం జిల్లాల్లో ఆదివాసేతరుల దురాక్రమణలో ఉన్న భూములను స్వాధీనం చేసుకున్న ఆదివాసీలకు పట్టాలివ్వాలి. 8) మాలి, దేవమాలి, విశాఖ జిల్లాల్లో బాక్సైట్ తవ్వకాలు, గనులు రద్దుచేయాలి. 9) బహుళజాతి కంపెనీలతో, బడా కంపెనీలతో చేసుకున్న అన్ని ఒప్పందాలను రద్దుచేయాలి. 10) నూకదొరలను, కొండరెడ్లను ఆదివాసీలు (షెడ్యూల్డ్ తెగలు) గా గుర్తించాలి. 11) ఒడిశాలోనూ, తెలంగాణలోనూ వందలాది గ్రామాల్ని ముంపునకు గురిచేసి, ఆదివాసీల్ని నిర్వాసితుల్ని చేస్తున్న పోలవరం ప్రాజెక్టును వెంటనే నిలిపివేయాలి. 12) కలిమెల రైతాంగానికి సాగునీటి వసతి కల్పించేలా కోటిపల్లి నుంచి మన్నెకొండ వరకు ఒక కాలువ నిర్మాణం చేపట్టాలి. 13) బలిమెల రిజర్వాయర్ ప్రాంతంలో కట్ ఆఫ్ ఏరియాలో ముంపునకు గురైన గ్రామాల రైతాంగానికి నష్టపరిహారం చెల్లించాలి. భవిష్యత్తులో మళ్లీ ముంపుకు గురయ్యే అవకాశం ఉంది గనుక రైతులకు భూమి చూపించి ప్రత్యామ్నాయ సదుపాయాలు కల్పించాలి. 14) దామన్ జోడీలో నాల్కో ప్రాజెక్టు వల్ల నిర్వాసితులై, నిర్లక్ష్యానికి గురైన ప్రజలకు తగిన న్యాయం చేయాలి.

మావోయిస్టు పార్టీ ప్రభుత్వం ముందు ఉంచిన డిమాండ్‌లను చర్చించడానికి మధ్యవర్తులుగా దండపాణి మహంతి, ప్రొఫెసర్ ఆర్.ఎస్. రావు, ప్రొఫెసర్ హరగోపాల్‌లను ఆ సందర్భంలో ప్రకటించింది. ఒడిశా ప్రభుత్వం మధ్యవర్తులతో చర్చలు జరిపింది. ఇరువురి మధ్య కుదిరిన ఒప్పందంలో భాగంగానే మల్కన్‌గిరి జిల్లాలో గాలింపు చర్యలు నిలిపివేస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఆ క్రమంలోనే మావోయిస్టుల డిమాండ్‌లను ఒక కాలపరిమితితో పరిష్కరిస్తామని ప్రభుత్వం ఒప్పుకొంది. మావోయిస్టులు ముందుగా పవిత్ర మాఝీని ఫిబ్రవరి 23న, వినీల్ కృష్ణను 24 ఫిబ్రవరి 2011న విడుదల చేశారు.

ఒడిశా ప్రభుత్వం మావోయిస్టు పార్టీ మధ్యవర్తులతో చేసుకున్న ఒప్పందాలను దేన్నీ కూడా పూర్తిగా అమలు చేయలేదు. ప్రభుత్వ ఉల్లంఘనలు ఎట్లా జరుగుతున్నాయంటే నారాయణపట్నం పరిధిలోని దూసిడి గ్రామానికి చెందిన సీతన్న అనే ఆదివాసీని నవంబర్ 2010లో పోలీసులు ఎత్తుకెళ్లారు. పోలీసులు ఎత్తుకెళ్లిన సీతన్నను విడిచిపెట్టాలని వినీల్ కృష్ణ కిడ్నాప్ సందర్భంగా పెట్టిన డిమాండ్లలో మొదటి డిమాండ్‌గా పెట్టారు. మావోయిస్టులు వినీల్ కృష్ణను విడుదల చేశారు కాని పోలీసులు సీతన్న మాకు తెలియదంటూ చివరికి హత్యచేసి ప్రమాదవశాత్తు మరణించినట్లుగా ప్రకటించారు. అప్పుడు మధ్యవర్తిగా వ్యవహరించిన ఆర్.ఎస్. రావు జూన్ 17న మరణించారు. సీతన్న మరణ వార్త కూడా అదేరోజు తెలిసింది. ఆర్.ఎస్. రావు ప్రభుత్వం కోరినట్లు వినీల్ కృష్ణను విడుదల చేయించాము, కాని సీతన్నను విడుదల చేయించలేకపోయాం అని బాధపడ్డారు. సీతన్న భార్యకు ఏం సమాధానం చెప్పాలి అని ఆయన బతికి ఉన్న ఆ కొద్ది రోజులు చాలా మదనపడ్డారు. దండపాణి మహంతి, హరగోపాల్ ఈ సంవత్సర కాలంలో పబ్లిక్ మీటింగ్‌లకు వెళ్లిన ప్రతీచోట ఒడిశా ప్రభుత్వ మోసకారితనాన్ని చెపుతూనే ఉన్నారు.

ఇంజనీర్ పవిత్ర మాఝీ, కలెక్టర్ వినీల్ కృష్ణ విడుదలై సంవత్సరం గడిచినా ప్రభుత్వం ఒప్పుకున్న డిమాండ్‌లు నెరవేర్చలేదు. పైగా ఆదివాసీ ప్రాంతాల్లోకి బహుళజాతి కంపెనీలను ఆహ్వానిస్తూ వాటికి అండగా సైన్యాన్ని దించింది. ఆ క్రమంలో సైన్యం ఆదివాసీల పంటలను, వందలాది ఇండ్లను తగలబెడుతూ, హత్యలకు పాల్పడుతూ, మహిళలపై అత్యాచాలకు పాల్పడుతూ, వందలాది మందిపై అక్రమ కేసులు బనాయించి జైళ్లలో నిర్బంధించింది. ఈ క్రమంలో ఆదివాసీలు అనివార్యమైన పరిస్థితిలో తమ మాన, ప్రాణాలను రక్షించుకోవడానికి విల్లంబులతో సాయుధులవుతున్నారు.

ఆదివాసీ ప్రాంతాల్లో ప్రభుత్వ బలగాలు తగలబెట్టిన గ్రామాలను చూడడానికి వెళ్లిన ప్రజాస్వామిక వాదులను, సామాజిక కార్యకర్తలను, మిడియాను, హక్కుల సంఘాలను రాకుండా నిరోధించడానికి పోలీసులు, సైన్యం అనేక రకాల ఆటంకాలు కల్పించి వారిపై దాడి చేశారు. చివరికి అక్కడికి వెళ్లి అక్కడ కాలి కూలుతున్న వందలాది ఇళ్లలోంచి కమురు వాసనలు వస్తున్నాయని అక్కడ పర్యటించి ప్రచురించిన నివేదికలు తెలుపుతున్నాయి.

ఆదివాసీ ప్రాంతాల్లోని భూముల్లో విలువయిన ఖనిజ సంపద ఉంది. వీటిని తవ్వుకోవడానికి ఒడిశా ప్రభుత్వం వేదాంత, పోస్కో, ఎస్సార్ వంటి బహుళజాతి సంస్థలతో ఒప్పందాలు చేసుకుంది. ఖనిజాల తవ్వకాల వల్ల అక్కడి వేలాది మంది ఆదివాసీలు నిర్వాసితుల అవుతున్నారు. అందుకే వాటిని ఆదివాసీలు అడ్డుకుంటున్నారు. వారికి అండగా మావోయిస్టు పార్టీ నిలిచి బహుళజాతి సంస్థలకు వ్యతిరేకంగా పోరాడుతోంది. ప్రభుత్వం ఆదివాసీ ప్రాంతాల్లో సైన్యాన్ని దింపి తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగిస్తోంది. ఆదివాసీ ప్రాంతాల్లో జరుగుతున్న అణిచివేతను సమాజం ముందుకు తీసుకు రావడంకోసం మావోయిస్టు పార్టీ ఇటీవల మళ్లీ ఇటలీ దేశస్తులైన కొలంజెలో, బొసుస్కోలను మార్చ్ 14న కిడ్నాప్ చేశారు. ఒడిశాకు చెందిన బి.జె.డి. ఎం.ఎల్.ఎ. జినా హికాకను మార్చ్ 24న కిడ్నాప్ చేశారు. చత్తీస్‌గడ్‌లోని సుక్మా జిల్లా కలెక్టర్ అలెక్స్ పాల్ మీనన్‌నూ కిడ్నాప్‌చేశారు.

కిడ్నాప్‌ల వార్తలు తెలియగానే మేధావులు, ప్రజాస్వామిక వాదులు కిడ్నాప్ చేసిన వారిని మానవతా దృక్పథంతో వదలాలని కోరారు. కేంద్ర హోం మంత్రి రాష్ట్రాలకు అదనపు బలగాలను పంపిస్తామని ఆయా రాష్ట్రాలకు హామినిచ్చారు. వీటిపై ఒడిశా పోలీసు అధికారుల సంఘం స్పందిస్తూ జైళ్లలో ఉన్న మావోయిస్టులను వదిలిపెడితే తాము గాలింపు చర్యలు నిలిపివేస్తామని తెలిపింది.

ప్రభుత్వ అధికారులను, రాజకీయ నాయకులను కిడ్నాప్ చేసిన వార్తలు బయటి ప్రపంచానికి తెలియడంతో బయటి సమాజంలో ఒక్కొక్కరు ఒక్కో విధంగా స్పందించారు. ఆదివాసీ తండాల్లో పోలీసులు విదేశీ బహుళజాతి సంస్థలకోసం ఆదివాసీల జీవించే హక్కులను కాలరాస్తున్న విషయాలు బయటి ప్రపంచానికి తెలియడంలేదు.

కిడ్నాప్ చేసిన వారిని విడిచి పెట్టడానికి మావోయిస్టు పార్టీ ఆయా రాష్ట్ర ప్రభుత్వాల ముందు కొన్ని డిమాండ్లను పెట్టింది. అవి అధిక భాగం వినీల్ కృష్ణ కిడ్నాప్ సందర్భంగా ఒడిశా ప్రభుత్వం ఒప్పుకొని అమలుచేయని డిమాండ్లే ప్రధానంగా ఆదివాసీ ప్రాంతాల నుండి ప్రభుత్వ బలగాలను వెనక్కి పంపాలనీ, దేశ ప్రజలపైనే గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరుతో జరుగుతున్న దాడులను ఆపాలనీ, ఆదివాసీలు స్వాధీనం చేసుకున్న భూములకు పట్టాలు ఇవ్వాలనీ వాళ్లు అడుగుతున్నారు. మావోయిస్టు పార్టీ సానుభూతిపరుల పేరుతో వందలాది మంది ఆదివాసీలను అక్రమంగా సంవత్సరాల తరబడి జైళ్లలో నిర్బంధించిన వారిని విడుదలచేయాలని కోరారు. జైళ్లలో ఉన్న మావోయిస్టు పార్టీ నాయకులను విడుదల చేయాలని కోరారు. ఆదివాసీలను ముంపుకు గురిచేస్తున్న పోలవరం ప్రాజెక్టును ఆపాలన్నారు. అటవి ప్రాంతంలోని భూముల్లో ఉన్న ఖనిజ నిక్షేపాలను తవ్వుకోవడానికి వేదాంత, పోస్కో, ఎస్సార్‌లాంటి ఎన్నో బహుళజాతి కంపెనీలతో కుదుర్చుకున్న ఒప్పందాలను రద్దుచేయాలంటున్నారు.

పోలీసులు రాజకీయపరమైన నిర్ణయాల్లోనూ జోక్యం చేసుకోవడం అనేది ఆయా ప్రాంతాల్లో పోలీసుల పాలన కొనసాగుతుందనడానికి ఇది ఒక ఉదాహరణ. ఆదివాసీల కనీస అవసరాలను తీర్చలేని కేంద్ర ప్రభుత్వం కిడ్నాప్‌లు జరిగిన ప్రాంతాలకు మాత్రం అదనపు బలగాలను పంపిస్తామని రాష్ట్ర ప్రభుత్వాలకు హామీనిచ్చింది. బ్రిటిష్ పాలకుల నుండి మొదలు ఈనాడు మనల్ని పాలిస్తున్న ప్రభుత్వాల వరకు అన్నిసమస్యలకు పోలీసుల అణిచివేతనే జవాబుగా ఎంచుకున్నాయి.

ఆదివాసీల హక్కులకు హామీనిచ్చే 1/70 చట్టమయినా, ఒడిశాలో 1956లో చేసిన భూసంస్కరణల చట్టం అయినా ఆదివాసీలు పోరాడి సాధించుకున్నవే. వాటిని అమలు చేయమని అడిగిన ఆదివాసీలను ప్రభుత్వం అణిచివేస్తోంది. ఆదివాసీలకు అండగా ఉంటున్న మావోయిస్టు పార్టీని దేశ అంతర్గత బధ్రతకు ముప్పు అంటున్నారు మన దేశ ప్రధాని. దేశ ప్రజలమీదే గ్రీన్‌హంట్ పేరుతో యుద్ధం ప్రకటించిన సైన్యానికి శిక్షణనివ్వడానికి అమెరికా సైన్యం భారత దేశంలోకి రావడం దేశ సార్వభౌమాధికారానికి గాని, అంతర్గత భద్రతకు గానీ ఎటువంటి ముప్పులేదు. ముప్పంతా ఈ దేశ సహజ సంపదను తమ ప్రాణాలొడ్డి రక్షిస్తున్న, ప్రజలకు అండగా ఉండి పోరాడుతున్న మావోయిస్టు పార్టీతోనే. మన 65 సంవత్సరాల 'స్వతంత్ర' దేశంలో ఆదివాసీ ప్రాంతాల్లో వైద్యానికి సంబంధించిన కనీస సౌకర్యాలు లేక ప్రతి సంవత్సరం వందలాది మంది మలేరియా వల్ల మరణిస్తున్నారు. ఆదివాసీ ప్రాంతాలకు వెళ్లిన మావోయిస్టులు ఆదివాసీలు రోగాల బారిన పడకుండా నీటిని వేడి చేసి తాగమనడం వల్ల 50 శాతం మరణాలు తగ్గినట్లు తెలుస్తోంది. మన ప్రభుత్వ యంత్రాంగం ఈ చిన్న పనిని కూడా చేయలేకపోయింది.

ఆదివాసీలు మన దేశంలోని సహజ వనరులను రక్షించే క్రమంలో ఈస్ట్ ఇండియా కంపెనీ మొదలుకొని ఈనాటి బహుళజాతి సంస్థల వరకు తమ ప్రాంతాలకు రాకుండా ప్రాణాలొడ్డి పోరాడుతున్నారు. ఈ క్రమంలో వాళ్లు ఓడిపోయారు కావచ్చు కానీ లొంగిపోలేదు. దేశంలోని ఆదివాసీ ప్రాంతాల్లోని భూమిలో లక్షల కోట్ల విలువచేసే బాక్సైట్ నిక్షేపాలు ఉన్నాయి. వీటిపై కన్నేసిన బహుళజాతి సంస్థలు భారత ప్రభుత్వ సహకారంతో అటవీ ప్రాంతాల నుండి ఆదివాసీలను తరలించే ప్రయత్నం ముమ్మరం చేసింది. ఆదివాసీలకు అండగా ఉండి ఈ దేశ సహజ వనరులు ఆదివాసీలకు దక్కాలంటున్న మావోయిస్టు పార్టీని అణిచి వేయడానికి ప్రభుత్వం ఆదివాసీ ప్రాంతాల్లో సైన్యాన్ని దింపింది. ఆదివాసీ ప్రాంతాల్లో సైన్యం కూబింగ్‌లు చేస్తూ, వారి ఇండ్లను, ఆహార ధాన్యాలను తగులబెట్టి, భయోత్పాతాన్ని సృష్టిస్తోంది. ప్రభుత్వం తెస్తున్న అణిచివేతను ఎదిరిస్తూ, బహుళజాతీ కంపెనీలను అడ్డుకుంటున్న అదివాసీలపై తీవ్ర నిర్భందాన్ని ప్రయోగించి, వందలాది మందిని జైళ్లలో సంవత్సరాల తరబడి నిర్బంధించింది. అడవి ప్రాంతాల్లో బాక్సైట్ తవ్వకాలను అడ్డుకున్నందుకు వాకపల్లి గ్రామానికి చెందిన 11 మంది ఆదివాసీ స్త్రీలపై 21 మంది గ్రేహౌండ్స్ పోలీసులు 2007 ఆగస్టు 19న అత్యాచారానికి పాల్పడ్డారు. 2010లో బల్లుగూడలో నలుగురు ఆదివాసి స్త్రీలపై స్పెషల్ పార్టీ పోలీసులు అత్యాచారానికి పాల్పడ్డారు.

# మాడ్ పై ప్రభుత్వ సాయుధ బలగాల దాడి

*ఖనిజ సంపదలను దళారీ పెట్టుబడిదారులకూ, బహుళజాతి కంపెనీలకూ దోచిపెట్టడంలో భాగంగానే భారత సైన్యం ఆదివాసులపై దాడులకు పాల్పడుతోందని అంటున్నారు* **చైతె మడావి**

ఈసారి కూడా మార్చ్ నెల దండకారణ్య ప్రజలకు నిరుటి వలెనే వినాశనాన్ని కొని తెచ్చింది. గత సంవత్సరం సరిగ్గా ఇదే నెలలో 11-16 తేదీల మధ్య దక్షిణ బస్తర్‌లోని చింతల్‌నార్ ప్రాంతంలో మోర్‌పల్లి, పులాన్‌పాడ్, తిమ్మాపురం, తాడిమెట్ల గ్రామాలపై ప్రభుత్వ సాయుధ బలగాలు విధ్వంసకర దాడి జరపగా, ఈసారి దాడికి గురైంది పాలకులు 'అబూజ్‌మాడ్'గా వ్యవహరించే మాడ్ ప్రాంతంపై. చింతల్‌నార్ విధ్వంసం గురించి, ఆ తర్వాత నిజనిర్ధారణ కోసం వచ్చిన అగ్నివేశ్ తదితరులపై జరిగిన ఇతర దాడుల గురించి అన్ని సెక్షన్ల నుండి వచ్చిన వత్తిడి మూలంగా, సుప్రీంకోర్టు ఆదేశం మేరకు చత్తీస్‌గడ్ ప్రభుత్వం సిబిఐ విచారణకు ఆదేశించిన సంగతి తెలిసిందే. సరిగ్గా ఆ 'విచారణ' జరుగుతున్న సమయంలోనే మాడ్‌పై జరిగిన ఈ అమానుష దాడి ద్వారా, మన దేశంలో అమలవుతున్నది ప్రజాస్వామ్యమని ఇంకా నమ్మేవాళ్లెవరైనా ఉంటే వాళ్లకు కనువిప్పు కాకతప్పదు.

గత జూలైలో సుప్రీంకోర్టు ఎస్‌పిఒ, కోయ కమాండోల నియామకాన్ని చట్టవిరుద్ధమని ప్రకటించి వాళ్ల చేతుల్లోని తుపాకుల్ని వెనక్కి తీసుకోవాలని తీర్పు ఇచ్చిన విషయం తెలిసిందే. చత్తీస్‌గడ్ ప్రభుత్వం తన అలవాటు ప్రకారం ఈ తీర్పును కూడా బేఖాతరు చేస్తూ ఎస్‌పిఒ/కోయ కమాండోలను 'అగ్జిలియరీ పోలీసు ఫోర్స్'గా పేరు మార్చి కొనసాగిస్తున్న సంగతి కూడా తెలిసిందే. నిరుడు 'కోయ కమాండో'ల రూపంలో వీరంగమాడిన ఫాసిస్టు మూకలు ఈసారి కొత్త కొత్త పేర్లతో సి.ఆర్.పి.ఎఫ్. (కోబ్రా), సి.ఎ.ఎఫ్., ఎస్.టి.ఎఫ్., సి-60 క్రాక్ కమాండో బలగాలతో కలిసి విధ్వంసానికి, లూటీలకు, హత్యలకు, అత్యాచారాలకు, విచ్చలవిడి కాల్పులకు పాల్పడ్డాయి.

ప్రభుత్వమే చెప్పిన ప్రకారం మూడు వేల మంది వివిధ సాయుధ బలగాలు పాల్గొన్న ఈ దాడికి 20-25 గ్రామాలు గురయ్యాయి. ఏకకాలంలో చత్తీస్‌గడ్ రాష్ట్రంలోని బస్తర్‌కు చెందిన నారాయణ్‌పూర్ జిల్లా, బీజాపూర్ జిల్లా, మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లాల నుండి - మూడు వైపుల నుండి జరిగిన ఈ దాడిలో ఒక ఆదివాసీ యువకుడు ప్రాణాలు కోల్పోగా, మరొక ఆదివాసీ యువకుడు మాయం చేయబడ్డాడు. కాగా ఎందరో ఆదివాసీ ప్రజానీకం గాయపడ్డారు. ఎన్నో చోట్ల నిరాయుధ ప్రజలపై పోలీసులు/పారామిలిటరీ బలగాలు విచ్చలవిడిగా కాల్పులు జరిపారు. పదుల సంఖ్యలో ఇండ్లను ధ్వంసం చేశారు. కొన్నింటిని కాల్చి బూడిద చేశారు. ఇండ్లల్లో దాచుకున్న లక్షల రూపాయల విలువ చేసే ప్రజల కష్టార్జితాలను లూటీ చేశారు. కాల్చివేశారు.

సల్వాజుడుం, ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ల పేరుతో గత ఏడేళ్లుగా సాగిస్తున్న విధ్వంసాల, హత్యాకాండల పరంపరలో భాగంగా 'ఆపరేషన్ విజయ్', 'ఆపరేషన్ హాకా' అనే పేర్లతో సాగించిన ఈ తాజా విధ్వంసకాండను పాలకవర్గాలు తమ 'విజయం'గా పెద్ద ఎత్తున ప్రచారం చేసుకున్నాయి. దేశ సరిహద్దుల వద్ద కాపలా కాస్తూ శత్రు దేశాల దాడుల నుండి దేశాన్ని రక్షించడానికి ఉద్దేశించిన సరిహద్దు భద్రతా బలగం, ఇండో-టిబెటన్ సరిహద్దు పోలీసు దళం, సశస్త్ర సీమా బల్‌లతో పాటు ప్రస్తుతం సైన్యాన్ని, వాయుసైన్యాన్ని కూడా దేశం నడి మధ్యన మోహరిస్తూ ఇక్కడి అత్యంత నిరుపేద జనాన్నే శత్రువుగా పరిగణించి వేటాడుతున్న రాజ్యానికి ఇది శత్రు దేశంపై సాధించిన 'విజయం' లాగా తోచడంలో ఆశ్చర్యం ఏముంది?!

ఆపరేషన్ గ్రీన్‌హంట్ రెండో దశలో భాగంగా గత సంవత్సరం జూన్ నెలలో ఒక బ్రిగేడ్ సంఖ్యలో భారత సైన్యాలు మాడ్ ప్రాంతంలో 'శిక్షణ' పేరుతో దండకారణ్యంలో ప్రవేశించిన సంగతి తెలిసిందే. మొత్తం 750 చ.కి.మీ. భూభాగాన్ని ఆక్రమించుకునే కుట్రలో భాగంగా మాడ్‌లోని అనేక గ్రామాల్ని లేకుండా చెయ్యడానికి, మొత్తంగా మాడియా

బాధితులు తమపై అత్యాచారం జరిగిందని ఏ పోలీసు స్టేషన్‌కు వెళ్లి ఎఫ్.ఐ.ఆర్ నమోదచేయమన్నా చేయలేదు. ఎఫ్.ఐ.ఆర్ నమోదు కోసం బాధితులు కోర్టుకు వెళ్లాల్సిన పరిస్థితి ఈ 'ప్రజాస్వామ్య' భారతదేశంలో ఉంది. ప్రత్యక్షంగా రాష్ట్ర ముఖ్యమంత్రికి తమ గోడును తెలుపుతూ తమకు న్యాయం జరిగేలా చూడాలన్నారు. కోర్టుల చుట్టూ తిరిగినా న్యాయం జరగకపోగా అవమానమే మిగిలింది.

గతంలో మావోయిస్టులు చేసిన కిడ్నాప్‌లను చూస్తే ఒకటి రెండు సంఘటనల్లో తప్పించి బందీలను తమ డిమాండ్లు నెరవేరలేదని చంపింది లేదు. దేశ సంపదలను కొల్లగొట్టడానికి ఆదివాసులపై హింసను అమలుచేస్తున్న ప్రభుత్వ విధానాలను, దుర్మార్గాలను బయటి ప్రపంచానికి తెలియజెప్పడమే మావోయిస్టులు చేస్తున్న కిడ్నాప్‌ల ప్రధాన ఉద్దేశమని రుజువవుతూనే ఉంది. గతంలో ఐదుగురు కలెక్టర్‌లను కిడ్నాప్ చేసినప్పటి నుండి ఎం.ఎల్.ఎ జిన్నా హిక్కాక వరకు వారి డిమాండ్లు ఏమేరకు నెరవేరినా అందరినా వదిలిపెట్టారు. అదే ప్రభుత్వం రాజ్యాంగ బద్ధంగా నియమించిన పోలీసులు మనుషులను ఎత్తుకెళ్లి సంవత్సరాలు గడిచినా వారి జాడే చెప్పడంలేదు. ఈ పరిణామాల మూల కారణాలను తెలుసుకొని వాటిని పరిష్కరించాల్సి ఉంది. అలా జరుగనంత కాలం సమస్యలు ఏదో రూపంలో సమాజం ముందుకు వస్తూనే ఉంటాయి.

*(రచయిత వీక్షణం సర్క్యులేషన్ మేనేజర్)*

వీ

ఆదివాసుల అస్తిత్వాన్నే రూపుమాపడానికి పథక రచన జరిగింది. దేశ సహజ సంపదల్ని కార్పొరేట్ వర్గాలకు దోచి పెట్టేందుకు అతి పెద్ద అడ్డంకిగా ఉన్న మావోయిస్టు ఉద్యమాన్ని దేశ అంతర్గత భద్రతకు అతి పెద్ద ప్రమాదంగా ఒక పథకం ప్రకారమే దుష్ప్రచారం చేస్తున్నారు. ముఖ్యంగా మాడ్ ప్రాంతాన్ని మావోయిస్టుల ప్రధాన స్థావర ప్రాంతమనీ, మావోయిస్టు అగ్రనేతలు మాడ్‌లోనే తలదాచుకుంటున్నారనీ, మీడియా ద్వారా ప్రచారం చేస్తూ, తద్వారా తమ దాడులకు సాధికారతను, ఆమోదాన్ని పొందవచ్చని భ్రమిస్తున్నారు.

నిజానికి మాడ్ ప్రాంతంలో దాడులు కొత్త విషయమేమీ కాదు. గతంలో వేరు వేరు ప్రాంతాల్లో వందల సంఖ్యలో పోలీసు/పారామిలిటరీ బలగాలు అక్కడక్కడ దాడులు చేసి హత్యలకు, విధ్వంసానికి, హింసకు పాల్పడ్డ సందర్భాలున్నాయి. మాడ్ అంచున ఉన్న ఇంద్రావతి నదీతీర ప్రాంతంలో 2005 నుండి సల్వాజుడుం దాడులు అనేకం జరిగాయి. పదుల సంఖ్యలో గ్రామాల్ని కాల్చి బుగ్గి చేశారు. ఎంతో మంది ప్రజలను కాల్చి చంపారు. లూటీలు, పంటల విధ్వంసం ఎంతో జరిగిపోయింది. కానీ ఇంత భారీ సంఖ్యతో మాడ్ ప్రాంతాన్ని మొత్తం మూడు వైపుల నుండి చుట్టేస్తూ ఏకకాలంలో దాడికి దిగడం ఇదే మొదటిసారి. మాడ్‌లో శిక్షణా స్కూళ్ల ఏర్పాటు పేరుతో నిరుడు బస్తర్‌లో దిగిన భారత సైన్యం మాడ్‌కు పక్కనే, కొండగాం ప్రాంతంలో మోహరించి ఉన్న నేపథ్యంలో ఇలాంటి భారీ దాడి జరిగిందనేది గమనార్హం. సైన్యం రూపొందించిన వ్యూహంతో, శత్రు దేశాలపై విరుచుకుపడే సైన్యాల మాదిరి జరిగిన ఈ దాడిలో హెలికాప్టర్లను, మానవరహిత విమానాలను, అత్యాధునిక టెక్నాలజీని, మోర్టార్స్ సహా అనేక రకాల మారణాయుధాలను పెద్ద ఎత్తున ఉపయోగించారు.

మాడ్ ప్రాంతం నుండి ఆదివాసులను ఖాళీ చేయించడం' సైన్యానికి శిక్షణా స్కూలు పేరుతో మొత్తంగా మాడ్‌ను ఆక్రమించుకోవడం' దళారీ పెట్టుబడిదార్లకు, బహుళజాతి కంపెనీలకు బస్తర్ సంపదలన్నీ దోచిపెట్టడం' వీటన్నిటినీ నిరాటంకంగా పరిపూర్తి చేయడం కోసం మావోయిస్టులను నిర్మూలించడం లక్ష్యాలుగా సాగుతున్న యుద్ధంలో భాగమే మాడ్‌పై జరిగిన ఈ తాజా దాడి.

మహారాష్ట్ర, చత్తీస్‌గడ్ పోలీసు ఉన్నతాధికారులు ఈ దాడికి పథక రచన చేశారు. కేంద్ర హోంశాఖ నక్సల్ ప్రభావిత రాష్ట్రాల డిజిపిలతో, ప్రధాన కార్యదర్శులతో గత నెల 22న జరిపిన తాజా సమావేశంలో, ఆ తర్వాత మార్చ్ 2న హోంమంత్రి చిదంబరం నిర్వహించిన వీడియో కాన్ఫరెన్స్‌లో తీసుకున్న నిర్ణయాల ప్రకారమే ఈ దాడి జరిగిందని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

పోలీసు అధికారులు ఈ దాడిని 'నక్సలైట్లపై పోలీసుల విజయం'గా పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్నారు. అసలు ఈ దాడి జరిగింది ఎవరిపైన? టార్గెట్ చేసింది ఎవరిని? హింస జరిగింది ఎవరిపై? అనే విషయాలేవీ పట్టించుకోని మీడియా పోలీసుల కథనాలకు మరింత మసాలాతో ప్రచారం సాగిస్తున్నది. అయితే నారాయణపూర్ ఎస్.పి. మీడియా వాళ్లతో మాట్లాడుతూ కొన్ని వాస్తవాల్ని కూడా చెప్పక తప్పలేదు. మాడ్‌లోని లోతట్టు గ్రామాల్లో స్కూళ్లు, ఆసుపత్రులు ఏవీ లేవని, మావోయిస్టులు కూరగాయలు, జొన్నలు తదితరాలు పండిస్తున్నారని, స్కూళ్లు నడుపుతున్నారని అన్నాడు. మరి ప్రభుత్వ నిర్లక్ష్యానికి గురైన ప్రజలు మావోయిస్టు పార్టీ ఆధ్వర్యంలో స్కూళ్లు నడుపుకోవడం, వ్యవసాయాన్ని మెరుగుపర్చుకోవడానికి కృషి చేయడం నేరమెలా అయిందో దేశ పాలకుల్ని నిలదీయాల్సిన అవసరం ఉంది. గ్రామాలతో పాటు ఈ ప్రాంతంలో విప్లవ జనతన సర్కార్ నడిపే రెండు స్కూళ్లను, రెండు వ్యవసాయ క్షేత్రాలను కూడా లక్ష్యంగా చేసుకొని సాగించిన ఈ దాడిని 'విజయం'గా ఎలా చెప్పుకుంటున్నారో ప్రతి ఒక్కరూ ఆలోచించాలి.

ఇక ఈ దాడి జరిగిన తీరుతెన్నుల్ని పరిశీలించడం ద్వారా ఇది మరింత స్పష్టమవుతుంది.

**దక్షిణాన ఇంద్రావతి అవతలి నుండి మొదలైన దాడి**

జగ్దల్‌పూర్ నుండి మార్చ్ 7న కోబ్రాలు, పోలీసులు, ఎస్‌పిఒలతో కూడిన తొమ్మిది కంపెనీల సాయుధ బలగాలు – అంటే దాదాపు 800 మంది బీజాపూర్‌కు చేరుకున్నారు. 'ఆపరేషన్ హాకా'గా చెప్పుకున్న ఈ దాడికి అక్కడే సన్నాహాలు పూర్తి చేసుకున్నారు. 11 ఉదయం ఇంద్రావతి ఒడ్డున ఉన్న బోడ్‌గా అనే గ్రామానికి చేరుకున్నారు. ఈ గ్రామంలో అనేక ఇండ్లల్లో లూటీలకు పాల్పడ్డారు. జావా అనే రైతు ఇంట్లోంచి 2,550 రూపాయలు దోచుకున్నారు. నకిరీ ఓయామివి రెండు వేల రూపాయలు దోచుకున్నారు. మాడివి బామన్ అనే రైతును విపరీతంగా కొట్టారు. దెబ్బల వలన ఆయన లేవలేకుండా అయ్యాడు. రాత్రికి వెడమ గ్రామానికి చేరుకున్నారు.

సాయుధ బలగాలు గ్రామాలపై దాడికి వచ్చిన విషయం తెలిసిన తాకిలోడ్ గ్రామ ప్రజలు, తమ గత చేదు అనుభవాల రీత్యా ముందుగానే గ్రామాన్ని ఖాళీ చేసి వెడమ గ్రామ సమీపంలోని అడవిలోకి వెళ్లి పడుకున్నారు. అలా పడుకున్న ప్రజలపై ప్రభుత్వ సాయుధ బలగాలు విచ్చలవిడిగా కాల్పులు జరిపాయి. 12న ఉదయం పోలీసులు వెడమ నుండి రేకవాయ పరిసరాల్లోకి వచ్చి అన్నం వండుకొని తిన్నారు. గ్రామంలో తమ చేతికి దొరికిన కోళ్లను ఇష్టానుసారం కోసుకొని తిన్నారు. ఇండ్లల్లోని కొన్ని వస్తువులు, నగదు కూడా దోచుకున్నారు.

12న సాయంత్రం నాయుంపార అనే చోట విప్లవ జనతన సర్కార్ నిర్వహించే ప్రాథమిక ఆశ్రమ పాఠశాలపై దాడి చేశారు. అయితే అందులో చదువుకునే పిల్లలు, టీచర్లు ముందే అడవిలోకి తప్పుకోవడంతో ఎవరికీ నష్టం జరగలేదు. ఆ రాత్రి పాఠశాలలోనే పడుకున్న జవానులు పోతూ పోతూ ఇక్కడ పిల్లలు స్నానాలు చేసే కాలువ దగ్గర ఒక బాంబును అమర్చి తమ హంతక స్వభావాన్ని చాటుకున్నారు. మరుసటి రోజు రాత్రి చీకటి పడ్డ తర్వాత కుమ్మం అనే చిన్న పల్లెకు చేరుకున్నారు. ఆ పల్లెలో ఇండ్లల్లోకి జొరబడి బలవంతంగా బియ్యం, ఇతర తిండి సరుకుల్ని దోచుకొని వంట చేసుకున్నారు. గెరిల్లాలు ఎదురుదాడి చేసే అవకాశం ఉందని భయపడి ఇండ్లన్నీ ఆక్రమించుకొని ప్రజల్ని బైటికి నెట్టేసి పడుకున్నారు. మరుసటి రోజు అక్కడి నుండి గుట్టలు దిగి తాడిబల్ల అనే గ్రామానికి చేరుకున్నారు. అక్కడ చాలా మంది ప్రజల్ని పట్టుకొని అందులోంచి కొందరిని వదిలేసి మిగతా వాళ్లను తమ వెంట తీసుకొని నది దాటిపోయారు. అలా కొట్టి వదిలేసిన కొందరి చేతుల్లో 20, 30, 50 రూపాయల్ని కూడా ఉంచారు. బహుశా వాళ్ల గ్రీన్‌హంట్‌లో 'సివిక్ యాక్షన్ ప్రోగ్రాం' కూడా భాగం కాబట్టి ఇలా డబ్బులివ్వాలని నిశ్చయించుకున్నారేమో! తాడిబల్ల గ్రామం వద్ద అడవిని నరికి హెలికాప్టర్ దిగేలా ఏర్పాట్లు కూడా చేసుకున్నారు. హెలికాప్టర్ ద్వారా బలగాలకు ఆహారాన్ని, ఇతర వస్తువుల్ని కూడా అందజేశారు.

బీజాపూర్–జగ్దల్‌పూర్ రోడ్డు మీదుండే మాట్వాడా నుండి మరో మూడు కంపెనీల బలగాలు దాదాపు ఇదే సమయంలో బయలుదేరాయి. వీళ్లు గుడ్రా అనే గ్రామం దగ్గర ఇంద్రావతి నదిని దాటి రేకపారకు వచ్చారు. ఈ గ్రామ సమీపంలోని అడవిలో జీలి, గోంగ్లా గ్రామాలకు చెందిన 22 మంది ప్రజల్ని పట్టుకున్నారు. కొంత మంది ప్రజలు వాళ్లను చూసి పారిపోతుండగా వాళ్లపై కాల్పులు జరిపారు. పట్టుకున్న ప్రజల్ని వెంట బెట్టుకొని గుట్టల్ని ఎక్కి కుమ్‌నార్ అనే కుగ్రామంపై దాడి చేసారు.

ఈ గ్రామంలో తమ కంటబడిన మహిళల్ని బాగా కొట్టారు. బుద్రు ఓయామి అనే ఒక వ్యక్తిని పట్టుకెళ్లారు. ఆ తర్వాత అతన్ని తప్పుడు కేసుల్లో ఇరికించి జైలుకు పంపారు. ఈ గ్రామంలోని అన్ని ఇండ్లలోకి దూరి ఇష్టం వచ్చినట్టుగా దోపిడీకి పాల్పడ్డారు. బుద్రు ఇంట్లోంచి 5 వేలు, పాయికే అనే మహిళ ఇంట్లోంచి 6 వేల రూపాయల్ని ఎత్తుకెళ్లారు. ఇంకా అనేక ఇండ్లల్లో ప్రజలు దాచి పెట్టుకున్న డబ్బుల్ని లూటీ చేశారు. ఒక రైతుకు చెందిన 'కోహల' (తెలుగులో 'సామలు'గా పిలిచే తృణ ధాన్యం – మాడ్ ప్రజల ప్రధాన ఆహార ధాన్యం) నిల్వచేసి ఉంచిన 'బడ్డీ' (గాదె)ని కాల్చివేశారు. దీంతో సంవత్సరం పాటు ఇంటిల్లిపాది కడుపు నింపాల్సిన ధాన్యం ఒక్క క్షణంలో కాలి బుగ్గయింది.

ఇంకా ఈ దాడిలో సాయుధ బలగాలు ప్రజలు చేపలు పట్టడానికి ఉపయోగించే వలలను కూడా కాలబెట్టారు. వీటి విలువ 10 వేల రూపాయల దాకా ఉంటుంది. ప్రజలు వేటాడి తమ ఇండ్లలో నిల్వ చేసుకున్న ఎండు మాంసాన్ని ఎత్తుకెళ్లారు. చాలా మంది ఇండ్లలో జొరబడి బట్టలు ఎత్తుకెళ్లారు. రెండు భర్మార్లు ఎత్తుకెళ్లారు.

ఈ బలగాలకు బీజాపూర్ ఎస్.పి.తో పాటు మరో ఎస్.పి. స్థాయి అధికారి ప్రత్యక్షంగా నాయకత్వం వహించాడు. వీళ్లు తమతో పాటు అత్యాధునిక మారణాయుధాలతో పాటు కంప్యూటర్స్, జి.పి.ఎస్. ఉపకరణాలు, శాటిలైట్ ఫోన్స్ తెచ్చుకున్నారు. అలాగే తేలికపాటి మానవరహిత విమానాల్ని (యు.ఏ.వి.) కూడా వెంట తెచ్చుకున్నారు. తక్కువ బరువుండి, మోయడానికి వీలుగా, ఏ భాగానికి ఆ భాగం విప్పదీసి, తిరిగి అమర్చుకునే వీలున్న యు.ఏ.వి.ని దాదాపు ప్రతి చోటా ఎగరవేస్తూ తామున్న పరిసరాల్లో దాన్ని తిప్పుతూ ఎక్కడైనా గెరిల్లాల కదలికలున్నాయా అని అది తీసే ఫోటోల ద్వారా నిర్ధారించుకున్నారు. బోడ్‌గా, రేకవాయ గ్రామాల్లో ఆగినపుడు వీటిని ఎగరవేశారు. అలా ఈ బీభత్సకర దాడిని హైటెక్ దాడిగా కూడా చెప్పుకోవాలి.

ముందే చెప్పినట్టుగా, పోలీసులు చాలా చోట్ల ప్రజల్ని విపరీతంగా కొట్టడం, ఆ తర్వాత వాళ్ల చేతిలో డబ్బులు పెట్టడంతో పాటు కొందరికి తమతో పట్టుకొచ్చిన కొన్ని బట్టల్ని పంచిపెట్టారు! చాలా మందిని కేవలం పిఎల్‌జిఎ తమపై దాడి చేయకుండా ఉండేందుకే రక్షణ కవచంగా వెంట బెట్టుకున్నారు. అయితే ప్రతి చోటా కూడా మహిళలు సాయుధ బలగాల వెంటపడ్డారు. తమ వాళ్లను వదిలెయ్యాలని వాళ్లతో ఘర్షణ పడ్డారు. చివరికి భైరంగఢ్ దాకా కూడా వాళ్ల వెన్నంటే వెళ్లి విడిపించు కొచ్చారు.

రేకపార దగ్గర పట్టుబడ్డ జీలి గ్రామానికి చెందిన 11 మందిని భైరంగఢ్ వరకు పట్టుకెళ్లారు. వీళ్లలో లచ్చు, బుద్రు, సుఖ్‌రాంలను బాగా కొట్టారు. దెబ్బల వల్ల బుద్రుకు మూత్రం బందయింది. అందరినీ ఒక రోజు ఉంచుకొని ఫోటోలు తీసుకొని, అందరికీ కలిపి 500 రూపాయలు ఇచ్చి 10 మందిని వదిలేశారు. బుద్రును తప్పుడు కేసుపై జైలుకు పంపారు.

రేకపార దగ్గర సాయుధ బలగాలకు దొరికిపోయిన గోంగ్లా గ్రామానికి చెందిన తొమ్మిది మందిలో లచ్చు ఓయామిని తప్పుడు కేసులో జైలుకు పంపారు. మిగిలిన వాళ్లను భైరంగఢ్ దాకా తీసుకెళ్లి కొన్ని డబ్బులిచ్చి వదిలిపెట్టారు.

మొత్తంగా ఈ ప్రాంతంలో పట్టుకున్న వాళ్లలో 10 మందిపై అక్రమ కేసులు మోపి జైలుకు పంపించారు – నాయుంపార గ్రామానికి చెందిన మడ్కామి ముసుర్ (32), ఓయామి కుమ్మా (45), మాడివి గుడ్డి (55), బోదగా గ్రామానికి చెందిన ఓయామి బుదు (33), ఓయామి హిడ్‌మా (35), బడేపల్లి గ్రామానికి చెందిన ఓయామి చైతు (40), పదామి సోముడు (35), కుమ్‌నార్‌కు చెందిన ఓయామి బుద్రు (23), గోంగ్ల గ్రామానికి చెందిన ఓయామి లచ్చు (25), జీలి గ్రామానికి చెందిన కుంజాం సుద్రు (35).

**నారాయణ్‌పూర్ వైపు నుండి సాయుధ బలగాల దాడి**

జిల్లా కేంద్రమైన నారాయణ్‌పూర్‌లో ఈ దాడికి సన్నాహాలు మార్చ్ 5 నుండే మొదలయ్యాయి. 13 రాత్రి బలగాలు బయలుదేరాయి. 14న వివిధ సాయుధ బలగాలకు చెందిన దాదాపు వెయ్యి మంది కోహ్కామెట్ట గ్రామం చేరుకొని, వేరే వైపు పోతున్నట్టుగా నటించి కచ్చాపాల్ గ్రామ పొలిమేరల్లోకి చేరుకున్నారు. ఇక్కడ ఊళ్లో నుండి పొలాల వైపు పోయే తోవకు ఆంబుష్ కూర్చున్నారు.

కచ్చాపాల్‌కు చెందిన సోను, రాజు అనే ఇద్దరు గ్రామస్తులు ఈ ఆంబుష్‌లో ఇరుక్కున్నారు. సాయుధ మూకలు వీళ్లపై విచ్చలవిడిగా కాల్పులు జరిపారు. సోను కాలికి తూటా తగిలి తీవ్రంగా గాయపడ్డాడు. అయినప్పటికీ అతను పరుగెత్తి తప్పించుకున్నాడు. రాజు మాత్రం పోలీసుల చేతికి చిక్కిపోయాడు. అతన్ని పట్టుకొని విపరీతంగా కొట్టి వదిలేశారు. ఆ దెబ్బల వలన చాలా రోజుల పాటు అతనికి నోట్లోంచి రక్తస్రావం జరిగింది.

**సాయుధ బలగాల విధ్వంసకాండకు గురైన తోకె**

15 సాయంత్రం 3 గంటలకు తోకె గ్రామంలోకి జొరబడే ముందు గ్రామ శివార్లలోనే విచ్చలవిడిగా కాల్పులు జరిపి, తర్వాత గ్రామాన్ని చుట్టుముట్టి ప్రజలపై విరుచుకుపడ్డారు. కేయె ధుర్వా అనే రైతు ఇంటిని పూర్తిగా కాలబెట్టారు. ఇంటితో పాటు ఇంట్లో ఉన్న సామాను, బియ్యం, కోహల ధాన్యం, బట్టలు, వంటపాత్రలు, 16 వేల రూపాయల నగదు కాలిపోయాయి. ఒక పంది కూడా మంటల్లో చిక్కుకొని కాలి చనిపోయింది.

కాళ్లకు సంబంధించిన వ్యాధితో బాధపడుతున్న బోతల్ దుంగ (45) అనే ఆదివాసీ నడవలేడు. ఇతన్ని బాగా కొట్టి ఈడ్చుకుపోతుంటే పక్కటెముకల ప్రాంతంలో గాయమై రక్తం కారింది. తర్వాత ఈ రైతు చేతిలో 20 రూపాయలు పెట్టబోయారు. తీసుకోవడానికి అతను నిరాకరిస్తే, అతని ముందు పడేసి పోయారు. ఇదీ వీళ్లు 'ప్రజల హృదయాల్నీ, మనస్సుల్నీ గెల్చుకునే' తీరు!

తర్వాత దుంగ ధుర్వా (38) అనే రైతును విపరీతంగా కొట్టి, తుపాకీ మడమలతో బాది అక్కడికక్కడే ప్రాణాలు తీశారు. దుంగకు భార్యాపిల్లలున్నారు.

మున్న పుల్‌సో (20) ఇంటి మీద దాడిచేసి విధ్వంసం సృష్టించారు. జబ్బుపడి ఇండ్లల్లో ఉండిపోయిన ప్రజలను కొట్టడానికి ప్రయత్నించారు. అడ్డం వెళ్లిన మహిళలను కొట్టారు. తర్వాత అక్కడే ఉన్న కొంతమందికి 20 రూపాయల చొప్పున పంచి పెట్టారు.

ఇదే గ్రామంలో ఉన్న ఆశ్రమ పాఠశాలలోకి వెళ్లి పిల్లలకు బిస్కెట్లు పంచారు. అవి అదే గ్రామంలో మరొకరి ఇంట్లోంచి ఎత్తుకొచ్చినవి. ఆశ్రమ పాఠశాలలో ఉన్న సోలార్ లైట్లు, బ్యాటరీలను పగులగొట్టారు. ఇది 'ప్రజాస్వామ్యబద్ధం'గా ఎన్నికైనట్టు చెప్పుకునే ప్రభుత్వం నడిపే పాఠశాల అన్నది గమనార్హం. పైగా వీళ్లు పగులగొట్టిన సోలార్ లైట్లు, బ్యాటరీలు వేరే ఎవరివో కాదు, ప్రభుత్వమే స్కూలుకు మంజూరు చేసినవి. మొత్తంగా గ్రామంలో చాలా మందిని కొట్టి, హింసించి, చాలా ఇండ్లు దోచుకున్న తర్వాత వాటికి బదులుగా అందరికీ కలిపి పంచిన నగదు డబ్బు మొత్తం 240 రూపాయలు!

తోకె నుండి కోడెనార్ గ్రామానికి పోయే దారిలో ఉన్న ఒక కోహల బడ్డీని కూడా కాల్చివేశారు. గ్రామంలో 4-5 కుటుంబాల వాళ్లవి మొత్తం 20-25 కోళ్లు దొంగిలించి తిన్నారు. వత్తె వడ్డె అనే 15 ఏళ్ల పిల్లవాడిని కొట్టుకుంటూ పట్టుకుపోయారు. మున్న ఇంటిలోనివే కాకుండా గోటుల్‌లో, ఇతరుల ఇండ్లల్లో ఉన్న పెద్ద పెద్ద డోళ్లను కూడా కత్తులతో కోసివేశారు. డోళ్లకు ఆదివాసుల జీవితంలో చాలా ప్రాముఖ్యత ఉంటుంది. పుట్టుక, పెళ్లి, చావులతో పాటు, ప్రతి సామాజిక, సాంస్కృతిక కార్యకలాపం డోలు, తదితర వాయిద్యాలతో ముడిపడి ఉంటుంది. తాము ఆపదలో పడ్డప్పుడు, అనుకోని విపత్తులు ఎదురైనపుడు కూడా డోళ్లు వాయించడం ద్వారానే చుట్టుపక్కల గ్రామస్తులందరినీ అప్రమత్తం చేస్తారు, సమైక్యం చేస్తారు. ఇందువల్ల కూడా ప్రభుత్వ సాయుధ బలగాలకు డోళ్లంటే కోపం. అలా దీనిని ప్రజలపై భౌతికంగానే కాదు, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక తదితర ప్రజాజీవన పార్శ్వాలన్నిటిపై జరిగిన దాడి అని చెప్పుకోవాలి.

**గడ్చిరోలి వైపు నుండి బలగాల ఆక్రమణ**

దాదాపు వందేళ్ల క్రితం ఆదివాసులు భూంకాల్ తిరుగుబాటు చేసినపుడు బస్తర్ ప్రాంతానికి సైనిక బలగాలు ఏకకాలంలో అప్పటి సెంట్రల్ ప్రావిన్స్ కిందకు వచ్చే నాగపూర్, జబల్‌పూర్‌లతో పాటు మద్రాసు, రాయపూర్ తదితర చోట్ల నుండి బయలుదేరి అణచివేతకు పూనుకున్న విషయం ఇక్కడి చరిత్రతో పరిచయం ఉన్న వాళ్లకు తెలిసే ఉంటుంది. ప్రస్తుత దాడి కూడా, శత్రు దేశంపై పడ్డట్టుగా ఏకకాలంలో రెండు రాష్ట్రాల నుండి పూర్తి సమన్వయంతో జరిగింది. సరిగ్గా మార్చ్ 14 నాడే మహారాష్ట్ర వైపు నుండి కూడా కోబ్రాలు, సి-60 కమాండోలు, పోలీసులు కలిసి దాదాపు 800 మంది మాడ్‌పై దాడికి బయలుదేరారు. నెయ్‌బెరెడ్ నది వెంట కాలి నడకన బయలుదేరిన బలగాలు పోదెవాడ గ్రామానికి చెందిన ముగ్గురిని పట్టుకున్నారు. వాళ్లలో ఇద్దరిని వదిలేసి ఒకరిని పట్టుకొని అడవి గుండా వెళ్లి గొడ్డెల్‌మర్క అనే కుగ్రామంపై మొట్టమొదట దాడి చేశారు. లాల్సు వడ్డె అనే 28 ఏళ్ల యువకుడిని, అతని తమ్ముడైన బిటియ వడ్డె (21)ను పట్టుకున్నారు. అన్నాదమ్ములిద్దరినీ బాగా కొట్టారు. వీళ్లను కట్టేసి తీసుకెళుతుంటే లాల్సు భార్య అడ్డం తిరిగినందుకు ఆమెను కూడా కింద పడేసి బాగా కొట్టారు. బిటియ ఇంట్లోంచి 1500 రూపాయల్ని కూడా దోచుకున్నారు. దాదాపు అన్ని ఇండ్ల నుండి బియ్యం, తిండి దినుసులు, కోళ్లు, గుడ్లు తదితరాలు లూటీ చేశారు. జైని గోట అనే గ్రామ మహిళపై కాల్పులు జరపగా తూటా ఆమె చేతిని చీరుకుంటూ వెళ్లింది.

15న తెల్లవారక ముందే ఈకోనార్ గ్రామాన్ని చుట్టుముట్టారు. ఈ గ్రామంలో సొందు అనే ఆదివాసీ ఇంటిపై దాడి చేశారు. ఆయన పోలీసుల్ని చూసి పరుగెత్తగా విపరీతంగా కాల్పులు జరిపారు. కానీ అతను క్షేమంగా తప్పుకోగలిగాడు. తర్వాత అతని ఇంట్లోంచి బియ్యం, బట్టలు, కంబళ్లు, చీరలు... అన్నింటినీ బయటికి తెచ్చి కాలబెట్టారు. వాళ్లు ఇంట్లో నిలువ చేసుకున్న 9 క్వింటాళ్ల ధాన్యాన్ని లూటీ చేశారు, కొంత కాలబెట్టారు. అన్ని ఇండ్లలోంచి సామాన్లను ఎత్తుకెళ్లారు. ఎత్తుకెళ్లని వాటిని నష్టపరిచారు. 3 బర్మార్ తుపాకులు, 4 గొడ్డళ్లు తదితర పనిముట్లను ఎత్తుకెళ్లారు. ఇక్కడ కూడా కోళ్లను దోచుకున్నారు. మంగ్లు అనే అతని ఇంట్లోంచి 3800 రూపాయల నగదుతో పాటు బట్టలు, బియ్యం దోచుకున్నారు. ఈ గ్రామం నుండి ఛన్ను పొడాడి అనే పదిహేనేళ్ల పిల్లవాడిని పట్టుకొని విపరీతంగా కొట్టారు. అతనిని బాల యాక్షన్ టీం కమాండర్‌గా చిత్రిస్తూ తప్పుడు కేసులు మోపి జైలుకు పంపించారు. పొలి అనే వృద్ధురాలిపై కోబ్రా కమాండోలు విరుచుకుపడి విపరీతంగా కొట్టి ఆమె చేతిలో వంద రూపాయలు పెట్టారు. లచ్చు, నంగి, మాలు అనే వాళ్లను కూడా కొట్టి పడేసి రూపాయలు చేతిలో ఉంచారు. బయ్యో అనే మహిళను తుపాకీ మడమలతో కొట్టారు. డబ్బులు తీసుకోవడానికి నిరాకరించిన వాళ్లను మళ్లీ కొట్టారు.

ఈ బ్యాచ్ 16వ తేదీ ఉదయం జట్‌వార్‌కి వెళ్లింది. తోకె వైపు నుండి కోడెనార్ గ్రామం మీదుగా వచ్చిన ఛత్తీస్‌గఢ్ బ్యాచ్‌తో వీళ్లు కలిశారు. అటు నుండి వస్తూ వస్తూ వాళ్లు కోడెనార్‌లో కూడా విధ్వంసానికి, లూటీకి పాల్పడ్డారు. రెండు ఇండ్లను దోచుకున్నారు. రెండు బ్యాచ్‌ల వాళ్లు కలిసి జట్‌వార్ గ్రామంలో విచ్చలవిడి విధ్వంసానికి పాల్పడ్డారు. ఇండ్లలోంచి ధాన్యాన్ని, తిండి దినుసుల్ని, నగదును, విల్లు బాణాలను, కోళ్లను, కోడిగుడ్లను, పొగాకును, గొడ్డళ్లను, టార్చ్‌లైట్లను, అద్దాలను, రేడియోలను, బట్టలను, ఆఖరుకు చెప్పుల్ని కూడా వదలకుండా దోచుకున్నారు. గ్రామంలో ఒక ఇంటిని, పొలాల్లోని ఒక గుడిసెను కాల్చివేశారు. గోంగ్లు అనే వ్యక్తి ఇంట్లోంచి 2500 రూపాయల విలువ చేసే డివిడి ప్లేయర్‌ను దోచుకెళ్లారు. లాల్సు అనే రైతు ఇంట్లోంచి 7 వేల రూపాయల నగదును దోచుకున్నారు. ఇతర వస్తువులతో పాటు సుక్కో ఇంట్లోంచి 1700, పర్సా ఇంట్లోంచి 700 రూపాయల నగదును దోచుకున్నారు. ఈ మూడు గ్రామాల్లో వీళ్లు దోచుకున్న మొత్తం నగదు డబ్బు 20 వేలకు పైగానే ఉంటుంది. పోలీసుల దాడి గురించి ముందే కబురందడంతో ఈ గ్రామస్తులు ఎవరూ పట్టుబడలేదు కానీ ఏదో పనిపై ఈ గ్రామానికి వచ్చిన కోడేనార్ గ్రామ పూజారి ఎడమ కారెను (45) పోలీసులు పట్టుకెళ్లారు.

అయితే ఈ దాడి మొత్తం సాఫీగా, ప్రతిఘటన ఏమీ లేకుండా సాగలేదు. ఈకోనార్, జట్‌వార్ గ్రామాల మధ్య, జట్‌వార్ దగ్గర కొందరు పి.ఎల్.జి.ఎ. గెరిల్లాలు, ప్రజా మిలిషియా సభ్యులు కలిసి ఈ కిరాయి సాయుధ బలగాలపై ఎంతో సాహసంతో, దాదాపు ఆరు సార్లు

ఎదురుదాడి చేశారు. ప్రతిఘటన ద్వారా తమ గ్రామాల్ని, ఆస్తిపాస్తులను, పంటలను కాపాడుకోవడానికి ఎంతో పట్టుదలతో ప్రయత్నించారు. వీళ్ల ప్రతిఘటనలో ఇద్దరు కోబ్రా కమాండోలు తీవ్రంగా గాయపడ్డారు. వీళ్లని తీసుకెళ్లడానికి హెలికాప్టర్ జట్‌వార్‌కు వచ్చింది. అయితే గెరిల్లాలు, మిలిషియా సభ్యులు హెలికాప్టర్‌ను కూడా వదలకుండా తేనెటీగల్లాగా దాని వెంటబడ్డారు. 16న పొద్దంతా వందలాది కిరాయి సాయుధ బలగాలకు, పిడికెడు పి.ఎల్.జి.ఎ./మిలిషియా బలగాలకు మధ్య అనేక దఫాలుగా పోరు సాగింది. సాయుధ బలగాలు వందల, వేల తూటాల్ని కాలుస్తూ, విచ్చలవిడిగా మోర్టార్ షెల్స్ వేస్తూ బీభత్సాన్ని సృష్టించినా ప్రజా మిలిషియా చెదిరిపోలేదు, బెదిరిపోలేదు. మిలిషియా సభ్యులు తమ దగ్గరున్న బర్మార్లు వంటి నాటు ఆయుధాలతోనే కాల్పులు జరుపుతూ హెలికాప్టర్‌ను ముప్పుతిప్పలు పెట్టారు. చివరికి ఎలాగోలా గాయపడ్డ వాళ్లను తీసుకెళ్లగలిగారు. సాయుధ బలగాల కోసం తిండి సామాగ్రిని అందించడం కోసం మరోసారి హెలికాప్టర్ వచ్చింది. కింద ఉన్న కిరాయి కోబ్రా బలగాలు ప్రతిఘటనకు భయపడి వీటిని అందుకోవడం కోసం దాని దగ్గరికి కూడా రాలేకపోయాయి. దాంతో హెలికాప్టర్ జార విడిచిన తిండి, రొట్టెలు, బిస్కెట్స్ వగైరా పిఎల్‌జిఎ, ప్రజలు జప్తు చేసుకొన్నారు. ఈ ప్రతిఘటనే లేకుంటే మరెంతో విధ్వంసానికి పాల్పడేవారనేది స్పష్టం.

అరెస్టు చేసిన వాళ్లను విడిపించుకోవడం కోసం వాళ్ల కుటుంబ సభ్యులు నారాయణ్‌పూర్ వెళ్లారు. వీళ్లలో ఇద్దరిని 21 సాయంత్రం విడిచిపెట్టారు. తోకె గ్రామానికి చెందిన వత్తె వడ్డె అనే పిల్లవాడిని విడిపించుకోవడానికి థానేదార్‌కు అతని తల్లిదండ్రులు 3 వేల రూపాయల లంచం ఇచ్చారు. కోడెనార్ పూజారి విడుదల కోసం అతని కుటుంబ సభ్యులు 2,000 రూపాయలు చెల్లించారు. పోలీసులు తాము సాధించిన ఈ 'విజయానికి' సాక్ష్యంగా మొత్తం 13 మందిని – నారాయణ్‌పూర్ జిల్లాలో ముగ్గురిని, ఇంద్రావతి ఏరియా (బీజాపూర్ జిల్లా)లో 10 మందిని అరెస్టు చేసినట్టు చూపారు. నారాయణ్‌పూర్‌లో అరెస్టుగా చూపిన వాళ్లలో ఈకోనార్‌కు చెందిన ఛన్ను పొదాడి, గొడ్డెల్‌మర్కకు చెందిన బిటియ, ఘాసీ అనే మరో వ్యక్తి ఉన్నారు. అయితే గొడ్డెల్‌మర్క గ్రామానికి చెందిన లాల్సును ఏం చేశారో తెలియడం లేదు. అరెస్టు చేస్తామని చెబుతున్న 'మావోయిస్టు'లలో అతని పేరు లేదు. అతన్ని విడిచిపెట్టనూ లేదు. పట్టుకున్నప్పుడే అతన్ని బాగా కొట్టారని గ్రామస్తులు చెబుతున్నారు. పోలీసులు పోయేటపుడు రెండు శవాల్ని కూడా తీసుకెళ్లారనే ప్రచారం కూడా జరిగింది. దీనితో లాల్సును బహుశా తోవలోనే చంపేసి శవాన్ని పూడ్చిపెట్టి ఉంటారని ప్రజలందరూ ఆందోళన చెందుతున్నారు.

దాడి తర్వాత ఎస్.పి. మయంక్ శ్రీవాస్తవ్ మీడియా వాళ్లతో విజయగర్వంతో పొంగిపోతూ మాట్లాడాడు. తమకు గెరిల్లాలతో మొత్తం 8 సార్లు ఎన్‌కౌంటర్స్ జరిగాయని 12 నుండి 15 మంది దాకా మావోయిస్టులు మరణించి ఉంటారని, అయితే శవాలు తమకు దొరకలేదని బొంకాడు. తాము తోకె గ్రామంలో తుపాకీ మడమలతో కొట్టి చంపిన దుంగ ధుర్వ గురించి మాత్రం ప్రస్తావించలేదు.

గ్రామాల్లో ప్రజలపై అమానుష దాడులకు పాల్పడుతూనే చాలా మంది చేతుల్లో రూపాయల నోట్లు పెట్టడం ఈ దాడిలో ఒక కొత్త అంశం. సామ్రాజ్యవాద ఎల్.ఐ.సి. వ్యూహంలో 'ప్రజల హృదయాల్నీ, మనస్సుల్నీ గెల్చుకునే' పథకం ఒకటుంది. ఇందుకోసం కేంద్ర, రాష్ట్రాల పోలీసు బలగాలకు ప్రభుత్వాలు వందల కోట్ల రూపాయలు మంజూరు చేస్తున్నాయి. దండకారణ్యంలో తిష్ట వేసిన వివిధ పారామిలిటరీ బలగాలు ఈ డబ్బులతో సివిక్ యాక్షన్ ప్రోగ్రాం (సి.ఎ.పి.) పేరుతో తరచుగా గ్రామాల్లో ప్రజలను బలవంతంగా కుప్పేసి కంబళ్లు, బట్టలు, గిన్నెలు, మందులు, సైకిళ్లు వంటివి పంచి పెడుతున్నాయి. తీసుకోమని అంటే బెదిరిస్తున్నాయి. అలా తాము ఉన్నది ప్రజల కోసమేనని నమ్మించగలమని వాళ్ల భ్రమ. ఫిబ్రవరి 22న జరిగిన మీటింగ్‌లో చిదంబరం నొక్కి చెప్పిన అంశాల్లో 'అణచివేత చర్యల సందర్భంగా ప్రజల మనోభావాలను దృష్టిలో పెట్టుకోవాల'నేది కూడా ఒకటి. మాడ్‌లో ఈ దాడి సందర్భంగా ప్రజల మనోభావాలను ఎంత చక్కగా గౌరవించారో, 'సివిక్ యాక్షన్'ను ఈ దాడిలో ఎంత బాగా మేళవించారో విడిగా చెప్పనక్కర లేదు!

పోలీసు అధికారుల అహంభావపూరిత ప్రకటనలు, ఈ దాడిలో వాళ్లు సాధించిన 'విజయాలు'గా పేర్కొన్న అరెస్టులు, అసలు వాళ్లు ప్రకటించుకున్న లక్ష్యాలు... ఇవన్నీ ఈ దాడి దేనికి వ్యతిరేకంగా, దేన్ని సాధించడం కోసం జరిగింది అనేది స్పష్టం చేస్తున్నాయి. ఈ దాడి జరిగింది ప్రజల పైననే. ఇది 2009 మధ్య నుండి సాగుతున్న 'ప్రజలపై యుద్ధం' (ఆపరేషన్ గ్రీన్‌హంట్)లో భాగమే. సి.పి.ఐ. (మావోయిస్టు) నాయకత్వంలో ప్రజలు స్వావలంబన, సహకారంలపై ఆధారపడి దండకారణ్యంలో ముందుకు తెస్తున్న ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను రూపుమాపడమే దీని లక్ష్యం. నిజానికి రేపు సైన్యం పూర్తి స్థాయిలో చేయబోయే దాడికి ఇదొక రిహార్సల్ కూడా. ఇదొక హెచ్చరిక కూడా. మావోయిస్టు రాజకీయాలను అనుసరిస్తే, పాలకవర్గాలు అమలు చేస్తున్న వినాశకర, విస్థాపన విధానాల్ని, బూటకపు అభివృద్ధి నమూనాను తిరస్కరిస్తే ఇదే గతి పడుతుందని ప్రజలకు పాలకులు చేస్తున్న హెచ్చరిక.

ఈ అన్యాయమైన యుద్ధాన్ని ప్రతి ఒక్కరూ ముక్తకంఠంతో ఖండించాలి. పాలకులు వల్లించే శుష్కమైన శాంతి వచనాల్ని, 'అభివృద్ధి' వాగుడును తోసిపుచ్చి న్యాయం పక్కన దృఢంగా నిలబడాలి. ఈరోజు ఈ దాడి జరిగింది సభ్య సమాజంగా చెప్పుకునే దానికి చాలా దూరంలో విసిరేసినట్టు ఉన్న అత్యంత వెనుకబడిన ప్రాంతంలోనే కావచ్చు. కానీ ఈ దాడికి పూనుకున్న శక్తులు విసురుతున్న పంజా కేవలం ఇక్కడికే పరిమితం కాదు. వాళ్లు చెబుతున్నట్టుగా ఇది కేవలం మావోయిస్టులపైనే యుద్ధం కాదని ప్రతి ఒక్కరూ గుర్తించాలి. మొత్తంగా జల్–జంగల్–జమీన్‌పై హక్కు కోసం నినదిస్తున్న ఆదివాసులందరిపై యుద్ధం ఇది. స్వావలంబనను, ప్రజాస్వామ్యాన్ని, శాంతిని, సార్వభౌమత్వాన్ని కోరుకునే దేశ ప్రజలందరిపైనా యుద్ధం ఇది. దీని వెనుక సామ్రాజ్యవాదం, ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాదం ఉంది. కార్పొరేట్ దోపిడీదొంగలున్నారు. అండగా బలమైన కార్పొరేట్ మీడియా ఉంది. ఈ యుద్ధాన్ని ఇప్పుడే, ఇక్కడే... అతి ప్రాచీన మానవ సమాజాలు నివసిస్తున్న, గొప్ప సాంస్కృతిక, పోరాట వారసత్వం గల ఈ ప్రాంతాల్లోనే అడ్డుకోకపోతే, ఇప్పుడే గట్టిగా గొంతు విప్పకపోతే, ఈ దాడిని వెంటనే ఆపాలని నినదించకపోతే మన దేశాన్ని, మన సహజ సంపదల్ని మనం రక్షించు కోలేం. ఇది ఒక మాడ్ ప్రాంతంలో బతికే అనామక ఆదివాసుల అస్తిత్వానికి సంబంధించిన ప్రశ్నే కాదు, మొత్తంగా దేశ భవిష్యత్తుతో ముడివడిన ప్రశ్న కూడా.

*(రచయిత సామాజిక ఉద్యమ కార్యకర్త)*

# గుజరాత్ గాయానికి పదేళ్లు

*ఈ దేశ ప్రజలపైన హిందూ మతోన్మాద కత్తి వేలాడుతోందనీ, దానిని చైతన్యంతో, అప్రమత్తతతో ఎదుర్కోవాల్సి ఉందనీ అంటున్నారు* **డి.వి. రామకృష్ణారావు**

గుజరాత్ మారణకాండకు పదేళ్లు. ఆ మారణకాండలో మూడు వేలకు పైగా ముస్లింలు చనిపోగా, లక్షలాది మంది తమ బతుకుదెరువు నుంచి, జీవితం నుంచి బయటకు విసిరివేయబడ్డారు. 2002 ఫిబ్రవరి 27న గోద్రా రైలు దహనంలో 59 మంది కరసేవకులు చనిపోవడం, తదనంతర పరిణామాల్లో ముస్లింలపై మారణకాండ జరిగింది. రైలు దహనంతో సంబంధంలేని అమాయక ప్రజానీకంపై ప్రతీకార హింసాకాండ జరిగింది. ఈ హత్యకాండకు మోడీ ప్రభుత్వ ప్రత్యక్ష, పరోక్ష సహకారం ఉన్నట్లు ఆరోపణలు ఉన్నాయి. ముస్లిం ప్రజానీకం సజీవ దహనాలకు, మానభంగాలకు, హత్యలకు గురయ్యారు. గర్భిణులను సైతం అమానుషంగా పొడిచి చంపారు. పదేళ్లు గడిచిపోయినా బాధితులకు న్యాయం జరగలేదు. గుజరాత్ హింసాకాండకు సంబంధించిన నిజనిజాలను పక్కదారి పట్టిస్తూ, ఏళ్లతరబడి దర్యాప్తును కొనసాగిస్తూ, నివేదికల్ని మోడీ ప్రభుత్వం తొక్కి పడుతోందని సర్వత్రా నిరసనలు వ్యక్తమవుతూనే ఉన్నాయి. మరో పక్క మాలెగావ్ నుండి హైదరాబాద్ దాకా పేలుళ్ల ఘటనల వెనక హిందూత్వ శక్తులే ఉన్నాయన్న సంగతి ఒక్కొక్కటిగా బయట పడడం తెలిసినదే. సమాజంలో ఒక సమూహ ప్రజానీకం పట్ల దుర్మార్గమైన హింసాకాండ అమలు జరపడం, దోషులను పదేళ్లైనా పట్టుకోక పోవడం, శిక్షించక పోవడం వలన బాధితులు అనివార్యంగా తమకు తోచిన పద్ధతులలో ప్రతికారానికి పూనుకొని సమాజంలో నేర ప్రవృత్తి ప్రబలడానికి, సామాజిక అశాంతికి దారి తీస్తాయి. అసలు దోషులకు శిక్షలు పడకపోగా వందలాది ముస్లిం యువకులు దేశవ్యాప్తంగా సామాజిక నిందితులుగా, అనుమానితులుగా జైళ్లలో మగ్గుతున్నారు.

నేషనల్ హ్యూమన్ రైట్స్ కమిషన్, కన్సర్నడ్ సిటిజన్స్ ట్రిబ్యునల్ వంటి హక్కుల కమిటీలు గుజరాత్ మారణకాండ విషయంలో మోడీ ప్రభుత్వాన్ని తప్పు పట్టాయి. నర్మదా బహుళార్థక సాధక ప్రాజెక్ట్ నుంచి వచ్చే కాలువలు వెళుతున్న ప్రాంతాలలో నివసిస్తున్న మైనార్టీలను ఖాళీ చేయించేందుకు సంబంధిత కాంట్రాక్టర్ల కుట్ర ఫలితమే ఈ మారణకాండకు కారణం అనే ఆరోపణలు వచ్చాయి. ఈ క్రమంలో సంఘ పరివార్, బిజెపిలతో పొంచి ఉన్న ప్రమాదాన్ని ఈ దేశంలోని లౌకిక శక్తులు, మేధావులు పెద్ద ఎత్తున ప్రచారం చేశారు. బిజెపి కూడా కేవలం తన హిందూత్వ రాజకీయాలతో మనుగడ సాగదని గ్రహించి 'అభివృద్ధి' ని కూడా తన రాజకీయ ప్రచారాంశంగా తరువాత కాలంలో మార్చుకుంది. ఆ అభివృద్ధిని గుజరాత్, చత్తీస్‌గడ్ ఇంకా బిజెపి సహకారంతో సాగుతున్న రాష్ట్రాలలో చూస్తూనే ఉన్నాం. రాజకీయార్థిక అంశాలలో ఆధిపత్యం, అధికారం కొనసాగించడానికి తమదైన నమూనాను పాలకులు సామాజిక, సాంస్కృతిక రంగాలలో అమలు చేయడం తెలిసినదే.

సరళీకరణ, ప్రవేటీకరణ, ప్రపంచీకరణ అనబడే నూతన ఆర్థిక విధానాల ప్రవేశం, హిందూ మతోన్మాద శక్తుల విజృంభణ ఒకే సారి కలిసి జమిలిగా ఈ దేశ ప్రజల నెత్తి మీద పడ్డాయి. నూతన ఆర్థిక విధానాలు 1990ల నుంచి ప్రారంభమైతే మరో పక్క 1991లో అయోధ్యలోని బాబ్రీ మసీదు కూల్చివేత జరిగింది. మన దేశంలో పెట్టుబడి సెక్యులర్ స్వభావాన్ని కోల్పోయింది. ఆ క్రమంలోనే బిజెపి బలం దేశవ్యాప్తంగా పుంజుకుంది. అధికారం కూడా చేపట్టింది. మోడీలాంటి నమూనాలు రుపొందింది ఈ క్రమంలోనే. అమెరికా ప్రపంచ వ్యాప్తంగా ముస్లిం దేశాలపై చమురు కోసం దాడులు చేస్తూ, మన దేశంలో ఖనిజ సంపదల దోపిడి కోసం బలమైన ఫండమెంటలిస్టు శక్తులపై ఆధారపడ దలచుకుంది. అందువలననే మోడీకి ప్రధాని కావడానికి అర్హత ఉన్నాయని అంటోంది. దీని వలన రెండు ప్రయోజనాలు ఉన్నాయి. ఈ దేశంలోని ముస్లింలు, దళితులు, ఆదివాసులను, వాళ్ల ప్రత్యామ్నాయ స్వప్నాలను అణిచివేయవచ్చు. దళారీ బూర్జువా, భూస్వామ్య ఆధిపత్య శక్తులనూ సంతృప్తి పరచవచ్చును. అలాగే తనకు కావలసిన వనరులను సునాయాసంగా తరలించుక పోవచ్చు. పెట్టుబడి సామ్రాజ్యవాద పెట్టుబడిగా పరిణమించాక పెట్టుబడికి ఉండే (అంతకు పూర్వదశలతో పోల్చినపుడు) ప్రగతిశీల స్వభావాన్ని కోల్పోయింది. యూరప్ దేశాలలో లాగా భూస్వామ్యాన్ని కూల్చే స్వభావం దానికి ఇప్పుడు లేదు. అందుకే ఈ ఫైనాన్స్ పెట్టుబడి ఇక్కడ భూస్వామ్యంతో, మతాలతో పెనవేసుక పోయింది. అందువల్ల పెద్ద ఎత్తున హిందూ సాంస్కృతిక పునరుద్ధరణవాదం మొదలైంది. హిందూత్వ భావజాల వ్యాప్తితో హిందూ ఓటు బ్యాంక్‌ను సమీకరించుకొని బిజెపి అధికార సోపానాలను ఎక్కింది. ఈ హిందూత్వ పోటీలో వెనుకబడి పోవద్దని కాంగ్రెస్, రాజీవ్‌గాంధీ, పి.వి నరసింహా రావులు కూడా హిందూ, బ్రాహ్మణీయ సంస్కృతిని ఎత్తి పట్టడంలో తమవంతు కృషి చేశారు. రాజీవగాంధీ అయోధ్యలోని వివాదస్పద స్థలంలో శిలాన్యాస్‌కు అనుమతిస్తే, నరసింహారావు బాబ్రీ మసీదు మీద దాడి జరిగే సందర్భంలో ప్రేక్షకపాత్ర వహించి తన హిందూ పక్షపాతాన్ని చాటుకున్నారు.

బిజెపి అధికారంలోకి రాగానే చరిత్ర పాఠ్యాపుస్తకాలలో పెద్ద ఎత్తున మార్పులకు చర్యలు తీసుకుంది. చరిత్రను వక్రీకరించడం, మతపరమైన ఘర్షణలను రెచ్చగొట్టడం ద్వారా తన హిందూత్వ నినాదానికి బలం చేకూర్చుకుంది. వేదాలు, జ్యోతిష్యం 'శాస్త్రాలు'గా ముందుకు వచ్చింది ఈ కాలంలోనే.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ తాను వచ్చే క్రమంలో మత ప్రాతిపదికన ముందుకెళ్లి, కుల ప్రాతిపదికన జన సమూహాన్ని సమీకరించడం మొదలుపెట్టింది. పాలకులకు ఓటు బ్యాంకులుగా వివిధ సమూహాలను సమీకరించడమూ సులువైంది. దిగుమతి అవుతున్న సాంకేతిక పరిజ్ఞానం, దెబ్బతింటున్న వివిధ చేతి వృత్తులు, కులవృత్తుల వారంతా తమకు న్యాయం చేయండంటూ ఆందోళనలు ఈ క్రమంలోనే మొదలయ్యాయి. రైతుల ఆత్మహత్యలు, చేనేత కార్మికుల ఆత్మహత్యలు మొదలయింది, కొనసాగుతున్నది ఈ రెండు దశాబ్దాలలోనే. ఈ ఆత్మహత్యలు కూడు, గుడ్డలకు సంబంధించిన సంక్షోభాన్ని సూచిస్తుంటే, పాలకులు వాటికి పరిష్కారాలను మత ఘర్షణల్లో చూపించడం మొదలైందీ ఈ కాలంలోనే. సామ్రాజ్యవాదం నిలదొక్కుకునే క్రమంలోనే ఇందిరమ్మ ఇళ్లు, ఉపాధి హామీ పథకాలు, ఒక రూపాయి కిలో బియ్యాలు రావడం మొదలైంది. మద్యం అమ్మకాలు, మత్తుమందు అమ్మకాలు పెరిగిపోయిందీ ఈ కాలంలోనే. వలసలు పెరిగిపోయిందీ ఈ అభివృద్ధి నమూనా అమలయ్యే క్రమంలోనే.

ఇక్కడికి దిగుమతి అవుతున్న పెట్టుబడి శ్రమను ఒక ఉత్పత్తి శక్తిగా వినియోగించుకునే స్వభావంతో రావడం లేదు. వివిధ సమూహాల ప్రజలను వారి బతుకుతెరువు నుంచి వేరుచేసి, అతి తక్కువ మానవ వనరులను ఉపయోగించుకుంటూ పెద్ద ఎత్తున ఖనిజ వనరులను, ప్రకృతి వనరులను తవ్వుకుపోయే క్రమంలో వస్తోంది. వివిధ రకాల సేవలను అమ్ముకోవడంలో భాగంగా వస్తోంది. ఇక్కడి వ్యవసాయం, పరిశ్రమలు దెబ్బతీయడంలో భాగంగా వస్తోంది. భూమీ, నీరూ, గాలీ సర్వం కోల్పోతున్న ప్రజలను రామ భజనతో సమీకరించే క్రమంలో వస్తోంది. అందుకే మన శాస్త్రవేత్తలు లంకావారధికి శాస్త్రీయ ఆధారాలు కనుక్కునే పనిలో పడిపోయారు.

గనుల మాఫియా, భూముల మాఫియా, మాదక ద్రవ్యాల మాఫియా, మహిళలను అమ్మివేసే మాఫియాలు బలపడింది ఈ రెండు దశాబ్దాల కాలంలోనే. ఇవన్నీ సజావుగా సాగాలంటే జనాన్ని రామభజనలో ఉంచగలగాలి. అనాదిగా మతం, మతాధికారుల స్వభావం రాజులను, వారి రాజ్యాధికారాలను కాపాడడమే. చర్చిలైనా, స్వాములైనా ఎప్పుడూ రాజుల పక్షమే. పాలకపక్షమే. ఈ క్రమాన్ని బలోపేతం చేయడంలోనే మన న్యాయస్థానాలూ వ్యవహరిస్తాయి. దానికి ఉదాహరణే ఇటీవల అయోధ్యపై అలహాబాద్ హైకోర్టు ఇచ్చిన తీర్పు.

మనుషులు, సమాజాలు తమ చైతన్యంతో సమిష్టి ప్రయోజనాల కోసం పని చేయడంగా కాక, ప్రైవేట్ శక్తులుగా ఆస్తులు కూడబెట్టుకొనే క్రమాన్ని, సామ్రాజ్యవాదులు ప్రజలను బతుకు నుండి బేదఖల్ చేసే క్రమాన్ని చూడవచ్చు. బతుకుతెరువు నుంచి విడిపోయిన మనుషులను ఏవో నమ్మకాల చుట్టూనో, భ్రమల చుట్టూనో, వ్యసనాల చుట్టూనో సమీకరించడం రాజ్యానికి అవసరం. అందువల్ల ఇక్కడ దేవతా విగ్రహాలు అప్పుడప్పుడు పాలుతాగడం, టమాటాలూ, కూరగాయలలో విఘ్నేశ్వరుడి ఆకారాలు కనబడడం 'దైవలీల'గా చెలామణి అవుతాయి. వీటికి రాజకీయ నాయకులు, ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్.లు సహకరించడం, సాధికారత కల్పించడం చూస్తూనే ఉన్నాం. అప్పుడప్పుడు ఆ రహస్యాలు బయటపడడం చూసాం. సామ్రాజ్యవాద పెట్టుబడి విస్తరించే క్రమంలోనే ప్రైవేట్ గ్యాంగులు ప్రశ్నించే ప్రజలను హత్యగావించే మూకలు బలపడడం మొదలైంది. అవి ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్కలాగ కొనసాగుతూండవచ్చు. వాటికి రాజ్యం, ప్రైవేట్ శక్తుల అండదండలు ఉంటాయి. ఉదాహరణకు, సాల్వాజుడుం, శాంతిసేన, హర్మద్‌వాహిని, హిందూవాహిని, కోబ్రాలు, పులులు ఇలా రకరకాల పేర్లున్నాయి. వీటన్నిటి ఉద్దేశం సామ్రాజ్యవాద పెట్టుబడికి సహకరించడమే.

గుజరాత్ మారణకాండనే పరిశీలిస్తే, హిందూత్వ శక్తులు దళితులను, ఆదివాసులను, బహుజనులను, మొత్తంగా అట్టడుగు వర్గాల ప్రజలను ముస్లింలకు వ్యతిరేకంగా ఉసిగొల్పడం చూశాం. ఈ హిందూత్వ శక్తుల ప్రణాళిక ఏమంటే, ప్రజల్లో ఉన్న పేదరికానికి, దారిద్ర్యానికి పరిష్కారాలను మరో సమూహంపై ద్వేషంలో చూపించడం.

శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం రోదసిలోకి ఎగిరినా, రోగాలకు మందులు కనుక్కున్నా ఆ శాస్త్ర విజ్ఞానం ఫలితాలు సామాన్య మనిషికి అందవు. ఈ ఆధునిక యుగంలోనూ సామాన్యులు తాయెత్తులూ, దిష్టి యంత్రాలూ, అసహాయంగా ప్రార్థనలు చేయడాల్లో తమ సమస్యలకు పరిష్కారాలు, భద్రత, రక్షణ, స్వస్థతను వెతుక్కొనే పరిస్థితి. వాటితోనూ ఉపశమనం లభించనప్పుడు ఆత్మహత్యలు చేసుకోవడం, ఉన్మాదంతో హత్యలకు దిగడంలో పరిష్కారాలు చూసుకొనే పరిస్థితి ఉంది.

హిందూ మతోన్మాదం మైనారిటీ సమూహాలను, ఇతర మతాల వారిని ద్వేషించడం పునాదిగా మనుగడ సాగిస్తుంది. ప్రజల సమస్యలకు శాస్త్రీయ పరిష్కారాలు కాకుండా, ఇంకో సమూహాన్ని ద్వేషించడంలో చూపిస్తోంది. మానవ సమాజ చరిత్రంతా వర్గపోరాటాల చరిత్రే అన్న శాస్త్రీయ అవగాహనకు మసిపూసి మారెడుకాయ చేసే ప్రయత్నంలో భాగంగా మతం పాత్ర ముందుకొస్తుంది. ఉత్పత్తి సాధనాలపై ఎవరికి యాజమాన్యం ఉంది, ఉత్పత్తి మిగులును ఎవరు దోపిడీ చేస్తున్నారు అన్న ప్రశ్నలు పక్కకుపోయి, సకల సంపదలు సృష్టిస్తున్న శ్రామికుల శ్రమను అప్రధానంగా చూపించే క్రమాన్ని రాజ్యం బలోపేతం చేస్తోంది. నమ్మకాలపై యుద్ధాలు చేసుకోవడానికి ప్రజలను రెచ్చగొడుతోంది. గుజరాత్‌లు పునరావృతం కాకుండా చైతన్యంతో అడ్డుకోవడంలో సమాజం పరిణతి సాధించాల్సే ఉంది.

ఇక రాష్ట్రంలో చూస్తే తెలంగాణ పేరిట మహబూబ్‌నగర్ శాసనసభ నియోజకవర్గం నుంచి బిజెపి అభ్యర్థి విజయం సాధించడం, ఆ క్రమంలో హైదరాబాద్ పాతబస్తీలో అల్లర్లు, దళిత–ముస్లిం–బహుజన విద్యార్థులు ఉస్మానియా యూనివర్సిటీలో బీఫ్ ఫెస్టివల్ (పెద్దకూర పండగ) నిర్వహించుకుంటే వారిపై జరిగిన దాడులను హిందూ మతోన్మాద విస్తరణ క్రమం నుంచి విడదీసి చూడలేం.

గుజరాత్ మారణకాండ ఎందుకు జరిగింది, గుజరాత్ నమూనాను ఎందుకు పునరావృతం చేయాలనుకుంటున్నారు, గుజరాత్ మారణకాండ తరువాత కూడా మోడీ మళ్లీ అధికారంలో ఎలా కొనసాగుతున్నాడు, గుజరాత్‌కు సాధికారత కల్పిస్తున్నదెవరు, గుజరాత్ లాంటి దుర్మార్గాలను సమాజం ఎందుకు మౌనంగా భరిస్తోంది అన్న ప్రశ్నలకు జవాబులు వెతుక్కోవాల్సి ఉంది. గుజరాత్‌లో లాగా ద్వేషంపైనా, ప్రజల అభద్రతపైనా రాజ్యమేలుదామని అనుకుంటున్న నాయకులను ఎందుకు మౌనంగా భరించాలి అనేవి ఆలోచించాల్సిన ప్రశ్నలు. బొగ్గు, నీళ్లు, ఖనిజాలు, భూములు, సాంకేతికత, ఆయుధాల కొనుగోళ్లు పేరిట వివిధ రంగాలలో లక్షల కోట్ల రూపాయల కుంభకోణాలకు పాల్పడుతూ ఆ క్రమంలో మతం వంటి సాధనాలతో నిలదొక్కుకునే ప్రయత్నంలో భాగంగానే మతోన్మాదం ముందుకొస్తోంది. జనం ఏదో ఒక నమ్మకంలో

# రావ్‌ఘాట్ ప్రాజెక్ట్‌తో జరిగేది వినాశనమే

***ఆదివాసీ ప్రజలనూ, సంస్కృతినీ, పర్యావరణాన్నీ విధ్వంసం చేస్తూ సామ్రాజ్యవాద ప్రయోజనాలు నెరవేర్చడంలో భాగంగా ముందుకొస్తున్న రావ్‌ఘాట్ ప్రాజెక్ట్‌కు, మొత్తంగానే గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా ఉద్యమించాలని అంటున్నారు అమన్***

**ఒ**క వైపు బస్తర్‌లో సైన్యం మోహరింపు ప్రక్రియ మొదలవుతుండగా, మరోవైపు రావ్‌ఘాట్ గనుల్ని ప్రైవేటీకరిస్తున్నట్టు స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా (సెయిల్) ప్రకటించింది. ఈ రెండు ఇలా ఒకేసారి ముందుకు రావడం కేవలం యాదృచ్ఛికం కాదు. వీటి మధ్య కుట్రపూరిత సమన్వయం ఉంది. రమణ్ సింగ్ ప్రభుత్వం శిక్షణ పేరిట సైన్యానికి 750 చదరపు కిలోమీటర్ల (1,85,250 ఎకరాలకు పైగా) స్థలాన్ని ఇవ్వజూపుతున్న నారాయణ్‌పూర్ జిల్లా (మాడ్ ప్రాంతం)లో, నారాయణ్‌పూర్ పట్టణానికి కేవలం 25 కిలోమీటర్ల దూరంలో ఉన్న రావ్‌ఘాట్ పర్వతాల్లో నిక్షిప్తమై ఉన్న నాణ్యమైన ఇనుప ఖనిజ నిల్వలను ఇప్పుడు పేరుమోసిన బహుళజాతి కంపెనీలకు అప్పజెప్పబోతున్నారన్న మాట. ఇలా ఒకవైపు నుండి సైన్యం, మరోవైపు నుండి కార్పొరేట్ కంపెనీలు ప్రాచీన మానవ సముదాయాల్లో ఒకటైన మాడియా గోండ్ ప్రజల నివాస స్థలమైన మాడ్ ప్రాంతాన్నంతా కబళించబోతున్నాయి.

ఉత్తర బస్తర్ ప్రాంతానికి చెందిన రావ్‌ఘాట్ నారాయణ్‌పూర్ నుండి భానుప్రతాప్‌పూర్‌కు పోయే రోడ్డుపై ఉంటుంది. రావ్‌ఘాట్ అనే పేరుతో ఊరైతే లేదు కానీ ఒక భారీ పోలీసు క్యాంపు మాత్రం ఉంది. నిజానికి ఇదొక గుట్టల వరుస పేరు. ఈ గుట్టలపై ఆదివాసుల ప్రాచీన పూజాస్థలం ఉంటుంది. ఇక్కడ ప్రతి ఏటా వేసవిలో ఒక పెద్ద జాతర జరుగుతుంది. గోండు, మాడియా తెగలకు చెందిన ఆదివాసులు వేల సంఖ్యలో ఇక్కడ పూజలు, పునస్కారాలు, బలులు ఇవ్వడం వంటివి చేస్తారు. అలా ఈ పర్వతాలను స్థానిక ప్రజలు తమ విశ్వాస కేంద్రంగా, సాంస్కృతిక వారసత్వ చిహ్నంగా భావిస్తారు.

ఈ ప్రాంతంలో నిక్షిప్తమై ఉన్న ఇనుప ఖనిజాన్ని వెలికి తీయడానికి గనుల్ని ప్రారంభించాలని ప్రభుత్వరంగ సంస్థ అయిన భిలాయ్ స్టీల్ ప్లాంట్ (బి.ఎస్.పి.) చాలా ఏళ్లుగా ప్రయత్నిస్తున్నది. ఇందుకోసం రైల్వేలైన్‌ను నిర్మించడం కోసం కూడా 2007లో బి.ఎస్.పి., చత్తీస్‌గఢ్ రాష్ట్ర ప్రభుత్వం, భారతీయ రైల్వేలకు మధ్య రు.970 కోట్ల ఒక అవగాహనా ఒప్పందం జరిగింది. అయితే స్థానిక ప్రజలు ఈ ప్రాజెక్టును (గనులను, రైల్వేలైన్ నిర్మాణంను) తొలి నుండీ వ్యతిరేకిస్తున్నారు. పలుమార్లు ఆందోళన చేశారు. ఇప్పటికీ చేస్తూనే ఉన్నారు. ఒక ప్రభుత్వ రంగ సంస్థ చేపట్టిన ప్రాజెక్టును ఇలా వ్యతిరేకించడం సరైనదేనా అనీ, దీనికి బి.ఎస్.పి.లో పని చేస్తున్న వేలాది కార్మికుల భవిష్యత్తుకు ముడివడి ఉన్న విషయాన్ని దృష్టిలో పెట్టుకున్నపుడు దీన్ని సమర్థించకపోవడం ఎలా సరైందనీ కొంత మంది తెలిసీ, తెలియక ప్రశ్నిస్తున్నారు.

నిజానికి 2006లో, రావ్‌ఘాట్ ప్రాజెక్టు పని మొదలవక ముందు, రావ్‌ఘాట్‌లోని డిపాజిట్లను అత్యంత రహస్యంగా టాటా, నెకో కంపెనీలకు లీజుపై ఇచ్చేసినట్టు బి.ఎస్.పి. యాజమాన్యంపై తీవ్రమైన ఆరోపణలు వచ్చాయి. దాంతో అప్పటి దాకా రావ్‌ఘాట్ ప్రాజెక్టును ప్రారంభిస్తున్నది కేవలం ప్రభుత్వ రంగ సంస్థ భవిష్యత్తు కోసమే తప్ప ప్రైవేటు కంపెనీల కోసం కాదని బుకాయిస్తూ వచ్చిన ప్రభుత్వానికి పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయ్యింది. బి.ఎస్.పి. యాజమాన్యం టాటా, ఎస్సార్, జిందల్, నెకో వంటి బడాపెట్టుబడిదారీ సంస్థల చేతుల్లో పావుగా మారిపోయినట్టు చాలా మంది భావించారు, విమర్శించారు. అయితే అప్పుడు బి.ఎస్.పి. చాలా చాకచక్యంగా ఈ ఆరోపణలను కప్పిపెట్టగలిగింది. కానీ నిరుడు సెయిల్ ఛైర్మన్ చంద్రశేఖర్ వర్మ రావ్‌ఘాట్ గనులను ప్రైవేటీకరిస్తున్నట్టు, ఇందుకోసం గ్లోబల్ టెండర్లు పిలుస్తున్నట్లు స్వయంగా ప్రకటించాడు. ఇక ముసుగులో గుద్దులాట ఏమీ లేదు! దోపిడీ ప్రభుత్వాల ఉద్దేశమేమిటో తేటతెల్లమే. దేశంలో అమలవుతున్న నయా ఉదారవాద విధానాలలో భాగంగా ఒక్క రావ్‌ఘాట్ లేదా భిలాయ్ స్టీలు ప్లాంటే కాదు, మొత్తం సెయిల్‌నే బహుళ జాతి కంపెనీలు మింగెయ్యగలవు. దేశంలోని ఇతర ప్రాంతాల్లో పోస్కో, వేదాంత వంటి తాజా ఉదాహరణలు ఈ సంకేతాలనే ఇస్తున్నాయి.

రావ్‌ఘాట్ పర్వతాల్లో మొత్తం 740 కోట్ల టన్నుల ఇనుప ఖనిజ నిల్వలున్నాయని ఒక అంచనా. ఇక్కడ 62 శాతం ఎఫ్.ఈ. గ్రేడ్‌తో

---

మునిగి ఉన్నంత సేపూ పాలకులకు ప్రమాదమేమీ లేదు. ప్రజల నుండి పదునైన ప్రశ్నల పరంపర పెరుగుతున్నప్పుడూ, పాలక ముఠాల మధ్య ఆస్తి పంపకాలలో వైరుధ్యం తీవ్రమైనప్పుడూ, అధికార కుమ్ములాటలు తీవ్రమైనప్పుడూ ప్రజలను విద్వేషాలలోకి లాగి, విద్వేషాలను రగిలించి హత్యాకాండలను సృష్టిస్తూ ఉన్నారు. ఈ ఉన్మాదం స్విచ్ వేసినట్లు ప్రజల మధ్యకు వచ్చి వెళ్లిపోతోందంటే, మౌలికంగా శ్రమ చేసే, శ్రమపై ఆధారపడి బతికే ప్రజల స్వభావం కాదది.

అయితే, మన సమాజం అటువంటి ఉన్మాదాలు బద్దలవడానికి అనుకూలమైన, బలహీనమైన పరిస్థితుల్లో, ఉన్మాదపు అంచులలో మనుగడ సాగిస్తోంది. ఎవరు దీనిని ఎట్లైనా మండించగలరు. అయితే, శాస్త్రీయ పరిష్కారాల వైపు, సమాజ ఉన్నతి వైపుకు మెరుగైన సమాజం కోసం ఆ ఉద్వేగాలను చైతన్యపూర్వకంగా మలచాల్సిన బాధ్యత ఆ సమాజపు ఆలోచనా పరులదే. ప్రగతికాముకులు, ప్రజాస్వామిక వాదులదే అంతిమంగా తమ శ్రమతోనే సమస్త సంపదలు సృష్టించే ప్రజలదే. వారి చైతన్యపూర్వకమైన పూనికతోనే 'గుజరాత్'లు పునరావృతం కాకుండా నిలువరించగలం. లేకుంటే నాజీలు, హిట్లర్‌లు, మోడీలు మన సామూహిక అజ్ఞానంపై మళ్లీ మళ్లీ సవారీ చేస్తూనే ఉంటారు.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

అత్యుత్తమ క్వాలిటీ కలిగిన ఇనుము ఉందని చెబుతారు. ఇక్కడ భిలాయ్ స్టీల్ ప్లాంట్ (సెయిల్‌కు చెందిన యూనిట్) 511 మిలియన్ టన్నుల ఖనిజాన్ని తవ్వి తీసే ప్రతిపాదన ఉంది. దీని కోసం దల్లీ–రావ్‌ఘాట్–జగ్దల్‌పూర్ వరకు 235 కిలోమీటర్ల రైలు మార్గం తయారవుతున్నది. ఇందులో భాగంగా దల్లీ నుండి రావ్‌ఘాట్ వరకు రైతుల నుండి బలవంతంగా భూముల్ని స్వాధీనం చేసుకోవాలని ప్రభుత్వం ప్రయత్నిస్తుండగా స్థానిక ప్రజలు వ్యతిరేకిస్తున్నారు.

నిజానికి ఈ పథకం చాలా కాలం కిందటిది. 1992లో ప్రజల నుండి తలెత్తిన బలమైన నిరసనతో దీన్ని నిలిపివేశారు. అప్పట్లో ఉత్తర బస్తర్ ప్రాంతానికి చెందిన అంతాగఢ్ పట్టణంలో పది వేల మంది ఆదివాసులు ఒక భారీ ఊరేగింపు నిర్వహించి ఈ గనుల ప్రతిపాదనను గట్టిగా వ్యతిరేకించారు. సహజంగానే, ప్రభుత్వం ఈ ప్రజాందోళనను అణచివేతతోనే ఎదుర్కోవాలనుకుంది. ఈ పర్వతాలపై ఒక పోలీసు క్యాంపును ఏర్పాటు చేసింది. అది ఇప్పటికీ ఉంది. ప్రజల ఈ న్యాయమైన పోరాటానికి మావోయిస్టులు తొలి నుండి క్రియాశీల మద్దతును తెలుపుతూ వస్తున్నారు.

ఈ పర్వతాల్లో గనుల్ని ప్రారంభిస్తే 3,278 హెక్టార్ల అడవులు పూర్తిగా నాశనమైపోతాయని స్థానిక ప్రజలు అభ్యంతరం తెలుపుతున్నారు. ఈ ప్రాంతంలో ప్రవహించే మేంఢ్క తదితర నదులు, వాగులు కలుషిత మవుతాయి. దీని ద్వారా పంటపొలాలు ఎంత మేరకు నాశనమవుతాయో ఊహించడం కూడా కష్టమే. బస్తర్ పర్యావరణాన్ని, రుతు పవనాలను దృష్టిలో పెట్టుకున్నపుడు రావ్‌ఘాట్ పర్వతాలకు ఎంతో ప్రాధాన్యత ఉందని పర్యావరణ శాస్త్రవేత్తలు చెబుతారు. రావ్‌ఘాట్ ప్రాజెక్టును ప్రారంభిస్తే 23 గ్రామాల అస్తిత్వం ప్రమాదంలో పడుతుంది. అంతే కాకుండా పక్కనే ఉన్న చార్‌గాం సమీపంలో నెకో జయస్వాల్స్ అనే ఒక ప్రైవేటు కంపెనీ ప్రారంభించబోయే గనుల వల్ల చార్‌గాంతో పాటు మరో 13 గ్రామాల ఆదివాసుల జీవితం అస్తవ్యస్తమవబోతున్నది. ఇక ఇందులో సైన్యం ఆక్రమించుకోబోయే 750 చ.కి.మీ. విశాల భూ భాగంకూడా కలిస్తే ఎన్ని గ్రామాలు తమ ఉనికిని కోల్పోతాయో చెప్పలేం.

ప్రతిపాదిత రావ్‌ఘాట్ గనుల కోసం టౌన్‌షిప్ నిర్మాణం ఎక్కడ జరగాలనే విషయంలో నారాయణ్‌పూర్, అంతాగఢ్ వ్యాపార వర్గాల మధ్య తీవ్రమైన కొట్లాట నడుస్తున్నది. ఇక్కడ గనుల్ని తెరవడం వల్ల ఎన్ని గ్రామాలు మాయమవుతాయో, ఎన్ని వేల మంది ఆదివాసులు నిర్వాసితులవుతారో, ఎంత అడవి నాశనమవుతుందో, ఎన్ని నదులు కలుషితమవుతాయో, విశిష్టమైన ఆదివాసీ సంస్కృతి ఎంతగా దెబ్బ తింటుందో, మొత్తంగా ఎంత వినాశనం జరుగుతుందో అనే ఆందోళన ఈ స్వార్థపరులకు కొంచెమైనా లేదు. దీని ద్వారా తమ వ్యాపారం పెంపొందుతుందనే ఆలోచనతోనే వాళ్లు ప్రభుత్వం చేస్తున్న 'బస్తర్ అభివృద్ధి' అనే తప్పుడు వాదనలతో గొంతు కలుపుతున్నారు.

ఈ రైల్వే నిర్మాణం, గనుల గురించి ప్రభుత్వం ఇప్పటి దాకా చేస్తూ వస్తున్న వాదన ఏంటంటే బి.ఎస్.పి.కి ముడిసరుకు (ఇనుప ఖనిజం) సరఫరా చేస్తున్న దల్లీరాజహరా గనులు త్వరలోనే వట్టిపోనున్నాయి కాబట్టి రావ్‌ఘాట్ నుండి ఇనుమును తవ్వి తీయడం తప్పనిసరి అని. రావ్‌ఘాట్‌లో ఇనుప గనులు ప్రారంభం కానట్టయితే ముడిసరుకు కొరతతో బి.ఎస్.పి. మూతపడే పరిస్థితి వస్తుందనీ, తద్వారా పదుల వేల కార్మికుల భవిష్యత్తు ప్రమాదంలో పడుతుందనీ పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్నారు. రావ్‌ఘాట్ గనులకు వ్యతిరేకంగా గొంతు విప్పిన వాళ్లనెవరినైనా 'అభివృద్ధికి వ్యతిరేకులు'గా ముద్రవేసే వాతావరణాన్ని సృష్టించారు. నిజానికి ఇలాంటి ప్రచారం మాటున ప్రభుత్వం, అధికారులు అనేక వాస్తవాల్ని మరుగుపరుస్తున్నారు.

బి.ఎస్.పి. యాజమాన్యం అనుసరించిన తప్పుడు విధానాల వల్ల, ముఖ్యంగా విచ్చలవిడి యాంత్రీకరణ మూలంగానే ఈరోజు దల్లీ రాజహరా దాదాపు మృత పట్టణంగా తయారైందని చెప్పవచ్చు. ఈ ప్రాంతంలోని నదీనదాలన్నీ చాలా ఘోరంగా కలుషితమై పోయాయి. దల్లీ సహా దాని చుట్టుపక్కల గల అనేక గ్రామాల్లో పొలాలన్నీ గనుల నుండి వెలువడిన ఎర్రమట్టితో నిండిపోవడంతో వ్యవసాయం దెబ్బతిన్నది. ఒకప్పుడు 16 వేల మంది కార్మికులున్న దల్లీ పట్టణంలో, విచక్షణారహితమైన యాంత్రీకరణ మూలంగా ఈరోజు పన్నెండు వందల మంది కార్మికులు మాత్రమే మిగిలారు. ప్రస్తుతం రావ్‌ఘాట్ ప్రాజెక్టును సమర్థిస్తున్న నారాయణ్‌పూర్, అంతాగఢ్, జగ్దల్‌పూర్ ప్రాంతాల్లోని వ్యాపార వర్గాలు, రాయపూర్‌కు చెందిన కాంట్రాక్టర్లు 20–25 ఏళ్లలో ఈ ప్రాంతం పరిస్థితి కూడా దల్లీ లాగా కాదని హామీ ఇవ్వగలరా?

'ముడిసరుకు దొరక్కపోతే బి.ఎస్.పి. మూతపడిపోతుంది' అని ప్రభుత్వం గనుక నిజంగానే ఆందోళన చెందుతూ ఉంటే అది బైలడిల్లా నుండి ఎన్.ఎం.డి.సి. (జాతీయ ఖనిజాభివృద్ధి సంస్థ) ద్వారా జపాన్, చైనా, కొరియాకు చెందిన బహుళజాతి కంపెనీలకు ఇనుప ఖనిజాన్ని అమ్మడాన్ని ఎందుకు ఆపడం లేదు? నిజానికి రాయపూర్–భిలాయ్ ప్రాంతానికి చెందిన చాలా స్పంజ్ ఐరన్ పరిశ్రమలు ఇనుప ఖనిజం కొరతతో మూతపడిపోయాయి. బైలడిల్లా నుండి విదేశాలకు ఇనుము ఎగుమతుల్ని ఆపేసి తమకు ముడిసరుకు అందించాలని ఆ పరిశ్రమల యజమానులు ప్రభుత్వాలను అనేక సార్లు వేడుకున్నారు. కానీ ప్రభుత్వాలు పెడచెవిన పెడుతూ వస్తున్నాయి. దీని ద్వారా వాటికి విదేశీ, బడా పెట్టుబడిదారుల ప్రయోజనాలే శిరోధార్యం అని స్పష్టంగా అర్థం కావడం లేదా? బి.ఎస్.పి. భవిష్యత్తు గురించి ప్రభుత్వం పడుతున్న 'ఆందోళన' వట్టి బూటకం కాదా? ఈ వాదన రావ్‌ఘాట్ గనుల్ని ప్రారంభించే చర్యలకు వచ్చే వ్యతిరేకతను దృష్టిలో పెట్టుకొని ముందుకు తెచ్చిన ఎత్తుగడ కాదా?

బి.ఎస్.పి. భవిష్యత్తు గురించి, దాని ముందున్న ప్రమాదాన్ని గురించి ఆందోళన చెందుతున్న కార్మికులు, ఉద్యోగులు, ఇతరులు ముందుగా ఆలోచించాల్సిన విషయం బి.ఎస్.పి.కి నిజమైన ప్రమాదం పొంచి ఉన్నది ఎవరితో అని. 1960 దశకంలో బి.ఎస్.పి.ని స్థాపించినపుడు ఏటా 1.5 మిలియన్ టన్నుల ఉక్కు ఉత్పత్తి జరిగేది. మొత్తం 95 వేల మంది కార్మికులు పని చేసే వారు. ఈరోజు ఉత్పత్తి మూడింతలు పెరిగి 4.5 మిలియన్ టన్నులకు చేరుకుంది. అయితే కార్మికుల సంఖ్య మూడో వంతుకు పడిపోయి 37 వేలకు చేరుకుంది. బి.ఎస్.పి.లో కాంట్రాక్టు విధానం, యాంత్రీకరణ, పాక్షిక ప్రైవేటీకరణ ప్రక్రియలు వేగంగా జరిగిపోతున్నాయి. కార్మికులకు లభించే అనేక సౌకర్యాలను ఎత్తగొట్టారు. అన్ని రకాల నియామకాలు పూర్తిగా నిలిచిపోయాయి. 2012–13 నాటికి దీన్ని మరింతగా ఆధునీకరించి, విస్తరించి ఉత్పత్తిని 7.5 మిలియన్ టన్నులకు పెంచాలనే పథకం ఉంది. అంటే అర్థం మరింత మంది కార్మికులు రిట్రెంచ్‌మెంట్‌కు, 'రిటైర్మెంట్'కు గురికాక తప్పదు. బి.ఎస్.పి.ని మెల్లమెల్లగా టాటా, మిత్తల్, జిందల్‌లకు కట్టబెట్టవచ్చనే అనుమానాలు కూడా ఉన్నాయి. బాల్కో అనుభవం మన కళ్ల ముందటే ఉంది. మొత్తంగా చూసినపుడు ఈ దుస్థితికి కారణం

# పడిపోతున్న విద్యా ప్రమాణాలు

***విచ్చలవిడిగా ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలలకు అనుమతులు ఇవ్వడం వలన విద్యా ప్రమాణాలు పడిపోవడమే కాకుండా, కాలేజీలూ మూతపడిపోతున్నాయని అంటున్నారు సిలువేరు హరినాథ్***

**21** శతాబ్దంలో పెనుమార్పులకు కారణమైన గ్లోబలైజేషన్ డొల్లపూరితమైన అభివృద్ధికి పాదులు వేసింది. ముఖ్యంగా ప్రజాసేవరంగాన్ని పూర్తిగా ప్రైవేటు పరం చేయడంలో ప్రపంచీకరణ పాత్ర కీలకమైంది. ఐక్యరాజ్య సమితి సమక్షంలో ప్రపంచ దేశాలన్నీ మానవోన్ముఖమైన అభివృద్ధిని సాధించడమే తక్షణ కర్తవ్యంగా భావించాయి. కానీ, ఆశించిన మేరకు ప్రయోజనాన్ని సాధించలేక అనేక దేశాలు మల్లగుల్లాలు పడ్డాయి. ఇదే నేపథ్యంలో భారతదేశంలో విద్యారంగం పూర్తి స్థాయిలో అనేక కుదుపులకు గురైంది. అందులో భాగంగా తెలుగు సమాజంలో కూడా ఈ ప్రకంపనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని అందించి మెరుగైన సమాజాన్ని నిర్మించడంలో కీలక పాత్ర పోషించే సైన్సు విద్యను పాలకులు తమ స్వప్రయోజనాల మూలంగా పూర్తిగా బలహీనం చేశారు. సరైన ప్రణాళికలు లేకపోవడం మూలంగా చూస్తుండగానే ఇంజనీరింగ్ విద్య కుప్పకూలిపోతున్నది. అంతర్జాతీయ పరిణామాల వెలుగులో స్థానిక విద్యార్థిలోకం మనుగడ ప్రశ్నార్థకంగా మారింది. భవిష్యత్తు కాదు వర్తమానమే అంధకారంగా తయారవుతున్న తీరుపై ఓ విహంగ వీక్షణం ఈ వ్యాసం.

ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక మాంద్యం ఏర్పడడంతో ఆర్థిక వ్యవస్థ కాస్త కుదేలుమన్నది. ఫలితంగా అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాలల్లో ఆర్థిక వ్యవస్థ కుప్పకూలి పోయింది. ఆ ప్రభావం సాంకేతిక విద్యారంగంపై తీవ్రంగా పడింది. దీనితో మన దేశంలో కూడా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ కంపెనీలన్నీ తిరోగమనంలో పడ్డాయి. దక్షిణాది రాష్ట్రాల్లోని ఆంధ్రప్రదేశ్‌లో ఎదురు లేకుండా దూసుకు పోతున్న ఐ.టి. రంగంపైన లక్షలాది మంది విద్యార్థులు లక్షల రూపాయలు ఖర్చుపెట్టి విద్యనభ్యసిస్తూ ఆ రంగంలోనే కొలువులు చేయాలనే భావన అనేక మంది విద్యార్థులకు వారి తల్లిదండ్రులకు ఏర్పడింది. ఇంజనీరింగ్ విద్య పూర్తయితే చాలు ఇట్టే ఉద్యోగం దొరికిన పరిస్థితి. కానీ ఈ సంవత్సరం ఇంజనీరింగ్ విద్య పరిస్థితి చూస్తే ఎంతో దయనీయ స్థితిలో కొట్టుమిట్టాడుతున్నది. రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితులు కావచ్చు, ఆల్ ఇండియా కౌన్సిల్ ఫర్ టెక్నికల్ ఎడ్యుకేషన్‌లో (AICTE) చోటు చేసుకున్న అనేక మార్పులు కావచ్చు లేక రాష్ట్రంలో అమలౌతున్న ఫీజు రియింబర్స్‌మెంట్ పాలసీ విధానంలో జరుగుతున్న అలసత్వం కావచ్చు లేక కళాశాలల్లో అనుభవజ్ఞులైన అధ్యాపకులు లేక సరైన విద్య అందకపోవడం లేక ఆయా కళాశాలల్లో సరైన మౌలిక సదుపాయాలు, సరైన రవాణా సౌకర్యం లేక కావచ్చు అనేక కళాశాలలకు పెద్ద దెబ్బే తగిలింది. దీని కారణంగా రాష్ట్రంలో అందుబాటులో ఉన్న 3.4 లక్షల

---

ప్రభుత్వాలు అనుసరిస్తున్న సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలే. కాబట్టి బి.ఎస్.పి.ని రక్షించుకోవాలంటే ప్రభుత్వాలు అనుసరిస్తున్న కార్మిక వ్యతిరేక, పెట్టుబడి అనుకూల విధానాలకు వ్యతిరేకంగా పోరాడాల్సిందే తప్ప వేరే ప్రాంతంలో గనుల్ని తెరిచి అక్కడి జల్-జంగల్-జమీన్‌లను వినాశనం చేసే కుట్రలకు ఎట్టి పరిస్థితుల్లోనూ మద్దతు తెలుపకూడదు. అటువంటి కుట్రలను గట్టిగా వ్యతిరేకించాలి. బి.ఎస్.పి. కార్మికులు సహా మొత్తంగా దేశభక్త ప్రజలందరూ రావ్‌ఘాట్ ప్రాజెక్టును వ్యతిరేకించాలి. భిలాయ్ స్టీల్‌ప్లాంట్ సహా పరిశ్రమలన్నిటిలో అనుసరిస్తున్న యాంత్రీకరణ, కాంట్రాక్టింగ్ విధానాలతో సహా కార్మిక వ్యతిరేక విధానాలన్నిటికీ వ్యతిరేకంగా పోరాడాలి. బైలడిల్లా నుండి ఇనుప ఖనిజాన్ని అడ్డికి పావుశేరు లాగా విదేశాలకు అమ్మడాన్ని వెంటనే నిలిపివేయాలని ప్రభుత్వాల్ని డిమాండ్ చేయాలి. నిజానికి బి.ఎస్.పి. కార్మికులు చేసే పోరాటాలకు ఈనాడు తమ జల్-జంగల్-జమీన్‌లను రక్షించుకోవడానికి పోరాడుతున్న దండకారణ్య ప్రజలంతా మద్దతునిస్తారు.

ప్రస్తుతం రావ్‌ఘాట్‌లో ఎలాగైనా సరే గనులను ప్రారంభించాలని ప్రభుత్వం మొండి పట్టుదలతో ఉంది. ఒక వైపు సైన్యం మోహరింపు జరుగుతుండగానే అది 'ఆపరేషన్ గ్రీన్‌హంట్'లో భాగంగా రావ్‌ఘాట్ ప్రాంతమంతా పోలీసు, పారామిలిటరీ బలగాల్ని మోహరించింది. మరీ ముఖ్యంగా రావ్‌ఘాట్ పర్వతాల్ని ఆనుకుని ఉన్న ప్రాంతాన్నంతా కార్పెట్ సెక్యూరిటీ కిందకు తెచ్చి ప్రతి 5-7 కిలోమీటర్లకు ఒకటి చొప్పున సాయుధ బలగాల క్యాంపుల్ని తెరిచింది. బి.ఎస్.పి. యాజమాన్యం రావ్‌ఘాట్ ప్రాజెక్టును ప్రారంభించడం కోసం ఐదు వేల ప్రత్యేక సాయుధ బలగాల్ని నియమిస్తామని ప్రకటించింది. కానీ సర్వత్రా వెలువడ్డ నిరసనలతో వెనక్కి తగ్గింది. దాదాపు ఐదు వేల మంది బి.ఎస్.ఎఫ్. బలగాల్ని కొత్తగా, కేవలం రావ్‌ఘాట్ పనుల కోసమే కావాలని కేంద్రాన్ని కోరుతున్నారు. అంటే సాయుధ బలగాల భారీ మోహరింపు ద్వారా ప్రజలను మొత్తంగానే ఇక్కడి నుండి వెళ్లగొట్టి ఇక్కడి ఖనిజాలను తవ్వితీయడానికి ప్రభుత్వాలు సిద్ధంగా ఉన్నాయనేది స్పష్టం. కానీ వీరోచిత పోరాట సాంప్రదాయం గల బస్తర్ ప్రజ దీనికి వ్యతిరేకంగా బరిగీసి నిలబడ్డది. మద్దతుగా నిలబడాలని మనందరి వైపూ ఆశగా, నమ్మకంగా చూస్తున్నది. ఆ ఆశను, నమ్మకాన్ని నిలబెట్టాల్సిన బాధ్యత మనందరిపైనా ఉంది. గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా సమైక్యంగా ఉద్యమించడం ద్వారానే ఇది సాధ్యం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

సీట్లకు గాను 1.5 లక్షలకు పైగా సీట్లు మిగిలిపోవడంతో మారుమూల పల్లెల్లో ఉన్న ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాలల పరిస్థితి ఎండమావిగా మారడంతో అనేక కళాశాలలు మూత పడడానికి సిద్ధంగా ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో 2004 కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత విద్యా విధానంలో అనేక సంస్కరణలు చోటు చేసుకున్నాయి. ప్రభుత్వ విద్యకు ప్రాధాన్యత అంటూనే, ప్రైవేటు విద్యకు పెద్దపీట వేశారు. దీని కారణంగా సాంకేతిక విద్యకు ఎనలేని ప్రాధాన్యత పెరిగింది. ప్రస్తుత సమాజంలో డబ్బు ఉన్నోడిదే రాజ్యం అన్నట్లుగా పలుకుబడి ఉన్నోడికే కళాశాలల ఏర్పాటుకు అధికారులు అన్ని ఏర్పాట్లు చేసి ఇబ్బడి ముబ్బడిగా పర్మిషన్లు ఇచ్చి కూర్చున్నది ప్రభుత్వం. రాష్ట్రంలో 2004లో 238 ఇంజనీరింగ్ కళాశాలల్లో 82,225 సీట్లు ఉండగా, 2011 విద్యా సంవత్సరంలో 715 కళాశాలలకు పెరగగా 3.4 లక్షల సీట్లు అందుబాటులో ఉన్నాయి. 2011 విద్యా సంవత్సరానికి కేవలం 2.12 లక్షల మంది విద్యార్థులే అర్హత సాధించారు. ఇంజనీరింగ్ అప్లికేషన్ల విషయంలో గత ఏడాదితో పోలిస్తే ఈ సంవత్సరం చాలా తగ్గాయి. 2010లో ఇంజనీరింగ్ విభాగంలో 3,28,945 మంది విద్యార్థులు అప్లికేషన్లు తీసుకోగా 3,16,115 మంది విద్యార్థులు తమ పేర్లు నమోదు చేసుకున్నారు. 2011 విద్యా సంవత్సరానికి 2,63,001 మంది విద్యార్థులు దరఖాస్తులు విక్రయించగా 2,51,013 మంది విద్యార్థులు తమ పేర్లు నమోదు చేసుకున్నారు. రాష్ట్రంలో బోధనా ఫీజులు చెల్లింపుల పథకం విస్తృతం చేసిన అనంతరం 2009 నుండి ఇంజనీరింగ్ పరీక్ష రాసే సంఖ్య చాలా పెరిగింది. 2009లో 3,11,973 మంది పరీక్ష రాసేందుకు తమ పేర్లు నమోదు చేసుకోగా ఈ సంఖ్య 2011లో ఆకస్మాత్తుగా పడిపోయింది.

ఆంధ్రప్రదేశ్‌లో ఇంజనీరింగ్ కళాశాలలు, సీట్ల వివరాలు రాష్ట్రంలో కొత్తగా ఎన్ని కళాశాలలు ఏర్పడినప్పటికీ టాప్ – 50లో ఉన్న కాలేజీలకు వచ్చే నష్టమేమి లేకుండా పోతుంది. ఆయా కాలేజీలకు ఉన్నా డిమాండ్ వల్ల తొలి దశలోనే సీట్లన్నీ భర్తీ అవుతున్నాయి. అలాగే యాజమాన్య కోటా కింద కూడా ముందుగానే సీట్లు భర్తీ అవుతున్నాయి. రాష్ట్ర వ్యాప్తంగా కేవలం 49 కళాశాలల్లో మాత్రమే వంద శాతం సీట్లన్నీ భర్తీ అయ్యాయి. ఇందులో యూనివర్సిటీ కళాశాలలు 29 ఉండగా 20 ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాలలు ఉన్నాయి. ఉస్మానియా యూనివర్సిటీ పరిధిలో 11 ప్రైవేటు కళాశాలల్లో ఆంధ్ర పరిధిలో 5, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ పరిధిలో 4 కళాశాలల్లో సీట్లన్నీ భర్తీ అయ్యాయి.

| కోర్సు | కన్వీనర్ కోటా సీట్లు | భర్తీ అయినవి | మిగులు సీట్లు |
|---|---|---|---|
| ఇసిఇ | 54,279 | 40,766 | 13,513 |
| సిఎస్ఇ | 46,239 | 30,800 | 15,439 |
| ఇఇఇ | 32,869 | 18,944 | 13,925 |
| మెకానికల్ | 25,281 | 17,432 | 7,849 |
| ఐ.టి. | 19,456 | 9,019 | 10,437 |
| సివిల్ | 18,964 | 11,760 | 7,204 |
| ఫార్మసీ | 9,373 | 799 | 8,594 |
| ఇతర శాఖలు | 6,435 | 4,800 | 1,635 |

గత రెండు సంవత్సరాల క్రితం స్థాపించబడిన 37 కొత్త ఇంజనీరింగ్ కళాశాలల్లో కేవలం 10లోపే సీట్లు భర్తీ అయ్యాయి అంటే వాటి పరిస్థితి ఎలా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు.

రాష్ట్రంలో ఒక పక్క లక్షా యాభైవేలకు పైగా సీట్లు మిగిలిపోయి, కాలేజీలు నడపాలా? లేదా చేతులెత్తేయాలా? అన్న సందిగ్ధంలో కళాశాల యాజమాన్యులు తర్జన భర్జన పడుతుంటే మరో వైపు రెండో షిఫ్టు కాలేజీలు నడిపిస్తామని కొంతమంది కాలేజీ యాజమాన్యులు బేరసారాలు చేస్తున్నారు. వద్దనీ సర్కారు చెబుతున్నా ప్రభుత్వాన్ని ఒప్పించేందుకు ముదుపుల మాటలతో రాజకీయ నాయకుల లాబీయింగ్ కొనసాగుతున్నాయి. దేశంలో ఏదైనా ఎక్కడయిన విద్యాసంస్థ కోరడమే పాపం ఇట్టే అనుమతులు ఇచ్చేస్తున్నారు. ఏ.ఐ.సి.టి.ఈ. నిర్వాకమే ఈ పరిణామాలకు కారణమౌతుంది. దేశంలో ఎక్కడ లేని విధంగా ఆంధ్రప్రదేశ్‌లో ఇంజనీరింగ్ కాలేజీలు ఉన్నాయి. వాటితో పాటు సీట్లు కూడా ఎక్కువగానే ఉన్నాయి. కాలేజీల ప్రమాణాలు అంతంత మాత్రంగానే ఉన్నాయని ఒక పక్క ప్రభుత్వమే ఆందోళన చెందుతుంది.

**2011-12 సంవత్సరం ఎంసెట్, ఇంజినీరింగ్ ఫలితాల వివరాలు**

| | ఇంజనీరింగ్ పరీక్షకు హాజరైన విద్యార్థుల వివరాలు | | | ఇంజనీరింగ్ పరీక్షల్లో అర్హులైన విద్యార్థుల వివరాలు | | | |
|---|---|---|---|---|---|---|---|
| విభాగం | బాలురు | బాలికలు | మొత్తం | బాలురు | బాలికలు | మొత్తం | శాతం |
| ఎస్.సి. | 18744 | 10282 | 29026 | 18744 | 10282 | 29026 | 100 |
| ఎస్.టి. | 7213 | 2964 | 10177 | 7213 | 2964 | 10177 | 100 |
| బి.సి.-ఎ | 13184 | 6361 | 19545 | 9924 | 6911 | 16835 | 75.9 |
| బి.సి.-బి | 29020 | 16382 | 45402 | 22521 | 12999 | 35520 | 78.2 |
| బి.సి.-సి | 1296 | 787 | 2083 | 1003 | 598 | 1601 | 76.8 |
| బి.సి.-డి | 25536 | 13574 | 39110 | 19756 | 10728 | 30484 | 77.9 |
| బి.సి.-ఇ | 8847 | 3349 | 12196 | 6314 | 2528 | 8842 | 72.5 |
| ఇతరులు | 67436 | 45019 | 112455 | 54878 | 37474 | 92352 | 82.1 |
| మొత్తం | 171276 | 98718 | 269994 | 140353 | 84484 | 224837 | 82.9 |

**కన్వీనర్ కోటాలో ఆయా కళాశాలల్లో సీట్ల భర్తీ వివరాలు**

| సీట్ల కేటాయింపు | 2010 | 2011 |
|---|---|---|
| 0-10 | 07 | 37 |
| 011-50 | 40 | 107 |
| 51-100 | 72 | 97 |
| 101-150 | 71 | 72 |
| 151-200 | 76 | 70 |
| 201-250 | 116 | 71 |
| 251-300 | 225 | 93 |
| 301-350 | 17 | 59 |
| 351- 400 | 29 | 22 |
| 401-500 | 19 | 31 |
| 501-600 | 13 | 24 |
| 601-715 | 5 | 3 |

రాష్ట్రంలో ఇక కొత్త ఇంజినీరింగ్ కళాశాలలు అవసరం లేదని గత కొన్ని సంవత్సరాలుగా ఆల్ ఇండియా కౌన్సిల్ ఫర్ టెక్నికల్ ఎడ్యుకేషన్ లేఖలు రాస్తూనే ఉంది. కానీ ఫలితం లేదు. ఇంకా కొత్త కాలేజీలు, అదనపు సీట్లు మంజూరౌతూనే ఉన్నాయి. ఇది ఇలా ఉంటే రాష్ట్రంలో గత మూడు సంవత్సరాలుగా విద్యా రంగం నష్టపోయింది. అందులో ఐ.టి. రంగం పై తీవ్ర పరిణామం పడుతున్న కారణంగా దాదాపు 30 శాతం పైగా విద్యార్థులు ఇతర రాష్ట్రాలల్లో అడ్మిషన్లు పొందారు. దీని కారణంగా సీట్లు మిగిలాయి. ఫీజు రీయంబర్స్‌మెంట్ పాలసీ అమలులో జరిగిన పరిణామాల వల్ల విద్యార్థులు అనేక ఇబ్బందులు ఆయా కళాశాలల యాజమాన్యాల నుండి ఎదుర్కోవలసి వస్తుంది. కొన్ని రోజుల పాటు యాజమాన్యాలు కళాశాలలను మూసివేయడం, విద్యార్థులను ఫీజు కట్టేందుకు ఇబ్బందులకు గురి చేయడం వల్ల సమస్య కోర్టు వరకు వెళ్ళడంతో విద్యార్థులు మానసికంగా తీవ్ర కలత చెందారు. దీని ద్వారా కూడా లక్షల కొద్దీ ఫీజులు కట్టడం తమ వల్ల కాదని అనేక మంది నిరుపేద మధ్యతరగతి వర్గాలకు చెందిన విద్యార్థులు ఇంజనీరింగ్ విద్యకు దూరంగా ఉన్నారు.

రాష్ట్రంలో ఇంజనీరింగ్ విద్యార్థులు గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి ఉద్యోగాలవైపు కన్నేస్తున్నారే గానీ పై చదువులకు ఆసక్తి చూపలేక పోతున్నారు. అనేక కళాశాలల్లో పి.జ. కోర్సులు లేక పోవడంతో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన విద్యార్థులతోనే పాఠాలు చెప్పిస్తున్నారు. అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులు లేక పోవడం ద్వారా విద్యార్థులకు సరైన విద్య అందక పోవడంతో ప్రతి సంవత్సరం కేవలం 30 నుండి 40 శాతం విద్యార్థులు మాత్రమే పాసవుతున్నారు. అందులో కేవలం 20 శాతం మంది విద్యార్థులు మాత్రమే ఉద్యోగాలకు అర్హత సాధిస్తున్నారు. ఇంకా 80 శాతం మంది విద్య దేనికీ పనికి రాకుండా నిర్వీర్యమైపోతుంది.

వివిధ దేశాల్లో అనేక మంది ఇంజనీరింగ్ విద్యార్థులు పి.హెచ్.డి. కోర్సులకు ఉత్సాహం చూపుతుంటే మన దేశంలో కేవలం డిగ్రీ పట్టాలతోనే సరిపెట్టుకుంటున్నారు. ఇతర దేశాల్లో ఇంజనీరింగ్ పి.ఎచ్‌డి. పట్టా పొందిన వారి వివరాలను చూసినట్లయితే యునైటెడ్ కింగ్‌డమ్‌లో 9.17 శాతం, అమెరికాలో 8.36 శాతం, జర్మనీలో 6.81 శాతం, జపాన్‌లో 3.81 శాతం సౌత్ కోరియాలో 2.98 శాతం చైనాలో 1.98 శాతం ఇండియాలో 0.66 శాతం మంది విద్యార్థులు పి.హెచ్.డి పట్టాలు పొందారు. దీని కారణంగా మనదేశంలో ఉపాధ్యాయుల కొరత తీవ్రంగా ఉంది. దాదాపు 95 శాతం మంది విద్యార్థులు పి.జి పూర్తి చేసిన వారిలో 95 శాతం మంది ఉద్యోగాల వైపు మల్లుతున్నారు. ఉపాధ్యాయ వృత్తిపై శ్రద్ధ కనబరచడం లేదు. అందులో ఎ.ఐ.సి.టి.ఈ. నిబంధనలకు అర్హత సాధించలేక పోవడం వల్ల ఉపాధ్యాయ కొరత ఏర్పడుతూ విద్యారంగంలో నాణ్యత కోల్పోయేలా చేస్తున్నాయి.

ఇప్పటికైనా ప్రభుత్వం, ఏ.ఐ.సి.టి.ఈ. అధికారులు తగిన చర్యలు తీసుకుని ఇంజనీరింగ్ విద్యకు పూర్వ వైభవం తీసుకు రావాల్సిన బాధ్యత ఉంది. విచ్చల విడిగా కళాశాలలకు అనుమతులు ఇవ్వకుండా విద్యార్థులకు అనుకూలంగా మారుమూల పల్లెల్లో విద్యా విధానం అమలయ్యేటట్లు చూడాలి. ఇప్పటివరకు ఉన్న కళాశాలలన్నీ పట్టణ ప్రాంతాలకే పరిమితం కావడం వల్ల మైదాన ప్రాంతాలల్లో ఉన్న విద్యార్థులు అనేక ఇబ్బందులు ఎదుర్కొని వేలాది రూపాయలు ఖర్చు పెట్టి పట్టణాలల్లో నివసిస్తూ విద్యనభ్యసిస్తున్నారు. అయినా ఫలితం లేకుండా పోతుంది.

పెరుగుతున్న కళాశాలలకు అనుగుణంగా వసతులు ఏర్పాటు చేయకపోవడం టీచింగ్ ఫ్యాకల్టీ లేకపోవడం కూడా కళాశాలలు వేధిస్తుంది. ఏ.ఐ.సి.టి.ఈ. చూసి చూడనట్లుగా వ్యవహరించి సమస్యలను పరిష్కరించకుండా కళాశాలను పెంచుకుంటూపోతే భవిష్యత్తులో ఇంజినీరింగ్ విద్య పూర్తిగా బలహీనం అవడం ఖాయం.

*(రచయిత డాక్టోరల్ ఫెలో,*
*హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ)*

**వీక్షణం అసహజ మరణాల సూచీకి మీరూ సహాయపడవచ్చు**

రాష్ట్ర వ్యాప్తంగా అసహజంగా మరణించిన వారి వివరాలను వీక్షణం పత్రిక తన వంతు భాధ్యతగా ఒక దగ్గర నమోదు చేసే ప్రయత్నం చేస్తోంది. ఇప్పటి వరకు అత్యధికంగా 19 జిల్లాల సమాచారం అందించగలిగాం ప్రస్తుతం 17 జిల్లాల నుంచి మాత్రమే సమాచారం అందించగలుగుతున్నాము. శ్రీకాకుళం, క్రిష్ణ, ప్రకాశం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కడప జిల్లాలల నుంచి మాకు ఈ సమాచారాన్ని అందించేవారు లేరు. అసహజ మరణాల సమాచారాన్ని అందించడానికి ఎవరైనా పూనుకోవచ్చు. ఈ పనికి ప్రత్యేక అర్హతలు ఏమీ లేవు. సామాజిక బాధ్యతగా గుర్తించి సహకరించడమే అందుకు ప్రాథమిక అర్హత. మీరు చేయాల్సిందల్లా మీ జిల్లాలో చోటుచేసుకున్న అసహజ మరణాలను ఏరోజుకారోజు ఏదేని ఒక దిన పత్రికలో పరిశీలించి నమోదు చేయడమే. రెండు మూడు దిన పత్రికలను పోల్చి చూసి సమాచారాన్ని మరింత సమగ్రంగానూ అందించే ప్రయత్నం చేయవచ్చు. మీరు రోజూ స్థానిక గ్రంథాలయానికి వెళ్లగలిగితే ఈ పనిచేయడం మరింత సులభమవుతుంది. ఈ సమాచారం అందించేవారికి పారితోషికంగా వీక్షణం పత్రికను ప్రతి నెల పంపిస్తాం. విద్యార్థులు, పరిశోధకులు, ఉపాధ్యాయులు, మీలో ఆసక్తి ఉన్న ఎవరైనా పూనుకోవచ్చు. -సం.

# గ్రామాల అధ్యయనాల చరిత్ర - 3

***మానవ చరిత్ర పరిణామ క్రమంలో గ్రామాల పుట్టుక, పెరుగుదల, రాజకీయార్థిక పరిణామాలనూ, గ్రామాల అధ్యయనాల చరిత్రనూ వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

*( గత సంచిక తరువాయి...)*

ఇరవయో శతాబ్ది మలి అర్ధభాగంలో కమ్యూనిస్టులు, నక్సలైట్ విప్లవకారులు, ఆ భావజాలంతో ప్రభావితులైన సామాజిక శాస్త్రవేత్తలు చేసిన గ్రామ అధ్యయనాల గురించి తెలుసుకోబోయే ముందు అప్పటివరకూ ఆ ఆలోచనాధారలో గ్రామానికి, గ్రామ అధ్యయనాలకు ఉండిన స్థానం గురించి స్థూలంగానైనా తెలుసుకోవాలి.

గ్రామం గురించీ, గ్రామంలోని అసమ సంబంధాల గురించీ, గ్రామీణ ప్రాంతాలలో సాగవలసిన వ్యవసాయ విప్లవం గురించీ గత నాలుగైదు దశాబ్దాలలో చాల ఎక్కువగా మాట్లాడినదీ రాసినదీ భారత కమ్యూనిస్టు ఉద్యమ నాయకులు, ఆ ప్రభావంతో చర్చలలో పాల్గొన్న సామాజిక శాస్త్రవేత్తలు మాత్రమే. కాని ఆశ్చర్యకరంగా కమ్యూనిస్టు ఉద్యమ ఆలోచనలలో అంతకు ముందు గ్రామానికి అంత ప్రాధాన్యత లేదు. భారతదేశం ప్రధానంగా వ్యవసాయదేశమనీ, అత్యధిక జనాభా గ్రామాల్లోనే నివసిస్తున్నదనీ చెప్పుకున్నప్పటికీ, విప్లవంలో గ్రామీణ ప్రజలకూ, రైతాంగానికీ ఉండే పాత్ర గురించి 1940ల ముందు భారత కమ్యూనిస్టు ఉద్యమానికి సమగ్రమైన అవగాహన లేదు. అందుకు చాల సంక్లిష్టమైన చారిత్రక, రాజకీయ, సాంస్కృతిక, భావజాల కారణాలున్నాయి గాని ఈ వ్యాస పరిధిలోకి వచ్చే కొన్ని అంశాలను మాత్రం చర్చించుకుంటే సరిపోతుంది.

భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పడడానికి ముందూ, ఏర్పడిన తర్వాత రెండు దశాబ్దాల పాటూ అది పూర్తిగా సోవియట్ యూనియన్ ప్రభావంలో ఉండింది. అలాగే భారత కమ్యూనిస్టు పార్టీకి అవసరమైన రాజకీయ, సైద్ధాంతిక, భావజాల మార్గదర్శకత్వం ఇచ్చే బాధ్యతను కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ (సిపిజిబి) పైన పెట్టింది. భారతదేశంలోనైనా, మరేదేశంలోనైనా విప్లవం అంటూ వస్తే రష్యాలో వచ్చినట్టే పారిశ్రామిక కార్మికవర్గపు సార్వత్రిక సమ్మె రూపంలో వస్తుందనే అమాయకమైన నమ్మకం ఒక పక్క, సిపిజిబి ఇచ్చే యూరప్ కేంద్రక, వలసవాద అనుకూల సలహా సహకారాలు మరొకపక్క భారత కమ్యూనిస్టు పార్టీకి సొంత దృక్పథం, దృక్పథ స్పష్టత లేకుండా చేశాయి. తాను ఏ సమాజంలో పనిచేయవలసి ఉన్నదో ఆ సమాజాన్ని అధ్యయనం చేసి, ఆ సమాజానికి తగిన విప్లవ వ్యూహాన్ని, ఎత్తుగడలను రూపొందించుకునే బాధ్యతను భారత కమ్యూనిస్టు ఉద్యమం విస్మరించింది. ఈ మాట ఎవరో విమర్శకులు ఆరోపించడం కాదు, స్వయంగా భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర డాక్యుమెంట్లు ఏడో సంపుటం (1948-1950) ముందుమాటలో సంపాదకుడు ఎం బి రావు అంగీకరించారు. 'సైద్ధాంతిక విశ్లేషణ లేకుండా ఒక కమ్యూనిస్టు పార్టీ తన వ్యూహం - ఎత్తుగడలను రూపొందించుకోజాలదని అందరికీ తెలిసిన విషయమే. అలాగే 1950 జనవరి 27న లాస్టింగ్ పీస్ పత్రిక సంపాదకీయానికి ముందరి దశలోనూ, ఆ తర్వాత సాగిన దశలోనూ రాజ్యాధికారం గురించి విశ్లేషించడానికి ఒక ప్రయత్నం జరిగింది. అయితే ఈ విశ్లేషణ అత్యంత విచిత్రమైన పద్ధతిలో జరిగింది. అది నిర్దిష్ట పరిస్థితుల నిర్దిష్ట అధ్యయనం మీద ఆధారపడలేదు. మొదట లెనిన్, స్టాలిన్ ల ఉటంకింపుల మీద, ఆ తర్వాత మావో, చైనీస్ నాయకుల ఉటంకింపులమీద ఆధారపడి జరిగింది.'

'ఆ విమర్శను కొనసాగించి ఆయన అనేక ఇతర విషయాలు రాశారు గాని, దానిలో ప్రధానంగా గ్రహించవలసిన విషయమేమంటే భారత నిర్దిష్ట సామాజిక వాస్తవికతను, అందులో ప్రధానమైన గ్రామీణ సంబంధాలను అధ్యయనం చేయడం మీద భారత కమ్యూనిస్టులు పెట్టవలసినంత శ్రద్ధ పెట్టలేదనేది.

స్థానిక ప్రజాజీవితాన్ని అధ్యయనం చేసి నిర్దిష్ట అవగాహన ఏర్పరచుకోవాలనే విషయంలో భారత కమ్యూనిస్టు పార్టీకీ చైనా కమ్యూనిస్టు పార్టీకీ మధ్య తేడా ఇక్కడ స్పష్టంగా కనబడుతుంది. రెండు పార్టీలూ ఒకేసంవత్సరం (1921) పుట్టినప్పటికీ (భారత కమ్యూనిస్టు పార్టీ పుట్టిన తేదీ విషయంలో కూడ వివాదం ఉంది - 1921ని ఆమోదించేవారు కొందరు కాగా, 1925 అనేవారు కొందరు), చైనా కమ్యూనిస్టుపార్టీ తాను పని చేయవలసిన మౌలికవర్గం రైతాంగం అని గుర్తించి గ్రామీణ ప్రాంతాలలో పని చేయడం 1927 నాటికే ప్రారంభించింది. కాని, భారత కమ్యూనిస్టు పార్టీకి ఆ స్పష్టత 1950 నాటికి కూడ సమగ్రంగా రాలేదు. రష్యా అనుభవం వల్ల కార్మిక కర్షక మైత్రి అనే మాట పదేపదే వల్లించినప్పటికీ కర్షకులలో పనిచేయడం గురించి 1934 దాకా ఆలోచించిన దాఖలా లేదు.

కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ (కొమింటర్న్) 1928 సమావేశాలలో ప్రవేశపెట్టిన నివేదికలో భారతదేశం గురించి వివరంగానే ఉంది. ఐతే ఆ నాటి ఆలోచనలకు తగినట్టుగానే 'భారతదేశంలో ఇప్పటికీ మౌలికమైన పరిశ్రమ వ్యవసాయమే. మొత్తం జనాభాలో 73 శాతం దానిపైననే ఆధారపడతారు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో భూస్వామ్య శక్తులతో ఘర్షణ పడుతూ వ్యవసాయంలోకి పెట్టుబడిదారీ విధానం చొరబడుతున్న కారణంగా తీవ్రమైన వ్యవసాయ సంక్షోభం తలెత్తుతోంది" లాంటి మాటలు ఉన్నాయి. ఈ వ్యవసాయ, గ్రామీణ వర్గం కార్మిక వర్గంగా

మారి విప్లవం వైపు వస్తుందనే అవగాహనే ప్రధానంగా ఉండేది గాని నిర్దిష్టంగా ఆ వర్గ సమస్యల అధ్యయనం, ఆ వర్గానికి ఉన్న విప్లవశక్తి గురించి అధ్యయనం తక్కువ. అప్పటికే బెంగాల్ లో, బొంబాయిలో వర్కర్స్ అండ్ పెజెంట్ పార్టీలు ఏర్పాటయ్యాయి గాని వాటిలో కూడ రైతాంగ సమస్యల ప్రాధాన్యత, అధ్యయనం తక్కువే. ఒకవైపు కొమింటర్న్ సమావేశాల్లో కర్షకుల ప్రాధాన్యత గురించి మాట్లాడుతూనే భారత కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం రాసిన ప్రణాళికలో కార్మికవర్గానిదే ప్రధాన బాధ్యతగా, దానికి రైతాంగం 'నిష్క్రియాపరమైన అనుచరవర్గంగా" ఉంటుందన్నట్టుగా రాశారు. కమ్యూనిస్టుల నాయకత్వంలోనే 1936లో అఖిలభారత కిసాన్ సభ ఏర్పడింది గాని అది కూడ గ్రామీణ అధ్యయనాల పట్ల చూపిన ఆసక్తి తక్కువే. 1948 దాకా ఎన్నో పత్రాలలో వ్యవసాయ పరిశ్రమ, వ్యవసాయ కార్మికులు, పెట్టుబడిదారీ చొరబాటు, వ్యవసాయదారుల కార్మికీకరణ, అర్ధ కార్మికీకరణ వంటి మాటలూ కనబడతాయి. వలస పాలనలోని భారతదేశంలో కమ్యూనిస్టులకు మార్గదర్శకత్వం వహించిన సిపిజిబి నాయకుడు రజనీ పామీ దత్ రాసిన, 1946లో తొలిసారి అచ్చయిన ఇండియా టుడే కూడ ఆ నాటి కమ్యూనిస్టులకు గ్రామాల గురించి ఉన్న ఇటువంటి అభిప్రాయాలకే అద్దం పడుతుంది.

సైద్ధాంతికంగా, పైనుంచి భారత కమ్యూనిస్టు ఉద్యమానికి ఇటువంటి అవగాహనలు ఉండగా, ఆచరణలో మాత్రం విప్లవానికి రైతాంగం ఒక ప్రధాన చోదకశక్తిగా ఉంటుందని అప్పటికే చైనాలో రుజువవుతోంది. సరిగ్గా ఆ సమయానికే భారత కమ్యూనిస్టు ఉద్యమం కూడ అనివార్యంగా దేశంలో మూడు ప్రాంతాలలో గ్రామీణ స్థాయిలో రైతాంగ పోరాటాలకు నాయకత్వం వహిస్తోంది. బెంగాల్ లో దాదాపు పందొమ్మిది జిల్లాలకు విస్తరించి కౌలు రైతులు తమకు న్యాయంగా రావలసిన వాటా కోసం చేసిన సుప్రసిద్ధమైన తెభాగ పోరాటం జరిగింది. తిరువాన్కూర్ రాజ్యంలో రాచరిక దౌర్జన్యాలకు వ్యతిరేకంగా రైతాంగం సాగించిన పున్నప్రా - వయలార్ పోరాటం దారుణమైన రాజ్య హింసను ఎదుర్కొని కూడ ముందుకు సాగింది. వెట్టి చాకిరీకీ, భూస్వాముల దౌర్జన్యాలకూ వ్యతిరేకంగా ప్రారంభమై తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం భూమి భుక్తి విముక్తి పోరాటంగా పరిణమించి, చైనా మార్గంలో నూతన ప్రజాస్వామిక విప్లవంగా మారడమే కర్తవ్యం అని ప్రకటించింది.

ఈ మూడు పోరాటాలలోను గ్రామీణ భూసంబంధాల పట్ల, రైతాంగ శక్తి పట్ల పార్టీకి మొదటిసారి పెద్ద ఎత్తున అవగాహన పెరిగింది. అప్పటికి దాదాపు పది సంవత్సరాలుగా రైతు కూలీల మధ్య, భూమిలేని నిరుపేదల మధ్య పని చేస్తున్నప్పటికీ గ్రామాల అధ్యయనం జరగవలసినంత సమగ్రంగా జరగలేదనే అనాలి. కాని ఈ మూడు పోరాటాల, ముఖ్యంగా తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట కాలం నాటి డాక్యుమెంట్లు పరిశీలిస్తే పార్టీ అప్పుడే గ్రామాల గురించి, గ్రామీణ భూసంబంధాల గురించి అధ్యయనం చేయడం మొదలుపెట్టినట్టు కనబడుతుంది. అయితే అప్పటికి శాస్త్రీయమైన గ్రామీణ అధ్యయన సంవిధానాలు తెలిసి ఉండే అవకాశం లేదు. ఒకవైపు ఈ పోరాటాలు సాగుతుండగానే అధికార మార్పిడి జరగడం, భారత కమ్యూనిస్టు పార్టీ పోరాట మార్గాన్ని వదిలి, పార్లమెంటరీ మార్గాన్ని చేపట్టాలని నిర్ణయం తీసుకోవడంతో భారత దేశంలో ఉత్పత్తి సంబంధాలను, గ్రామాలను, ప్రజాజీవితాన్ని అధ్యయనం చేయవలసిన అవసరం కూడ లేకపోయింది.

అటువంటి చర్చకు, అధ్యయనాల అవసరానికి దారి తీసినది మళ్లీ నక్సల్బరీ ప్రజా ప్రజ్వలనమే. భారత కమ్యూనిస్టు పార్టీ గాని, 1964లో ఏర్పడిన భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) గాని భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని, పెట్టుబడిదారీ వ్యవస్థ ఏర్పడిందని, లేదా ఏర్పడుతోందని, ఇప్పుడు జరగవలసినది జనతా ప్రజాస్వామిక విప్లవమని తీర్మానించాయి గనుక వాటికి గ్రామీణ అధ్యయనాలు చేయవలసిన అవసరం తగ్గిపోయింది. నక్సల్బరీ పంథా మాత్రం భారతదేశానికి ఇంకా స్వాతంత్ర్యం రాలేదని, ఇవాళ ఇక్కడ కొనసాగుతున్నది అర్ధభూస్వామ్య, అర్ధవలస పాలన అని నిర్వచించుకున్నది గనుక ఆ సూత్రీకరణను పరిపుష్టం చేసుకోవడానికి గ్రామీణ అధ్యయనాలు జరపవలసి వచ్చింది.

నక్సల్బరీ ఉద్యమ తొలిరోజుల్లోనే, 1968లోనే, 'ప్రతి పార్టీ కమిటీ తాను పనిచేసే ప్రత్యేక ప్రాంతాన్ని ఎంపిక చేసుకుని, ఆ ప్రాంతంలో వర్గ విశ్లేషణ ఎలా జరపాలో నేర్చుకోవాలి. పరిశోధన ద్వారా, అధ్యయనం ద్వారా అక్కడి ప్రజానీకంలోని ప్రతి ఒక్క బృందపు ఆకాంక్షలను, ఆలోచనలను మదింపు వేయడం నేర్చుకోవాలి. ఈ రకమైన పరిశోధనా, అధ్యయన పద్ధతిని నేర్చుకోవడం సుదీర్ఘ ఆచరణ ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది" అని చారు మజుందార్ రాశారు. ఆ రోజుల్లోనే బెంగాల్ లోని ముర్షిదాబాద్ జిల్లాలో ఒక గ్రామం గురించిన వివరమైన విశ్లేషణ జరిపి, ఆ నివేదికను బెంగాలీ నుంచి ఇంగ్లిష్ లోకి అనువదించి లిబరేషన్ 1969 జూన్, ఆగస్ట్ సంచికలలో అచ్చువేశారు. పూర్తిస్థాయి అధ్యయనాలు, శాస్త్రీయ పరిశోధనలు కాకపోయినా గ్రామీణ ప్రాంతాల భూస్వాముల గురించి, భూసంబంధాల గురించి, రైతుకూలీల స్థితిగతుల గురించి నివేదికలు ఆకాలపు సాహిత్యంలో కొల్లలుగా కనిపిస్తాయి.

సరిగ్గా ఆ సమయంలోనే మేధోలోకంలో గ్రామీణ, వ్యవసాయ రంగ అధ్యయనాల గురించి లోతైన చర్చ మొదలయింది. ప్రధానంగా ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో జరిగిన ఈ చర్చ మోడ్ ఆఫ్ ప్రొడక్షన్ డిబేట్ గా సుప్రసిద్ధమైంది. భారత వ్యవసాయంలోకి పెట్టుబడిదారీ విధానం ప్రవేశించిందా లేదా, పెట్టుబడిదారీ యాంత్రీకరణ జరిగిందా లేదా, పెట్టుబడిదారీ ప్రవేశం కొన్ని ప్రాంతాలలోనే జరిగిందా, దేశవ్యాప్తంగా జరిగిందా, అసలు జరగలేదా, వ్యవసాయ ఉత్పత్తి సంబంధాలలో భూస్వామ్య, అర్ధ భూస్వామ్య సంబంధాలే కొనసాగుతున్నాయా లేదా, భారత గ్రామీణ రంగంలో ప్రధానమైన వర్గాలు ఏమిటి, ఏ వర్గాల మధ్య మైత్రితో, ఏ వర్గాల మధ్య ఘర్షణతో సామాజిక చలనం ముందుకు సాగనుంది, వీటిలో ఏ నిర్ధారణలు ఏ రాజకీయ వైఖరికి దారితీస్తాయి వంటి అనేక ప్రశ్నలకు జవాబులు వెతుకుతూ దాదాపు రెండు డజన్ల మంది అర్థశాస్త్రవేత్తలు పంజాబ్, హర్యానా, బీహార్, బెంగాల్, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, మహారాష్ట్ర వంటి అనేక ప్రాంతాలలో గ్రామాలను అధ్యయనం చేసి, విభిన్నమైన విశ్లేషణలు ప్రకటించారు. చర్చోపచర్చలు చేశారు. ఈ చర్చ

సందర్భంగా భారత గ్రామీణ వాస్తవికత గురించి మాత్రమే కాక, మార్క్సిస్టు దృక్పథంలోని ఉత్పత్తి విధానం, ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి సంబంధాలు, మొత్తంగా సామాజిక ఆర్థిక నిర్మితి భావన, వలసవాద పాలన, భూస్వామ్యం, అర్ధభూస్వామ్యం, పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం, అర్ధవలస వంటి ఎన్నో అంశాలు చర్చకు వచ్చాయి.

ఒకరకంగా ఈ చర్చకు కొనసాగింపుగానే భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) అగ్రనాయకులు పి సుందరయ్య 1974 లో గుంటూరు జిల్లాలోని అనంతవరం, కాజ గ్రామాలను అధ్యయనం చేసి, 1976 **'గ్రామీణ పేదలు – భూపంపకం'** పుస్తకంగా ప్రచురించారు. ఫౌండేషన్ ఫర్ అగ్రేరియన్ స్టడీస్ సంస్థ 2005–06లలో గుంటూరు జిల్లా అనంతవరం, అనంతపురం జిల్లా బుక్కచెర్ల, కరీంబగర్ జిల్లా కొత్తపల్లి గ్రామాలను అధ్యయనం చేసి 2010లో సోషియో ఎకనమిక్ సర్వేస్ ఆఫ్ త్రీ విలేజెస్ ఇన్ ఆంధ్రప్రదేశ్ – ఎ స్టడీ ఆఫ్ అగ్రేరియన్ రిలేషన్స్ అని ప్రచురించింది. సుందరయ్య విజ్ఞాన కేంద్రం, జనవిజ్ఞాన వేదిక సంయుక్తంగా 2008–09ల్లో రాష్ట్రవ్యాప్తంగా 22 జిల్లాల్లో 88 గ్రామాల అధ్యయనం జరిపి 2011లో గ్రామీణ ఆంధ్ర ప్రదేశ్ – ఆర్థిక, సామాజిక అంతరాలు ప్రచురించాయి.

మోడ్ ఆఫ్ ప్రొడక్షన్ చర్చ జరిపిన మేధావులకు, సామాజిక, అర్థ శాస్త్రవేత్తలకు, పైన చెప్పిన మూడు పుస్తకాలకు ఈ చర్చ కేవలం అకడమిక్ చర్చే కావచ్చుగాని, విప్లవకారులకు ఇది జీవన్మరణ సమస్య. విప్లవకారులు రచించుకునే వ్యూహం – ఎత్తుగడలు వారు సమాజం గురించి ఏర్పరచుకునే అవగాహన మీద ఆధారపడి ఉంటాయి. ఆ అవగాహన ఏర్పరచుకోవడానికి గ్రామాలను అధ్యయనం చేయక తప్పదు. అప్పటికి ప్రాణాలు బలిపెట్టి పోరాడుతున్న మార్గం సరైనదేనని నిర్ధారించుకునేందుకు కూడ గ్రామాల అధ్యయనం అవసరమవుతుంది. అందువల్ల తొలిదశ నక్సల్బరీ, శ్రీకాకుళ విప్లవోద్యమాల వెనుకంజ తర్వాత తిరిగి విప్లవశక్తులను కూడగట్టడానికి జరిగిన ప్రయత్నాలన్నీ గ్రామీణ అధ్యయనాలతో కలగలసి సాగాయి. వేరు వేరు నాయకత్వాల కింద సాగిన విప్లవోద్యమాలు ఏదో ఒక పద్ధతిలో తమకు వీలయిన చోట్ల గ్రామీణ అధ్యయనాలు సాగించాయి.

అటువంటి అధ్యయనాలలో చెప్పుకోదగినది 1978 మేలో పుస్తకరూపంలో వెలువడిన **వ్యవసాయ విప్లవం**. నల్లగొండ, కృష్ణా జిల్లాలలో ఒక్కొక్క గ్రామాన్ని, ఆదిలాబాద్ జిల్లాలో రెండు గ్రామాలను తీసుకుని అధ్యయనం, విశ్లేషణ సాగించిన ఈ నివేదిక మొదట అప్పటి సిపిఐ (ఎంఎల్) సిఓసి, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కమిటీ రహస్య పత్రిక **ఎర్రజెండా** 1976 ఏప్రిల్ – ఆగస్ట్ సంచికలో అచ్చయింది. రక్షిత నీటి పారుదల సౌకర్యాలు లేనందువల్ల వెనుకబడిన వ్యవసాయ స్థితి, పాత సాంకేతిక పద్ధతుల, పరికరాల వినియోగం, భూకమతాలలో అసమానతలు, వ్యవసాయ ఉత్పాదకాల ఖరీదు పెరిగిపోతుండడం, రసాయనిక వినియోగం వల్ల భూసారం తగ్గిపోతుండడం, వ్యవసాయం నానాటికీ గిట్టుబాటు కాని స్థితి, వ్యవసాయానికి తగిన సంఖ్యలో పశుగణం అభివృద్ధి చెందకపోవడం, వ్యవసాయానికి తగినంత పెట్టుబడి అందకపోవడం, పరపతి సౌకర్యాల కొరత, వెట్టి, కట్టు బానిసత్వం, తప్పుడు కొలతలు, విపరీతమైన వడ్డీ రేట్లు వంటి భూస్వామ్య అలవాట్లు కొనసాగడం, భూమి మీద అపరిమితమైన ఒత్తిడితో వ్యవసాయ శ్రామికులకు ఏడాదికి సగం రోజులైనా పని దొరకకపోవడం, పెరిగిపోతున్న రుణభారం వంటి అంశాలు ఆనాటి గ్రామీణ ప్రాంతాలలో ఉన్నాయని వ్యవసాయ విప్లవం నిర్ధారించింది. ఆ స్థితి నుంచి ప్రజల విముక్తికి, గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికి వ్యవసాయ విప్లవం మాత్రమే మార్గమని, అది నూతన ప్రజాస్వామిక విప్లవంలో భాగంగా జరగాలని పిలుపునిచ్చింది.

ఈ పుస్తకం తర్వాత నాలుగు సంవత్సరాల పాటు సాగిన రైతాంగ పోరాటాలు, ప్రతి సంవత్సరం వేసవిలో రాడికల్ విద్యార్థి యువజనులు జరిపిన గ్రామాలకు తరలండి కార్యక్రమాలు అభివృద్ధి చేసిన అవగాహనల నేపథ్యంలో 1981లో కరీంనగర్ జిల్లాలోని గౌరవెల్లి, మాణిక్యాపూర్, రామవరం, కొత్తపల్లి గ్రామాల అధ్యయనం జరిగి, **'దున్నేవారికే భూమి లభించనిదే రైతాంగానికి విముక్తి లేదు'** అనే పుస్తక రూపంలో 1982లో వెలువడింది. ఆ తర్వాత గడిచిన ముప్పై సంవత్సరాలలో తెలంగాణలో వరంగల్ జిల్లాలో కొండాపూర్, లద్దునూరు, ఖిలా షాపూర్, అడవి కేశవాపూర్ గ్రామాలలో, ఏటూరు నాగారం ప్రాంతాలలో, కరీంనగర్ జిల్లా గొర్రెపల్లి, మహబూబ్ నగర్ జిల్లా మొలచింతలపల్లి గ్రామాలలో, ఆదిలాబాద్ జిల్లా మంగి ప్రాంతంలో, నిజామాబాద్ జిల్లా మొత్తం మీద అధ్యయనాలు సాగాయి.

ఇదే కాలంలో విప్లవోద్యమ ప్రభావంలో ఉన్న అర్థశాస్త్రవేత్తలు కొందరు కూడ స్వతంత్రంగా గ్రామ అధ్యయనాలు జరిపారు. అవి అటు సామాజిక, అర్థశాస్త్ర శాఖలలో ఎంఫిల్, పిఎచ్‌డి సిద్ధాంత పత్రాలుగా గాని, లేక విడిగా వ్యాసాలుగాగాని వెలువడ్డాయి. 1982లో వెలువడిన దున్నేవారికే భూమిలో అధ్యయనం చేసిన నాలుగు గ్రామాల నుంచి రెండు గ్రామాలను (గౌరవెల్లి, మాణిక్యాపూర్) తీసుకుని 2011లో వీక్షణం సంపాదకవర్గం మళ్లీ అధ్యయనం చేసింది. ఈ అధ్యయన తొలి నిర్ధారణలను ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో 2011 జూలైలో భారత వ్యవసాయ ఉత్పత్తి విధాన పరివర్తన మీద జరిగిన సదస్సులో సమర్పించడం జరిగింది.

ఇటీవలికాలంలో, ముఖ్యంగా ప్రపంచీకరణ తర్వాత చాల మార్పులు జరిగిపోయాయని, గ్రామాలలో ఉత్పత్తి సంబంధాలు మారిపోతున్నాయని ఒక అభిప్రాయం బలపడుతున్న నేపథ్యంలో గ్రామీణ అధ్యయనాలకు మళ్లీ ఒకసారి ప్రాధాన్యత పెరుగుతోంది. గ్రామాలు, గ్రామాలలో ఉత్పత్తి సంబంధాలు ముప్పై ఏళ్ల కింద ఉన్నట్టే యథాతథంగా ఇవాళ కూడ ఉంటాయని వాదించడం అర్థరహితమే అవుతుంది గాని, వచ్చిన మార్పుల స్వభావం ఏమిటి, మార్పుల దిశ ఏమిటి, ఆ మార్పులు మౌలికమైనవా, సారంలో మార్పులా, రూపంలోని మార్పులు మాత్రమేనా వంటి ప్రశ్నలకు లోతైన జవాబులు వెతకవలసిన అవసరం, అవకాశం ఉన్నాయి. అందువల్ల గ్రామీణ అధ్యయనాలు మరొకసారి, మరింత నిశితంగా, క్రమబద్ధంగా, శాస్త్రీయంగా జరపవలసిన అవసరం ఉంది.

(ఇంకా ఉంది)

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

# ఆదివాసుల సంస్కృతి అన్యాక్రాంతం

***ఆదివాసీ సంస్కృతీ, సంప్రదాయాలనూ, విలువైన చారిత్రక ఆధారాలనూ పరిరక్షించాల్సిన అవసరం ఎంతో ఉందని అంటున్నారు*** **గుమ్మడి లక్ష్మీనారాయణ**

ఆది నుండి సంస్కృతీ సాంప్రదాయాలు కలబోసిన జీవన విధానానికి సజీవ దృశ్యమే ఆదివాసీ సమాజం. ఎందుకంటే పూర్వ మానవ సంబంధాలు, గోత్రాలతో కూడిన బంధుత్వ వారసత్వాలు, ప్రత్యేక సాంప్రదాయ పండుగలు, కట్టుబాట్లు ఆదివాసుల వెన్నంటే ఉంటున్నాయి. అందుకు నిలువెత్తు సాక్ష్యంగా వరంగల్ జిల్లాలో జరిగిన సమ్మక్క సారలమ్మ అనే గిరిజన జాతర. కుల, మత, ప్రాంత భేదం లేకుండా మేడారం మరో 'గిరిజన కాశీ'గా వెలుగొందుతోంది. ఆదివాసులు స్వయం పాలన కోసం నాటి కాకతీయులను ఎదుర్కొని వీరత్వం నుండి దైవత్వం పొందిన ఆ శక్తి దేవతల ముందు నేటి నాగరిక సమాజం మోకరిల్లడం విశేషం. కేవలం ఆదివాసీ పూజారులే సంప్రదాయ బద్ధంగా వన దేవతలను ప్రతిష్టిస్తారు. ప్రభుత్వం రెండేళ్లకొకసారి ఆదాయ మార్గంగా, ఆర్భాటంగా నిర్వహించడమే తప్ప, మేడారం కోయ, నాయక్ పోదు గిరిజనుల సంక్షేమం పట్టించుకోవడం లేదు. పూర్వం గిరిజనులకే పరిమితమైన జాతర, నేడు సకల జనుల సమ్మేళన జాతరగా మారడంతో మంత్రులు, ప్రజా ప్రతినిధులు, అధికారులు వన దేవతల – దీవెనలు పొంది, అడవి బిడ్డల సంస్కృతినీ, సంక్షేమాన్నీ గాలికొదిలేయడం పరిపాటిగా మారింది.

'అనాగరికులు'గా పిలువబడుతున్న ఆదివాసులు – ఎనిమిది వందల ఏళ్లపూర్వమే దండకారణ్యంలో ఉంటూనే కాకతీయ సామ్రాజ్యంపై తిరుగుబాటు చేసిన ఘన చరిత్ర ఉంది. కేవలం మౌఖిక సాహిత్యంగా మిగిలినా, వారిది గొప్ప పోరాట చరిత్ర. ఆదిమ కాలంలో పరాధీనతను ఒప్పుకోని ఆదివాసులు వనవాసంలోనూ కోయ రాజ్యాలేర్పడడం, మేడరాజు, పగిడిద్దరాజుల పరిపాలనలో సమ్మక్క, సారలమ్మలు ధీర వనితలుగా స్మరించబడడం, ఆ వారసత్వాలు నేడు స్మరించుకున్నా సంస్కృతీ, సాంప్రదాయాలూ క్రమం తప్పక పాటించడం నవీన సంస్కృతికి ప్రతిబింబమే.

ప్రత్యేకించి స్త్రీలను వన దేవతలుగా పూజించడం – మాతృస్వామిక కుటుంబాలలోనే ఆరంభమైన మానవజాతి మూల లక్షణాలు ఆదివాసుల్లోనే కన్పిస్తాయి. మహిళలను అంగడి సరుకుగా, బానిసగా, ఒక వ్యాపార ప్రకటనగా చూపిస్తున్న సమాజం ఆదివాసుల నుంచి నేర్చుకోవాల్సింది ఎంతో ఉంది.

ఆదివాసుల సంస్కృతిలో భాగంగా 1940 నుండి వెలుగులోకి వచ్చిన ఈ సాంస్కృతిక (వన) జాతర 1996లో రాష్ట్ర పండుగగా గుర్తింపు పొందినా గిరిజనులకు ఒరిగిందేమీ లేదు. తాజాగా జాతీయ హోదా కల్పించాలనే నాయకులు, మేధావులు వారి సంస్కృతీ, సంక్షేమం, జీవన విధానానికి అదే స్థాయిలో భరోసా ఇస్తే బాగుంటుంది. మరోవైపు సంస్కృతికి విరుద్ధ సంఘటనలు పెచ్చరిల్లడం సర్వసాధారణం అయిపోయింది. ఆదివాసులకు మతాచారాలు లేవు. ఏ మత పద్ధతులూ పాటించరు. విగ్రహారాధన అసలే లేదు. కేవలం ప్రకృతి ఆధార శక్తులనే ఆరాధిస్తారు. కానీ అందరినీ ప్రేమిస్తారు. వీరి అనుబంధం సర్వమత సమానత్వం నేర్పుతుంది. కాని హైందవీకరణ ప్రభావంతో, ఆధునికీకరణ పేరుతో సంస్కృతికి విరుద్ధమైన పరాయీకరణ మొదలయింది. రాజకీయ నాయకులు, గిరిజనేతరుల జోక్యం పెరిగింది. దేవదాయ శాఖ ఆలయ ప్రాంగణంలో పసుపు, కుంకుమ, పూల అలంకరణ బదులుగా పెయింట్లు, ప్లాస్టిక్ పూలు, కాకతీయ తోరణాలు, హిందూత్వ చిహ్నాలు వాడుతున్నారు. పారేటాకుకు బదులు అరిటాకు భోజనం, ప్రసాదం పేరిట లడ్డూలు దర్శనమిచ్చాయి. రాజకీయ నాయకులు, విఐపిలు దర్శనం కోసం పూజారులను పట్టించుకోకుండా పాదరక్షలతో ప్రవేశించడం అపచారమైనా ఉదాసీనతే. ఆదివాసీల మౌఖిక సాహిత్యానికి విరుద్ధంగా దేవతల భిన్న కథనాలు, పాటలు, పుస్తకాలు, వీడియో ఆల్బమ్స్ వ్యాపారం, అన్యమత ప్రచారం కొనసాగుతోంది.

వన దేవతల పోరాట విశేషాలు, సంస్కృతికి ఆధారమైన కళావస్తువులు, చారిత్రక ఆధారాలు కనుమరుగు కాకముందే భద్రపరిచేందుకు గిరిజన మ్యూజియం, సమ్మక్క వెలసిన చిలకల గుట్ట చుట్టూ ఫెన్సింగ్ మార్క్ జరగాలి. ఈ ప్రతిపాదన 2006లో రాగా, ఇటీవల ఫిబ్రవరి 1న ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి మేడారం సందర్శనతో మోక్షం లభించినట్లయింది. ఆధ్యాత్మికంగా, ప్రత్యేక శక్తి పీఠంగా భాసిల్లుతున్న మేడారం స్ఫూర్తిని భవిష్యత్తరాలకు పాఠ్యాంశంగా చేర్చాలి. ఐటిడిఎ, గిరిజన సంక్షేమ శాఖలు గిరిజనులు తయారు చేసిన మూలికాపరమైన ఔషధ, వైద్య విధానాలకు చెందిన ఉత్పత్తులను ప్రచారం చేసి గిరిజన సాంస్కృతిక జీవన విధానాన్ని లోకానికి చాటి చెప్పాలి. మేడారం స్ఫూర్తితో ఆదిలాబాద్ జిల్లాలోని కేస్లాపూర్‌లో జరిగే నాగోబా జాతర సందర్భంగా సమస్యల పరిష్కార వేదికగా నిర్వహిస్తున్న గిరిజన దర్బార్ వలే మేడారంలోనూ దర్బార్ నిర్వహించాలి.

గిరిజనులు క్రమంగా వారి సంస్కృతీ, హక్కులపై ఆధిపత్యం కోల్పోతున్న సంఘటనలు అనేకం. జాతర నిర్వహణలో భాగంగా గిరిజన సంస్కృతి, పరిరక్షణ కోసం ఏర్పాటైన ట్రస్ట్ బోర్డ్ కమిటీలో చైర్మన్, ఒక డైరెక్టర్ మినహా ఏడుగురు గిరిజనేతరులను ప్రభుత్వం నియమించింది. భక్తుల సేవా కార్యక్రమాల్లో పనిచేసేందుకు అధికారులు ఎన్ఎస్ఎస్, ఎన్‌సిసి విద్యార్థులను నియమించి, ఆదివాసీ వాలంటీర్లను పట్టించుకోవడం లేదు. జాతరను ఆదాయ వనరుగా భావించిన గిరిజనేతరుల వలసలు పెరిగి, స్థానిక నాయకుల ప్రమేయంతో 1/70 చట్టానికి విరుద్ధంగా భూములు కొనుగోలు చేసి, భవనాలు నిర్మించారు. ఇది గిరిజన చట్టాలకు వ్యతిరేకం కాదా? సాంస్కృతిక హననం కాదా? గిరిజన పూజారులు, సాంప్రదాయ కళాకారులు కూడా గుర్తింపు, భద్రతను కోల్పోతున్నారు. జాతర ప్రాంగణంలో అధికారులకు విశ్రాంతి భవనాలున్నట్లు, ఆదివాసులకు కేటాయించకపోవడం సమంజసం కాదు. ఈసారి మేడారంలో

# మీడియా - ప్రస్తుత పరిణామాలు

***ప్రజలకు అవసరమైన విషయాల్లో పట్టింపులేనితనాన్ని, అనవసర విషయాల్లో సంచలనాత్మకతను ప్రదర్శించే మీడియా బాధ్యతా రాహిత్యాన్ని వివిధ సంఘటనల ఆధారంగా వివరిస్తున్నారు*** **సుకిరణ్ దావులూరి**

కొద్దినెలల క్రితం ప్రెస్ కౌన్సిల్ నూతన చైర్మన్‌గా బాధ్యతలు స్వీకరించిన అనంతరం ఒక ఇంగ్లిషు మీడియా ఛానల్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో జస్టిస్ మార్కండేయ కట్జూ మీడియా పై, అందునా జాతీయ మీడియాపై చేసిన వ్యాఖ్యలు సంచలనాన్ని సృష్టించాయి. చాలా మీడియా సంస్థలు బాధ్యతారహితంగా వ్యవహరిస్తున్నాయని, ప్రజల సమస్యల కన్నా ఏదో కొద్దిమంది వినోదానికే పెద్ద పీట వేస్తున్నాయని ఆయన చేసిన వ్యాఖ్యలు పెనుదుమారాన్నే సృష్టించాయి. కాని ఈ మధ్య కాలంలో జరిగిన కొన్ని సంఘటనలు మీడియా బాధ్యతా రాహిత్యాన్ని ఆయన తక్కువగా అంచనావేసారని స్పష్టం చేస్తున్నాయి.

కొద్దిరోజుల క్రితం నాంది ఫౌండేషన్ అనే స్వచ్ఛంద సంస్థ దేశంలోని 9 రాష్ట్రాలలోని 112 జిల్లాలలో, 3360 గ్రామాలలోగల 1,09,093 మంది ఐదు సంవత్సరాలలోపు వయస్సుకల శిశువులపై పౌష్టికాహార లోపంపై వెలువరించిన నివేదిక ఎన్నో చేదు వాస్తవాలను వెల్లడించింది. ఆ నివేదిక ప్రకారం సర్వే చేసిన ప్రాంతాలలోని 42 శాతం మంది శిశువులు పౌష్టికాహార లోపంతో బాధపడుతున్నారు. ఇది భవిష్యత్తులో వారి ఆరోగ్యం పై, రోగనిరోధక శక్తిపై తీవ్ర ప్రభావాన్ని చూపి సగటు జీవన ప్రమాణ స్థాయిని మరింత దిగజార్చే అవకాశం ఉంది. అదే నివేదిక 92 శాతం మంది తల్లులకు పౌష్టికాహార లోపంపై సరైన అవగాహన కూడా లేదన్న వాస్తవాన్ని వెల్లడించింది. ప్రపంచంలోనే అత్యంత చురుకైన మీడియాగా పేరొందిన మన మీడియా కనీసం ఈ విషయంలోనూ గ్రామీణులలో ఒక అవగాహనను ఏర్పరచలేని స్థాయిలో ఉన్నట్లయితే మీడియా ఏ సామాజిక బాధ్యతను నెరవేరుస్తున్నట్లు? ఎవరి ప్రయోజనాలను నెరవేరుస్తున్నట్టు? ఈ నివేదిక జవహర్ లాల్ నెహ్రూ తరువాత అంతటి మేధావి, విద్యావంతుడైన ప్రధానిగా, అంతకు పూర్వం ప్రణాళికాసంఘం ఉపాధ్యక్షుడుగా, రిజర్వు బ్యాంకు గవర్నర్‌గా, పి.వి. నరసింహారావు మంత్రివర్గంలో ఆర్థిక మంత్రిగా సంస్కరణలను ప్రవేశపెట్టి దేశాన్ని అభివృద్ధిపథంలో నడిపిస్తున్నాడని పేరుగాంచిన మన్మోహన్ సింగ్ విడుదల చేయడం ఆశ్చర్యకరం. మీడియా ఈ

---

వినియోగించిన రు. 60 కోట్ల నిధులు అవినీతికి గురైన సందర్భం లేకపోలేదు. ఎందుకంటే జాతరకు ఆరు నెలల ముందే ప్రణాళిక చేసి, మూడు నెలల్లో (బినామీ పేర్లతో) అనుమతులు సాధించి, కేవలం నెలరోజుల్లో పనులు తాత్కాలికంగా, నాణ్యత లేనివిగా చేసి, జాతరానంతరం వాటిని తొలగిస్తున్నారు. ఈ పనుల్లో కాంట్రాక్టర్లు, ఇంజినీర్లు, నాయకులు... ఇలా ఎవరి వాటా వారిదే. కాంట్రాక్టర్లు అవినీతిపనులను సైతం అమ్మవారి సమక్షంలోనే ఆరంభించడం కొసమెరుపు.

కోయ గిరిజనుల భాష, సంస్కృతి, ఉనికిని పరిరక్షించడంలో ప్రభుత్వం దృష్టి సారించకపోవడం విచాకర అంశం. ప్రభుత్వం, విద్యాధికారులు సంస్కృతి పరిరక్షణకు చరిత్ర – సాహిత్యం వరకు, అంతరించిపోయిన కోయ భాషపై పరిశోధన గానీ, కనీసం పాఠశాల స్థాయిలో 'కోయభారతి' వాచక పరిచయానికి గానీ పూనుకోకపోవడం చారిత్రక తప్పిదమే. తెలుగు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వరంగల్‌లో 'గిరిజన విజ్ఞాన పీఠం' ఏర్పడినా, అక్కడి అధ్యయనాలు వ్యక్తిగత పిఎచ్‌డి పట్టాలకే తప్ప గిరిజన తెగల జీవితానికి భరోసా ఇవ్వలేదు. ఇటీవల ప్రభుత్వం ఏర్పాటు చేసిన గిరిజన విశ్వవిద్యాలయం కోయ గిరిజనులున్న ప్రాంతానికి దక్కకుండా విశాఖపట్నం జిల్లాకు తరలించారు. ఎనిమిది వందల ఏళ్ల చరిత్ర గల సమ్మక్క – సారలమ్మ పేరును తాడ్వాయి మండలానికి పెట్టాలనే ప్రతిపాదన ఎనిమిదేళ్లుగా పాలకుల మధ్య మగ్గిపోతోంది. 2004 నుండి 2012 వరకు చంద్రబాబు నాయుడు నుండి కిరణ్‌కుమార్ రెడ్డి వరకు నలుగురు ముఖ్యమంత్రులు పేరు మార్పిడికి హామీలు ఇచ్చారు. గతంలోనే తాడ్వాయి మండల పరిషత్ సమావేశం, జిల్లా పరిషత్ సమావేశం ఏకగ్రీవ తీర్మానం చేసినా అదీ మరుగున పడింది. ఇప్పటికైనా మేడారంను గ్రామపంచాయతీగా మార్చి, తాడ్వాయిని సమ్మక్క, సారలమ్మ పేరుతో పాటు, ములుగు ప్రాంతాన్ని 'మేడారం డివిజన్'గా మార్చాలని స్థానికులు కోరుతున్నారు. అలాగే ఆదివాసీ బిడ్డల పరాధీనతకు చరమగీతం పాడి, స్వయం పాలన కోరిన సమ్మక్క – సారలమ్మను స్మరించుకునేలా – కాకతీయుల ఆనవాళ్లతో సమానంగా ప్రతిమలను జిల్లా కేంద్రంలో ఏర్పాటు చేయడానికి సమాచార, సాంస్కృతిక శాఖలు చొరవ తీసుకోవాలి.

వనదేవతల సాక్షిగా రాజకీయ నాయకులు తమ రాజకీయ ప్రచారం ఆరంభిస్తూ – సంస్కృతీ, సంక్షేమం, స్వయం పాలన హామీలు గుప్పించడం రివాజుగా మారింది తప్ప, వాటికి కట్టుబడింది లేదు. 2010 జాతర ఆదాయం మూడు కోట్ల 94 లక్షల రూపాయలు రాగా, ఆదివాసీల సంక్షేమానికి వినియోగించింది శూన్యం. కాగా ఈ ఏడాది ఆదాయం రు. 5,12,84,755కు పెరిగింది. కనీసం వనదేవతల స్వస్థలాలైన బయ్యక్కపేట, కన్నెపల్లి, కొండాయి, పూనుగొండ్ల గ్రామాల్లో దేవాలయాలు అభివృద్ధికి నోచుకోలేదు. ఆదాయం వాటాలో 14 మంది పూజారులకు ఇచ్చే 1/3 వంతు జీతం వారికి ఏ కోశానా సరిపోదు. కావున ఆదివాసీల సాంప్రదాయాలను గౌరవించి, వారి వారసత్వాలకు 40 శాతం వాటా, స్థానిక ఏజెన్సీ గ్రామాల అభివృద్ధికి మరో 40 శాతం వాటా కేటాయించాలి. ఆదివాసుల సంస్కృతీ సాంప్రదాయాలతో కూడిన అభివృద్ధిని కాంక్షిస్తున్నారు. ప్రభుత్వం ఆదివాసీలు సాంస్కృతిక జీవనాన్ని పరిరక్షించే చర్యలు చేపట్టాల్సిన అవసరముంది.

*(రచయిత ఆదివాసీ రచయితల సంఘం సభ్యులు)* వీ

నివేదికకు ఎలాంటి ప్రాధాన్యత ఇవ్వలేదు.

ఢిల్లీ, ముంబై నగరాలలో పొగమంచు కారణంగా రద్దైన విమాన సర్వీసుల సమాచారాన్ని ప్రసారం చేయడంపై చూపే శ్రద్ధ సైతం మీడియా ఇంతటి ముఖ్యమైన విషయానికి ఇవ్వకపోవడం మీడియాలో నెలకొన్న పెడ ధోరణులకు నిదర్శనం. ఇదే సందర్భంలో మీడియా ఈ కాలంలో ఏయే విషయాలపై దృష్టిసారించిందో గమనించినట్లైతే మీడియా ఏ రకపు సామాజిక బాధ్యతను నిర్వహిస్తోందో అర్థమవుతుంది.

సల్మాన్ రష్దీ అనే భారత సంతతికి చెందిన బ్రిటిష్ రచయిత జైపూర్‌లో జరుగుతున్న సాహితీ సమ్మేళనానికి హాజరు కాకుండా కొన్ని ముస్లిం సంస్థలు అడ్డుపడడంతో, ఆయనకు హెచ్చరికలు చేయడంతో రాజస్తాన్ ప్రభుత్వం ఆయనకు భద్రత కల్పించలేమని పేర్కొంది. దానితో సల్మాన్ రష్ది తన పర్యటనను రద్దు చేసుకున్నారు. రష్దీ రెండు దశాబ్దాల క్రితం రాసిన 'సతానిక్ వెర్సెస్' అనే పుస్తకం తమ మతాన్ని కించపరిచే విధంగా ఉందన్న ఉద్దేశ్యంతో ముస్లింలు ఆయనపై తీవ్ర ఆగ్రహంతో ఉన్నారు. రాబోయే కొద్ది నెలల్లో ఐదు రాష్ట్రాలకు ఎన్నికలు జరగనున్న నేపథ్యంలో, ఆయా రాష్ట్రాలలో ముస్లింలు ఎక్కువగా ఉండడంతో కాంగ్రెస్ ప్రభుత్వం వారిని తమవైపు తిప్పుకొనే ప్రయత్నాల్లో భాగంగా ఆయా సంస్థలకు వంతపాడుతోంది. నాంది ఫౌండేషన్ వెలువరించిన నివేదిక వెలువడే సమయానికి మీడియా సల్మాన్ రష్దీకి భారతదేశంలోకి ప్రవేశించే హక్కులపై, ముస్లిం మత ఛాందసవాదంపై, ప్రభుత్వ ఓటు బ్యాంకు రాజకీయాలపై నిప్పులు కక్కుతోంది. భారతదేశంలో ప్రతి పౌరుడికీ సల్మాన్ రష్దీ రచించిన పుస్తకం చదివే హక్కు ఉంది. ఏ వర్గం వారికి ఇబ్బంది కలిగించినా తన అభిప్రాయాన్ని వెల్లడించే హక్కు ప్రతీ రచయితకూ, అది భారతీయుడైనా, భారతసంతతికి చెందినవారైనా, విదేశీయుడికైనా కచ్చితంగా ఉండితీరాలి. దాన్ని మీడియా పరిరక్షించాలి. కానీ ఒక వ్యక్తి హక్కులు, గుప్పెడు మంది వ్యక్తుల మత ఛాందసవాదం మీద మాత్రమే తమ దృష్టిని నిమగ్నం చేసినట్లయితే భారతదేశ మీడియా అందునా జాతీయ మీడియా తన సామాజిక బాధ్యతను వదిలిపెట్టినట్లే.

అదే విధంగా, ఈ మధ్య కాలంలో నార్వేలో భారత సంతతికి చెందిన ఇద్దరు పిల్లలపై మీడియా ఎక్కువ దృష్టి సారించింది. అభిజ్ఞాన్, ఐశ్వర్య అనే ఇద్దరు పిల్లలను వారి తల్లిదండ్రులు వారిపై సరైన దృష్టి సారించడం లేదన్న కారణంతో నార్వే ప్రభుత్వం శిశు సంరక్షణ విభాగానికి అప్పగించింది. తర్వాతి కాలంలో మీడియా, భారత ప్రభుత్వ జోక్యంతో వారిని వారి బంధువులకు అప్పగించడం జరిగింది. నార్వే గణాంక సంస్థ 2011లో వెలువరించిన ఒక నివేదికలో 2004-2010 మధ్యకాలంలో నార్వేలో స్థిర పడిన ప్రతి వెయ్యి మంది వలస దేశీయులకు పుట్టిన పిల్లల్లో 19 మందిని వారి తల్లితండ్రులకు దూరంగా ఉంచిందని నివేదించింది. ఈ విషయంలో మీడియా అకారణంగా వేరు చేయబడ్డ పిల్లల విషయంలో బాధ్యతాత్మకంగా వ్యవహరించినప్పటికీ ఒక వ్యక్తీ లేదా కుటుంబ స్థాయిలో జరిగే అన్యాయాలను ప్రశ్నించడం మినహా సంస్థాగత స్థాయిలో, కొన్ని కోట్ల మంది జీవితాలను ప్రభావితం చేసే స్థాయిలో జరిగే అన్యాయాలను మీడియా ప్రశ్నించ లేకపోతోంది. కొన్ని సందర్భాలలో కొన్ని మీడియా సంస్థలు సమర్థనీయమైన పాత్ర పోషిస్తున్నప్పటికీ వాటిని సమస్య పరిష్కారం వరకు లేదా విధాన సవరణ జరిగే వరకు కొనసాగించడంలో మీడియా దారుణంగా విఫలం అవుతోంది. దేశంలో ప్రతిరోజూ కొన్ని వేల మంది పిల్లలు ఆకలితో, తేలికగా నివారించగలిగిన వ్యాధులతో బాధపడుతూ మరణిస్తున్నా మీడియా, అందునా దేశ విధానపర నిర్ణయాలను సైతం ప్రభావితం చేయగల జాతీయ మీడియా, ప్రత్యేకంగా ఆంగ్ల మీడియా ఒకరిద్దరి పిల్లలపై అంతటి శ్రద్ధ కనబరచడం అన్యాయం.

అదే విధంగా ఇంగ్లాండ్‌లోని మాంచెస్టర్ నగరంలో హత్యకు గురైన అనుజ్ బిద్వే హత్య విషయంలో కూడా మీడియా అత్యుత్సాహం చూపింది. అనుజ్ గత డిసెంబర్ 24న మాంచెస్టర్‌లో కొంతమంది గుర్తు తెలియని దుండగుల చేతిలో చంపబడ్డాడు. అతని హత్య విషయంలో మీడియా ఎంతో చురుకుగా వ్యవహరించింది. హత్య జరిగిన నెల రోజుల తర్వాత కూడా ఎన్నో కథనాలను ప్రసారం చేస్తూనే ఉంది.

'గత ఆరు దశాబ్దాలుగా భారత ప్రజాస్వామ్యం ఎన్నో సవాళ్లను ఎదుర్కొని నిలవగలిగి ఉండడంలో మీడియా పాత్ర ఎంతో ఉంద'ని అమర్త్యసేన్ వంటి మేధావులు అభిప్రాయపడుతున్నారు. కానీ ఈ మధ్య కాలంలో మీడియా బాధ్యతారహిత ప్రవర్తనకు పై ఉదాహరణలు సరిపోతాయి.

అరవై ఆరు సంవత్సరాల క్రితం, 1946 డిసెంబర్ 9న మొదటి సారి రాజ్యాంగసభ సభ్యులు పార్లమెంట్ హాల్‌లో సమావేశం అయ్యారు. దాదాపు మూడు సంవత్సరాలు శ్రమించిన అనంతరం వారు భారత దేశమనే సువిశాల భవంతిని నిర్మించడానికి ప్రణాళికను తయారు చేసారు. ఆ ప్రణాళిక అప్పటికి ఏ దేశంలోనైనా రూపొందించబడిన ప్రణాళిక కంటే భిన్నమైనది, మెరుగైనిది, మరింత అనువైనది. వారి కృషి ఫలితంగా ఈనాడు భారతదేశమనే ఈ సువిశాల భవంతి ఎన్నో వజ్రాలను, మణి మాణిక్యాలను తన తలపై ధరించి సుదూరాలనున్న ఎందరో బాటసారులను తనవైపు ఆకర్షింప చేసుకొని ఆశ్చర్యపరుస్తోంది, ఎందరికో ఆదర్శంగా నిలుస్తోంది. కాని బయటి వారికి తెలియని ఎన్నో సవాళ్లను ఆ భవంతి ఎదుర్కొంటోంది.

26 నవంబర్, 1949 భారత రాజ్యాంగ సభకు అధ్యక్షుడైన బాబు రాజేంద్రప్రసాద్ రాజ్యాంగ ప్రతినిధి సభ్యుల ఆమోదానికి ఉంచుతూ చేసిన వ్యాఖ్యలు ఈ సందర్భంలో గమనార్హం. 'రాజ్యాంగం ఏ విషయాల ను పొందుపరచినా, వేటిని పొందుపరచలేకపోయినా దేశ క్షేమం దేశాన్ని నడిపించే వ్యక్తులపైనే ఆధారపడి ఉంది. కొంత మందికి రాజ్యాంగంలోని కొన్ని విషయాలు అభ్యంతరకరంగా ఉండొచ్చు. రాజ్యాంగంలో కొన్ని లోపాలున్న విషయాన్ని మనం అంగీకరించి తీరాలి. ఒకవేళ ప్రజల ద్వారా ఎన్నుకోబడిన నాయకులు నీతి, నిజాయితీ కలిగిన వారైతే వారు ఇటువంటి రాజ్యాంగాన్ని కూడా చక్కగా వినియోగించుకోగలరు. రాజ్యాంగం అనేది ఒక యంత్రంలాగా ప్రాణంలేనిది. రాజ్యాంగాన్ని అమలుచేసే వ్యక్తులద్వారా ఆ రాజ్యాంగం ప్రాణం పోసుకుంటుంది.'

ప్రజలకు రాజకీయ నాయకులపై ఏనాడో నమ్మకం సన్నగిల్లింది, తమ సమస్యల పరిష్కారానికి వారు న్యాయ వ్యవస్థ, మీడియా వైపు చూస్తున్నారు. ఒకవేళ మీడియా సమాజంలోని మధ్యతరగతి, ఉన్నత వర్గాల సమస్యలకు, సౌకర్యాలకు అధిక ప్రాధాన్యతనిస్తూ అధిక సంఖ్యాకుల సమస్యలను గాలికి వదిలినట్లయితే ఎలాంటి పరిణామాలు సంభవిస్తాయో ఊహించడం కష్టం.

*(రచయిత పరిశోధక విద్యార్థి)* వీ

# గిరిపుత్రుల అభివృద్ధి సాధ్యమేనా?

***ఆదివాసుల అభివృద్ధికీ, ఆరోగ్యానికీ, వారి జీవిత మనుగడకూ ఇప్పటి వరకు పాలకులు చేసింది ఏమీ లేకున్నా, వారి అణచివేతకు మాత్రం కోట్ల రూపాయలను బడ్జెట్‌లలో కేటాయిస్తున్నారని అంటున్నారు సర్దార్‌జీ***

డార్విన్ పరిణామ సిద్ధాంతం ప్రకారం నాటి ఆదిమ జాతుల ప్రతిరూపమే నేటి మానవజాతి సమూహం. నేటి నవీన యుగానికి నాగరికత నేర్పించిన ఆదివాసులే ఆదిమ మానవులుగా చరిత్రలో నిలిచిపోయారు. సమాజానికి దూరమైనట్లుగానే చరిత్రకు కూడా దూరం చేశారు ఈ పాలకులు. దక్షిణ భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలో ఆదివాసులు పెద్ద సంఖ్యలో జీవిస్తున్నట్లుగానే మన రాష్ట్రంలో కూడా గోదావరి పరీవాహక ప్రాంతాలలో ఆదివాసులు జీవనం సాగిస్తున్నారు. 2001 జనాభా లెక్కల ప్రకారం మన రాష్ట్రంలో 50,24,104 మంది ఆదివాసులు నివసిస్తున్నారు. ఈ జనాభాలో 41 శాతం మంది షెడ్యూల్డ్ ప్రాంతాలలో నివసిస్తున్నారు. మైదాన ప్రాంతాల్లో 59 శాతం మందికి చెందిన ఐదు తెగల వారు నివసిస్తున్నారు. మైదాన ప్రాంత ఆదివాసులలో అక్షరాస్యత 34 శాతం కాగా, షెడ్యూల్డ్ ఏరియాలో అక్షరాస్యత పురుషులది 17 శాతం, మహిళలది 8.64 శాతంగా ఉంది. డా. బి.ఆర్. అంబేద్కర్ భారత రాజ్యాంగంలో 366 ఆర్టికల్ 25 సూచించిన ప్రకారం మన రాష్ట్రంలో అడవి ప్రాంతంలో స్థిర నివాసం కలిగిన 30 తెగల సమూహాలున్నాయి. ఆదివాసీ తెగలలో అత్యంత వెనుకబడి కొండలపైన, గుట్టలపైన జీవిస్తూ నాగరిక ప్రపంచానికి దూరమై అంతరించిపోతున్న తెగలలో కొండరెడ్ల తెగ ఒకటి. ఖమ్మం జిల్లాలోని భద్రాచలం డివిజన్‌లోని ఐ.టి.డి.ఎ. పరిధిలో వి.ఆర్.పురం, కూనవరం, చింతూరు, వేలూరుపాడు, అశ్వరావుపేట, దమ్మపేట మండలాల్లో కొండరెడ్లు సుమారు 2500 కుటుంబాలు 12 వేల మంది జనాభా కలిగి ఉన్నాయి. ఇప్పటికీ కొండరెడ్ల గ్రామాలు గుట్టలపై ఉన్నాయి. అడవులకు దగ్గరగా అభివృద్ధికి ఆమడదూరంలో జీవిస్తున్నారు. ఆయా తెగల వృత్తుల జీవనరీతుల ఆధారంగా వాటిని వర్గీకరించారు. ఈ తెగల్లో కొన్ని ఇంకా ఆహారసేకరణ దశలో ఉన్నాయి. కొన్ని తెగలు పశుపోషణ చేపట్టాయి. మరికొన్ని తెగలు పోడు వ్యవసాయం చేస్తున్నాయి. చాలా తెగలు స్థిర నివాసం ఏర్పర్చుకొని వ్యవసాయ వృత్తిని చేపట్టాయి. ఈ తెగలలో కొండరెడ్ల తెగ ఒకటి.

రాష్ట్రంలోని గోదావరి నది ప్రవహించే చేరువలో కరీంనగర్ నుంచి ఉభయ గోదావరి జిల్లాల వరకూ కొండరెడ్ల తెగను చూడవచ్చు. ప్రధానంగా భద్రాచలం ప్రాంతం నుంచి తూర్పు గోదావరి దేవీపట్నం, పశ్చిమ గోదావరి జిల్లాలోని పోలవరం వరకూ కొండరెడ్లు విస్తరించి ఉన్నారు. ఆయా ఆదివాసీ గ్రామాల్లో ఇతర ఆదివాసీ తెగలతో కలిసి నివసిస్తున్నప్పటికీ, ఆదివాసీ తెగల్లో కొండరెడ్డి తెగకు ప్రత్యేక స్థానం ఉంది. తమ ప్రత్యేకతను తెలుపుతూ, ఇళ్లను విడివిడిగా గుట్టలపైన నిర్మించుకుంటారు. కొండరెడ్లు నాగరిక సమాజానికి దూరంగా కొండ కోనల్లో జీవనం సాగిస్తున్నారు. పక్క రాష్ట్రమైన చత్తీస్‌గడ్ వైపు గుత్తి కోయ భాషా, ఒడిశా వైపు ఒడియా భాషా మాట్లాడుతారు. వస్త్రాధారణ, అలంకారాలు, ఆహార అలవాట్లు కూడా దండకారణ్యంలోని సంప్రదాయాలను పోలి ఉంటాయి. ఆదివాసీ ఇతర తెగలతో పాటు కొండరెడ్లు ప్రధానంగా వ్యవసాయంపై ఆధారపడి అడవి నరికి పోడు వ్యవసాయం చేస్తారు. ఇవ్వాళ ఆదివాసులు వ్యవసాయం చేయడం ఫారెస్ట్ ఏరియాలో ఒక సమస్యగా మారింది. ఎందుకు అంటే ఫారెస్ట్ భూమి ఒక పెద్ద సమస్యగా మారింది కాబట్టి. 1947లో అధికార మార్పిడి జరిగిన తర్వాత రిజర్వ్ ఫారెస్ట్‌గా వర్గీకరించేటప్పుడు ఆదివాసుల భూముల్ని, ఉమ్మడి భూముల్ని, హక్కుల్ని నిర్ధారించకుండానే, సెటిల్ చేయకుండానే అడవులుగా ప్రకటించారు. ఆదివాసీ ప్రజల సెటిల్‌మెంట్ హక్కుల గురించి పట్టించుకోలేదు. 1952 నాటి జాతీయ అటవీ విధానాన్ని భారత ప్రభుత్వం సవరించి 1980లో అటవీ సంరక్షణ చట్టం తెచ్చి అడవిపై భారత ప్రభుత్వానికి, వ్యాపారపరంగా దోచుకొనే దోపిడీ వర్గానికి ప్రభుత్వం పూర్తి ఆధిపత్యానిచ్చింది. కాబట్టి ఆదివాసీ గూడెంలోకి వేదాంత, పోస్కో, టాటా లాంటి కంపెనీలతో పాటు బహుళ ప్రాజెక్టులు ఆదివాసీ కొండల్లోకి వస్తున్నాయి. నిర్వాసితం అనేది ఆదివాసుల జీవితంలో ఒక భాగమైపోయింది. అధికార మార్పిడికి ముందు ఎంతమంది ఆదివాసులు నిర్వాసితులు అయ్యారు అనే లెక్కలు స్పష్టంగా లేకున్నా, అధికార మార్పిడి తర్వాత ఆదివాసులు అనేక ప్రాజెక్టులు, గనులు, అభివృద్ధి పథకాల ద్వారా పెద్ద ఎత్తున నిర్వాసితులు అయినారు, అవుతున్నారు. నూతన ఆర్థిక విధానాల మూలంగా ఆదివాసులను మరింత నిర్వాసితులను చేయడం కోసం, బహుళజాతి గుత్త సంస్థలు, ప్రపంచబ్యాంక్ కన్ను వేసాయి. అందుకే ఆదివాసీ ప్రాంతాల ప్రజలు పొట్ట చేతబట్టుకొని లోతట్టు ప్రాంతాలకు తరలి వెళ్తున్నారు.

కొండలపై ఉన్న గ్రామాలలో అనేక ఆదివాసీ తెగలతోపాటు కొండరెడ్లకు మౌలిక వసతులు కరువయ్యాయి. ఇక్కడ తరతరాల నుండి వారు జీవిస్తున్నారు. అయినా సరైన ఇళ్లులేవు. ఇప్పటివరకూ పాఠశాలలూ, అంగన్‌వాడీ కేంద్రాలూ, హెల్త్ సెంటర్‌లూ కూడా ప్రభుత్వం, ఐ.టి.డి.ఎ. ఏర్పాటు చేయలేదు. చిన్న రోగం వచ్చినా సుమారు ముప్పై కిలోమీటర్లు కాలిబాటన కొండలు ఎక్కి దిగవలసిందే. సరియైన నీటి వసతులు లేక మురికి నీరుతాగి మలేరియా, డయేరియా, డెంగ్యూలతో ఎంతో మంది చనిపోతున్నారు. ప్రభుత్వం, ఐటిడిఎ హెల్త్ సెంటర్‌లు సంవత్సరం మొత్తం నిధులను ఖర్చు చేస్తున్నాయని చెప్పినా కొండరెడ్ల అభివృద్ధికి, వారి ఆరోగ్యానికి కూడా ఉపయోగపడడం లేదు.

ఆదివాసుల అభివృద్ధికి ఐ.టి.డి.ఎ. అధికారులు, ప్రభుత్వం కోట్ల రూపాయలు కేటాయించామని చెప్పినా వాస్తవంలో ఏజెన్సీ ప్రాంతాల్లోని మావోయిస్టుల వేట కోసం మనుషులను చంపడానికే తప్ప అభివృద్ధికి కేటాయించలేదు. ఉదాహరణకు, భద్రాచలంలోని ఐ.టి.డి.ఎ. పరిధిలో 2010-11 బడ్జెట్‌లో వివిధ శాఖల్లో భద్రతా అవసరాల దృష్ట్యా 100

# బాక్సైట్ బద్దలైతే!

***బాక్సైట్ నిక్షేపాలను కార్పొరేట్ కంపెనీలకు అప్పజెప్పే క్రమంలో అతలాకుతలం అవుతున్న ఆదివాసీ జీవితాలను, వారి ప్రతిఘటనలను వివరిస్తున్నారు ఎం. నాగమణి***

మన్యంలో ఉన్న అపార బాక్సైట్ నిక్షేపాలను బడా కంపెనీలకు దారాదత్తం చేయడానికి కాంగ్రెసు ప్రభుత్వం కృత నిశ్చయంతో పావులు కదుపుతోంది. ఆదివాసుల మనుగడకే ప్రమాదం అంటూ సామాజిక ఉద్యమ కార్యకర్తలు, ఆదివాసి ప్రజలు హెచ్చరించినా ఫలితం లేకుండా పోతోంది. ఆదివాసీల నుంచి తీవ్ర వ్యతిరేకత వ్యక్తమవుతున్నా పట్టించుకోకపోవడం శోచనీయం. అన్‌రాక్, జిందాల్ కంపెనీలకు బాక్సైట్ ఖనిజం తవ్విపోయాలనే దిశగా ప్రయత్నాలు ముమ్మరం అవుతున్నాయి. బాక్సైట్ తవ్వకాలతో పర్యావరణంతో పాటు, ఉత్తరాంధ్రలో ఉన్న 19 నదులు ఎండిపోతాయి. ఫలితంగా నీటి వనరులు ఎలా కరిగిపోతాయనే అంశంపై సోహన్ హట్టంగిడి అనే సామాజికవేత్త అధ్యయనం చేశారు. ఈ అధ్యయన నివేదికలో పర్యావరణానికి తీరని నష్టం కలుగుతుందని నివేదించారు. అయినా బాక్సైట్‌పై ప్రభుత్వం నుంచి సరైన స్పందన రాలేదు. పర్యావరణ పరిరక్షణపై అటవీ, కాలుష్య నియంత్రణ మండలిలో అధ్యయనం జరపాల్సిన ప్రభుత్వం మిన్నకుంది.

బాక్సైట్ తవ్వకాలపై చింతపల్లి, గూడెం రక్షిత అటవీ ప్రాంతంలో ఏ.పి.ఎం.డి.సి.కి (అన్‌రాక్ కోసం) కేంద్ర అటవీ పర్యావరణ మంత్రిత్వ శాఖ నుంచి పూర్తి స్థాయిలో అనుమతులురాలేదు. ఈ దిశగా ప్రభుత్వాలు (కేంద్ర, రాష్ట్ర) వడివడిగా అడుగులు వేస్తున్నాయి. దీనికోసం ఇటీవల డా. జె.సి.కాలా (పర్యావరణ నిపుణులు) ఆధ్వర్యంలో అధ్యయన కమిటీ వేశారు. ఈ కమిటీ ఎదుట బాక్సైట్‌కు వ్యతిరేకంగా ఆదివాసీ ప్రజలు, ప్రజాస్వామికవాదులు, రాజకీయపార్టీలు. ప్రజాసంఘాలు అంతా గళం వినిపించాయి. నష్టాలను ఏకరువు పెట్టారు. డిసెంబర్ 20, 21 తేదీలలో 48 గంటల పాటు మన్యం బంద్‌కు పిలుపునిచ్చారు. నిరసనకారులను పోలీసులు నిర్బంధిచారు. ఈ క్రమంలో మన్యం పర్యటనను కమిటీ రద్దు చేసుకుంది. డిసెంబర్ 21న కమిటీ సభ్యులు ఏరియల్ సర్వే చేపట్టారు. దీనిని అడ్డుకునేందుకు వేలాది మంది ఆదివాసీ ప్రజలు తమ సంప్రదాయక ఆయుధాలతో జెర్రెల అటవీ ప్రాంతం చేరుకొని హెలిక్యాప్టర్ ల్యాండింగ్ కాబడే స్థలాలను, తమ అదుపులో పెట్టుకున్నారు. కొండలపై వేలాదిగా ఉన్న ప్రజలను చూసి ఏరియల్ సర్వేను అర్థాంతరంగా ముగించుకొని తిరుగు ప్రయాణమయ్యారు. డిసెంబర్ 22న జరిపిన ప్రజాభిప్రాయ సేకరణలో పాల్గొన్న వివిధ బూర్జువా, రివిజనిస్టు పార్టీలు, ప్రజాసంఘాలు, విద్యార్థి సంఘాలు, ప్రజలు బాక్సైట్‌పై ఎటువంటి తవ్వకాలకు అనుమతులు ఇవ్వవద్దని, అసలు ప్రజాభిప్రాయ సేకరణే చేపట్టవద్దని డిమాండ్ చేశాయి. అయినా ప్రస్తుతానికి జి.కె. వీథి మండలం జెర్రెల ప్రాంతంలో బాక్సైట్ తవ్వకాలకు ప్రభుత్వం మొగ్గు చూపిస్తోంది. ఇందుకు కేంద్ర సాధికారత కమిటీ అధ్యక్షుడు డా. జె.సి. కాలా తవ్వకాలను అందరు వ్యతిరేకించడం లేదని, ఏ పరిశ్రమల వల్ల అయినా కాలుష్యం ఉంటుందని అన్నారు. ప్రకటనే నిదర్శనం. ఈ తవ్వకాలు జరిగితే ముడి బాక్సైట్ రవాణా వల్ల భారీ ఎత్తున కాలుష్యం జనంపైన, నీటితావులపై, పంటచేలపై,

---

కోట్ల రూపాయలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కేటాయించినవి. ఈ బడ్జెట్‌లోని కొద్దోగొప్పో మిగిలిన బడ్జెట్‌ను ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరిట మావోయిస్ట్‌లను చంపడానికి తప్ప ఆదివాసీ పేద ప్రజల అభివృద్ధికి కేటాయించలేదు. దశాబ్దాలు గడిచినా ఆదివాసీ జీవితాలు కొండలకు మాత్రమే పరిమితమై పోతున్నాయి.

విస్తారమైన అడవిలో సాగు చేసుకోవడానికి వీలైన సారవంతమైన భూమి ఉన్నప్పటికీ ఫారెస్ట్ అధికారుల నుంచి నానా ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. గోదావరి నదికి ఇరుపక్కల విస్తరించి ఉన్న భూములు సారవంతమైనవి. కాబట్టి ఇవాళ గిరిజనేతరులు, ముఖ్యంగా కోస్తా నుంచి భూస్వాములు ఈ భూములను ఆక్రమించుకొన్నారు. భారత రాజ్యాంగంలో 5వ షెడ్యూల్డ్‌కి చెందిన మన రాష్ట్రంలోని తొమ్మిది జిల్లాల పరిధిలో ఏజెన్సీ ప్రాంతాలలో పాలకుల అప్రజాస్వామిక దోపిడీతో ఆదివాసీ గ్రామాలు అతలాకుతలమవుతున్నాయి. ఏజెన్సీ ప్రాంతాల్లో 1/70 చట్టానికి విరుద్ధంగా, భూ పరాయీకరణ పెసా చట్టానికి అక్రమంగా మైనింగ్ మాఫియా, సహజ వనరుల దోపిడీ, పోలవరం ప్రాజెక్ట్ ఏర్పాటు వంటి పరిస్థితుల వల్ల ఆదివాసులు అధికభాగం నిర్వాసితులవుతున్నారు. ఆదివాసీ అభివృద్ధి కోసం ఐ.టి.డి.ఎ. అనేక పథకాలు రూపొందించినా ఆచరణలో అమలు జరపకపోవడం వలన ఆదివాసుల అభివృద్ధితో పాటు అంతరించిపోతున్న కొండరెడ్ల అభివృద్ధి సాధ్యమేనా అనే సందేహాలు కలుగుతున్నాయి.

అడవుల్లో నివసించే ఆదివాసుల జీవిత వనరు అడవులే. చేపల్ని నీటి నుంచి వేరు చేస్తే ఎట్లా బతకలేవో, అట్లాగే ఆదివాసుల్ని అడవి నుంచి వేరు చేస్తే బతుకలేరు. ఆదివాసులకు ఆహారాన్ని, ఆశ్రయాన్ని ఇచ్చేవి అడవులే. శతాబ్దాలుగా వాళ్లు అడవుల్ని వాడుకునే స్వేచ్ఛను, జంతువుల్ని వేటాడే స్వేచ్ఛను అనుభవించడం వాళ్ల సాంస్కృతిక జీవితాన్ని అతి దగ్గరగా పరిశీలిస్తే తప్ప అడవితో పెనవేసుకున్న వాళ్ల జీవితానుబంధం ఎంత బలమైనదో అర్థం కాదు.

చరిత్రలో అడవుల్ని దోచుకోవాలనుకున్న ప్రతివాడు తాను చేసే ప్రతిచర్య ఆదివాసీ అభివృద్ధికే అని చెప్పాడు ప్రపంచానికి. అయితే ఇవాళ్టి ఆదివాసీ అభివృద్ధి అంటే ఆదివాసుల్ని అడవి నుండి వేరు చేయడమేనా?

*(రచయిత తెలంగాణ విద్యార్థి వేదిక రాష్ట్ర కోశాధికారి)* వీ

వృక్షాలపైకి వెదజల్లనున్నాయి. సంవత్సరానికి 4.5 మిలియన్ టన్నుల బాక్సైట్‌ను జెర్రెల బ్లాక్ నుంచి తరలించనున్నారు. దీనికోసం 16 టన్నుల టిప్పర్లను వినియోగిస్తే సంవత్సరానికి 2.81 లక్షల లోడ్లు తరలించాల్సి ఉంటుంది. అంటే ఆయా లారీలు రోజుకు 770 ట్రిప్పులు తిరగాలి. రోజుకు 8గంటల పాటు రవాణా జరిగితే గంటకు 96 లారీలు బాక్సైట్ రవాణా చేస్తాయి. ఈ లెక్కన నిమిషానికి 1.6 ట్రక్కులు రోడ్డుపై బాక్సైట్‌ను మోసుకు వెళతాయి. ఇదే 25 టన్నుల మల్టీ యాక్సెల్ ట్రక్కుల్లో రవాణా ఏటా 1.80 లక్షల లోడ్లు వెళతాయి. దీని ప్రకారం గంటకు 61 ట్రిప్పులు వేయాలి. అంటే నిముషానికి ఒక లారీ రవాణా జరగాలి. దీని ప్రకారం యావకరపాలెంలోని అన్‌రాక్ పరిశ్రమ నుండి జర్రెల బాక్సైట్ బ్లాకు వరకు వరుసగా లారీలు రహదారి పైనే దర్శనమిస్తాయి. దీని వల్ల ప్రజా రవాణా వ్యవస్థ దెబ్బతింటుంది. అత్యవసర సర్వీసులకు విఘాతం కలుగుతుంది. రహదారిపై అటు ఇటు దాటే వారి పరిస్థితి ప్రమాదంలో పడుతుంది. రోడ్డు ప్రమాదాలు జరిగి, మరణాలు పెరిగే అవకాశం లేక పోలేదు. రహదారికి రెండూ వైపులా నిర్వహించే సంతల పరిస్థితి ప్రశ్నార్థకంగా మారనుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రజల జీవించే హక్కుకి భగ్నం కలుగుతుంది. శబ్ద కాలుష్యం, నీటితావుల కాలుష్యం, పంటచేలు, వృక్షాలు, పశుపక్ష్యాదులు, వాతావరణ కాలుష్యం, అంతటా విధ్వంసాన్ని సృష్టించి, ఆదివాసీలు, పీడిత ప్రజలు జీవించే హక్కు కబళించే ఈ బాక్సైట్ తవ్వకాలను అభివృద్ధికి ప్రతి రూపాలుగా పాలకుల ప్రచారం చేసుకోవడం అత్యంత విషాదకరం.

**అంతులేని కాలుష్యం**

బాక్సైట్ రవాణాకు అనువుగా ఇప్పటికీ కొంతమేర రహదారి నిర్మాణం జరిగింది. నర్సీపట్నం నుంచి దౌనూరు వరకు ఇప్పటికే 6 లైన్ల రహదారి పనులు పూర్తి చేశారు. ఇదే తరహాలో 6 లైన్ల రహదారి జర్రెల వద్ద చేపట్టగా, బాక్సైట్‌కు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న ఆ ప్రాంతం ప్రజలు మూడు ప్రొక్లయిన్‌లను దగ్ధం చేశారు. ఒక వేళ రహదారి నిర్మాణం జరిగితే దాదాపు 20 భారీ వృక్షాలను తొలగించాల్సి ఉంటుంది. ఇప్పటికే నర్సీపట్నం నుంచి దౌనూరు వరకు చేపట్టిన రహదారి నిర్మాణం సందర్భంగా ఏళ్ల నాటి భారీ వృక్షాలను వందల సంఖ్యలో నరికివేశారు. ఇది పర్యావరణానికి తీరని ప్రమాదంగా ఏర్పాడుతుంది. దీనిపై అటవీశాఖ అభ్యంతరం వ్యక్తం చేయడం లేదు. అదే ఆదివాసీ ప్రజానీకం జీవిక కోసం కొండ పోడు కొడితే, వారిపై రాబందుల్లా వాలిపోయి, అక్రమకేసులు బనాయించడం, జైళ్లల్లో నిర్బంధించడం క్షణాల్లో జరిగిపోయి ఉండేది. ఒక పక్క మొక్కలు నాటుతూ మరొక దిక్కు చెట్లను నరికివేయడంపై పర్యావరణవేత్తలు అభ్యంతరం వ్యక్తం చేయడం మేరకే పరిమితమయ్యారు తప్ప! పర్యావరణాన్ని కాపాడాలనే కార్యాచరణ మచ్చుకైనా కనబడడం లేదు. బాక్సైట్ తవ్వకాలు మొదలై రవాణా జరిగితే ఒక్కొక్క ట్రక్కు మూడు గంటల పాటు ప్రయాణించి, నిక్షేపాల ప్రాంతం నుంచి అన్‌రాక్ పరిశ్రమకు చేరుకుంటుంది. ఈ ప్రయాణ సమయంలో సగటున 250 కిలోల బాక్సైట్‌తో వచ్చే రెడ్ మట్టి, దూళి గాలిలోకి వెళుతుంది. దీంతో రహదారికి ఇరువైపులా ఉండే వారి జీవనం దుర్భరంగా మారుతుంది. దుమ్ము, ధూళీతో కూడుకొని ఉన్న గాలిని పీల్చడం ద్వారా శ్వాసకోశ సంబంధ వ్యాధులకు గురిచేయబడతారు. "మూలిగే నక్కపై తాటి పండు పడ్డ" చందంగా ఇప్పటికే మలేరియా మహమ్మారి కారణంగా ఏడాదికేడాది వందల మంది ఆదివాసీ ప్రజలు పిట్టల్లా రాలిపోతుంటే, ఆదుకునే నాథుడే లేడాయే. ఇప్పుడూ బాక్సైట్ తవ్వకాల వలన ఉత్పన్నమయ్యే కాలుష్య సంబంధ వ్యాధుల మాట దేవుడెరుగు. బాక్సైట్ మట్టి ఎరుపు రంగులో ఉంటుంది. ఈ మట్టి గాలికి ఎగరడంతో చెట్లు ఎర్రబారుతాయి. ఎండ వేడిమికి ఆకులు ఎలా తయారువుతాయో, ఈ మట్టి సోకిన ఆకులు కూడా ఒక విధంగా తయారవుతాయి. ఫలితంగా ఆకులు చిగురించడంగానీ, పూత పూయడం అనే ప్రకృతి పరిణామంకు తీవ్ర విఘాతం కలిగిస్తుంది. మనిషి జీవన మనుగడకు ప్రమాదం వాటిల్లే అవకాశాలు మెండుగా ఉన్నాయి. అన్‌రాక్ బాక్సైట్ శుద్ధి కర్మాగారం కార్యకలాపాలు మొదలైతే ఏలేరు ఎడమ ప్రధాన కాలువ నుంచి రోజుకు 5 మిలియన్ గ్యాలన్ల నీటిని తీసుకుంటారు. అంటే గ్యాలన్ 4.5 లీటర్ల చొప్పున 2.25 కోట్ల లీటర్ల నీటిని అనరాక్ వినియోగిస్తుంది. మనిషి సగటున వంద లీటర్ల చొప్పున సరఫరా చేసినా రోజుకు 2.25 లక్షల మంది ఆ నీరు ఉపయోగపడుతుంది. భవిష్యత్‌లో ఇంత భారీ మొత్తంలో నీటిని పారిశ్రామిక అవసరాలకు వినియోగిస్తే ప్రజలకు నీటి ఎద్దడి తప్పేటట్లు కనిపించడం లేదు. ఇప్పటికే రక్షిత మంచినీటి సమస్యలతో ప్రజలు నానా అగచాట్లు పడుతున్నారు. బాక్సైట్ తవ్వకాల వల్ల వచ్చే ఈ అంశాలతో పాటు అనుబంధ సమస్యలపై పూర్తిస్థాయిలో అధ్యయనం చేసి దానికి అనుగుణంగా చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉందని నిపుణులు హెచ్చరిస్తున్నా ప్రభుత్వంలో చలనం లేదు.

**ఆదివాసీల ఉద్యమం**

మైనింగ్ మాఫియా రాజకీయ వారసత్వాన్ని చేజిక్కించుకొని ఆదివాసీ బతుకులను ఛిద్రం చేస్తోంది. విశాఖ మన్యంలో 8 వేల హెక్టార్లలో 750 మిలియన్ టన్నుల బాక్సైట్ తవ్వకాల వలన 274 గ్రామాలు, 42 వేల మంది ఆదివాసీ తెగలు కకావికలం అయ్యే పరిస్థితి ఉంది. ఇదే జిల్లాలో డుంబ్రిగూడ మండలంలో చైనాక్లే తవ్వకాల వలన 10 వేల మంది నిర్వాసితులవుతున్నారు. తూర్పు, విశాఖ సరిహద్దుల్లోని వంతాడ లోని లెటరైట్ ఖనిజాన్ని తవ్వి నిర్వాసితులను చేస్తున్నారు. దీనికి వ్యతిరేకంగా 1999 చంద్రబాబు హయాం నుండి ప్రతిఘటనోద్య మాలు కొనసాగిస్తున్నారు. ధర్నాలు, రాస్తారోకోలు, బంద్‌లు ద్వారా బాక్సైట్ తవ్వకాలు విరమించుకోవాలనీ ప్రభుత్వానికి తెలియజేశారు. 2007, 2011లో చేపట్టిన ప్రజాభిప్రాయ సేకరణలో ఆదివాసీలు, రాజకీయ పార్టీలు, వివిధ ప్రజాసంఘాలు, విద్యార్థి మేధావులు పాల్గొని బాక్సైట్ తవ్వకాలు చేపట్టరాదనీ, మైనింగ్ మాఫియా, బడా పెట్టుబడిదారులు, పాలకులు, ప్రభుత్వ యంత్రాంగం, ఆదివాసీ పీడిత ప్రజలను వారి భూములలో నుండి బేదఖల్ చేసి, నిల్వ నీడలేక చేసి, వారి మాన ప్రాణాలకు ముప్పు చేశారు. ఈ స్థితిని సహించని మన్యం వాసులు మా అడవి మాకు కావాలి, మా అటవీ సంపద మాకు కావాలి. మా జల్, జంగల్, జమీన్ మాకు కావాలి. అడవిపై సర్వాధికారం ఆదివాసులది. మా మన్నెంలో మా రాజ్యం ఉండాలని ఆందోళన చేసినందుకు గాను కొయ్యూరు మండలం బూదరాళ్ల పంచాయితీ కన్నవరం వద్ద ముగ్గురు ఆదివాసీ యువకులు (గోపాలరావు, బంగారయ్య, నాగేశ్వరరావు) ని బూటకపు ఎన్‌కౌంటర్‌లో కాల్చి చంపారు. ఈ ఘటన మిగిల్చిన విషాదఛాయల నుండి బైట పడనేలేదు. తిరిగి 2007 ఆగస్ట్ 20న వాకపల్లి ఆదివాసీ మహిళలపై అత్యాచారాలకు పూనుకున్నారు. సభ్య సమాజం తలదించుకునేలా చేశారు. ఈ పరంపరలో ఆంధ్ర – ఒడిశా సరిహద్దులో ఉన్న కోటిపల్లి (మల్కన్‌గిరి

జిల్లా) వద్ద పట్టపగలు ఇద్దరు ఆదివాసీలు (బుద్ర, చెంబు) తో సహా ఒక ఆదివాసీ మహిళ (సాదాయి) ని కాల్చి చంపి, ఎప్పటి మాదిరిగానే ఎన్‌కౌంటర్ కట్టుకథ అల్లారు. అదే విధంగా 2010 జనవరిలో ముంచంగిపుట్ మండలం బాబుసాల పంచాయితీ భల్లుగూడ గ్రామంలో మావోయిస్టులు ఆశ్రయం పొందుతున్నారనే నెపంతో ప్రత్యేక పోలీసు బలగాలు అర్ధరాత్రి గ్రామంపై దాడి చేశారు. గ్రామస్తులందర్నీ (పురుషుల్ని మాత్రమే) స్కూలు భవనంలో నిర్బంధించారు. ఆపై గ్రామంలో తోడేళ్లలా జొరబడి మహిళలపై అత్యాచారానికి ఒడిగట్టారు. అత్యాచారాలు జరిగి సంవత్సరాలు గడిచినా నిందితులు ఎవరో తేల్చలేని ప్రజాస్వామిక వ్యవస్థ ఇది. ఆదివాసీ మహిళలపై ఆదివాసేతరులు అత్యాచారాలు చేసినా, ఆదివాసేతరుల రాజకీయ ప్రోద్బలంతో తుంగలో తొక్కబడ్డాయి. ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం 1989 కూడా అమలయ్యే పరిస్థితి లేదు. బాక్సైట్ వ్యతిరేక పోరాటాన్ని అణచి వేయడంలో పోలీసు బలగాల ఆకృత్యాలకు అవధుల్లేకుండా పోయాయి. వీరి ఆకృత్యాలను ప్రశ్నించిన వారిని, మీకు మావోయిస్టులతో సంబంధాలున్నాయనీ, నోరు మూయిస్తు న్నారు. ఆదివాసీలను, వారి ఆందోళనకు నాయకత్వం వహించే వారి నాయకులపై తప్పుడు కేసులు బనాయించి జైళ్లలో నిర్బంధిస్తున్నారు. మన్యం వాసులు బాక్సైట్‌కు వ్యతిరేకంగా ఆందోళన అన్న, మౌలిక వసతులు కల్పన కోసం ధర్నా అన్న, మావోయిస్టుల మద్దతుతో ఉద్యమం చేస్తున్నారనీ చిత్రిస్తూ మన్యం వాసులపై సి.ఆర్.పి.ఎఫ్., గ్రేహౌండ్స్ వంటి సాయుధ బలగాలను దింపి, గ్రీన్‌హంట్ పేరుతో అణచివేస్తున్నారు. ఇందులో భాగంగా జూలై 25, 2011లో చింతపల్లి మండలం బలపం పంచాయితీ కోరుకొండ గ్రామంపై తెల్లవారుజామున మూకుమ్మడిగా దాడిచేసి ఆరుగురిని అరెస్టు చేశారు. దీనికి నిరసనగా బలపం పంచాయితీ చుట్టూ పక్కల కొడిమిసారా, లోతుగెడ్డ, తమ్మెంగుల, అన్నవరం పంచాయితీలకు చెందిన వేలాది మంది ఆదివాసులు, తమ సంప్రదాయిక ఆయుధాలు చేతబూని స్థానిక అన్నవరం పోలీసు స్టేషన్‌పై దాడికి దిగారు. ప్రజల ధాటికి తాళలేక అత్యవసరస్థితిని తెలియజేసే 'సైరన్' మోగించాల్సిన స్థితికి నెట్టబడ్డారు. విధిలేక అరెస్టు చేసిన ఆరుగురు ఆదివాసులను విడిచి పెట్టారు. ఇట్లా పోలీసులు, ఆదివాసులు పరస్పరం తలపడడం నిత్యకృత్య మైంది. ఈ మధ్యకాలంలో అంటే 15 ఫిబ్రవరి 2012న చింతపల్లి మండలం బలపం పంచాయితీ రాళ్లగెడ్డ గ్రామంలో పోలీసులకు, ఆదివాసులకు మధ్య చోటు చేసుకున్న వివాదం కొట్లాటకు దారితీసింది. బాక్సైట్‌కు వ్యతిరేకంగా, కాఫీ తోటల స్వాధీనంకై జరుగుతున్న పోరాటంలో రాళ్లగెడ్డ గ్రామానిది ప్రధానపాత్ర పోషిస్తూ, చుట్టుపక్కల ఆదివాసీ ప్రజలకు ఆదర్శంగా నిలవడవే పోలీసులకు కంటగింపయ్యింది. అంతే, ఫిబ్రవరి 15న తెల్లవారు మూడు గంటల సమయంలో సుమారు వంద మంది ప్రత్యేక పోలీసు బలగాలు గ్రామంపై దాడిచేశారు. సంఘ నాయకుడు సిందేరి, కార్లను అదుపులోకి తీసుకున్నారు. దీంతో పోలీసులు ప్రజలను చెదరగొట్టేందుకు పొగబాంబులు, గ్రైనేడ్స్ విసిరారు, కాల్పులు జరిపారు. అయినా ప్రజలు వెనక్కి తగ్గకపోగా, పోలీసులపై ఎదురు దాడికి దిగి నలుగురు పోలీసుల్ని గాయపరిచారు. ఈ క్రమంలో ఎనిమిది మంది ఆదివాసీలు (స్త్రీ – పురుషులు) గాయపడ్డారు. డబ్బు, బంగారం, నగలు, పోలీసులు దోచుకున్నారు. అంతేకాక పోలీసులు రేకులు, టివి డిష్ యాంటినాలు, కిటికీలు, తలుపులు ధ్వంసం చేశారు. ఆదివాసీ, బాక్సైట్ ఉద్యమకారు లను వేలాది పారా మిలిటరీ, స్పెషల్ పార్టీలను దించి, పల్లెలు, గూడెలు, అటవీ ప్రాంతాలు, మన్యం అంతటా ప్రత్యేక నల్లచట్టాలతో అణచి వేస్తున్నారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అణచివేతలో భాగంగా ఆదివాసీ ప్రజలు అడిగే హక్కులేక, తినడానికి తిండిలేక, ఉండడానికి గుడిసెలు లేక, చేయడానికి చేను, పనుల్లేక మన్యాన్ని విడిచి, సుదూర ప్రాంతాలైన చెన్నై, హైదరాబాద్, గుంటూరు, నెల్లూరు, ప్రకాశం వంటి పట్టణాలకు వలస పోతున్నారు. పట్టణాలలో దొరబాబులు, కూలీ కాడ పని యజమాని వారి శ్రమను దోచుకొని, చాలీచాలనీ వేతనాలతో వారిని కట్టు బానిసలుగా చూస్తున్నారు. మరికొంత మంది మధ్య దళారీల బారిన చిక్కుకొని తీవ్రంగా మోసపోతున్నారు.

అభివృద్ధి అనేది మనిషి కేంద్రంగా జరగాలి. అభివృద్ధి కోసం రూపొందించే విధానాలు మెజారిటీ ప్రజల ప్రయోజనాలు నెరవేర్చే విధంగా ఉండాలి. అభివృద్ధిలో ప్రజల క్రియాశీలక భాగస్వామ్యం ఉండాలి. అభివృద్ధి అనేది ప్రజల జీవన స్థితిగతులను మెరుగుపరిచి, ప్రతి ఒక్కరూ మౌలిక అవసరాలు వినియోగించుకునే విధంగా ఉండాలి. జీవన విఘాతానికి, వినాశనానికి దారి తీయకూడదు. ప్రజల జీవితాలు బుగ్గిపాలు చేయకూడదు. కానీ మన పాలకులు, ప్రభుత్వాలు పీడిత ప్రజల ప్రయోజనాలు పక్కనపెట్టి, బడా పెట్టుబడిదారుల, సామ్రాజ్యవాద కంపెనీల ప్రయోజనాల కోసం అర్రులు చాస్తున్నారు.

ఒక పక్క అడవిపై సర్వాధికారం కోసం ఆదివాసీ ప్రజల పోరాటం, మరోపక్క అభివృద్ధి పేరు మీద సతమతమవుతున్న బతుకులు. బాక్సైట్ వినాశకర అభివృద్ధి మన్యంవాసుల బతుకులు బుగ్గిపాలు కానున్నాయి. స్వాతంత్ర్యం వచ్చి ఆరు దశాబ్దాలకు పైబడినప్పటికీ ఈ దేశ మూలవాసులు, నాగరికతకు ప్రతీకలు, పౌర సమాజంలో అంతర్భాగం కాలేకపోయారు. ఇప్పుడు మాత్రం వారి జీవనానికి మూల ఆధారమైన అటవీ సంపదను శాశ్వతంగా అన్యాక్రాంతం చేసే ప్రక్రియ చురుగ్గా సాగుతోంది.

ఇదంతా ఎందుకు అనుకున్నప్పుడు మన్యంలోని విలువైన ఖనిజ సంపదను ప్రకృతి వనరులను సామ్రాజ్యవాద దేశీయ కార్పొరేట్ కంపెనీలకు దోచిపెట్టి అందులో తనవంతు వాటా దక్కించుకోవడం పాలకుల లక్ష్యం. అందుకు అడ్డంకిగా ఉన్న ప్రజలను, వారిని సంఘటితం చేసి అడవిపై సర్వాధికారం కోసం పోరాడుతున్న ఆదివాసులకు నేతృత్వం వహిస్తున్న మావోయిస్టు పార్టీని నిర్మూలించ దలిచారు. ఇప్పుడు దేశవ్యాప్తంగా విస్తారమైన ఖనిజ సంపదలతో నిండిన ఆదివాసీ ప్రాంతాలన్నింటా జరుగుతున్నదిదే. ఈ క్రమంలో బాక్సైట్ వ్యతిరేక పోరాటాన్ని అణచివేయడానికి మన్యం అంతటా ఆపరేషన్ గ్రీన్‌హంట్ ముందుకు వచ్చింది. లేదు లేదంటూనే ఆదివాసులపై యుద్ధానికి భారత సైన్యాన్ని దించింది.

పిడికెడు మంది కార్పొరేట్ యజమానుల ప్రయోజనాల కోసం తన స్వంత ప్రజలపైనే యుద్ధాన్ని ఎక్కుపెట్టిన భారత దళారీ నిరంకుశ పాలకవర్గాల దుర్మార్గపు విధానాలను అన్ని వర్గాల ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, సంఘాలు, మేధావులు, వ్యక్తులు, ప్రజాస్వామిక శక్తులు అంతా ముక్తకంఠంతో ఖండించాలి. మన్యం వ్యాప్తంగా గ్రీన్‌హంట్ దాడులను ఉధృతంగా ఎదుర్కోవడమే నేడు మన ముందున్న కర్తవ్యం. అప్పుడే మన్యంలో ఉన్న ఖనిజ, ప్రకృతి సంపదలను, ఆదివాసీ ప్రాంతాలను కొల్లగొట్టకుండా, ఆదివాసుల సంస్కృతి కనుమరుగై పోకుండా కాపాడుకోగలుగుతాం.

*(రచయిత సామాజిక ఉద్యమ కార్యకర్త)* వీ

# వరంగల్ డిక్లరేషన్ - పొడిగింపులు, చేర్పులు

***తెలంగాణ ప్రాంత ప్రజల అభివృద్ధికీ, విద్య, వైద్యం, వ్యవసాయం, నీటిపారుదల, తదితర రంగాలలో తక్షణమే చేపట్టాల్సిన చర్యలను సూచిస్తున్నారు* ఎల్. అరణ్య**

చరిత్ర చదవడమే శుద్ధ దండగ అనీ, వ్యవసాయం చేయడం వ్యర్థమనీ, సామాజిక శాస్త్రాలకు కాలం చెల్లిందని ప్రవచించి వరల్డ్ బ్యాంక్ ఎంగిలి మెతుకులకు సాగిలబడ్డ మహానాయకుడు చంద్రబాబు నాయుడు. పరిపాలించిన కాలమంతా 'తెలంగాణ' అనే పదాన్నే ఎక్కడా వినబడకుండా చేసిన 'ఘనుడు' ఆయన. తన్నినకొద్దీ బంతి లేచినట్లు, తొక్కినకొద్దీ ఆకాంక్షలు ఎగిసిపడుతుంటాయి. 1969 తెలంగాణ ఉద్యమం తర్వాత మరుగున పడిపోయిన తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షను విప్లవోద్యమం, విప్లవ సంస్థలు ప్రజల మనసులలో ఎప్పటికప్పుడు పదిలపరుస్తూనే వచ్చాయి. అగ్గిరవ్వను ఆరిపోకుండా కాపాడుతూ వచ్చాయి. ప్రజల్లో అంతర్గతంగా నిక్షిప్తమై ఉన్న ఆ ఆకాంక్షలకు ఒక బహిర్గత రూపాన్నిచ్చి వారిని ఉద్యమోన్ముఖులను చేయడానికి క్రమంగా వివిధ ప్రజాసంఘాలు ఇదే చంద్రబాబు నాయుడు పరిపాలనకాలంలో తమ కృషిని ప్రారంభించాయి. ఒకటొకటిగా ప్రజాసంఘాలు, సంస్థలు తెలంగాణ రాష్ట్ర సాధన ఆవశ్యకతను వివరిస్తూ ప్రజలను చైతన్యపరిచే కార్యక్రమానికి పూనుకున్నాయి. ఇదే క్రమంలో 1997 డిసెంబర్ 28, 29 తేదీలలో 'అఖిలభారత ప్రజా ప్రతిఘటన వేదిక' వరంగల్‌లో వరంగల్ డిక్లరేషన్‌ను ప్రతిపాదించింది. 'ప్రత్యేక తెలంగాణ – ప్రజాస్వామిక ఆకాంక్షలు' అనే విషయంపై జరిగిన ఈ సమావేశంలో ఎన్నో తెలంగాణ ప్రజాసంఘాలు వరంగల్ డిక్లరేషన్‌ను ఆమోదించాయి. ఇందులో మొత్తం 60 డిమాండ్లు ఉన్నాయి. తెలంగాణ ప్రాంత స్థితిగతులను కనీసంగానైనా బాగు చేయడానికి ప్రభుత్వం ఏ చర్యలు చేపట్టాల్సి ఉంటుంది? మౌలికంగా ఏ పనులు చేస్తే తెలంగాణ ప్రాంతం క్షీణస్థాయిలో నైనా మెరుగుపరచబడుతుందనే దిశగా ఈ డిమాండ్లు, ప్రతిపాదనలను చేశాయి. అయితే ఈ అరవై డిమాండ్లు తీరినంత మాత్రాన తెలంగాణకున్న సకల సమస్యలు తీరినట్లు కావని, తెలంగాణ సమస్యలులేని ప్రాంతంగా మారాలంటే ప్రత్యేక తెలంగాణ రాష్ట్రమే ఆవశ్యకమని, అలాంటి భౌగోళిక విభజన జరిగిన తర్వాత అది ప్రజాస్వామీకరించబడి ప్రజాస్వామిక తెలంగాణ ఏర్పడితేనే అది సాధ్యమని ఆ సమావేశం ప్రకటించింది.

ఇది జరిగి దాదాపు 15 సంవత్సరాలు గడిచిపోయాయి. ఈ పదిహేనేళ్లలో రాజకీయంగా, సామాజికంగా, ఆర్థికంగా దేశంలో, సమైక్య రాష్ట్రంలో, తెలంగాణ ప్రాంతంలో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. కరడుగట్టిన నియంత అయిన చంద్రబాబు పాలన పోయి రెండుదఫాలు వై.ఎస్ పాలన వచ్చింది. సరళీకరణ విధానాలు ప్రపంచీకరణగా మార్పు చెంది, నేటికి సామ్రాజ్యవాద ప్రపంచీకరణగా తెలంగాణపై పరుచుకున్నాయి. సామ్రాజ్యవాదం తెలంగాణలో జడలు విప్పుకుంది. విప్లవోద్యమం పక్కరాష్ట్రంలో విస్తృతం కాగా, తెలంగాణలో తగ్గుముఖం పట్టింది. అనేకమంది విప్లవోద్యమ నాయకులు హత్యలకు గురయ్యారు. బూటకపు ఎన్‌కౌంటర్లలో అనేక మంది తెలంగాణ ప్రజలు మరణించారు. తెలంగాణ కోసమేనంటూ ప్రకటించుకొని ఒక రాజకీయపార్టీ పుట్టింది. అనేక తప్పటడుగుల తర్వాత ఆ పార్టీ నాయకుని నిరాహారదీక్ష తర్వాత ప్రజలు ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని చేతుల్లోకి తీసుకొని పూర్తి ప్రజాస్వామ్యబద్ధంగా ముందుకు నడిపించారు. సకలజనుల సమ్మెవరకు అనేక రూపాలలో తమ శాంతియుత ప్రతిఘటనలను కొనసాగిస్తూ వచ్చారు.

పదిహేనేళ్లలో జరిగిన ఈ మార్పుల దరిమిలా, మరీముఖ్యంగా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం విషయంలో జరిగిన ఈ మార్పుల దరిమిలా గతంలోని అనేక చారిత్రక అనుభవాలను మననం చేసుకుంటూ, ఆ అనుభవాల సారాన్ని జీర్ణించుకుని, దానిని నూతన ఉద్యమ పరిస్థితులకు అన్వయించుకుంటూ అవసరమైన మార్పుచేర్పులు చేసుకుంటూ ముందుకు సాగడం తర్వాత తరాలకు అత్యవసరం. ఒక గొప్ప విషయం ఏమిటంటే 1997లో ప్రతిపాదించుకున్న 'వరంగల్ డిక్లరేషన్' లోని డిమాండ్లు, ప్రతిపాదనలు అక్షరాలా నేటికీ ప్రభుత్వాలకు సవాలుగానే ఉంటూ, అందులోని 60 అంశాలలో ఏ ఒక్కటీ తమ రిలవెన్స్‌ను కోల్పోలేదు. నేటికీ ఆ డిక్లరేషన్ చదివిన ప్రతి ఒక్కరికీ తెలంగాణ ప్రాంత బాధలు, వాటిని పోగొట్టుకోవడానికి చేయాల్సిన డిమాండ్లు స్పష్టమవుతుంటాయి. అందుకే ఈ నాటి తెలంగాణ ఉద్యమ కార్యకర్తలందరూ తప్పకుండా చదవాల్సిన పత్రం అది.

ఇక ఈ పదిహేనేళ్లలో అనేకరంగాల్లో వచ్చిన మార్పుల దృష్ట్యా ఆ డిక్లరేషన్‌లో పొందుపరచిన అరవై డిమాండ్లలో కొన్నింటికి పొడిగింపులు, మరికొన్ని చేర్పులు అవసరమని భావించి, ఆ అరవై డిమాండ్లకు తోడు మరిన్ని డిమాండ్లు చేరుస్తూ తెలంగాణ ఉద్యమం పురోగతి చెందేందుకు వాటిని అధ్యయనం చేయాల్సి ఉంటుందని భావిస్తున్నాను.

**పొడిగింపులు, చేర్పులు**

1. తెలంగాణ ప్రాంతంలోని ప్రభుత్వ పాఠశాలలను, వైద్యశాలలను బలోపేతం చేయాలి. కార్పోరేట్ విద్యా , వైద్య సంస్థలను నిషేధించి విద్యా, వైద్యరంగాలను ప్రభుత్వం తన చేతుల్లోకి తీసుకొని నిర్వహించాలి. కామన్ స్కూల్ విధానం ఒక న్యాయబద్ధమైన అవసరం. దాన్ని వెంటనే అమలు చేయాలి.

2. వ్యవసాయ, వ్యవసాయేతర రంగాలపై ఆధారపడ్డ కూలీలకు పనికాలాలతో, పనిపరిస్థితులతో, పనిస్థలాలతో సంబంధం లేకుండా శాశ్వత ఉపాధి కల్పించాలి. కూలి రేట్లను పెంచి స్థిరజీతం అందే విధానాన్ని ఏర్పాటు చేయాలి.

3. రైతులకు పంటభద్రత, పంటభూమిభద్రత, బీమా ఏర్పాట్లు చేయాలి. శాశ్వత బీమా, శాశ్వత భద్రత, శాశ్వత నష్టపరిహార చర్యలు చేపట్టాలి. సాగు భూములకు భౌతిక సౌకర్యాలన్నీ ప్రభుత్వమే కల్పించాలి. అంటే నీటివసతి, విత్తనాల సరఫరా, పురుగుమందుల సరఫరా, ధాన్యం అమ్మకం వంటి విషయాలన్నీ ప్రభుత్వమే చూసుకోవాలి. కేవలం పంట పండించడమే రైతు పనిగా ఉండాలి.

4. కనీస భూపరిమితి చట్టాన్ని కఠినంగా అమలు చేస్తూ , బినామీ భూములను గుర్తించి వాటిని పేదలకు పంచాలి.

5. భూమి మొత్తాన్ని గణించి ఆర్థిక ప్రాతిపదికల ఆధారంగా, ఆర్థిక వెనకబాటు స్థాయిల ఆధారంగా ప్రజలందరికీ భూమిని పంచాలి. సంపాదన అవకాశాలున్న వారిని దీనినుంచి మినహాయించి ప్రతి ఒక్కరికీ భూమి అందే ఏర్పాట్లు చేయాలి.

6. తెలంగాణలో ఇప్పటికీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో అమలవుతున్న భూస్వామ్య విధానాన్ని నిర్మూలించే పటిష్ట ప్రణాళికను వెంటనే తయారు చేయాలి.

7. తెలంగాణ నుంచి గల్ఫ్‌కు, ముంబాయికి ఉపాధికోసం వలసపోతున్న ప్రజలకు స్థానికంగా తెలంగాణలోనే ఉపాధి అవకాశాలు కల్పించాలి. అందుకు సంబంధించిన ఉపాధి కల్పనా చర్యలు చేపట్టాలి.

8. ధ్వంసమైపోయిన వృత్తులను వెంటనే పునరుద్ధరించాలి. వృత్తుల ద్వారా ఉపాధిని కల్పించి, ఆ కుటుంబాలను పునరుద్ధరించే చర్యలకు నడుంబిగించాలి.

9. తెలంగాణలో ఇబ్బడి ముబ్బడిగా నెలకొల్పబడిన వేలాది దేశీయ, విదేశీయ కంపెనీలు, స్టాల్‌లు, మార్ట్‌లు, సోడాహబ్‌ల వంటి వాటిని వెంటను మూసివేయాలి. కార్పొరేట్ వాణిజ్యాన్ని నిలిపివేసి, ప్రభుత్వ ఆధ్వర్యంలో ఆ అవకాశాలను స్థానిక నిరుద్యోగులకు అందించాలి.

10. స్పెషల్ ఎకానామిక్ జోన్ల(సెజ్) పేరిట వేలాది ఎకరాలను బడాకంపెనీలకు ధారాదత్తం చేయడాన్ని నిలిపివేయాలి. ఇప్పటికే భూములు అప్పగించిన సందర్భాలలో నిర్వాసితులకు తక్షణం నష్టపరిహారంతో కూడిన పునరావాసాన్ని అందించాలి.

11. ప్రపంచీకరణ ద్వారా కలిగిన దుష్ఫలితాలను గుర్తెరిగి తెలంగాణలో ప్రపంచీకరణ విధానాలన్నింటినీ వెంటనే నిలిపివేయాలి. ఆ ప్రపంచీకరణకు వెన్నుదన్నుగా నిలుస్తున్న ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్ వంటి సంస్థలతోను, బడా బహుళజాతి సంస్థలతోను వేంటనే తెగతెంపులు చేసుకోవాలి.

12. తెలంగాణలో మైనింగ్, ఇసుక వెలికితీత, క్వారీల కేటాయింపులను వెంటనే నిలిపివేయాలి. మాయమవుతున్న గుట్టలు, నదులు వంటి ప్రకృతి వనరులను పరిరక్షించాలి.

13. తెలంగాణలో వేగవంతంగా అమలవుతూ గ్రామాలకు గ్రామాలనే కబళిస్తున్న ఓపెన్‌కాస్ట్ విధానంలో బొగ్గు తీయడాన్ని నిలిపివేయాలి. అండర్‌గ్రౌండ్ పద్ధతిలో, అది కూడా చాలా పరిమిత స్థాయిలో బొగ్గు తీయాలి. ఓపెన్‌కాస్ట్‌ల ద్వారా ఇప్పటికే నిర్వాసితులైన గ్రామాల ప్రజలకు శాశ్వత పునరావాసం, నష్టపరిహారం సత్వరం అందజేయాలి.

14. తెలంగాణలో దేవాలయాల పేరిట ఉన్న మాన్యాలను పేదలకు ఇవ్వాలి. దేవాలయాలకు వచ్చే ఆదాయాలను వెంటనే తెలంగాణ ప్రాంత అభివృద్ధికై ఖర్చుచేయాలి. లేదా దేవాలయాలు ఉన్నంత వరకూ వాటి సంపదను, విరాళాలను తెలంగాణలోని వెనకబడిన వర్గాల అభివృద్ధికై ఖర్చుపెట్టాలి.

15. శాస్త్రీయ భావజాలాన్ని ప్రచారం చేసేలా పాఠ్యపుస్తకాలను రూపొందించాలి. శ్రమ సంబంధిత పాఠ్యాంశాలను చేర్చాలి.

16. బి.సి.ల వలెనే ఎస్.సి, ఎస్.టి సామాజిక వర్గాలను కూడా వర్గీకరించాలి. వర్గీకరణ ఒక న్యాయబద్ధమైన డిమాండ్. ఎస్.టిలలో వర్గీకరణ లేకపోవడం వల్ల దశాబ్దాలుగా తెలంగాణ ఏజెన్సీ ప్రాంతాలలో ఆదివాసీలు నష్టపోతున్న విషయాన్ని గుర్తించి వెంటనే వర్గీకరణ జరపాలి.

17. ఫెమినిస్టు శాఖలను సమావేశ పరిచి తెలంగాణ స్త్రీలపై సాగుతున్న వివక్షలపై, సమస్యలపై చర్చించాలి. పరిష్కారాలు కనుగొనాలి. దండకారణ్య మహిళ ఉద్యమం సాధించిన విజయాలను ఇక్కడి ప్రభుత్వ పరిధిలో అమలు చేసే దిశగా ఆలోచించాలి.

18. కవ్వాల్ అభయారణ్యంలో టైగర్‌జోన్ ఏర్పాటుతో పాటు తెలంగాణ అటవీప్రాంతాలలో ఎలాంటి ప్రాజెక్టులు, జోన్‌లు, కంపెనీలు, సెజ్‌లు ఏర్పాటుచేయకూడదు. తగ్గిపోతున్న అటవీ భూమి శాతాన్ని పెంచాలే కానీ, వీటి పేరుతో మరింత తగ్గించరాదు.

19. ఆదిలాబాద్, కరీంనగర్, నిజామాబాద్, ఖమ్మం జిల్లాల్లోని అటవీ ప్రాంతాల అభివృద్ధికై ఆరవ షెడ్యూల్ ప్రకారం ప్రత్యేక అటవీ అభివృద్ధి మండలిని ఏర్పరచి దానికి స్వయం ప్రతిపత్తి హోదానివ్వాలి. అందులో సభ్యులుగా రాజకీయేతర స్థానిక గిరిజనులకే అవకాశాలు కల్పించాలి. అందులో ఉద్యోగాలు, భూములు, వనరులు అన్నింటిపైనా సంపూర్ణాధికారం ఆ మండలికే అప్పగించాలి.

20. తెలంగాణ ప్రజలు కోల్పోతున్న హక్కులను పునరుద్ధరించాలి. ఇప్పటికే భావప్రకటన, సమావేశాలు ఏర్పరచుకునే హక్కులకు దూరమైనారు. వాటిని పునరుద్ధరిస్తూ ఆ హక్కుల పరిరక్షణకై చర్యలు తీసుకోవాలి. హక్కుల సంఘాల కార్యకర్తలను నిర్బంధించకుండా వారి డిమాండ్లను అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలి.

21. సంవత్సరాల తరబడి జైళ్లలో మగ్గుతున్న రాజకీయఖైదీలను విడుదల చేయాలి. వారి డిమాండ్లపై స్పందించాలి.

22. చత్తీస్‌గడ్ నుంచి తెలంగాణ ప్రాంతంలోకి తల దాచుకోవడానికి వలసవస్తున్న అమాయక ప్రజలపై పోలీసుదాడులనూ, నిర్బంధాలనూ, విచారణలనూ నిలిపివేయాలి.

23. జల్-జంగల్- జమీన్‌లపై తెలంగాణలోని అక్కడి స్థానిక ప్రజలకే అధికారాలు కల్పించాలి.

24. నక్సలైట్ ఉద్యమ ప్రారంభం నుంచి పోలిసుకాల్పుల్లో మరణించినవారి కుటుంబాలను న్యాయంగా ఆదుకోవాలి. బూటకపు ఎన్‌కౌంటర్లపై నిష్పాక్షికంగా న్యాయవిచారణ జరిపించాలి. తలలపై వెలలను రద్దుచేయాలి.

పై డిమాండ్లు వరంగల్ డిక్లరేషన్‌కు పొడిగింపులు, చేర్పులు మాత్రమే. డిక్లరేషన్‌లోని అరవై డిమాండ్లకు తోడు వీటిని కూడా చేర్చడం ద్వారా ప్రస్తుత పరిస్థితులకు ఆ డిమాండ్లు మరింత శక్తివంతంగా ప్రభుత్వాలను నిలదీయగలవని భావిస్తూ, ఇక ఐక్య ఉద్యమాలతోనే, ఈ డిమాండ్ల సాధనతోనే త్వరితగతిన తెలంగాణ ప్రాంత బాధలు, కష్టాలు కొన్నైనా తీరగలవని ఆశిస్తున్నాను.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 14

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

*( గత సంచిక తరువాయి...)*

## నైజాం సర్కార్ పాలనలో సాయుధ భూ పోరాటం

నిజాం పాలనలోని రాష్ట్ర భూభాగంలో జాగీర్దార్లు, పాయిగాదార్లు, సంస్థానాలు, దేశ్‌ముఖ్‌లు, పటేల్‌లు, పట్వారీలు, మునసబులు, మక్తాదారులు, బంజరుదారులు, ఇజాందారులే కాకుండా అన్ని రంగాల ప్రభుత్వ ఉద్యోగులు, మరాఠా వ్యాపారస్తుల యాజమాన్య హక్కు కింద వందల, వేల ఎకరాలు, గ్రామాలకు గ్రామాలే ఉండేవి. వీరిలో చాలామంది పట్టణాలలో ఉండడం, భూమి మొత్తాన్ని సేద్యం చేయలేని పరిస్థితులలో ఉండడం వలన తమ భూమిపై వ్యవసాయం చేయడానికి రైతుల ఎంపికను, పన్ను వసూలుకు ఏజెంట్లనూ, వర్తకుల దగ్గర నుంచి పెద్ద మొత్తంలో ముందస్తుగా డబ్బు తీసుకొని పన్ను వసూలు బాధ్యత వారికి, వారి ఆధ్వర్యంలో నడిచే కంపెనీలకు అప్పగించడం చేస్తుండే వారు. వీరిలో కొందరు దేశ్‌ముఖ్‌లకు, పటేల్‌లకు, పట్వారీలకు ఈ బాధ్యతను అప్పగించేవారు. ఈ శిస్తు గ్రహీతలు తమ లాభాన్ని, తమకు పన్ను వసూలు బాధ్యతను అప్పగించిన వారికి కావలసిన మొత్తాన్ని, కలిపి అసలు భూమి శిస్తు కన్న చాలా ఎక్కువగా శిస్తును వసూలు చేస్తుండేవారు. పన్ను వసూలు పేరిట రైతులపై చాలా కఠినంగా వ్యవహరించి వారిని కొట్టడం, వారి చేతికొచ్చిన కొద్దిపాటి పంటను, వారి పశువులను జప్తు చేయడం తరచుగా జరుగుతుండేవి. ఈ శిస్తు గ్రహీతలు పెద్ద మొత్తంలో రైతుల దగ్గర నుంచి భూమి శిస్తును వసూలు చేసి యాజమాన్య హక్కులు ఉన్న వారికి మాత్రం చాలా తక్కువ మొత్తంలో అప్పగించడం అలా నీటిపారుదల కోసం, రవాణా సౌకర్యాలకు, సమాచార వ్యవస్థను పెంపొందించడానికిగాను అవసరమయ్యే ఖర్చుకు కావల్సిన ధనం ఉండేది కాదు. ఒకవైపు గ్రామాలలో పేద రైతులు తినడానికి తిండిలేక, కనీసం భూమి శిస్తు కట్టేస్తోమత కూడా లేకుండా ఉంటే, ఇంకోవైపు దేశ్‌ముఖ్‌లు, పటేల్‌లు, పట్వారీలు తాము పండించిన ధాన్యం నిల్వ ఉంచుకొని సేకరించి పెట్టుకున్న ధాన్యాన్ని పెద్ద మొత్తంలో కరువుల వలన తరచుగా వ్యవసాయం కూడా చేయలేక తమ భూములను బీడుగా వదిలేసే పేదరైతులకు ఎక్కువ లాభానికి అమ్మి బాగా డబ్బు సంపాదిస్తుండేవారు.

నిజాం ప్రధానమంత్రి సర్ సాలార్‌జంగ్ వలన పాలన ఎప్పుడూ బ్రిటిష్ వారి కనుసన్నలలో జరుగుతుండేది. అందులో భాగంగానే 1888 నుండి స్థానిక పాలన కోసం భూమి శిస్తు ఒక్క రూపాయికి అణా చొప్పున స్థానిక సుంకం వసూలు చెయ్యడం మొదలుపెట్టారు. 1894 నుంచి పరిపాలనా సౌలభ్యం కోసం హైదరాబాద్ రాష్ట్రంలో కార్య నిర్వాహక మండలి లేదా పరిషత్తును, శాసన సంబంధ మండలిని ఏర్పరిచారు. వీటి సభ్యులను ప్రజలు ఎన్నుకోకుండా ప్రభుత్వమే నియమించేది. వీరు స్థానిక అవసరాల కోసం వసూలు చేస్తున్న సుంకాన్ని జాగీర్దార్ల, పాయిగాదార్ల, ఇతర ప్రభుత్వ ప్రతినిధులు లేదా ఉద్యోగుల అభీష్టం మేరకు స్థానిక పాలనకు ఉపయోగించేవారు.

గ్రామ ప్రజల జీవన స్థితిగతులకు సంబంధించి ముఖ్యంగా కులవృత్తుల ద్వారా ఉపాధి పొందుతున్న వారిని మినహాయిస్తే తతిమ వారంతా వ్యవసాయం మీదే ఆధారపడి బతుకుతుండేవారు. ప్రభుత్వం నడవడానికి కావలసిన ధనం, పాలకులకు కావలసిన ధనం యావత్తూ భూమి శిస్తు ద్వారానే లభించేది. అందుకే శిస్తును సెటిల్‌మెంట్ చేస్తూ దశలవారీగా పెంచుకుంటూ పోయేవారు. తరి భూమికైతే చాలా అధిక మొత్తంలో ఎకరానికి రు. 18 నుంచి రు. 20 వరకూ ఉండేది. భూమిపై హక్కుల స్వభావం, భూమి శిస్తు వసూలు కోసం, భూ లావాదేవీలకు కావలసిన అనుమతుల కోసం 1907లో హైదరాబాద్ భూమి శిస్తు చట్టం అమలులోకొచ్చింది. హైదరాబాద్ ల్యాండ్ రెవెన్యూ చట్టం వచ్చినా కూడా పెద్ద మొత్తంలో భూములను భూస్వాములకు, ప్రభుత్వ ఉద్యోగులకు, కులీనులకు తక్కువ ధరకు అప్పగించడం, భూమి శిస్తును, నిర్ధారించిన శిస్తుకన్న తగ్గించి ఇవ్వడం, వంశపారంపర్యంగా కులీనులకు భూముల బదలాయింపు, భూమి వారి ఆక్రమణలో ఉన్నా లేకున్నా జరుగుతుండేది. ఈ చట్టం వలన ఆధీనంలో ఉన్న లేదా ఆక్రమణలో ఉన్న భూముల బదలాయింపు ప్రభుత్వం అనుమతిలో చేసుకొనే వీలు కలిగింది. ఇంత పెద్ద మొత్తంలో భూములు తమ ఆధీనంలో ఉండడం వలన వీరు అతి తక్కువ మొత్తం డబ్బు ఇచ్చి తమ వద్ద వెట్టి చాకిరి చేసే జీతగాళ్ల (భగేలాలు) ద్వారా వ్యవసాయాన్ని చేయించేవారు. ఒకవైపు బ్రిటిష్ వారి పాలనలో ఉన్న రాష్ట్ర భూభాగంలో ఆంగ్ల బోధన ద్వారా చదువుకోవడానికి బడులు, కళాశాలలు ఉండి ఎక్కువ భాగం అన్ని వర్గాలకు చదువు అందుబాటులోకొస్తే నిజాం పాలనలోని రాష్ట్ర భూభాగంలో ఆంగ్ల భాషలో చదువులేక పోగా, తప్పనిసరి ఉర్దూ భాషలో చదువుకోవాల్సిన పరిస్థితి ఉంది. 48 శాతం గా ఉన్న తెలుగు ప్రజలు (కన్నడ ప్రాంత ప్రజలు 10 శాతం, మరాఠా ప్రాంత ప్రజలు 24 శాతం మిగిలిన హైదరాబాద్ రాష్ట్రంలో ఉన్నారు) ఆంగ్ల విద్యనభ్యసించి, తెలుగు భాషలో చదువుకుని వచ్చిన ప్రజలతో సంబంధాలు పెరగడంతో తెలుగు ప్రజలలో పూర్తి ఉర్దూ మీడియంపై తిరుగుబాటు ధోరణి మొదలైంది.

20వ శతాబ్దం మొదలైన తరువాత జరిగిన మొదటి ప్రపంచ యుద్ధంలో ప్రజలను బాగా పీడించి యుద్ధ నిధి కోసం బ్రిటిష్ పాలనలోని రాష్ట్ర భూభాగంతోపాటు నిజాం పాలనలో కూడా ధాన్యం లెవీతో పాటు ధనం వసూలు చేశారు. దాంతో భూస్వాములు భగేలాలతో మరింత వెట్టి చాకిరీ చేయించి వ్యవసాయం చేయించేవారు. ముఖ్యంగా గ్రామాలలోని భూస్వాములైన దేశ్‌ముఖ్‌లు, పట్వారీలు, పటేల్‌లు

భగేలాల వలన బాగా లాభం పొందారు. భగేలాలతో పాటు బేగారి తనం ఉండేది. ఈ బేగారులు గ్రామ రెవెన్యూ అధికారుల నుంచి దివాను వరకు, ఎలాంటి ప్రతిఫలం ఆశించకుండా అన్ని ప్రభుత్వ రంగ ఉద్యోగాలకూ సేవ చెయ్యాలి. 1926లో 'సర్ బరాహి రూల్స్' అమలులో కొచ్చినా ఇవి బేగారి సంస్కృతిని క్రమబద్ధీకరించడానికి బేగారి పనిచేసే వారికి కొద్దిపాటి భూమి ఇవ్వడానికి ఉపయోగపడ్డాయి కానీ, బేగారి పనిని తొలగించడానికి ఉపయోగపడలేదు.

వ్యవసాయ కమతాల పరిస్థితి గురించి చెప్పాలంటే యాజమాన్య హక్కులు ఉన్నవారు తరచుగా తమ భూమిని కౌలుకు తీసుకునేవారిని మారుస్తూ, పట్టాదారు కౌలు అంగీకార పత్రాన్ని ఫారం-9లో నమోదు కాకుండా చూసేవారు. వరుసగా ఒకే కౌలుదారు పేరు ఉంటే అతను రక్షిత కౌలుదారు (షిక్మిదారు లేదా ప్రొటెక్టెడ్ టెనెంట్) అవుతాడు కాబట్టి 75 శాతం కౌలుదార్లు సాగుచేసే భూములలో కౌలుదారు పేరు నమోదు కాకుండా పట్టాదార్లు జాగ్రత్త పడేవారు. 90 సంవత్సరాల నుంచి (తరతరాల నుండి) ఒకే భూమిలో సాగు చేస్తున్న కుటుంబాలలోని వ్యక్తులకు కూడా భూస్వామి ఇష్టానుసారం సేద్యం చేసే అవకాశం ఉండేది. హైదరాబాద్ ల్యాండ్ రెవెన్యూ చట్టం ప్రకారం షిక్మిదార్‌కు భూ బదలాయింపు జరగాలన్నా భూస్వామికి దాదాపు ప్రతి బదలాయింపు లోనూ 'నజరానా' (బహుమతి) ఇచ్చుకోవాల్సిన పరిస్థితి ఉండేది. సర్వే సెటిల్‌మెంట్ జరుగుతున్నప్పుడు జాగీర్దార్లు, పాయిగాదార్లు, మక్తాదార్లు, ఇతర భూస్వాములు భూమి హక్కు వచ్చే షిక్మిదార్లను కూడా కౌలుదార్లుగా నమోదు చేయించేవారు. దీనిలో సాగు విస్తీర్ణానికి మించి శిస్తు వసూలు చేసేవారు. రైతులకవసరమైనా వీరు చాలా చోట్ల సర్వే, సెటిల్‌మెంట్ చెయ్యనివ్వలేదు. వీరు ఎంత వ్యతిరేకతతో ఉన్నారంటే 1949 నాటికి 5800 దివాని గ్రామాలలో 1137 గ్రామాలకే సర్వే సెటిల్‌మెంట్ జరిగిందానిని బట్టి అర్థమవుతుంది. నాన్ ఖల్సా భూములలో రక్షిత కౌలుదారుగా నమోదయ్యే అవకాశం ఉన్నవారు జమాబంది జరిగే సమయంలోనూ, సర్వే సెటిల్‌మెంట్ జరిగేటప్పుడు విజ్ఞాపన పత్రం ఇస్తే దానిపై నామమాత్రపు విచారణ జరిపి పటేల్‌లు, పట్వారీలు, గిర్‌దావర్‌లు, నాయబ్ తహసిల్దార్లు, కుమ్మక్కయి నాజిమ్ జమాబంది అధికారి ముందు సరైన సమాచారం దఖలు పరచకపోవడం లో షిక్మిదారు విజ్ఞాపనకు అనుమతి లభించేది కాదు. అదే సమయంలో జాగీర్దార్లు, పాయిగాదార్లు, మక్తాదారులు, ప్రభుత్వ ఉద్యోగులు, మరాఠా వర్తకులు భూ బదలాయింపుకో, భూమి శిస్తు తగ్గింపుకో విజ్ఞాపనలంద జేస్తే, వారికున్న పలుకుబడి వలన జమాబందిలో వెంటనే వారికి అనుమతి మంజూరు చేసేవారు.

ఈ నేపథ్యంలో జాతీయ స్థాయిలో జరుగుతున్న రాజకీయ మార్పిడి కోసం జరిగే పోరాటంతో ప్రభావితమైన వ్యక్తులు కొంతమంది కలిసి 1921లో హైదరాబాద్ రాజకీయ సంస్కరణల సంఘాన్ని ఏర్పరచి రాజ్యాంగ సంస్కరణలు, పౌర హక్కులు సాధించాలని నిర్ణయించారు. 1922లో దాదాపు 48 శాతంగా ఉన్న తెలుగు ప్రజలకు మద్దతుగా ఈ సంఘమే ఆంధ్ర మహాసభ సంఘంగా ఏర్పడింది.

బ్రిటిష్ వారు రకరకాల కమిటీలు వేసి భూసంబంధ సమస్యలు ఇతర రాజకీయ సమస్యలపై నివేదికలు తెప్పించుకున్నట్లుగా నిజాం కూడా 1929-30 మధ్యకాలంలో వరంగల్ సుబాలోని ప్రజల వాస్తవ జీవన స్థితి గురించి అధ్యయనం చేసి నివేదిక నివ్వడానికి ఎస్. కేశవ్ అయ్యంగార్ ఆధ్వర్యంలో కమిటీని నియమించాడు. ఈ కమిటీ భూకమతాలు, భూమి శిస్తు, భూబదిలీలు, బేగారి, అప్పులు, సహకార సంఘాలు, రైతు కూలీల స్థితిగతులు, వారికి వచ్చే కూలి, పశుగణన, వృత్తి పనివారి జీవన స్థితిగతులు, ఇతర కూలీల జీవనంపై అధ్యయనాన్ని ఆరు జిల్లాలలోని యాభై ఆరు దివాని గ్రామాలలో చేసి నిజాం ప్రభుత్వానికి నివేదిక నిచ్చింది. ఈ కమిటీ నివేదిక ప్రకారం మొత్తం వ్యవసాయ కమతాలలో 76 శాతం భూమిని కౌలుదారులే వ్యవసాయం చేస్తున్నారు. ఈ భూములలో రక్షిత కౌలుదారుగా 32 శాతం రైతులు ఉండి, వీరు మొత్తం పట్టాదారులలో 12 శాతంగా ఉన్నారు. 90 శాతం వ్యవసాయాన్ని కౌలుదారులు, సన్న, చిన్నకారు రైతులు పాత పద్ధతులలోనే ఎరువులు లేకుండా, అదనుకు సేద్యం చేసే పరిస్థితి లేకుండా కేవలం అప్పుల మీదనే ఆధారపడి చేస్తున్నారు. 1926కి ముందు వరంగల్ సుబాలో కాకతీయుల గోండుల పాలనలో బావులు, చెరువులు, నదుల రూపంలో నీటిపారుదల వ్యవస్థలు వరంగల్ జిల్లాలో 18,726, కరీంనగర్‌లో 31,919, ఆదిలాబాద్ జిల్లాలో, 1,779 తరి సేద్యం కోసం ఉపయోగిస్తుండగా అందులో 1926కి వరంగల్‌లో 2,798, కరీంనగర్‌లో 4,109 పని చెయ్యకుండా పోయినాయని పాకాల, రామప్ప, లక్నవరం చెరువుల కింద దోఫసల్ (రెండు పంటలు) పండించే వారు నీటిని బాగు చేయించకపోవడం వలన ఆయకట్టు బాగా తగ్గిపోయి, మెట్ట పంటలు వేసుకోవాల్సిన పరిస్థితులలో ఉన్నారని కమిటీ నిర్ధారించింది. నీటిపారుదల వ్యవస్థలు బాగు చెయ్యడానికి 1911-12 లో 23.27 లక్షలు మాత్రమే అతి తక్కువగా వెచ్చించినట్లుగా కమిటీ గుర్తించింది. (వాస్తవానికి 1948-49కు కూడా కేవలం 30.17 లక్షలు మాత్రమే నీటి పారుదల వ్యవస్థల కోసం ఖర్చు చేశారు. అప్పట్లోనే కరీంనగర్ జిల్లాలో గోదావరి నది కింద మానేరు ప్రాజెక్టుకు 1928లో మొదటి తాలూకాదారు రు. 35,80,000 అంచనాలతో ప్రభుత్వానికి పంపిస్తూ దీని కింద కరీంనగర్ జిల్లాలోని 23,000 ఎకరాల సాగుకు నీరు వినియోగించుకోవచ్చని, 1076 కిలోవాట్ల విద్యుత్తును ఉత్పత్తి చెయ్యొచ్చని అంచనా వేసి పంపితే ఈ ప్రాజెక్టును 1945లో మొదలుపెట్టి 1949లో పూర్తి చేశారు. ఇలా నిజాం పాలనలో కొత్త నీటి పారుదల వ్యవస్థలను దాదాపుగా పట్టించుకోలేదు.)

సహకార సంఘాల ద్వారా ఇస్తున్న రుణాలు, భూమిని బాగు చేసుకోవడానికి, మంచి విత్తనాలను కొనుక్కోవడానికి, ఎరువులు కొనుక్కోవడానికి ఇస్తున్న రుణాలు గ్రామానికి ఒక పది మందికి వచ్చేవి. ప్రభుత్వ భూమి తనఖా బ్యాంకులు లేకపోవడంతో పాటు, ప్రజలకు భూమిపై హక్కులు కూడా లేకపోవడంతో కౌలు, శిస్తు అధిక మొత్తం ఉండడం వలన వ్యవసాయం చేయడానికి కావలసిన అప్పు కోసం భూమి తనఖా పెట్టాల్సొచ్చేది. కేశవ అయ్యంగార్ ఆర్థిక సర్వే ప్రకారం వ్యవసాయం చేసుకోవడానికి కావల్సిన అప్పు కోసం రైతులు తీసుకున్న అప్పు 38 శాతం భూస్వాముల నుంచి, 31 శాతం వ్యాపారస్తుల నుంచి తీసుకున్నారు. మెట్ట పొలాలలో రైతులు ధాన్యం తినడానికి లేక ధాన్యం అప్పుగా తీసుకొనేవారు. డబ్బుకు బదులుగా కొన్నిచోట్ల అప్పు తీర్చడానికి ధాన్యం కొలిపించుకునేవారు. మిర్యాలగూడలో వడ్డీ కింద 1 కొలతకు 11/2 కొలత ఇవ్వాల్సొచ్చేది. ముఖ్యంగా అప్పు పుట్టాలంటే కూడ ఒక గొర్రెనో, మేకనో, కోడినో బహుమతిగా ఇవ్వాల్సొచ్చేది. ఇవి కాకుండా పంటలు సరిగ్గా పండకపోవడం, కుటుంబ ఖర్చులు పెరగడం, పెళ్లిళ్లకు, ఇతర పండుగలకు, ఆచారాలకు, చావులకు, కర్మలకు అధిక మొత్తంలో డబ్బు అవసరం కావడంతో భూస్వాములు, వడ్డీ వ్యాపారస్తులతోపాటు, కాబూలీవాలాలు, అరబ్బులు, రోహిల్లాల దగ్గర ఎక్కువ వడ్డీకి (సంవత్సరానికి 75 శాతం నుంచి 150 శాతం వడ్డీ) అప్పు తీసుకునే

వారు. తీసుకున్న అప్పు తీర్చలేకపోవడం వలన 1929-30 సర్వేలో 15 శాతం భూమి రైతుల నుంచి చేతులు మారినట్లుగా తేలింది. ఇది సాగుచేసే భూమిలో 14వ వంతుగా ఉంది. వరంగల్ సుబాలో సర్వే చేసిన భూములలో మొత్తం 24,736 మంది రైతులు సాగు చేస్తుంటే అందులో 17,626 మంది ఆక్రమణ సాగుదారులుగా 3960 మంది షిక్‌మిదార్లుగా, పూర్తిగా భూమిలేని వాళ్లు 3553, తనఖా పెట్టుకొన్న భూములలో ఉన్నవాళ్లు అరవై మంది ఉన్నారు. అదే 1949-50లో చేసిన సర్వేలో రైతులు చేసిన అప్పుకు గాను అప్పు తీర్చలేక 80 శాతం మెట్ట పొలాలు, 81.25 శాతం తరి పొలాలు, 20 శాతం తోటలు అప్పు తీర్చడం కోసం అమ్ముకోవడమో లేదా అప్పు కిందకు జమ వేసుకోవడమో జరిగింది. దాదాపు 1929-30 నాటికి 80 శాతం రైతులు అప్పుల ఊబిలో ఇరుక్కుపోయారని కేశవ అయ్యంగార్ కమిటీ నివేదికనిచ్చింది.

ముఖ్యంగా పెద్ద రైతులు, భూస్వాములు గ్రామ రెవెన్యూ సిబ్బంది, దేశ్‌ముఖ్‌లు వ్యవసాయ భూమిలేని వాళ్లను భగేలాలుగా నియమించుకొని తమ భూములలో వ్యవసాయం, పశువుల పోషణ, ఇతర పనులు అన్నీ వీరితోనే చాలా తక్కువ మొత్తంలో వీరికి సంవత్సరానికి ఇచ్చి కేవలం భోజనం మాత్రం పెట్టి చాకిరీ చేయించుకునేవారు. వెట్టి వారికి సుమారుగా రోజు మూడు పూటలా భోజనం, సంవత్సరానికి వంద రూపాయల జీతం హుజూర్‌నగర్ తాలూకాలో ఉంటే అదే దేవరకొండ తాలూకాలో అయితే రు.60 నుండి రు.80 వరకు సంవత్సరానికి జీతం, మూడు పూటలా భోజనం కింద పెట్టుకొనేవారు. కొన్నిసార్లు బాకీ కింద ఇంట్లో ఉన్న వారిని భగేలాలుగా నియమించుకుంటున్నారనీ, భగేలాలకు సరైన కూలీ ఇవ్వడం లేదనీ కమిటీ చెప్పింది. కమిటీ నివేదిక ఆధారంగా నిజాం ప్రభుత్వం 'భగేలా' ఒప్పందం క్రమబద్ధీకరణ చట్టం 1936లో చేసింది. కాని బేగారి రూల్స్, 1926-27లో చేసినా, 1923 నుంచి వెట్టి చాకిరీని తగ్గించాలని ఫర్మానా జారీ చేసినా ఉపయోగం లేనట్లుగానే భగేలా ఒప్పంద క్రమబద్ధీకరణ చట్టం ద్వారా కూడా పెద్ద ఉపయోగం జరగలేదు. ఈలోపు 1935లో 'భారత ప్రభుత్వ చట్టం' ప్రకటించబడిన నేపథ్యంలో నిజాం పాలనలో కౌలుదారుల సమస్యలపై కమిటీని 1936-37లో వేశారు. ఈ కమిటీ నివేదక ప్రకారం 1929-30లో ఉన్న నివేదికను బట్టి 76 శాతం కౌలుదార్లుండగా, ఇప్పుడు వీరు 78 శాతం పెరిగారు. అప్పటి భూమిలేని కూలీలు 32 శాతం నుంచి 47 శాతం పెరిగారు. వీరే భగేలాలు అంటే వెట్టి చాకిరీ చేసే వాళ్లు చాలా ఎక్కువ అయ్యారని అర్థం. షిక్‌మిదార్లు పట్టాదారులలో ఇది వరకు 12 శాతంగా ఉన్నవాళ్లు, ఇప్పుడు 21 శాతానికి పెరిగారు. దీనిని బట్టి హైదరాబాద్ ల్యాండ్ రెవెన్యూ చట్టం 1907 అధ్యాయం 7 సెక్షన్ 169 ప్రకారం భూమి హక్కుల బదలాయింపు రక్షిత కౌలుదారుకు జరగలేదు. ఇదంతా వారసత్వ హక్కు ద్వారా గ్రామరెవెన్యూ సిబ్బంది కొనసాగడం, పాయిగాదార్లు, జాగీర్దార్లు, మక్తాదార్లు ప్రభుత్వం కార్య నిర్వాహక వర్గంలోనే ఉండడంతో వీరంతా ప్రజలకు భూమిపై ఉన్న వాస్తవ హక్కును గుర్తించలేదు. కౌలుదారుల సమస్య మీద నియమించబడిన కమిటీ 1937లో 312 గ్రామాలలో జరిపిన నమూనా సర్వేలో 83 శాతం రైతులు అప్పులు తీసుకున్నారని, వీరిలో 54 శాతం ప్రజలు భూస్వాముల దగ్గర అప్పు చేసినట్లుగా తేలింది. పైగా బొంబాయి వర్తకులు ప్రతిచోట తమ కమిషన్ ఏజెంట్లను నియమించుకొని రైతులకు వ్యవసాయం చేయడానికి అప్పులిచ్చి జాయింట్ స్టాక్ బ్యాంకులు నెలకొల్పుకొని పంట దిగుబడి అయిన వెంటనే పొలాల్లోనే పంట మిగలకుండా కొలిపించుకొని స్వాధీనం చేసుకునేవారు. భూస్వాములైతే అప్పు తీర్చలేని పక్షంలో పొలం స్వాధీనం చేసుకోవడం, స్వంత పొలం లైని వాళ్లైతే ఇంటిలోని వారితో వెట్టి చాకిరీ చేయించుకోవడం జరిగేది. సాగు చేసుకోవడానికి పనికి వచ్చే భూమి ఉన్నా కూడా ప్రజలకు పంపిణీ చేసేవారు కాదు. ఇదికాక వందల, వేల ఎకరాలు పరోక్ష భూస్వాముల కింద పడావుగా పడి ఉండేది. కౌలుదారు కమిటీ నివేదిక ప్రకారం వరంగల్ సుబాలో సాగుకు పనికివచ్చే భూమి 10,55,893 ఎకరాలు ఉంటే, లావుని పట్టాగా వ్యవసాయం చేసుకునేవారికి 50,967 ఎకరాలు మాత్రమే పంపిణీ చేశారు. కూలీల పరిస్థితి చాల దయనీయంగా ఉండేది. రోజు కూలీ కింద రెండు సోలల నుంచి మూడు సోలలు ధాన్యం ఇచ్చేవారు. దాదాపు 14 గంటలు పనిచేయించేవారు. ఎనిమిది నుండి పది సంవత్సరాల వయసున్న పిల్లలను ఇళ్లల్లో పశుపోషణకు పని చేయడానికి నియమించుకొని వారికి సంవత్సరానికి ముప్పై సోలలు బియ్యం, ఆడవారికైతే నలభై సోలలు జీతం కింద ఇచ్చేవారు.

ప్రజల దగ్గర భూమి శిస్తు కట్టడానికే డబ్బు లేకపోతే 1943-44లో మొదలైన రెండవ ప్రపంచ యుద్ధం చెయ్యడానికి కావల్సిన ధనాన్ని, ధాన్యాన్ని ప్రజల దగ్గర నుంచే వసూలు చేసేవారు. అందులో ధాన్యం లెవీ సుమారుగా పండే పంటలో 33 నుండి 50 శాతం వరకూ ఉండేది. దీనిని గిర్‌దావర్ (రెవెన్యూ ఇన్‌స్పెక్టర్), పటేల్, పట్వారీల ద్వారా సేకరించేవారు. భూస్వాములు, దేశ్‌ముఖ్‌లు, జాగీర్దార్లు, గీర్‌దార్, పటేల్, పట్వారీలకు లంచం ఇచ్చి, ప్రలోభపెట్టి లెవీ నుంచి తప్పించుకొని టన్నుల కొద్దీ ధాన్యాన్ని దాచుకొని ఎక్కువ ధరకు అమ్ముకునేవారు. అదే పేద వాళ్లు కొని ఇవ్వాల్సిన పరిస్థితి ఉండేది. ఇంకోవైపు పేదలకు పంపిణీ చేసే బియ్యం, జొన్నలను 1945లో 25 శాతం తగ్గించారు. రెవెన్యూ సిబ్బంది కింద పనిచేసే చౌకడిపోలు నడిపేవారు పేద ప్రజలకు కేటాయించిన తిండి గింజలను బ్లాక్ మార్కెట్‌లో అమ్ముకునేవారు. అందుకే 1946-48లో ధాన్యం లెవీని సేకరిస్తున్న ఆరుగురు గిర్‌దావర్లను, ఒక 2వ తాలూకాదారును వరంగల్ సుబాలోని సిర్‌పూర్, హుజూరాబాద్, బూర్గంపాడులలో ప్రజలు దాడిచేసి కొట్టారు. ప్రజలను కఠినంగా అణచివేసి వారి అవసరాలు పట్టించుకోకుండా రెవెన్యూ సిబ్బంది ప్రభుత్వం నిర్ణయించిన మేరకు ధాన్యాల లెవీని సేకరించడం వలనే రెవెన్యూ సిబ్బంది పై ఈ దాడి జరిగింది.

రైతులు, సామాన్య ప్రజలు ఈ విధంగా దయనీయ స్థితిలో గడపడానికి కారణం గ్రామ రెవెన్యూ సిబ్బంది, తాలూకా రెవెన్యూ అధికారులు కలిసి కౌలుదారుల పేర్లు సరిగ్గా నమోదు చేయకపోవడం, శిస్తు నిర్ధారణ సర్వే సెటిల్‌మెంట్ చేయకపోవడం వారికి భూమిపై హక్కు కల్పించకపోవడం, తక్కావి రుణాలు సక్రమంగా పంపిణీ చేయకపోవడం, ప్రకృతి వైపరీత్యాలకు, కరువు కాటకాలు సంభవించినప్పుడు భూమి శిస్తుకు రెమిషన్ ఇవ్వక పోవడం

పరిశ్రమల విషయానికొస్తే నిజాం పాలనలో పరిశ్రమలు చాలా తక్కువ ఉన్నాయి. ఉన్న అజంజాహి మిల్లు, సింగరేణి బొగ్గు గనులు, చక్కెర మిల్లులు, స్పిన్నింగ్ మిల్లులలో మేనేజర్ స్థాయి వ్యక్తులకు లేక పెద్ద మొత్తంలో జీతాలు ఇచ్చి అనేక సదుపాయాలు కల్పించేవారు. అదే కూలీలకు చాలా తక్కువ కూలీ, దుర్భరమైన పరిస్థితులలో కఠిన పరిశ్రమ చెయ్యాల్సొచ్చేది.

*(ఇంకా ఉంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
*saralareddy007@gmail.com*

# చెర్నోబిల్ దుర్ఘటన

*అణు ధార్మిక ప్రమాదాల్లోనే అతి పెద్దదైన చెర్నోబిల్ ఘటన వెనుక ఉన్న సాంకేతిక కారణాలను వివరిస్తున్నారు*

**డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

ప్రపంచచరిత్రలో జరిగిన అణుధార్మిక ప్రమాదాల్లో అన్నిటికన్నా పెద్దది 1986లో చెర్నోబిల్ రియాక్టర్‌లో జరిగింది. ఎంతో భయంకరమైనదిగా పరిణమించిన ఈ ఘోరప్రమాదానికి విలయం, ప్రళయం అనే పదాలను ఉపయోగించడం సముచితంగా అనిపిస్తుంది. అంతకు ముందు అమెరికాలోని త్రీ మైల్ ఐలండ్ రియాక్టర్‌లో జరిగిన ప్రమాదంతో పోలిస్తే ఇది చాలాపెద్దది. చెర్నోబిల్ రియాక్టర్‌లో జరిపిన కొన్ని ప్రయోగాలు అదుపుతప్పడంవల్ల విపత్తు తలెత్తింది. నాలుగు రియాక్టర్ల సముదాయంలో నాలుగోది ఈ ప్రమాదంలో ధ్వంసమైంది.




చెర్నోబిల్ రియాక్టర్ – 1. కంట్రోల్ కడ్డీలు, 2. ఇంధనకడ్డీలు, 3. ప్రెషర్ గొట్టాలు, 4. ఆవిరి సెపరేటర్, 5. ఆవిరి, 6. టర్బైన్, 7. కండెన్సర్, 8. నీరు, 9. పంప్, 10. ప్రాణరక్షక కవచం, 11. గ్రాఫైట్ మోడరేటర్, 12. నీరు పారే దిశ
http://world-nuclear.org/images/info/chornobyl.gif

కాలం చెల్లినదిగా భావించబడుతున్న ఈ రియాక్టర్ రూపకల్పనలో 2 శాతం 235 ఐసోటోప్ మోతాదు కలిగిన యురేనియం డయాక్సైడ్ ఇంధనంగా ఉపయోగపడింది. దీన్ని చల్లబరిచే నీరు రియాక్టర్ లోపలే ఉడుకుతుంది కనక దీన్ని బాయిలింగ్ వాటర్ రియాక్టర్ (BWR) అంటారు. ఈ ఆవిరి హీట్ ఎక్స్ఛేంజర్‌గుండా (heat exchanger) కాకుండా తిన్నగా టర్బైన్‌లోకి ప్రవేశించి దాన్ని తిప్పుతుంది. ఒక్కొక్క రియాక్టర్‌లోనూ 500 మెగావాట్ల విద్యుత్తును ఉత్పత్తిచేసే ఇటువంటి టర్బైన్లు రెండేసి ఉంటాయి. చల్లబరిచే నీరు నిట్టనిలువుగా ఉన్న ప్రెషర్ గొట్టాలలోని ఇంధనకడ్డీల చుట్టూతా ప్రవహిస్తుంది. ఈ గొట్టాలన్నీ కిందిభాగాన కలిపి వెల్డ్ చెయ్యబడి ఉంటాయి.

అణువిచ్ఛిత్తిలో విడుదలయ్యే న్యూట్రాన్ల వేగాన్ని తగ్గించేందుకు గ్రాఫైట్ మోడరేటర్‌గా పని చేస్తుంది. ఇది ప్రెషర్ గొట్టాల బైట ఉంటుంది (పటం). గ్రాఫైట్ దిమ్మలు ఆక్సిజన్ ప్రభావానికి లోనవకుండా వాటి మధ్యకు నైట్రొజన్, హీలియం వాయువులను పంపుతారు. కీలకమైన ఇంధనపు క్రోడం (core) 7 మీటర్ల ఎత్తూ, 12 మీటర్ల వ్యాసమూ కలిగి ఉంటుంది. రియాక్టర్ స్థాయిని తగ్గించగలిగిన 211 కంట్రోల్ కడ్డీలను దింపడం ద్వారా న్యూట్రాన్ల సంఖ్య తగ్గి, రియాక్టర్ మూత పడుతుంది. ఇటువంటి రియాక్టర్‌లో కొన్ని ప్రత్యేకతలున్నాయి. ఇంధనాన్ని చల్లబరిచే నీరు న్యూట్రాన్లను కొంతవరకూ సంగ్రహించగలదు కనక అణువిచ్ఛిత్తి జోరుగా జరుగుతున్నప్పుడు వేడెక్కిన నీటిలోని ఆవిరిబుడగల మోతాదు పెరిగినప్పుడల్లా నీటితో పోలిస్తే వాటిగుండా ఎక్కువ న్యూట్రాన్లు ప్రసరించడంతో అణువిచ్ఛిత్తి జోరు మరింతగా పెరుగుతుంది.

రియాక్టర్ వ్యవస్థకు విద్యుత్తు సరఫరా కనక ఏ కారణం చేతనైనా నిలిచిపోతే ఒత్తిడితో నీటిని ఇంధనం చుట్టూ తిప్పే పంపులు పని చెయ్యకపోయే ప్రమాదం ఉంటుంది. అందుకని వాటికి ప్రత్యేకంగా డీసెల్ జెనరేటర్లుంటాయి. అయితే ఇవి తమ పూర్తి వేగాన్ని అందుకోవడానికి ఒక నిమిషం వ్యవధి పడుతుందని గుర్తించిన అధికారులు దాన్ని గురించి మథనపడ్డారు. అప్పటిదాకా తిరుగుతున్న టర్బైన్ ఒక్కసారిగా ఆగిపోదు కనక దాని మిగులుశక్తిద్వారా ఆ వ్యవధికి సరిపడే శక్తి సరిపోతుందేమో చూసేందుకు వారు లోగడ కొన్ని ప్రయోగాలు జరిపారు. 1986 ఏప్రిల్ 25న వాటిని మళ్లీ మొదలుపెట్టారు. వీటి నిమిత్తం విపత్కరపరిస్థితులు తలెత్తినప్పుడల్లా రియాక్టర్‌ను నిలిపివేసే భద్రతా వ్యవస్థలు కొన్నిటిని వారు బుద్ధిపూర్వకంగా పనిచెయ్యకుండా చూశారు. వివరాలను పూర్తిగా ప్రకటించలేదుగాని జరిగినదేమిటో ప్రమాదం జరిగిన తరవాత నిపుణులు చెప్పే ప్రయత్నం చేశారు.

ఈ ప్రయోగాన్ని 1000 మెగావాట్ల స్థాయిలో కాకుండా తక్కువ స్థాయిలో జరిపేందుకు కంట్రోల్ కడ్డీలను దింపారు. అయితే అర్ధరాత్రి జరిపిన ఈ ప్రయోగంలో వాటిని మరీ ఎక్కువగా జొనిపించడంతో రియాక్టర్ పనితీరు అనుకున్నదాన్నికన్నా తక్కువస్థాయికి పడిపోయినట్టుగా తెలుస్తోంది. దీన్ని సరిదిద్దడానికి మళ్లీ కడ్డీలను బాగా పైకి లేపారట. అయితే యురేనియం విచ్ఛిత్తి చెందేటప్పుడు ఏర్పడే వ్యర్థాలలో జెనాన్–135 (xenon-135) వంటివి న్యూట్రాన్లను ఎక్కువగా సంగ్రహిస్తాయి కనక వాటి మోతాదు కొన్ని గంటలపాటు తగ్గకుండా ఉండడంతో రియాక్టర్ నియంత్రణకు అవరోధాలు ఏర్పడతాయి. రియాక్టర్ మూతపడేముందు తీవ్రమైన ఒడిదుడుకులు తలెత్తాయి. మొత్తం మీద రియాక్టర్ శక్తి తగ్గడానికి బదులుగా ఉవ్వెత్తుగా పెరిగిపోయింది. అలాంటి పరిస్థితుల్లో కార్యకలాపాలను నిలిపెయ్య గలిగే పరికరాలను సిబ్బంది స్వయంగా ఆటంకపరిచి ఉంచారు కనక ప్రమాదం జరగడానికి అవరోధాలు లేకుండాపోయాయి.

ఉష్ణోగ్రత అతితీవ్రస్థాయిలో ఉన్న ఇంధనం నీటికి తగలడంతో ఆవిరి పెరిగి ఒత్తిడి అసాధారణ స్థాయికి హెచ్చింది. మూడు నాలుగు ఇంధన కడ్డీలు దెబ్బతినగానే మొత్తం రియాక్టర్ వ్యవస్థ ప్రమాదానికి లోనయింది. వెయ్యి టన్నుల బరువున్న రియాక్టర్ పైకప్పు కదల బారడం

తో కంట్రోల్ కడ్డీలు బిగుసుకోవడం, ఇంధనకడ్డీలు స్థానభ్రంశం చెందడం మొదలైన పరిణామాలు కలిగాయి. శీతలీకరణవ్యవస్థ తూట్లు పడడంతో రియాక్టర్‌లోకి నీరు ప్రవహించి, అన్నిచోట్లా ఆవిరి అలముకుంది. పీడనంవల్ల ఆ ఆవిరి పేలడం, ప్రమాదకరమైన రేడియో ధార్మిక పదార్థాలు వాతావరణంలోకి ఎగసిపడడం జరిగాయి. రెండు మూడు సెకండ్ల తరవాత మరొక పేలుడు జరిగింది. ఇది బహుశా ఇంధన కడ్డీలకు తొడుగుగా ఉపయోగించిన జిర్కోనియం లోహంతో ఆవిరి రసాయనిక ప్రక్రియలకు లోనవగా, హైడ్రొజన్ తయారవడంవల్ల జరిగి ఉంటుందని తెలుస్తోంది. ఇంధనవ్యర్థాలూ, మండుతున్న గ్రాఫైట్ వెదజల్లబడ్డాయి.

ఈ పేలుళ్లవల్ల ఇద్దరు కార్మికులు చనిపోయారు. రియాక్టర్లోని 1200 టన్నుల గ్రాఫైట్‌లో నాలుగోవంతు ఎగజిమ్మింది. ప్రజ్వరిల్లుతున్న ఇంధనం బైటపడింది. ఇక ప్రమాదనివారకచర్యలు మొదలయాయి. ముందుగా గంటకు రెండుమూడు వందల టన్నుల నీటిని లోపల ప్రవహింపజేశారు కాని అదంతా పొంగిపొర్లడంతో తగ్గించారు. మండుతున్న రియాక్టర్‌ను ఆర్పడానికి 5 వేల టన్నుల డోలమైట్, బోరాన్ (న్యూట్రాన్లను హరిస్తుంది), సీసం (గామాకిరణాలను నిరోధిస్తుంది), ఇసక, బురద మొదలైన పదార్థాలను హెలికాప్టర్ సహాయంతో కురిపించారు. బైటపడ్డ రేడియో ధార్మికతలో ఎక్కువ భాగం రసాయనికంగా ప్రక్రియలకు లోనవని ఆర్గాన్, జెనాన్‌వంటి వాయువుల వల్లనే వ్యాపించిందని తెలుస్తోంది. 192 టన్నుల ఇంధనం ఉన్న నాలుగో నంబర్ రియాక్టర్‌లోని జెనాన్ వాయువు పూర్తిగానూ, రేడియో ధార్మిక వ్యర్థాలైన సీసియం, అయొడీన్ వగైరాలలో సగభాగమూ వాతావరణం లోకి ప్రవేశించినట్టుగా అంచనా. ఎగసిన పదార్థాలలో ఎక్కువభాగం ధూళీ, చెత్తా కనబడింది. ఇదంతా ఎక్కువగా సమీపంలో రాలగా, కొంతభాగం యూక్రేన్, బెలారూస్, రష్యాలను కలుషితం చేసింది. గాలి మోసుకెళ్లిన ధూళిలో కొంత స్కాండినేవియా దాకానూ, ఇతర యూరప్ దేశాల దాకానూ వెళ్లింది.

ఈ ప్రమాదంలో ప్రాణాలు కోల్పోయినవారిలో అగ్నిమాపక సిబ్బందికి చెందినవారున్నారు. 28 మందికి తీవ్రమైన వికిరణం సోకింది. వీరిలో ఆరుగురు అగ్నిమాపకసిబ్బందికి చెందినవారు. విపరీతమైన రేడియో ధార్మికతతో కలుషితమైన ఆ ప్రదేశాన్ని శుభ్రపరిచేందుకు రష్యా 2 లక్షల మందిని తరలించింది. వారం పది రోజులు గడిచేలోపునే స్థానిక బస్తీ ప్రిప్యాత్‌నుంచి అధికారులు 45 వేలమంది జనాభాను తరలించేశారు.

ప్రమాదం గురించిన వివరాలు క్రమంగా బైటకు పొక్కడంతో ప్రపంచ జనాభా అంతా తీవ్రమైన ఆందోళనకు లోనయింది. కళ్లకూ, ఇతర ఇంద్రియాలకూ అవగతం కానటువంటి రేడియోధార్మికత గురించిన లేనిపోని భయాలు ఇరవయ్యో శతాబ్దప్రారంభంనుంచే ప్రజలలో ఉన్నాయి. అవన్నీ అతిభయంకరంగా వాస్తవరూపం దాల్చినట్టయింది. సాంకేతికనిపుణులు మాత్రం ఈ సంఘటనను ఒక తీవ్రమైన హెచ్చరికగానూ, గుణపాఠంగానూ పరిగణించారు. రేడియో ధార్మికతను చూసి భయపడనప్పటికీ దాన్ని తప్పకుండా గౌరవించాలనే పాఠం మరోమారు రుజువైంది.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## చర్చ : భాషా రాష్ట్రాలపై అంబేద్కర్

**లో**కే రాజ్‌పవన్ వీక్షణం మార్చ్ 2012 సంచికలో రాసిన విమర్శలకు క్లుప్తమైన స్పందనగా కొద్ది అంశాలకు పరిమితమవుతాను.

1. చర్చ ముగింపు గురించి నిర్ణయించాల్సింది సంపాదకవర్గం, మనం కాదు.

2. అంబేద్కర్ భావాల్లో ఈ కోణాల్ని వెలుగులోకి తెచ్చింది నేను, దాచి పెట్టింది ఇతరులు – అని నేను రాస్తే 'అది అబద్ధం' అనడం అనుచితం. వాస్తవాలను వెలికి తీసుకురావడం వరకే న్యాయం. నవంబర్ 2011లో నేను ఈ వ్యాసం రాయడానికి ముందే ఎబికె వంటివారు రాశారని పేర్కొన్నారు. నా వ్యాసాన్ని వీక్షణంకు ఆగస్ట్‌లో పంపినట్లు, అంతకు ముందు 'కొద్దినెలలు' దినపత్రికల్లో ప్రచురింపచేయడానికి ప్రయత్నించినట్లు పేర్కొన్నాను. (ఏప్రిల్ 2011 అంబేద్కర్ జయంతి నాటికే రాశాను.) తొందరపాటులో రాజ్‌పవన్ దాన్ని గమనించలేదు. ప్రత్యేక వాదానికి అనుకూలంగా వచ్చిన వందలాది వ్యాసాల్లో 'దాదాపు' ఇతరులెవ్వరూ 1953 వ్యాసంలోని విషయాలను చెప్పలేదని రాశాను. అది అబద్ధమైతే అలాంటి రెండు, మూడు వ్యాసాల్ని ప్రస్తావిస్తే తెలుసుకుంటాను. సమైక్యవాదులు కూడా ఉటంకించినట్టు 'కనపడదు' అని రాశాను. ఢంకా బజాయించి చెప్పలేదు. ఆంధ్రప్రభలో ఏమి వచ్చిందో నేను చూడని మాట నిజం. (ఆ పత్రికని అందులో ఈ ప్రాంతంలో ఎంతమంది చూస్తుంటారో వారికి తెలిసి ఉండాలి.) ఇలాంటి విషయాల్ని 'అబద్ధం' అనడం తగదు.

3. అసలు తన వ్యాసం దేని గురించి రాశారో కూడా ఆయనకు గుర్తు లేదు – అని ఎత్తి పొడిచారు. '1953లో రాసిన వ్యాసానికి విశ్లేషణగా తన మొదటి వ్యాసం రాశానని, రెండో వ్యాసంలో చెప్పుకున్న కృష్ణ ఆదిత్య..' అంటూ రాశారు. 1953 వ్యాసం సందర్భాన్ని పేర్కొని, 'ఆ వ్యాసం విశ్లేషణ ఇది' అని నా వ్యాస పరిధినీ, పరిమితినీ మొదటి వ్యాసం ప్రారంభంలోనే పేర్కొన్నాను. విమర్శించే తొందరలో ఇదీ గమనించలేదు.

4. అంబేద్కర్ ప్రత్యేక తెలంగాణకి సుముఖం కాదనే అర్థం వచ్చేలాగా రాశారు – అన్నారు. 1955 వ్యాసంలో తన అభిప్రాయాలు మార్చుకొని భాషా రాష్ట్రాలను విడగొట్టవచ్చునని భావించారు అనే 'ఒక్క వాక్యమైనా' రాయాల్సింది అన్నారు. 1955 వ్యాసాన్ని 'అప్రధానం చేసి, మరుగుపరిచానని' ఆరోపించారు. మరుగుపరచలేదు సరికదా, దానిలో అంబేద్కర్ క్రోడీకరించిన ఐదు పాయింట్లను పేర్కొన్నాను. ఒక్క వాక్యమే ఎందుకు? ఒక భాషకు విధిగా ఒకే రాష్ట్రం ఉండాలనేమీ లేదు – అన్న ఆయన ముఖ్యాంశాన్ని ఆరో పాయింట్‌గా కొంత వివరంగా అనేక వాక్యాల్లో చెప్పాను. 1955 వ్యాసంలోని అంశాలను అనేక విధాలుగా అన్వయించుకోడానికి వీలుందని (వరంగల్ రాజధానిగా సంపూర్ణ ఆంధ్ర, మైనారిటీ హక్కుల కోసం హైదరాబద్ విడి రాష్ట్రం, దేశ రెండో రాజధానిగా హైదరాబాద్ విడి ప్రతిపత్తి, రెండు కోట్ల జనాభా ప్రాతిపదికగా తెలంగాణ విభజన, మహారాష్ట్రను నాలుగు భాగాలుగా విడగొట్టడం, బొంబాయిని వేరు చేయడం అన్న ప్రతిపాదనల ఉదాహరణగా మొదలైనవి) చెప్పాను. ప్రత్యేక తెలంగాణను బలపరిచేవారు – అని అనుకోడానికి' ఆనయకా హక్కుంది' అని కూడా రాశాను. అలా కాక అంబేద్కర్ 'తప్పకుండా' అన్న పదాన్ని తొలగించి వ్యాఖ్యానించారు. ఇది సబబు కాదు. తీవ్ర వివాదాంశంగా ఉన్న విశాలాంధ్రకి వ్యతిరేకంగా కానీ, విడి తెలంగాణ అనుకూలంగా గానీ, ఒక్క వాక్యం కూడా 1955 వ్యాసంలో లేదన్న వాస్తవాన్ని పేర్కొన్నాను. దీన్ని కాదనడం అసాధ్యం. ఆనాడు రగులుతున్న ఈ సమస్యపై ఒక్క వాక్యం కూడా వ్యాసంలో లేకపోవడం గమనార్హం. ప్రతి రాష్ట్రాన్నీ ప్రస్తావించడం సాధ్యమయ్యే పనేనా? అన్నది దీనికి జవాబు కాదు.

5. ఎవరు రాసినా వేదం కాదని, నేటి దోపిడీ, పోలీసు రాజ్యంలో ఒక రాష్ట్రం చిన్నదా అనేది కాదని ముగించాను. గతి తార్కిక పద్ధతిలో ఆలోచించే వారికి ఇందులో ఆక్షేపణ ఎందుకుండాలి?

**– ఎం. కృష్ణ ఆదిత్య,** పాత్రికేయులు

*(.. 4వ పేజీ తరువాయి)*

నేడు తమిళనాడు, తిరునల్వేలి జిల్లాలోని 'కూడంకుళం'లోని అణు విద్యుత్ కేంద్రం గురించి దేశవ్యాప్తంగా చర్చ జరుగుతున్నది. చుట్టుపక్కల అరవై గ్రామాల ప్రజలు తీవ్రంగా వ్యతిరేకిస్తూ ఉద్యమిస్తున్నప్పటికీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఉత్పత్తి ప్రారంభించడానికి సిద్ధంగా ఉన్నాయి. ఉద్యమం వెనుక విదేశీ నిధులతో నడుస్తున్న ఎన్.జి.ఒ.లు ఉన్నాయని ప్రధానమంత్రి స్వయంగా ప్రకటించడం ఆశ్చర్యంగా ఉంది. ఆ ఎన్.జి.ఒ.లను అనుమతించింది, ప్రోత్సహిస్తున్నది కేంద్ర ప్రభుత్వమే. ప్రపంచ బ్యాంక్‌తో చేసుకున్న ఒప్పందాలలో భాగంగా అమెరికన్ మిలిటరీ స్థావరాలను, సైన్యాన్ని మన దేశంలో ఉండడానికి అనుమతించింది. ఉద్యమాలను అణచి వేయడానికి ఒప్పందం చేసింది. అమెరికా, జర్మనీ, స్కాండినేవియా తదితర దేశాలలో నుండి మన దేశంలో పనిచేస్తున్న చాలా స్వచ్ఛంద సంస్థల వివరాలు రచయిత పి.వి. రమణ తెలియజేసినందుకు అభినందనలు. స్వచ్ఛంద సంస్థల ముసుగులో గూఢచార చర్యలు ఉంటాయి. తేనె పూసిన కత్తిలా ఉద్యమాలను పెడతోవను పట్టించే అవకాశాలున్నాయని ఉద్యమకారులు గుర్తించాలి.

**– తుంపాల శ్రీరామమూర్తి**
*కొత్తగాజువాక, విశాఖపట్నం*

ఏప్రిల్ 2012 వీక్షణం సంచికలో ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు వ్యాసం 'రష్యాలో అక్టోబర్ విప్లవం' రష్యా గురించి మరిచిపోయిన వారికి మరొక్కసారి జ్ఞాపకానికి తెచ్చారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక తర్వాత, దాని ఫలితంగానే భారత దేశంలో గూడ చీలిక వచ్చి ఒకరి మీద మరొకరు దుమ్మెత్తిపోసుకుంటున్న పరిస్థితులలో, సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమై ప్రపంచ సోషలిస్టు విప్లవానికి ఎంతో హాని జరిగినప్పటికీ, చైనా పార్టీ మావో నాయకత్వాన (ఆయన జీవించినంత వరకే) ఎంతో కొంత ఆశాజనకంగానే ఉండింది. కాని అది కూడా పెట్టుబడిదారీ రాజ్యాంగ అవతారమెత్తిన తరువాత ప్రపంచ ప్రజానీకంలో కొంత స్తబ్దత ఏర్పడింది. వీటన్నిటి ఫలితంగా సోవియట్ యూనియన్ అనే మాటే లేకుండా పోయింది. రష్యాలో అక్టోబర్ విప్లవం జయప్రదమయినప్పటి నుండి రష్యా విప్లవం గురించి తెలుసుకోవడానికి మొత్తం పాఠశాలలు, కళాశాలలు, విద్యాలయాలలో ఎక్కువ మంది విద్యార్థులలో ఏదో ఒక మేరకు ఈ చర్చ జరుగుతుండేది. కొంతమంది చరిత్ర అధ్యాపకులు రష్యా విప్లవం గురించి బాగానే చెపుతుండేవారు. రష్యా విప్లవం కలిగించిన ఆశలు విద్యార్థులలో వామపక్ష భావాలు అంకురించడానికి కారణమైంది. సాధారణ ప్రజానీకం కూడ రష్యా గురించి ఆ పార్టీ గురించి ఎక్కువగా అడిగి తెలుసుకుంటుండే వారు. బూర్జువా భూస్వామ్య ప్రభుత్వాలకు ప్రత్యామ్నాయం కమ్యూనిస్టు పార్టీయేనని నమ్మకమున్న రోజులు అవి. ఎప్పుడైతే సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైందో అప్పటి నుండి ఆ ఆశలు అడుగంటి రష్యా గురించి తెలుసుకోవాలన్న ఆలోచనలు లేకుండా పోయింది అనేది వాస్తవం. ఇటీవల కాలంలో ఎక్కడా పాఠశాల విద్యార్థులలో రష్యా మాటే లేదు. ఇటువంటి పరిస్థితులలో తిరిగి నేడు రష్యానూ, ఆ పార్టీ చరిత్రనూ తెరమీదకు తెచ్చి పాత జ్ఞాపకాల నుండి కొత్త ఆలోచనలకు దారితీసేటట్లు ఈ వ్యాసం ఉంది అనవచ్చు. ఈ వ్యాసాన్ని అందించడం ఎంతో సమయోచితంగా ఉంది అని భావిస్తూ రచయితగారికి నా కృతజ్ఞతలు.

'భూంకాల్ బాటలో బస్తర్ వాసులు' అనే వ్యాసం, ఈ దేశ మూలవాసుల చరిత్ర అంటే వారి తిరుగుబాట్ల చరిత్రేనన్నది నిరూపించిన వ్యాసం ఇది. భారత ఖండంలో ఉన్న మూలవాసుల్ని అణచిపెట్టడంలో ఈ దేశానికొచ్చిన ఆర్యులే ముందున్నారు. వీరి ప్రప్రథములనవచ్చు. ఆర్య సామ్రాజ్యవాదులు చాలా క్రూరంగానే వ్యవహరించి ఆదివాసుల్ని చరిత్రకెక్కకుండా చేశారు. ఆ తరువాత ఇక్కడి రాచరిక ప్రభువుల అండతో చాలా దుర్మార్గంగా దాడులు చేసి దండయాత్రల పేరుతో వారిని సర్వనాశనం చేశారు. ఆర్య సామ్రాజ్యవాద వారసులే నేటి మన పాలకవర్గాలు. ఆదివాసులు నివసించే ప్రాంతమంతా సంపదలమయమే. కానీ వారి సౌభాగ్యానికి అవి ఉపయోగ పడకుండా దోపిడీ పాలకులు తన్నుకు పోతున్నారు. ఆదివాసుల అడ్డు తొలగించు కొనేందుకు దుర్మార్గమైన యుద్ధ బీభత్సాన్ని కలిగిస్తున్నారు. ఆర్య సామ్రాజ్యవాద దండయాత్రల విజయాలే చరిత్రకెక్కించారు గానీ ఆదివాసుల తిరుగుబాట్లు చరిత్రకెక్కనివ్వలేదు. ఆనాడు ఆర్య సామ్రాజ్యవాద దండయాత్రలు గూడా ధర్మం అనే పేరు తగిలించి ధర్మం పేరుతోనే చేశారు. వీరు చేసే అభివృద్ధికి వారు అడ్డొస్తున్నారనేది దీని అర్థం. ఇంతకు ముందు ఆర్య సామ్రాజ్యవాద పాలకుల కంటే కూడా ఈనాటి పాలకవర్గాలు జిత్తులమారితనంగా క్రూరంగా ఆదివాసుల్ని వంచిస్తున్నారు. వారి గడ్డ మీద నుండి గెంటేస్తున్నారు. అయితే వారికి మావోయిస్టు పార్టీ నాయకత్వం వహిస్తోంది. వారిని అడ్డు తొలగించుకొంటేగాని వారి కుట్రలు కొనసాగవు. అందుకే మావోయిస్టుల్ని ప్రధాన శత్రువుగా పరిగణించి యుద్ధం ప్రకటించారు. దానిపేరు గ్రీన్‌హంట్. ఎంతటి ముద్దుపేరు. యుద్ధం పేరు చెప్పకుండానే యుద్ధం కొసాగించడం అంటే ఇదే గదా. ఈ రచయితకు నా అభినందనలు. ఆదివాసుల చరిత్రను (తిరుగుబాట్లు) తెలుసుకోవలసిన ఆవశ్యకత నేడెంతో ఉంది. 'అభివృద్ధి పేరిట వంచన' అన్న వ్యాసం నేటి పాలక వర్గాల మాయా జాలాన్ని, దాని నిజస్వభావాన్ని బాగా తెలియజేస్తుంది. దోపిడీవర్గాల అభివృద్ధినే ప్రజల అభివృద్ధిగా ప్రచారం చేసుకోవడంలో నేటి పాలకవర్గాల వారు ముందంజలోనే ఉన్నారు. సమయానుకూలంగా వ్యవహించడంలో భారత బడా బూర్జువా వర్గం చాలా తెలివైనది కూడా. ప్రజలను మోసగించడంలో భారతదేశ బూర్జువా వర్గానికి ఏ దేశ బూర్జువా వర్గం కూడా సాటిరాదనవచ్చు. అబద్ధాలకు నిజం ముసుగేసి ప్రజల్ని నమ్మించడంలో ఈ దేశపాలక వర్గాల వారంతా ఒకరి కంటె మరొకరు మించిన వారే. ప్రపంచీకరణ అనేది అవినీతికి అందలం. మానవ జీవన వికాసానికి దోహదపడేది అసలైన అభివృద్ధి అని, ప్రపంచీకరణ సరళీకరణ అనేదంతా మార్కెట్ వ్యవహారమని, ఉదార ఆర్థిక విధానంలో చెప్పినదంతా మాటల గారడి తప్ప ఇంకేది లేదని చాలా బాగా రాశారు. ఈరోజు ప్రత్యక్షంగా అమెరికా సామ్రాజ్యవాద దురాక్రమణ పథకాలతోనే ఈ దేశ ప్రజానీకం మీద యుద్ధానికి ప్రభుత్వం సన్నద్ధమవుతున్నదని హెచ్చరిస్తున్నారు. ఈ విప్లవోద్యమాన్ని అణచడానికి ఈ దేశ పాలకవర్గాలకు ఏ మాత్రం సత్తాలేదని తేలిపోయింది. అందుకే విదేశీ సామ్రాజ్యవాదుల సహాయంతో అణచాలని ప్రయత్నాలు చేస్తున్నారు. ఆదివాసులకు ప్రజల మద్దతు కూడగట్టడంలోనే గాక విప్లవోద్యమానికి సహకారమందివ్వాల్సిన అవసరం కూడా నేడు ఏర్పడిందని ఈ దేశ ప్రజాస్వామిక మేధావులకు విజ్ఞప్తి చేస్తున్నారు. రచయిత ఎ. నర్సింహారెడ్డి. చాలా ముందుచూపుతో ఈ సలహా ఇస్తున్నారు. ఈ దేశ సంపదల్ని, కష్టార్జితాన్ని ఈ దేశ శ్రమజీవులకు దక్కకుండా విదేశాలకు తరలించి డబ్బులు మూటగట్టుకుంటున్నాయి. వాళ్లల్లో వాళ్లకున్న వైరుధ్యాలే బద్దలై వాస్తవాలు బయటపడుతున్నాయి.

**– కడియాల సుబ్బానాచారి**
*దుత్తలూరు, నెల్లూరు*

వీక్షణం పత్రికను నేను రెగ్యులర్‌గా చదువుతున్నాను. పత్రిక చాలా బాగా వస్తోంది. కేవలం తెలుగు నేలకే పరిమితం కాకుండా, దేశవ్యాప్తంగా నడుస్తున్న వివిధ ప్రజాస్వామిక ఉద్యమాలపై వివరంగా విరివిగా రిపోర్ట్‌లు, వ్యాసాలు, విశ్లేషణలు వస్తే బాగుంటుంది.

**– దేవేంద్ర**
*మైసూరు జైలు*

ఏప్రిల్ 2012 వీక్షణం సంచికలో రచయిత అమన్ రాసిన 'సోనీ సోడిపై రాజ్యం కత్తి గట్టిందెందుకు' అనే వ్యాసం చదివి చాలా దిగ్భ్రాంతికి గురైయ్యాను. రాజ్య హింసకు గురైన సోనీ సోడికి కన్నీటి చేవ్రాలు. తనను తాను, తన ఆధిపత్యాన్ని, తన ఆధిపత్య వర్గ ప్రయోజనాల కోసం రాజ్యం ఎంత క్రూరత్వానికి, దుర్మార్గానికి, పాశవిక చర్యకు పాల్పడుతుందో సోనీ సోడి ఒక సజీవ సాక్ష్యం. ఆమె ఒక బాలికల ఆశ్రమంలో వార్డెన్‌గా పని చేస్తోంది. ప్రభుత్వ ఆధ్వర్యంలో పనిచేస్తున్న బాలికల ఆశ్రమం. అక్కడి పోలీసులు ఆమెను, ఆమె భర్తను మావోయిస్టులను హతమార్చడానికి ఇన్‌ఫార్మర్లుగా సహకరించాలని అందుకు లక్ష రుపాయలు కూడా బహుమతి ఇస్తామని ప్రలోభ పెట్టారు. దానిని ఆ దంపతులు నిరాకరించారు. వాళ్లు చేసిన తప్పు ఇదే. దానికి రమణ్‌సింగ్ రాజ్యం పాశవిక, అటవిక చర్యకు పాల్పడి తన ఫాసిస్టు స్వభావాన్ని బయటపెట్టుకుంది. విప్లవోద్యమాన్ని, విప్లవకారులను అణిచి వేయడానికి, హతమార్చడానికి ఈ దళారీ పాలక వర్గాలు సోనీ సోడి లాంటి అమాయక ఆదివాసీ మహిళలను, వారి పిల్లలను, వారి కుటుంబీకులను అదృశ్యం చేసి తన పొట్టన ఎంత మందిని పెట్టుకున్నదో? ఆమెపై జరిగిన చిత్రహింసలు అక్షరాలకు అందనంతా క్రూరంగా ఉన్నాయి. ఇక సోనీ సోడిపై జరిగిన న్యాయ విచారణ గురించి రచయిత చాలా వివరంగా చెప్పారు. ఈ విచారణ గురించి ఆలోచిస్తే ఈ దేశ న్యాయస్థానాలకు, న్యాయమూర్తులకు న్యాయంపై న్యాయ విచారణపై అవగాహన లేదని చెప్పవచ్చు. అవగాహన ఉంటే ఈ విచారణ ఇలా జరిగేది కాదనుకోవాలి. నేరస్తుడే నేర విచారణ చేసినట్లు ఉంది. ఈనాడు న్యాయస్థానాలన్ని 'కార్పొరేటీకరణ' అయ్యాయి. కాబట్టి కార్పోరేట్ న్యాయస్థానాల న్యాయ విచారణ ఇలాగే చేస్తాయేమో! ఆస్తిని గుర్తించిన మన న్యాయస్థానాలు మనిషి విలువను గుర్తించలేదు. అన్యాయాన్ని శిక్షించడమే న్యాయం అనుకున్నాను. కాని న్యాయాన్ని శిక్షించడమే నేడు చట్టం పనైంది. రాజ్యాంగం, చట్టాలు, న్యాయస్థానాలు, పాలకులు మనిషి మనిషిగా మిగలడానికి ఉన్న దారులన్నింటిని మూసివేస్తున్నారు. ఇక మనిషిని మనిషిగా నిలబెట్టేది సోనీ సోడిలు చేస్తున్న పోరాటాలే అనేది ఒక్కటే సత్యం.

**– సృజన్**
*కల్వకుర్తి, మహబూబ్‌నగర్*

## 13 మంది సి.ఆర్.పి.ఎఫ్ జవాన్ల మృతి

మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లా పశుతోలా గ్రామ సమీపంలో మార్చ్ 27న నక్సలైట్లు పేల్చిన మందు పాతరకు 13 మంది జవాన్లు మృతిచెందారు. 192వ బెటాలియన్‌కు చెందిన 40 మంది జవాన్లు నక్సలైట్ల కోసం గాలింపు నిర్వహించి వస్తుండగా మావోయిస్టులు మందుపాతర పేల్చారని అధికారులు చెప్పారు. పేలుడు వల్ల అక్కడికక్కడే 12 మంది మరణించగా మిగతావారికి గాయాలయినట్లు చెపుతున్నారు. సి.ఆర్.పి.ఎఫ్ జవాన్లపై నక్సలైట్లు చేసిన దాడిని మార్చ్ 28న పార్లమెంట్ ఖండించింది.

## ఆంగ్ల దినపత్రికలపై నిషేధం

పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ప్రభుత్వ, ఎయిడెడ్ లైబ్రరీలలో ఆంగ్ల, అధిక సర్క్యులేషన్ ఉన్న బెంగాలీ దిన పత్రికలపై నిషేధం విధిస్తూ సర్క్యులర్‌ను విడుదల చేసింది. రాష్ట్రంలో బెంగాలీ, హిందీ, ఉర్దూ భాషల్లో ప్రచురించే 8 దిన పత్రికలను ఎంపిక చేసి ఈ పత్రికలు మాత్రమే కొనుగోలుచేయాలని నిబంధన విధించింది. ఈ నిర్ణయాన్ని మిత్రపక్షం కాంగ్రెస్‌తోపాటు ప్రతిపక్ష పార్టీలు, మేధావులు తీవ్రంగా ఖండించారు.

## రోజోనా ఉరిశిక్ష నిలిపివేత

పంజాబ్ మాజీ ముఖ్యమంత్రి హత్యకేసులో నిందితుడైన బబ్బర్ ఖల్సా సంస్థకు చెందిన బల్వంత్‌సింగ్ రోజోనా ఉరిశిక్ష అమలును కేంద్రం నిలిపివేసింది. రోజోనాకు క్షమాభిక్ష పెట్టాలంటూ సిక్కుల అత్యున్నత మతసంస్థ శిరోమణి గురుద్వారా ప్రబంధక్ కమిటీ (ఎస్‌జిపిసి) రాష్ట్రపతికి రాసిన లేఖపై కేంద్రం ఈ నిర్ణయం తీసుకుంది. మార్చ్ 31న అమలు కానున్న ఉరిశిక్షను నిలిపేస్తూ కేంద్ర హోం మంత్రి పంజాబ్ ప్రభుత్వానికి లేఖ రాశారు.

## భ్రూణ హత్యలు

గత మూడు దశాబ్దాల్లో భారత దేశంలో ఒక కోటి ఇరవై లక్షల మంది ఆడ పిల్లలు గర్భస్థ పిండాలుగా ఉన్నప్పుడే హత్యకు గురయ్యారు. ఈ విషయం 'సెంటర్ ఫర్ గ్లోబల్ హెల్త్' సంస్థ నిర్వహించిన అధ్యయనంలో తేలింది. 2010లో వెలువడిన 'బాలల హక్కుల పరిరక్షణ జాతీయ కమిషన్' నివేదిక కూడా ఇదే వాస్తవాన్ని వెల్లడించింది. ఈ ప్రభావం మగ, ఆడ నిష్పత్తిలో చాలా తేడాను 2011లో నిర్వహించిన జనాభా లెక్కలే తేల్చాయి. ఆరేళ్ల లోపు ఆడపిల్లల, మగపిల్లల సంఖ్య మధ్య తేడా చాలా ఉంది. మహారాష్ట్ర, పంజాబ్, హర్యానా, మధ్యప్రదేశ్ వంటి రాష్ట్రాల్లో ప్రతి వెయ్యిమంది బాలురకు 914 మంది బాలికలు మాత్రమే ఉన్నారు.

## సిక్కుల ఊచకోతలో ప్రభుత్వం, పోలీసుల పాత్ర

1984లో అప్పటి ప్రధాని ఇందిరా గాంధీ హత్య తరువాత ఢిల్లీలో సిక్కులను ఎంతో మందిని చంపారు. ఢిల్లీలోని కంటోన్మెంట్ ప్రాంతంలో జరిగిన అల్లర్లు ప్రణాళిక బద్ధంగానే జరిగాయని, ఆనాటి ప్రభుత్వం, పోలీసులు కలిసి చేసిన పనే అని ఏప్రిల్ 23న ఢిల్లీ అడిషనల్ సెషన్స్ కోర్టులో సి.బి.ఐ. తెలిపింది. సిక్కు వ్యతిరేక అల్లర్లను కాంగ్రెస్ నేత సజ్జన్‌కుమార్ రెచ్చగొట్టడంతో అక్కడ ఉండే సిక్కుల ఇల్లు నేలమట్టమయ్యాయని తెలిపింది.

## సి.బి.ఐ. పక్షపాత ధోరణి

సి.బి.ఐ. నిందితుల పట్ల వివక్ష చూపుతున్న తీరుపై రాజస్థాన్ హైకోర్టు ఆగ్రహం వ్యక్తం చేసింది. కొందరు నిందితులకు సకల సౌకర్యాలు కల్పిస్తూ, మరికొందరిని పోలీసుల కస్టడీకి పంపి ఇబ్బందులకు గురిచేస్తోందని ప్రశ్నించింది. చర దారాసింగ్ బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో కొందరిని జ్యూడీషియల్ కస్టడీకి తరలించిన సమయానికి చాయ్, కాఫీలు అందేలా చూస్తోంది. మరి కొంత మందిని దీర్ఘకాలం పోలీసుల కస్టడీకి పంపి ఇబ్బందుల పాల్జేస్తోంది. ఇలాంటి చర్యలు వ్యతిరేక ఫలితాలను ఇస్తాయి. ఏదో ఒక రోజు సి.బి.ఐ.ని మూసేసే రోజు వస్తుందని ఈ కేసును విచారిస్తున్న జస్టిస్ మహేజస్ చంద్ర శర్మ వ్యాఖ్యానించారు. 2006లో జరిగిన దారాసింగ్ ఎన్‌కౌంటర్ బూటకమైందని ఆరోపణలు రావడంతో సి.బి.ఐ. విచారణకు ఆదేశించారు. ఈ కేసులో 13 మంది నిందితులుండగా అందులో ఒకరు మాజీ మంత్రి, మాజీ డి.ఐ.జి కూడా ఉన్నారు.

## మీడియాపై ఆంక్షలు

ఆర్మీ కదలికలపై వార్తలు ప్రచురించవద్దంటూ అలహాబాద్ హైకోర్టు తీర్పు ఇచ్చింది. ఈ తీర్పును సుప్రీం కోర్టులో సవాల్ చేయనున్నట్టు ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా చైర్మన్ మార్కండేయ కట్జూ తెలిపారు. ఇండియన్ ఆర్మీకి ఎలాంటి విశేషాధికారాలు లేవని, దేశంలోని ప్రతి పౌరుడు చెల్లించే టాక్స్‌లపైనే సైన్యానికి చెందిన బడ్జెట్ రూపొందుతుందన్న విషయం గుర్తుంచుకోవాలని కట్జూ అన్నారు. అలాంటపుడు ఆర్మీకి సంబంధించిన విషయాలు తెలుసుకునే హక్కు ప్రజలకు ఉంటుందన్నారు. ఇండియన్ ఆర్మీలో జరిగిన ఆదర్శ్, సుక్నా కుంభకోణాలను మీడియానే వెలికితీసిందన్న విషయాన్ని గుర్తుచేశారు. యుద్ధం జరుగుతున్న సందర్భాల్లో ఇలాంటి నిబంధనలు విధిస్తే విధించవచ్చు కానీ, ప్రస్తుత పరిస్థితుల్లో ఈ తీర్పు అనసరనీయం కాదని కట్జూ అన్నారు.

## 8 మంది పార్లమెంట్ సభ్యుల సస్పెన్షన్

రెండవ విడత పార్లమెంట్ బడ్జెట్ సమావేశాల్లో ఏప్రిల్ 24న తెలంగాణ ఎం.పిలు తెలంగాణపై బిల్లు పెట్టాలని కోరుతూ ప్లకార్డులు ప్రదర్శించారు. స్పీకర్ పోడియం వద్దకు వెళ్లి తెలంగాణకు అనుకూలంగా నినాదాలు చేశారు. తెలంగాణ కోసం నినాదాలు చేసిన కాంగ్రెస్ ఎం.పిలు పొన్నం ప్రభాకర్, ఎం. జగన్నాథం, జి. సుఖేందర్ రెడ్డి, మధు యాష్కి, రాజయ్య, బలరాం నాయక్, జి. వివేక్, కె. రాజగోపాల్ రెడ్డిలను స్పీకర్ 4 రోజుల పాటు సభ నుంచి సస్పెండ్ చేశారు. 1980లో 50-55 మంది ప్రతిపక్ష సభ్యులను భోఫోర్స్ విషయంలో ఆందోళన చేసినందుకు సస్పెండ్ చేశారు. కానీ..అధికార పార్టీ సభ్యులను అధికార పార్టీయే సస్పెండ్ చేయడం ఇదే మొదటిసారి.

## వాణిజ్య లోటు

విదేశీ వాణిజ్య లోటు ప్రమాద సంకేతాలనిస్తుంది. ఇదివరకెప్పుడు లేని విధంగా గత ఆర్థిక సంవత్సరం రికార్డు స్థాయిలో 18,500 కోట్ల డాలర్లకు (దాదాపు రు. 9.2500 కోట్లు) చేరింది. దీనికి ముడి చమురు, బంగారం దిగుమతులే కారణం అయ్యాయి. 2011-12కు మొత్తం దిగుమతుల్లో ముడి చమురు, పసిడి దిగుమతులు 44 శాతానికి పైగా ఉండడం ఆందోళన కలిగిస్తోందని ప్రభుత్వం పేర్కొంది.

## మధ్యప్రదేశ్‌లో మైనింగ్ మాఫియా

మధ్యప్రదేశ్‌లో మహిళా తహసీల్దారును చంపేందుకు మైనింగ్ మాఫియా శక్తులు విఫలయత్నం చేశాయి. దేవాస్ జిల్లా కుసుమానియా గ్రామంలో అక్రమ మైనింగ్ జరుగుతోందని ఏప్రిల్ 18న కన్నోడ్ తహసీల్దార్ మీనా పాల్‌కు ఫిర్యాదు రావడంతో ఆమె సంఘటన స్థలానికి వెళ్లారు. అక్రమంగా వెలికితీసిన బండరాళ్లను పరిశీలిస్తుండగా జెసిబి వాహనం పాల్ వైపుకు వేగంగా రావడాన్ని గుర్తించిన పాల్ పక్కకు దూకి ప్రాణాలు దక్కించుకున్నారు. మైనింగ్ మాఫియా సభ్యుడు, స్థానిక బి.జె.పి నేత ధారాసింగ్ పటేల్ హస్తం ఉందని అధికారులు ఆరోపిస్తున్నారు. గత నెల మార్చ్ 8న గ్రానైట్‌ను అడ్డుకున్నందుకు ఐ.పి.ఎస్ అధికారిని ట్రాక్టర్‌తో తొక్కించి హత్యచేశారు ఆరోపనలున్నాయి.

వీ

## వీరప్పన్ వేటపేరుతో సాగిన అకృత్యాలు

అడవి జంతువులను, అడవి సంపదను కొల్లగొడుతున్నాడని వీరప్పన్‌ను పట్టుకోవడానికి తమిళనాడు, కేరళ, కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి స్పెషల్ టాస్క్ ఫోర్స్ (ఎస్.టి.ఎఫ్) ను ఏర్పాటు చేశాయి. ఈ ఎస్.టి.ఎఫ్, ఐ.పి.ఎస్ అధికారి శంకర్ బిదరీ నేతృత్వంలో పనిచేసింది. కొన్ని సంవత్సరాలు వీరప్పన్‌ను పట్టుకోవడానికి ప్రయత్నించి చివరికి వీరప్పన్‌ను, అతని అనుచరులను చంపింది. వీరప్పన్‌ను ఎక్కడున్నాడన్న సమాచారం కోసం అక్కడ స్థానికంగా ఉండే గిరిజనులను ముఖ్యంగా మహిళలను తీవ్ర చిత్రహింసలకు గురిచేసి అత్యాచారాలకు పాల్పడ్డారని బాధితులు చెపుతున్నారు. తమ కుటుంబీకులని తమ కళ్లెదుటే కాల్చిచంపారని ఆరోపించారు. ఈ అకృత్యాల పై విచారణ జరిపేందుకు కర్ణాటక హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎ.జె. సదాశివ, సి.బి.ఐ మాజీ డైరెక్టర్ సి.వి. నరసింహన్‌ల నేతృత్వంలో కమిటీని జాతీయ మానవ హక్కుల కమిషన్(ఎన్.హెచ్.ఆర్.సి) 1999లో నియమించింది. 2003 డిసెంబర్‌లో కమిటీ నివేదికను సమర్పించింది. ప్రభుత్వం ఇప్పటి వరకు ఎవరిపైన చర్యతీసుకున్న దాఖలాలు లేవు. సదాశివ కమిషన్‌కు బాదితులు దాఖలుచేసిన అఫిడవిట్లలో, ఇచ్చిన ఫిర్యాదులు నిజమే అయితే శంకరబిదరి క్రూరత్వాన్ని కొలిచేందుకు లిబియా నియంత గడాఫీ, ఇరాక్ నియంత సద్దాం హుసేన్ సైతం ఎందుకూ పనికిరారంటూ హైకోర్టు తీవ్ర వ్యాఖ్యలే చేసింది. సదాశివ కమిషన్ ఎదుట మొత్తం 193 మంది బాధితులు హాజరయ్యారు. వారిలో 89 మంది చేసిన ఆరోపణలకు బలం ఉందని కమిషనే భావించింది. కర్ణాటక పోలీసులు అక్కడి మహిళలను అదుపులోకి తీసుకొని 15 రోజుల నుండి ఏడాదిన్నర వరకు తమ నిర్భంధంలో ఉంచుకున్నారని, ప్రతి రోజూ అత్యాచారాలకు పాల్పడడమే కాక, తీవ్ర చిత్రహింసలకు గురిచేశారని బాధిత మహిళలు ఆరోపించారు. ప్రపంచ వ్యాప్తంగా సైన్యాన్ని నియమించిన ప్రతీచోట భద్రతా బలగాల ప్రత్యేక అధికారాల చట్టం ముసుగులో హక్కుల హననం జరుగుతుంది. స్త్రీలపై అత్యాచారాలు జరుగుతున్నాయి. మనుషుల్ని మాయం చేస్తున్నారు. ఎన్‌కౌంటర్ పేరుతో హత్యలు చేస్తున్నారు. వేలాది మందిని జైళ్లలో నిర్భంధిస్తున్నారు. పోలీసుల చర్యలు అనేకం బయటి ప్రపంచానికి తెలియకుండానే మరుగున పడిపోతున్నాయి.

## రక్షణ రంగానికి పాకిన అవినీతి

దేశ భద్రతకు అత్యంత కీలకమైన సైనిక రంగంలో కూడా అవినీతి కుంభకోణాలు చోటుచేసుకుంటున్నాయి. రక్షణ శాఖకు చెందిన మాజీ అధికారి తనకు పద్నాలుగు కోట్ల రూపాయలు లంచం ఇవ్వజూపరంటూ సైనికాధికారి వి.కె. సింగ్ తెలిపారు. వి.కె. సింగ్ రక్షణ శాఖకు సంబంధించిన విషయాలపై ప్రధానికి రాసిన లేఖ బయట పడడంతో తీవ్రమైన చర్చకు దారితీసింది. సైన్యంలో మందుగుండు కొరత ఉన్నట్లుగా, అలాగే యుద్ధట్యాంకులు శిథిలావస్థకు చేరాయని ఆలేఖలో తెలిపారు. సైన్యానికి కేటాయించిన నిధులు ఆధునీకీకరణకు వినియోగించకపోవడం వల్ల నిధులు అలాగే ఉండిపోయాయన్నారు. కేంద్రం ఈ విషయంపై ఎప్పటికప్పుడు నిర్ణయాత్మకంగా వ్యవహరించకపోవడం వల్లే ఈ పరిస్థితి ఏర్పడిందన్నారు. దేశంలో రక్షణ రంగంలో జరిగిన అవినీతి చరిత్రను చూస్తే 1948 నాటి జీపుల కుంభకోణం, భోఫోర్స్, కార్గిల్ యుద్ధంలో మరణించిన వారి శవపేటికల కుంభకోణం, ఆదర్శ్ హౌసింగ్ కుంభకోణం, శ్రీనగర్ వైమానిక దళ భూముల స్కాంతోపాటు నేడు ట్రక్కుల కుంభకోణం వరకు రక్షణ శాఖలో జరిగినవే. రక్షణ శాఖకోసం నాణ్యతలేని 600 వాహనాలను సైన్యంకోసం కొనడానికి మాజీ సైనికాధికారి తేజిందర్ సింగ్ 'తత్రా వెక్ట్రా' అనే సంస్థ తరపున ఒప్పందం కుదుర్చుకోవడానికి ప్రయత్నించారు. గతంలో అవినీతికి పాల్పడి కొనుగోలుచేసిన ట్రక్కులు ఇప్పటికే ఏడువేలకు పైగా సైన్యం దగ్గర ఉన్నట్లు వి.కె. సింగ్ తెలిపారు. రక్షణ రంగంలో జరుగుతున్న అవినీతి విషయం బయటికి పొక్కడంతో రక్షణ శాఖ మంత్రి ఈ విషయంపై సి.బి.ఐ దర్యాప్తుకు ఆదేశించారు. మన దేశ అంతర్గత భద్రతకు ముప్పు అనుకునే రహస్యాలు అవినీతి కుంభకోణాల వల్ల బహిర్గతమతున్నాయి. కాని అనేక కుంభకోణాల్లో సంపాధించిన లక్షల కోట్ల డబ్బు స్విస్ బ్యాంకుల్లో భద్రంగానే ఉంది. దాన్ని తీసుకురావడానికి విదేశీ చట్టాలు అడ్డువస్తాయి. కాని దేశ సంపద దోచుకోవడానికి ఏవీ అడ్డురావు. ఈనాడు అవినీతి ప్రతి రంగంలోకి వ్యాపించి విస్తరిస్తోంది. ఈ నాడు కోర్టుల్లో నడుస్తున్న కేసులు, పత్రికల నిండా వస్తున్న అవినీతి కుంభకోణాల వార్తలు లేని రోజు లేదంటే అశ్చర్య పోనక్కరలేదు. సామాన్యుల పరిస్థితి మాత్రం రోజు రోజుకు దిగజారీ పోతోంది.

## కొజికోడ్‌లో సి.పి.ఎం. 20వ మహాసభలు

కేరళలోని కొజికోడ్‌లో సి.పి.ఎం. 20వ జాతీయ మహాసభలు ఏప్రిల్ 2 నుండి 9 వరకు జరిగాయి. వివిధ రాష్ట్రాల నుండి 700 మంది ప్రతినిధులు హాజరయ్యారు. పార్టీ కార్యదర్శిగా ప్రకాష్ కరత్ (65) వరుసగా మూడోసారి ఎన్నికయ్యారు. సి.పి.ఎం. ప్రధాన కార్యదర్శి సహా పార్టీలోని వివిధ స్థాయిల కార్యదర్శుల పదవికాలన్ని మూడు విడతలకు పరిమితం చేస్తూ ఆ పార్టీ కాంగ్రెస్ కొత్తగా తీర్మానం చేసింది. అయితే పార్టీలోని నాలుగింట మూడొంతుల మంది ప్రతినిధుల ఆమోదం అభిస్తే నాలుగో దఫా కూడా కార్యదర్శి పదవిలో నేతలు కొనసాగే సౌకర్యాన్ని ఈ సవరణలో చేర్చారు. పార్టీ కాంగ్రెస్‌లో పాల్గొన్న ప్రతినిధుల్లో నాలుగింట మూడొంతుల మంది మద్దతు లభించినప్పుడు మాత్రమే ప్రధాన కార్యదర్శి అయ్యే అవకాశం ఉంది. సి.పి.ఎం. ప్రధాన కార్యదర్శి, కార్యదర్శుల పదవికాలం మూడు సంవత్సరాలు. పార్టీ పదవుల్లో ఉండే నేతలకు గరిష్ఠ వయోపరిమితి విధించాలన్న ప్రతిపాదనను మాత్రం 20వ కాంగ్రెస్ ప్రతినిధులు అంగీకరించలేదు. పార్టీ కేంద్ర కమిటీని పునర్వ్యవస్థీకరించారు. ప్రకాష్ కరత్ ముగింపుగా ఉపన్యాసమిస్తూ దేశంలో వామపక్ష ప్రజాతంత్ర ప్రత్యామ్నాయాన్ని రూపొందించేందుకు లెఫ్ట్ పార్టీలు ఐక్యంగా కృషి చేయాలన్నారు. శ్రీలంకలోని తమిళులకు పూర్తి పునరావాసం లభించేలా ఆదేశం పై రాజకీయ, దౌత్య మార్గాల్లో ఒత్తిడి పెంచాలని కేంద్రాన్ని కోరుతూ ఒక తీర్మానాన్ని ఆమోదించాయి. శ్రీలంక తమిళులపై మానవ హక్కుల ఉల్లంఘన జరిగిందన్న ఆరోపనల మీద స్వతంత్ర దర్యాప్తుకు ఆదేశించేలా శ్రీలంక సర్కారును కేంద్రం ఒప్పించాలని సి.పి.ఎం. 20వ కాంగ్రెస్ కోరింది. పుచ్చలపల్లి సుందరయ్య శత జయంతి ఉత్సవాలను మే 1వ తేదీ నుంచి సంవత్సరంపాటు జరపాలని ఈ మహాసభల సందర్భంగా తీర్మాణించారు.

**వార్త - వ్యాఖ్య : వై. రామచంద్రం**

వీ

## 'బ్రిక్స్' సదస్సు

'బ్రిక్స్' (బ్రెజిల్, రష్యా, ఇండియా, చైనా, సౌత్ ఆఫ్రికా) దేశాల నాల్గవ సదస్సు మార్చ్ 29న న్యూఢిల్లీలో జరిగింది. ఈ సదస్సులో రెండు కీలక ఒప్పందాలు జరిగాయి. స్థానిక కరెన్సీలో రుణ సదుపాయం కల్పించడంపై మాస్టర్ అగ్రిమెంట్‌ను, బహుళపక్ష లెటర్ ఆఫ్ క్రెడిట్ కన్ఫర్మేషన్ ఫెసిలిటీ ఒప్పందాలను సభ్య దేశాలు కుదుర్చుకున్నాయి. సభ్యదేశాల మధ్య వాణిజ్యం మరింత పెరిగేందుకు స్థానిక కరెన్సీలో రుణ లభ్యత అంశం దోహదపడగలదని బ్రిక్స్ నేతల సంయుక్త ప్రకటనలో ప్రధాని మన్మోహన్ సింగ్ తెలిపారు. వచ్చే ఏడాది బ్రిక్స్ సదస్సులు దక్షిణ ఆఫ్రికాలో జరగనున్నాయి.

## 'అమెరికాస్'లో నిరసనలు

అమెరికా, దక్షిణ అమెరికా ఖండాలకు చెందిన 35 స్వతంత్ర దేశాల సముదాయం 'అమెరికాస్'. రెండు ఖండాలకు చెందిన దేశాల వికాసాన్ని, అభివృద్ధిని సమైక్యంగా సాధించాలన్న ఆకాంక్షతో 1994 నుంచి ప్రతి ఏడాది అమెరికాస్ శిఖరాగ్ర సదస్సులను నిర్వహిస్తారు. ఈ ఏడాది ఏప్రిల్ 14, 15 తేదీల్లో కొలంబియాలోని కార్టజెనా నగరంలో ఆరో శిఖరాగ్ర సదస్సు నిర్వహించారు. ఈ శిఖరాగ్ర సదస్సులో అగ్రరాజ్యం అమెరికాపై సభ్య దేశాలు నిరసనను తెలిపాయి. సభ్యదేశాలలో ఒకటైన క్యూబాను సదస్సుకు ఆహ్వానించకుండా అమెరికా, కెనడాలు కలిసి ఆధిపత్యం చెలాయించడానికి చూస్తున్నాయనీ, ఇది 'అమెరికాస్'పై అపనమ్మకం కలిగిస్తోందనీ తెలిపాయి. ఈ అంశంపై జరిగిన చర్చలో క్యూబాకు అనుకూలంగా 32 దేశాలు ఓటింగ్ చేసి తమ నిరసనలు తెలిపాయి. అంతేకాకుండా, క్యూబా లేకుండా ఏడో శిఖరాగ్ర సమావేశాన్ని నిర్వహిస్తే సామూహికంగా బహిష్కరిస్తామని హెచ్చరించాయి.

## పాకిస్తాన్ లో విమాన ప్రమాదం

పాకిస్తాన్‌లో ఏప్రిల్ 20న విమాన ప్రమాదం జరిగింది. కరాచీ నుంచి ఇస్లామాబాద్‌కు వెళ్తున్న భోజా ఎయిర్‌లైన సంస్థకు చెందిన బోయింగ్ విమానం వాతావరణం సరిగ్గా లేకపోవడంతో ఇస్లామాబాద్ దగ్గర్లో జనావాస ప్రాంతాల్లో కుప్పకూలింది. అందులో ప్రయాణిస్తున్న మొత్తం 118 మంది ప్రయాణికులు, తొమ్మిది మంది సిబ్బంది మరణించారు.

## భయపెట్టిన భూకంపం

హిందూ మహాసముద్రంలో ఏప్రిల్ 11న భూకంపం సంభవించింది. దీంతో తీరంలోని 28 దేశాలకు సునామీ హెచ్చరికలు జారీ అయ్యాయి. ఇండోనేషియా తీర సముద్ర గర్భంలో (సముద్ర మట్టానికి 33 కిలోమీటర్ల లోతున) రెండు సార్లు భూకంపం వచ్చింది. తొలి భూకంపం తీవ్రత రిక్టర్ స్కేల్‌పై 8.5గా నమోదవగా, రెండవసారి 8.2గా నమోదయింది. ఈ భూకంపం వల్ల ఇండోనేషియాలో భూమి తీవ్రంగా కంపించింది. ప్రజలు ప్రాణభయంతో రోడ్లపైకి పరుగులు తీశారు. ఎనిమిదేళ్ల కింద వచ్చిన సునామీ తాలూకు భయం ఇంకా వారిని వదిలిపోలేదు. సునామీ హెచ్చరికలు జారీ చేయడంతో అధికారులు సముద్ర తీర ప్రాంతాలనూ పూర్తిగా ఖాళీ చేయించారు. ఈ భూకంపం తీవ్రత ఎంతుందంటే ఇండోనేషియాకు 1800 కిలోమీటర్లపైగా దూరంలో ఉన్న ఆంధ్రప్రదేశ్ తీర ప్రాంతంతోపాటు చెన్నై, బెంగళూరు, తిరువనంతపురం, కొచ్చి, కోల్‌కతా, భువనేశ్వర్, గౌహతి సహా పలు నగరాల్లో భారీ ప్రకంపనలు వచ్చాయి. అయితే ఈ భూకంపనలు భారీ అలలను సృష్టించే విధంగా రాకపోవడం సమాచారంతో సునామీ ప్రమాదం తప్పిపోయింది.

## రిపబ్లికన్ అభ్యర్థిగా రోమ్నీ

అమెరికా అధ్యక్ష ఎన్నికలకు రిపబ్లికన్ అభ్యర్థిగా ఆ పార్టీ నేత మిట్ రోమ్నీ ఎన్నికయ్యారు. స్వపక్షానికి చెందిన తన సమీప ప్రత్యర్థి రిక్ శాంటోరమ్ అకస్మాత్తుగా పోటీ నుంచి తప్పుకోవడంతో రోమ్నీకి నామినేషన్ లభించింది. దీంతో నవంబర్ జరిగే అధ్యక్ష ఎన్నికలకు రోమ్నీ ప్రస్తుతం అధ్యక్షుడు బరాక్ ఒబామాతో తలపడతారు.

## అఫ్ఘనిస్తాన్‌లో దాడులు

అఫ్ఘనిస్తాన్‌లో రాజధాని కాబూల్, దాని చుట్టుపక్కల పట్టణాల్లో తాలిబన్లు బాంబు పేలుళ్లు, రాకెట్ దాడులు, కాల్పులతో దాడులు జరిపారు. ఏప్రిల్ 15న తాలిబన్లు ఏకకాలంలో ఏడు చోట్ల దాడులు జరిపారు. పార్లమెంట్‌పై రాకెట్లతో దాడులు జరుపుతూ లోపలికి పోయేందుకు ప్రయత్నించారు. ఆ సమయంలో పార్లమెంట్ సమావేశాలు జరుగుతున్నాయి. పార్లమెంట్ పక్కనున్న భవనాల నుంచి భద్రతా సిబ్బందితో పోరాటం జరిపారు. పద్దెనిమిది గంటల పాటు జరిగిన ఎదురు కాల్పుల తరువాత భద్రతా సిబ్బంది పరిస్థితిని అదుపులోకి తీసుకొచ్చారు. ఈ దాడిలో 36 మంది తాలిబన్లు, ఎనిమిది మంది భద్రతా సిబ్బంది, ముగ్గురు పౌరులు మరణించారు. అరవై మందికిపైగా గాయపడ్డారు. తాలిబన్లు అధ్యక్షుడు హమీద్ కర్జాయ్ భవనంపై కూడా దాడి చేశారు. నగర శివారు ప్రాంతం షహర్ ఏ నాలోని జర్మనీ, బ్రిటన్, రష్యా, జపాన్ దేశాల ఎంబసీలపై రాకెట్లు పేల్చారు. కాబూల్ సమీప పట్టణాల్లోని నాటో స్థావరాలపై కూడా దాడులు జరిపారు. కాబుల్ దగ్గరలోని జలాలాబాద్‌లో విమానాశ్రయంలోకి చొరబడేందుకు ప్రయత్నించడంతో భద్రతా సిబ్బంది వారిని అడ్డుకున్నారు. దీంతో ఇద్దరు బాంబర్లు తమను తాము పేల్చేసుకున్నారు.

## పాకిస్తాన్ జైలుపై దాడి

పాకిస్తాన్‌లోని ఓ జైలుపై ఏప్రిల్ 14 అర్ధరాత్రి వంద మంది తాలిబన్లు దాడి చేశారు. ఈ దాడి సందర్భంగా 384 మంది ఖైదీలు పారిపోయారు. జైలుపై తాలిబన్లు రాకెట్లు, గ్రనేడ్లతో దాడి జరిపారు. పారిపోయిన వారిలో ఇరవై మంది కరుడుగట్టిన ఖైదీలు ఉన్నారని జైలు అధికారులు తెలిపారు. జైలుపై దాడి జరిగిన సమయంలో 944 మంది ఖైదీలు ఉన్నారని జైలు అధికారులు వెల్లడించారు.

## ప్రపంచబ్యాంక్‌కు నూతన అధ్యక్షుడు

ప్రపంచ బ్యాంక్ పన్నెండవ అధ్యక్షుడిగా జిమ్ యంగ్ కిమ్ ఎన్నికయ్యారు. కిమ్ దక్షిణ ఆఫ్రికాలో జన్మించారు. ప్రస్తుతం డార్ట్‌మౌత్ కాలేజీ అధ్యక్షుడిగా ఉన్నారు. జిమ్ యంగ్ కిమ్‌ను అమెరికా నామినేట్ చేసింది. ప్రపంచబ్యాంక్ అధ్యక్ష పదవి కోసం కొలంబియాకు చెందిన జోస్ ఆంటానియో ఒకాంపో, నైజీరియాకు చెందిన ఒకాంజో ఐవెలాలు పోటీపడ్డారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 మార్చ్ నుండి 31 మార్చ్ 2012 వరకు 16 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1619)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 5 | – | 20 | 22 | 4 | 5 | 2 | 2 | 2 | 3 | 4 | 3 | 4 | 24 | 28 | – | – | – | – | 4 |
| హైదరాబాద్ | – | – | – | 7 | 12 | – | 1 | – | 1 | 5 | 6 | 19 | – | – | 27 | 18 | – | – | – | 11 | – |
| కరీంనగర్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| ఖమ్మం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| మహబూబ్‌నగర్ | – | 10 | 1 | 12 | 11 | 5 | 5 | 2 | 2 | 5 | 5 | 12 | 15 | 11 | 27 | 7 | – | – | – | – | – |
| మెదక్ | 1 | 2 | 2 | 7 | 12 | 8 | 4 | 2 | – | 3 | 4 | 7 | 4 | 5 | 28 | 14 | – | – | – | – | – |
| నల్గొండ | – | 3 | – | 15 | 20 | 2 | 2 | 1 | 2 | 7 | – | 2 | 2 | 7 | 66 | 30 | – | – | – | 8 | 4 |
| నిజామాబాద్ | – | – | – | 4 | 13 | – | 2 | – | – | 3 | – | 2 | 1 | 2 | 17 | 20 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 11 | – | 21 | 20 | 10 | 17 | 4 | 5 | 5 | 5 | 10 | 12 | 4 | 56 | 1 | – | – | – | – | 1 |
| వరంగల్ | – | 3 | – | 11 | 9 | 6 | 9 | 6 | 2 | 2 | – | – | 2 | 16 | 20 | 9 | – | – | – | – | 9 |
| చిత్తూరు | – | – | – | 7 | 6 | 3 | 5 | – | 3 | 6 | 4 | 5 | 5 | – | 27 | – | – | – | – | – | 7 |
| అనంతపూర్ | – | 6 | 3 | 23 | 18 | 6 | 1 | 1 | 5 | 9 | 11 | 21 | 10 | 7 | 78 | 3 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 1 | 2 | – | – | – | – | 2 | – | – | 2 | 2 | 22 | 10 | – | – | – | – | – |
| కర్నూలు | – | 6 | – | 18 | 12 | 5 | 6 | 7 | 4 | 6 | 2 | 5 | 9 | 3 | 28 | 31 | – | – | – | – | –6 |
| విశాఖపట్నం | 3 | – | – | 6 | 10 | 1 | 1 | – | 1 | 8 | 1 | 1 | 7 | – | 23 | 9 | – | – | – | 5 | – |
| విజయనగరం | – | 2 | – | 4 | 3 | 2 | 3 | 2 | 6 | 5 | 4 | 2 | – | 2 | 28 | 10 | – | – | – | – | 8 |
| **మొత్తం** | **5** | **48** | **6** | **156** | **169** | **52** | **61** | **27** | **33** | **68** | **45** | **90** | **72** | **63** | **471** | **190** | **–** | **–** | **–** | **24** | **39** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు



కొత్తచూపు
పేజీ 295, రు.120



అభివృద్ధిని ఇలా చూద్దాం
పేజీ 205, రు.80



మీరు-నేను- ఆర్థికం
పేజీ 215, రు.60



ఒక దళారీ పశ్చాత్తాపం
పేజీ 172, రు.50



కుట్రాజకీయం
పేజీ 114, రు.40



ఇన్ సర్చ్ ఆఫ్ మెథడ్
పేజీ 367, రు.200



ఇండివిడ్యుల్ సబ్-గ్రూప్స్
గ్రూప్స్ అండ్ ఫ్రీడం
పేజీ 59, రు.75



క్రైసిస్ అండ్ డెవలప్‌మెంట్
ఇన్ మార్క్సియన్ ఫ్రేంవర్క్
పేజీ 105, రు.80



ఆన్ ఎడ్యుకేషన్
పేజీ 142, రు.100



మెథడాలజీ ఆఫ్
సోషల్ ఎంక్వైరీ
పేజీ 201, రు.150




ఫిఫ్టీ ఇయర్స్
ఆఫ్
ఆంధ్రప్రదేశ్
**1956 – 2006**

పేజీ 568, రు.300



రాబందు వాలిన నేల
పేజీ 408, రు.180

వ్యవసాయం – ప్రపంచీకరణ
పేజీ 224, రు.100






కల్లముందరి చరిత్ర
పేజీ 309, రు.80



పరిచయాలు
పేజీ 194, రు.50



గంగానమ్మ
పేజీ 61, రు.15



జాత్యహంకారి హిట్లర్
పేజీ 171, రు.80



రాబందు నీడ
పేజీ 111, రు.25



విశ్వాంతరాళం
పేజీ 189, రు.90



మానవ పరిణామం
పేజీ 211, రు.90



జీవకణాలూ – నాడీకణాలూ
పేజీ 184, రు.80



ప్రకృతి – పర్యావరణం
పేజీ 230, రు.90



లేచినిలిచిన తెలంగాణ
పేజీ 303, రు.120

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 130 - May 2012 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/04/2012 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణం దశాబ్ది ప్రత్యేక సంచిక రూపకల్పనలో పాలుపంచుకోండి

2012 డిసెంబర్ సంచికతో వీక్షణం పది సంవత్సరాలు పూర్తి చేసుకుంటుంది. తెలుగునాట ఇంతకాలం నిరాటంకంగా, నవనవోన్మేషంగా నడిచిన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక మరొకటి లేదు. ఈ పదికాలాల వీక్షణం సఫలజీవనం సంపూర్ణంగా పాఠకుల, అభిమానుల, రచయితల, శ్రేయోభిలాషుల ఆదరణవల్లనే సాధ్యమయింది. పదికాలాలపాటు సజావుగా నడిచిన వీక్షణంను మరొక పదికాలాలపాటు నిలపడానికి, మరింత ప్రజాప్రయోజనకరంగా నడపడానికి దిశానిర్దేశం చేసుకుని పునరంకితం కావలసిన సమయం ఆసన్నమవుతోంది. ఈ సమయంలో వెలువడే రెండో దశాబ్ది ప్రారంభ సంచిక, 2013 జనవరి సంచికను చిరకాలం దాచి ఉంచుకోదగిన ప్రత్యేక సంచికగా రూపొందించాలని ఆలోచిస్తున్నాం. వీక్షణం పాఠకులు, అభిమానులు, రచయితల నుంచి మా ఆలోచనలను పరిపుష్టం చేసే సలహాలు, సూచనలు కోరుతున్నాం. ప్రత్యేకంగా ఈ సంచిక తయారీ కోసమే ఒక కీలకమైన రచయితల, పాఠకుల సమావేశం ఏర్పాటు చేస్తున్నాం. జూలై మొదటి వారంలో జరగనున్న ఈ సమావేశానికి వీక్షణం పాఠకులు, రచయితలు, అభిమానులు అందరూ ఆహ్వానితులే. ఈలోగా మీ సలహాలు, సూచనలు లిఖితపూర్వకంగా ఇవ్వదలచుకుంటే రాసి పంపించవచ్చు. జూలై సమావేశానికి హాజరై వివరంగా చర్చించవచ్చు.

ఇప్పటిదాకా వీక్షణం అభివృద్ధిలో ప్రతి అడుగులోనూ మీ సహాయ సహకారాలు ఉన్నాయి. ఇకముందు కూడ అలాగే మీ ఇతోధిక సహాయ సహకారాలు ఉంటాయని ఆశిస్తున్నాం.

**- సంపాదకవర్గం**

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao